బాలవ్యాకరణ

# సప్తార్ధప్రకాశిక

(బ్రహ్మశ్రీ నిహు కృష్ణమూర్తిశాస్త్రి పండితవర్యప్రణీత పారికారికాం
దేశీభూతపరవస్తు చిన్నయసూరికర్తృక బాలవ్యాకరణంబునకు

## వ్యాఖ్యానము

ఇయ్యెడ రాజమహేంద్రవరమందలి గవర్నమెంటార్ట్సుకాలేజీలో
నిరుగి పండితులును గీర్వాణభాషాగురు పదారూఢులును
కొంతకాలము కొవ్వూరు సంస్కృతకాలేజీ ప్రధానోపాధ్యాయులును
శ్రీమన్మహోపాధ్యాయ బిరుదాంకితులు నైన

బ్ర॥ కల్లూరి వేంకటరామశాస్త్రులవారిచేత

రచియింపబడినది

రెండవకూర్పు 2000 ప్రతులు

రాజమహేంద్రవరము.

శ్రీలలిత ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడెను

1929

[రిజిస్టర్డు కాపీరైటు]

[వెల రూ 5-0-0

404 8475
వేం. కృ- బాల

# శ్రీహరికారికాస్వత్వప్రకటనము

గోదావరిడిస్ట్రిక్టు అమలాపురముతాలూకా, ముక్తేశ్వరగ్రామవాస్తవ్యులు బ్రహ్మశ్రీ శిష్టుకృష్ణమూర్తిశాస్త్రులుగారు కాకతాళీయముగ నొకదివసంబున నాకుఁ దటస్థించినపుడు నేమరచించుచున్న గుప్తార్థప్రకాశికావ్యాఖ్యప్రశంస ప్రసంగవశంబున సంభవిల్లఁగా నంతట వారు తెలుఁగు భాష నుద్ధరింపఁజాలిన హరికారికలు తమపితామహులగు శిష్టుకృష్ణమూర్తిశాస్త్రులవారిచే రచింపఁబడి లేఖనపూర్వకముగా నుండియున్నవియనియు, నట్టిపుస్తకంబు నింకొకపర్యాయంబున దాని ప్రత్యాదులను బరిశీలింపఁగాఁ దెచ్చియిచ్చెదననియు దయతో వాగ్దానముచేసి, యనతికాలములోనే యాపుస్తకరాజంబును దానికిసంబంధించిన కొన్ని కాగితములతో జోడించి శ్రీరామార్పణముగా రాజకీయన్యాయపత్రంబుపైని లిఖించుచు గ్రంథంబును గుఱించిన సర్వస్వాతంత్ర్యమును యథేచ్ఛముగా ననుభవించుటకై నాకు దానం బొసంగిరి కావున నట్టికారికలు గ్రంథకర్తృత్వాది విమర్శన సందర్భాదులయందు లోకోపకారకంబగునన్న బుద్ధితో ముద్రింపఁబడియె ఇయ్యవి ముద్రింపఁగా నితరులకు నధికారములేదు. గ్రంథకర్తృత్వాది విమర్శనంబునకును వ్యాకరణాదిసత్యా... త్యంబులకును మిక్కిలి యుపకరించెడి యీకారికారత్నంబుల దానము చేసిన శిష్టుకృష్ణమూర్తి శాస్త్రులవారియెడ నెంతయు కృతజ్ఞుఁడ నయ్యెద.

క. మేరుసమశిష్టవంశ స్ఫారమణిం గృష్ణమూర్తిశాస్త్రి *బ్రవీణు
శ్రీరామార్పణమ్ముగ హరికారికల ... నొసఁగినకర్ణు నుతింతున్

వేం. శా.

45206

*ఇతఁడు వీణాబ్ధము వీణాగానమున లక్షణగానమున వీణాకర్తృత్వము గలవాఁడని యర్థాంతరము.

## అభిప్రాయములు.

"బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులవారికి ...............
తమ యుత్తరము గ్రంథము చేరినవి.

తమగ్రంథము భాషకును లక్షణజ్ఞాన మలవఱచుకొనఁగోరువారికి నత్యంత మావశ్యకమని నొక్కి చెప్పఁగలను ఈగ్రంథప్రకటనముచే నాంధ్రలోకమునకు గొప్పయుపకారము చేసినవారైతిరి. ఇది యాంధ్ర లోకమున సర్వత్రవ్యాపకము కలదియగుంగాక.

తమరు సూచించిన 390—404 పుటలను జూచితిని. చిన్నయ్య గారి కృష్ణమూర్తి గ్రంథముల పౌర్వాపర్యము లఁగుఱించి మీరువ్రాసినది పంక్తిసాధ్యము యుక్తి యుక్తముగానే యున్నది గాని యందునత్యాంతమాత్రమో యను సందేహముమాత్రమునన్నుఁ బీడించుచున్నది.

ఇట్లువిన్నవించు,
భవద్విధేయుఁడు.
వా సుబ్బారావు,
తెలుగుపండితుడు ప్రసిడెన్సీ కాలెజి

చెన్నపట్టణం
5— 1915

could duly go through a few portions of the stout volume 'Balavyakarana gupthartha Prakasika" most of which is tough study I find that the author has brought to bear on the production of this great work his thorough mastery of the principles of Sanskrit Grammar and succeeded in impressing upon it the stamp of the monumental commentaries on Panini. It is a remarkable work giving proof of the author's deep scholarship vast research sound reasoning and Judgment.

Madras
10—6—15

[Sd] C BHANUMOORTY.
Telugu Translater to Govt.

I have had the p easure of going tl rough Brahma Sri Ka uri Venkrtaram S stri G ru s comm ntaries on the we -known Te ugu Grammar Ba avy karanam by the ate Paravastu Chinnayya Suri Mr Venkatarma Sastri is a Sanskrit and Te ugu Scholar of repute and it augurs well for tl e f t ire of the Te ugu language that Pandits of his type shou d devote their time and learning for elucidating the laws of that language

The cammentaries are remar able for elaborateness of exposition and wea th of il ustration

There may be difference of opinion on some of the points dea t with in the book but there can be no doubt that the way in which they are treated is learned and calcu ated to stimulate thought The book wil be high y useful to persons wishing to acquire a thorough understanding of the structure of the Te ugu language

GUNTUR [Sd] J RAMAYYA,
20–7–1915

బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులవారిచే రచియింపబడిన బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికావ్యాఖ్యానమును అక్కడక్కడ విన్నా నిది మిక్కిలి యాంధ్ర లోకమునకు మహోపకారమైన గ్రంథము వీరికి నుభయభాషాపాండిత్యము మిక్కిలి కలిగియున్నందున నిట్టి గ్రంథము రచించుటకు సాధ్యమైనది. వీరికి సంస్కృతవ్యాకరణాది శాస్త్రములయందు పాండిత్యమెక్కువగా గలదు కావుననే యీ గ్రంథమింత రమ్యముగానున్నది

చిన్నయసూరికి సంస్కృతవ్యాకరణ పాండిత్యము విషయమై బాలవ్యాకరణములోని యంశములు చూడగా నాకు మిక్కిలి సందేహముగానున్నది

రాజమండ్రి,
ది 4— 0—15

ప్రకృతమందున్న శాంతులు రాజమహేంద్రవరపు
ఆర్ట్సుకాలేజీ పండితులు,
కస్తూరి శివశంకరశాస్త్రులు

శ్రీ వేదమూర్తులయిన బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామ శాస్త్రులగారికి—

వేదము వేంకటరాయశాస్త్రి నమస్కారపూర్వకముగా విజ్ఞాపించుట —ఉకు

యుష్మద్విరచితమై యుష్మత్ప్రసాదితమైన బాలవ్యాకరణవ్యాఖ్యాగ్రంథము చేరి చిరకాలమయినను అనారోగ్యకారణముచేత నాయభిప్రాయమును వెంటనే వ్రాయఁ జాలనైతిని. ఇటీవల కొంచెమారోగ్యము కలుగుటచే పూర్వభాగమును పరికించితిని. వ్యాఖ్య వైయాకరణసార్వజ్ఞ్యాములయిన మీరు రచించినట్టిది ఎట్లుండవలయునో అట్లేయున్నది ఒక్క [illegible], చోటందప్ప కడమయంతటను మీయభిప్రాయములను హృదయంగమములని యభినందించుచున్నాను.

ఉత్తరభాగమును చదువుటకు ఇంకను సజ్జుడనుగాక యున్నాను చదివిన పిమ్మట విశేషము తోఁచినచోఁ వ్రాసెదను స్థాలీపులాకన్యాయముచేఁ జూడ నుత్తరభాగమును ఇట్లే సర్వసమంజసముగా నుండునని తలంచుచున్నాను

అభిప్రాయము వ్రాయుటకు ఆలస్యము చేసినందులకు మన్నింపవలయును

గోతిమ్మతిప్పన్న మూలపేట
16-10-15 నెల్లూరు.

ఇవ్వియయ నేకనమస్కారములు

వేదము వేంకటరాయశాస్త్రి.

అయ్యా

అనేకవందనములు. తాము దయాపూర్వకముగాఁ బంపిన "బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక"ను సమగ్రముగాఁ జదివి మిక్కిలి యానందించినాఁడను. వ్యాఖ్యానమెక్కడఁ జూచినను సంస్కృతవ్యాకరణమునందును తద్భాష్యములయందును మీకుఁ గల యసాధారణపాండిత్యమును

వెల్లడించుచున్నది ఆంధ్రవ్యాకరణజ్ఞానమును నలవరించుకొనఁ గోరు వారికందఱకును మీపుస్తకమత్యంతోపయుక్తమైనదనుటకు సందేహము లేదు అయినను ప్రకీర్ణపరిచ్ఛేదావసానమునందు గ్రంథకర్తలవిషయమున మీరిచ్చినయభిప్రాయముతోనే నేకీభవింపఁజాలనందుకు చింతిల్లుచున్నాఁడను

ఇట్లు భవద్భాగధేయాప్తుఁడు,
కందుకూరి వీరేశలింగము
(రావుబహద్దూరు)

రాజమండ్రి
ది 16—10—15

---

బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులవారికి—

తమ బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక లక్షణపూర్వముల లక్ష్యములనభ్యసింపఁ గోరువారికి నత్యంతావశ్యకము ఆంధ్రభాషకు మహోపకారిణి లోకమంతటఁ బరనపారన లెసంగఁ గాత

ఈషద్భేదముగ సంస్కృతముగానున్న కృష్ణమూర్తి పండిత ప్రౌఢకృతియు స్వసంస్కృత గ్రంథమునకు గొంత తెనుఁగసిన చిన్నయసూరి బాలవ్యాకరణమును బూర్ణముగఁ జదివియారసితిని

ప్రధానము బాలవ్యాకరణమున గుప్తార్థమిది సమర్థుఁడయి యాంధ్రశబ్దచింతామణి సూత్రార్థగ యుక్తి చింతనమున నాంధ్రులకు మేలొచేసి స్త్రీలకునగోష్యములు నర్థపిహితములునయి సరసములగు నర్థహారోజాదిపదసంధ్రీచీన యాంధ్రభాషయుపదేశింప రాదను నవీనమతముల వసనికవిబ్రహ్మయకీర్తి కివదంతి మాపు నియంశవ న సమస్తైకమత్యము నొందితిని

విద్వద్భాగధేయుఁడు
అకుండి వ్యాసమూర్తిశాస్త్రి
ఇపుడు ప్రకృతివేతనము గొనుచున్న రాజమండ్రి
ఆర్ట్సుకాలేజీ సంస్కృతాంధ్రోపాధ్యాయుడు

రాజమండ్రి
ది 22—10—5.

[ఇట్టి సజ్జనమండలంబనెడి సప్తర్షి మండలంబునఁ బరివృతంబైనమదీయగ్రంథంబు ధ్రువకీర్తిం దోఁచయుఁగాత ] క వేం శా

---

# ఉపోద్ఘాతము.

నేటికించుమించుగా నేబదియేండ్లు సంవత్సరముల క్రిందట బాలవ్యాక
రణము పరవస్తు చిన్నసూరిచే విరచింపబడియె నందును ఇయ్యది
సంస్కృతమునను న్నన్నయభట్టీయమునకు వివరణవృత్తిగాఁగ శిష్టు
కృష్ణమూర్తిశాస్త్రిలుగారు సంస్కృతభాషలో రచియించిన హరికారి
కావళికినచ్చుపుఁ దెనుంగైనట్టికనంబడు ఆంధ్రమున రచింపఁబడియె నను
నామ మాత్రమేకాని యీగ్రంథరాజ మతికఠినంబుగాన సామాన్యధీ
మంతులకు దురవగాహంబగు తనర్చు దీనంగ్రహింపవలసిన విషయం
బులు పెక్కులున్నందున నియ్యుత్తమ గ్రంథమ్ము సర్వజనులకు సుబోధ
ముగానుండిన బాగుండుననుపంశం బెల్లవారల మనోరథంబు అమ్మనో
రథంబీడేర్పనెంచి ప్రథమమున బచ్చుప్ప కళాభవనంగాన ప్రధానాం
ధ్రోపాధ్యాయులుగా విలసిల్లిన వింజమూరి కృష్ణమాచార్యులవారి గ్రం
థమునకు విపులమగు వ్యాఖ్య వ్రాయనుద్దేశించిరి కాని యాంధ్రుల
దురదృష్టవశమున నాయన తనయుద్దేశంబు సిద్ధింపకుండనే కాలధర్మము
నొందుటంజేసి యయ్యది యాదిలోనే శాశ్వతనిద్రం జెందె పదంబడి మ
ఱికొందఱు పండితులాయన తలంచిన ప్రయత్నము గొనసాగింపనెంచి
రట గాని యిప్పటికిని మనకుసుదినంబులు వాటిల్లమి నదియును మొద
టనే తుద్దిముట్టె

ఇపుడు రాజమహేంద్రపురంబున సర్వకలాశాలలో గీర్వాణభా
షా గురువులును ప్రధాన పండితులగు బ్ర॥ శ్రీ కల్లూరి—వేంకట
రామశాస్త్రిలవారు బాలవ్యాకరణమునకు వ్యాఖ్యానమొనరించిరి ఈ
వ్యాఖ్యప్రారంభంబున గ్రంథకర్తగారికిఁ ప్రియశిష్యుండగు సుంకర రం
గయ్యగారు కుండలీంద్రునకుం (తిక్కనసోమయాజికి) గులాలు కులస్థుం
డా గురునాథుండువోలె (కుమ్మర గురునాథుఁడు) లేఖకాదులయందుఁ

దోడుగాఁగ గ్రంథము చాలవఱకు రచితంబయ్యె పిమ్మట గొందఱు
కలహాశనుల ప్రోత్సాహంబున గురుద్వేషంబూని రంగయ్యగారు తగ
ముగా వ్రాయుటకై గురుదత్తమైన గ్రంథము తమయొద్దనే యుంచు న
గ్రంథకర్తృత్వము తమయందారోపించుకొని గ్రంథకర్త కొఱుకలేనిదిగా
ముద్రితకారక పరిచ్ఛేదాంత గ్రంథము ప్రథమభాగముగాఁ దమపేరనఁ
బ్రకటించుకొనిరి తామెంతయో విశ్వప్రయత్నంబు సేసినను లభింపని
యార్ట్సుకాలేజీ పండితపదంబు శాస్త్రులవారికి ననాయాసలభ్యంబైనదన్న
యసూయయే శాస్త్రి వారియెడ నీకలహాశనులకు నిష్కారణ వైరం
బు గలిగించి యీశూద్రశిష్యుని భేదంబుమూలంబున శాస్త్రులవారిని
వంచింపఁ జూచెనందురు ఇట్లీ చతుర్థవర్ణశిష్యుఁడు ద్వేషింపఁగాఁ గీర్తి
శేషులగు మ॥రా శ్రీ—ఏలూరి లక్ష్మీనరసింహముగారు గురుశిష్యులుభ
యులకును రాజానామా నడిపిరి మధ్యవర్తులగు శ్రీలక్ష్మీనరసింహము
గారు బాల్యాదిగాఁ బ్రియశిష్యుండును బుత్త్రప్రాయుండుగాన రంగయ్య
గారికింగూడ నప్పటివఱకుసిద్ధమైన గ్రంథంబునందు సమానస్వాతంత్ర్య
మీయవలయునని శాస్త్రులవారిని గోరఁగా సరసులైన శాస్త్రులవారు
మధ్యవర్తులమాటకు చిరకాల ప్రవర్తమాన శిష్యవాత్సల్యంబును నిరా
కరింపఁజాలక యట్లు సమ్మతించిరిగాని రాజానామాజరిగిన యనతికాల
ములోనే అక్టోబరు19,0సం లో రంగయ్యగారుపరమ ప ద ం బు
వేంచేసిరి.

మఱియు సాత్త్వికబ్రహ్మ విద్యావిలాసనిరసన గ్రంథప్రారంభం
బున శాస్త్రులవారిచే రచింపఁబడిన కృత్యాద్యవస్థాభూత వంశముక్తావ
ళీకోశంబున స్వవంశవర్ణనసం బానరించినది మొదలు మ రా శ్రీ॥ శ్రీకృ
త్తివెంటి నాగేశ్వరరావుగారికి శాస్త్రులవారియందు నధికభక్తి విశ్వాస
గౌరవంబు మెండగాఁ గలదు దానంజేసి యేతద్గ్రంథముద్రణమూల్య
దాన భారంబు తాము వహించెదమని వాగ్దానముతో శాస్త్రులవారిపేర
నిట్లు వ్రాయుచున్నారు

శ్రీవేదభాష్యకర్తలైన బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులు గారి సముఖమునకు వి. శ్రీ॥ కృత్తివెంటి నాగేశ్వరరావు అనేకనమస్కారములు—ఉభయకుశలోపరి

తా॥ తాము రచించిన బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక అనుగ్రంథము చూడగా నాకుచాల సంతోషకరముగాను ఆంధ్రభాషాభిలాషులకు మిగుల నుపయోగకరముగాను నుండినట్లు నాకు కనబడినందున నా సంతోషపూర్వకముగా తద్గ్రంథము వర్తమానములో ముద్రాపించుచునే యున్నాను గ్రంథపూర్తి అయ్యినపిమ్మట దానివ్యయము నేనేవహించుచున్నాఁడను గాన తమకు ఆగ్రంథముయొక్క కాపీరైటును శ్రీరామార్పణముగా సమర్పింపఁ దలంచినాఁడను

చిత్తగించవలెను

7—6—1908 }
రాజమండ్రి, } శ్రీకృత్తివెంటి నాగేశ్వరరావు వ్రాలు

ఇట్టివాగ్దానముంబట్టి వారు గ్రంథాది క్రియాపరిచ్ఛేదమందలి 85 సూత్రము వఱకున్న ముద్రితభాగమునకు ధర్మబుద్ధితోన మూల్యదానం బొనర్చిరి ధర్మాత్ములకీకలికాలంబులో గష్టంబులు మెండుగావున శ్రీనాగేశ్వరరావుగారు దైవవశంబునఁ గొన్నిచిక్కులంబడి మనోవైకల్య నొందఁగా గ్రంథకర్తగారు శిష్యుని లోకాంతరప్రాప్తి పిమ్మటను బూర్తిచేసిన గ్రంథశేషమునకు ముద్రణమూల్యం బడుగఁగా నోరురాక యూరకుండిరి తక్కినగ్రంథమునకు సయితము ముద్రణమూల్యము సుసరళహృదయుండైన యొసీతారామమూర్తి సహాయ్యంబుననే లభింపఁగా గ్రంథంబు సాకల్యంబు నొందె.

ఈగ్రంథరాజంబు 'బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక యనునామంబునఁ బరగుచున్నది—మూలగ్రంథమున నున్న సూత్రముల న్నిను కరతలామలకంబుగా సోదాహరణ వివరణంబుతోనుండి యుదా

I have had the pleasure of going through Brahma Sri Kalluri Venkatarama Sastri Garu's commentaries on the well-known Telugu Grammar Balavykaranam by the late Paravastu Chinnayya Suri. Mr Venkatarama Sastri is a Sanskrit and Telugu Scholar of repute and it augurs well for the future of the Telugu language that Pandits of his type should devote their time and learning for elucidating the laws of that language

The commentaries are remarkable for elaborateness of exposition and wealth of illustration

There may be difference of opinion on some of the points dealt with in the book but there can be no doubt that the way in which they are treated is learned and calculated to stimulate thought The book will be highly useful to persons wishing to acquire a thorough understanding of the structure of the Telugu language

GUNTUR [Sd] J RAMAYYA,
20-7-1915

బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులవారిచే రచియింపబడిన బాలవ్యాకరణ సుప్రార్థప్రకాశికావ్యాఖ్యానమును అక్కడక్కడ విన్నానిది మిక్కిలి యాంధ్రలోకమునకు మహోపకారమైన గ్రంథము వీరికి నుభయభాషాపాండిత్యము మిక్కిలి కలిగియున్నందున నిట్టిగ్రంథమ్ము రచించుటకు సాధ్యమైనది. వీరికి సంస్కృతవ్యాకరణాది శాస్త్రములయందు పాండిత్యమెక్కువగాగలదు కావుననే యీగ్రంథమింతరమ్యముగానున్నది

చిన్నయసూరికి సంస్కృతవ్యాకరణ పాండిత్యము విషయమై బాలవ్యాకరణములోని యంశములు చూడగా నాకుమిక్కిలి సందేహముగానున్నది.

రాజమండ్రి,
ది 4—10—15

ప్రకృతమందున్న శాంతులు రాజమహేంద్రవరము
ఆర్ట్సుకాలేజీ పండితులు,
కస్తూరి శివశంకరశాస్త్రులు.

శ్రీవేదమూర్తులయిన బ్రహ్మశ్రీ కల్లూరి వేం
కటరామ శాస్త్రులగారికి.

వేదము వేంకటరాయశాస్త్రి నమస్కారపూర్వకముగా విజ్ఞా
పించుట —ఉ కు

యుష్మద్విరచితమై యుష్మత్ప్రసాదితమైన బాలవ్యాకరణవ్యా
ఖ్యా గ్రంథము చేరి చిరకాలమయినను అనారోగ్యకారణముచేత నాయభి
ప్రాయమును వెంటనే వ్రాయఁ జాలనైతిని ఇటీవల కొంచెమారోగ్యము
కలుగుటచే పూర్వభాగమును పరికించితిని. వ్యాఖ్య వైయాకరణసార్వ
భౌములయిన మీరు రచించినట్టిది ఎట్లుండవలయునో అట్లేయున్నది
ఒక్క కాన, చోటం దప్ప కడమయంతటను మీయభిప్రాయములను
హృదయంగమములని యభినందించుచున్నాను.

ఉత్తరభాగమును చదువుటకు ఇంకను సజ్జుఁడను గాక యున్నాను
చదివిన పిమ్మట విశేషము తోఁచినచోఁ వ్రాసెదను స్థాలీపులాకన్యాయ
ముచేఁ జూడ నుత్తరభాగమును ఇట్లే సర్వసమంజసముగా నుండునని
యెంచుచున్నాను

అభిప్రాయము వ్రాయుటకు ఆలస్యము చేసినందులకు మన్నింపవలయును

జ్యోతిష్మతీప్రెస్సు మూలపేట
16-10-15 నెల్లూరు } ఇవియె యనేకనమస్కారములు

వేదము వేంకటరాయశాస్త్రి.

---

అయ్యా

అనేకవందనములు. తాము దయాపూర్వకముగాఁ బంపిన బాల
వ్యాకరణగుప్తార్థప్రకాశికను సమగ్రముగాఁ జదివి మిక్కిలి యానం
దించినాఁడను వ్యాఖ్యానమెక్కడఁజూచినను సంస్కృతవ్యాకరణమునం
దును తద్భాష్యములయందును మీకుఁ గల యసాధారణపాండిత్యమును

వెల్లడించుచున్నది ఆంధ్రవ్యాకరణజ్ఞానమును సలవరించుకొనఁ గోరు వారికందఱకును మీపుస్తకమత్యంతోపయుక్తమైనదనుటకు సందేహములేదు అయినను ప్రకీర్ణపరిచ్ఛేదావసానమునందు గ్రంథకర్తలవిషయమున మీరిచ్చినయభిప్రాయముతోనే నేకీభవింపఁజాలనందుకు చింతిల్లుచున్నాఁడను

ఇట్లు భవద్విధేయాప్తుఁడు——
కందుకూరివీరేశలింగము
(రావుబహద్దూరు)

రాజమండ్రి
ది 16—10—15

---

బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిలవారికి—

తమ బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక లక్షణపూర్వముల లక్ష్యముల నభ్యసింపఁ గోరువారికి నత్యంతావశ్యకము. ఆంధ్రభాషకు మహోపకారిణి లోకమంతటఁ బరనపారనటౌంగఁ గాత

ఈషద్భేదముగ సంస్కృతముగానున్న కృష్ణమూర్తి
పండిత ప్రౌఢకృతియు స్వసంస్కృత గ్రంథమునకుఁ గొంత తెనుఁగైన
చిన్నయసూరి బాలవ్యాకరణమును బూర్ణముగఁ జదివియారసితిని

ప్రధానము బాలవ్యాకరణమున గుప్తార్థమిది సమర్థుఁడయి యాంధ్రశబ్దచింతామణి సూత్రాంతర్గతయుక్తి చింతనమున నాంధ్రులకు మేలొనేసి స్త్రీలకునగోచ్యములు నర్థవిహీనములునయి సరసములగు నదిరోజాదిపదప్రభేదీన యాంధ్రభాషయుపదేశింప రాదను నవీనమతముల వదనికవిబ్రహ్మయకీర్తి కిరవదంతి మాపు నియంశవ న సమగ్రైకమత్యము నొందితిని

విద్వద్విధేయుఁడు
ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రి
ఇపుడప్రకృతివేతసముగొనుచున్న రాజమండ్రి
ఆర్ట్సుకాలేజీ సంస్కృతాంధ్రోపాధ్యాయుడు

రాజమండ్రి
ది 22—10—5

[ఇట్టి సజ్జనమండలంబనెడి సప్తర్షిమండలంబునఁ బరివృతంబైనమదీయగ్రంథంబు ధ్రువకీర్తిం దోఁపయుంగాత] క వేం శా

---

# ఉపోద్ఘాతము.

—— ◌ ∘ ◌ ——

నేటికించుమించుగా నేబదియేండ్లు సంవత్సరముల క్రిందట బాలవ్యాక
రణము పరవస్తు చిన్నసూరిచే విరచింపబడియె నందరు ఇయ్యది
సంస్కృతముననున్న వ్యాయభట్టీయమునకు వివరణవృత్తిగాఁగ శిష్టు
కృష్ణమూర్తిశాస్త్రులుగారు సంస్కృతభాషలో రచియించిన హరికారి
కావళికినచ్చుపుఁ దెనుఁగైనట్టుకనంబడు ఆంధ్రమున రచింపఁబడియె నను
నామ మాత్రమేకాని యీగ్రంథరాజ మతికఠినంబుగాన సామాన్యధీ
మంతులకు దురవగాహంబగు తనర్చు దీనంగ్రహింపవలసిన విషయం
బులు పెక్కులున్నందున నియ్యుత్తమ గ్రంథమ్ము సర్వజనులకు సుబోధ
ముగానుండిన బాగుండుననుసంశం బెల్లవారల మనోరథంబు అమ్మనో
రథంబీడేర్పనెంచి ప్రథమమునఁ బచ్చయప్ప కళాభవనంబునఁ బ్రధానాం
ధ్రోపాధ్యాయులుగా విలసిల్లిన వింజమూరి కృష్ణమాచార్యులవారీ గ్రం
థమునకు విపులమగు వ్యాఖ్య వ్రాయనుద్దేశించిరి కాని యాంధ్రుల
దురదృష్టవశమున నాయన తనయుద్దేశంబు సిద్ధింపకుండనే కాలధర్మము
నొందుటంజేసి యయ్యది యాదిలోనే శాశ్వతనిద్రం జెందె పదంబడి మ
ఱికొందఱు పండితులాయన తలంచిన ప్రయత్నము కొనసాగింపనెంచి
రట గాని యిప్పటికిని మనకుసుదినంబులు వాటిల్లమి నదియును మొద
టనే తుద్దిముట్టె

ఇపుడు రాజమహేంద్రపురంబున సర్వకలాశాలలో గీర్వాణభా
షా గురువులును ప్రధాన పండితులగు బ్ర|| శ్రీ కల్లూరి—వేంకట
రామశాస్త్రులవారు బాలవ్యాకరణమునకు వ్యాఖ్యానమొనరించిరి ఈ
వ్యాఖ్యప్రారంభంబున గ్రంథకర్తగారికిఁ బ్రియశిష్యుండగు సుంకర రం
గయ్యగారు కుండలీంద్రునకుఁ (తిక్కనసోమయాజికి) గులాంకుడు కులస్థుం
డౌ గురునాథుండువోలె (కుమ్మర గురునాథుఁడు) లేఖనాదులయందుఁ

దోడుగాఁగ గ్రంథము చాలవఱకు రచితంబయ్యె పిమ్మట కొందఱు కలహాశనుల ప్రోత్సాహంబున గురుద్వేషంబూని రంగయ్యగారు తుద ముగా వ్రాయుటకై గురుదత్తమైన గ్రంథము తమయొద్దనే యుంచి గ్రంథకర్తృత్వము తమయందారోపించుకొని గ్రంథకర్త కోలుకలేనిదియే ముద్రితకారక పరిచ్ఛేదాంత గ్రంథము ప్రథమభాగముగాఁ దమపేరను బ్రకటించుకొనిరి తామెంతయో విశ్వప్రయత్నంబు సేసినను లభింపని యార్ట్సుకాలేజీ పండితపదంబు శాస్త్రులవారికి ననాయాసలభ్యంబైనదన్న యసూయయే శాస్త్రులవారియెడ నీకలహాశనులకు విష్కారణ వైరం బు గలిగించి యీశూద్రశిష్యుని భేదంబుమూలంబున శాస్త్రులవారిని వంచింపఁ జూచెనందురు ఇట్టి చతుర్థవర్ణశిష్యుఁడు ద్వేషింపఁగాఁ గీర్తి శేషులగు మ॥రా శ్రీ—వలూరి లక్ష్మీనరసింహముగారు గురుశిష్యులుభ యులకును రాజీనామా నలిపిరి మధ్యవర్తులగు శ్రీలక్ష్మీనరసింహము గారు బాల్యాదిగాఁ బ్రియశిష్యుండును బుత్రప్రాయుండుగాన రంగయ్య గారికింగూడ నప్పటివఱకుసిద్ధంబైన గ్రంథంబునందు సమానస్వాతంత్ర్య మీయవలయునని శాస్త్రులవారిని గోరఁగా సరసులైన శాస్త్రులవారు మధ్యవర్తులమాటను చిరకాల ప్రవర్తమాన శిష్యవాత్సల్యంబును నిరా కరింపఁజాలక యట్లు సమ్మతించిరిగాని రాజీనామాజరిగిన యనతికాల ములోనే అక్టోబరు19।0సం లో రంగయ్యగారుపరమ ప ద ం బు వేంచేసిరి.

మఱియు సాత్త్వికబ్రహ్మ విద్యావిలాసనిరసన గ్రంథప్రారంభం బున శాస్త్రులవారిచే రచింపఁబడిన కృత్యాద్యవస్థాభూత వంశముక్తావ ళీకోశంబున స్వవంశవర్ణనం బానరించినది మొదలు మ॥రా॥శ్రీ॥ శ్రీకృ త్తివెంటి నాగేశ్వరరావుగారికి శాస్త్రులవారియందు నధికభక్తి విశ్వాస గౌరవంబు మెండగాఁగలదు దానంజేసి యేతద్గ్రంథముద్రణమూల్య దాన భారంబు తాము వహించెదమని వాగ్దానముతో శాస్త్రులవారిపేర నిట్లు వ్రాయుచున్నారు

శ్రీవేదశాస్త్రార్థతత్త్వవేత్తలైన బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులు గారి సమ్ముఖమునకు వి శే శ్రీ॥ కృత్తివెంటి నాగేశ్వరరావు అనేకనమస్కారములు—ఉభయకుశలోపరి

తా॥ తాము రచించిన బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక అనుగ్రంథమునుజూడగా నాకుచాల సంతోషకరముగాను ఆంధ్రభాషాభిలాషులకు మిగుల నుపయోగకరముగాను నుండినట్లు నాకు కనపడినందున నాసంతోషపూర్వకముగా తద్గ్రంథము వర్తమానములో ముద్రింపించుచున్నే యున్నాను గ్రంథపూర్తి అయ్యినపిమ్మట దానివ్యయము నేనేవహించుచున్నాడను గాన తమకు ఆగ్రంథముయొక్క కాపీరైటును శ్రీరామార్పణముగా సమర్పింపఁ దలంచినాడను

చిత్తగించవలెను

7—6—1908 } శ్రీకృత్తివెంటి నాగేశ్వరరావుగారు
రాజమండ్రి, }

ఇట్టివాగ్దానముంబట్టి వారు గ్రంథాది క్రియాపరిచ్ఛేదముందలి 88 సూత్రము వఱకునున్న ముద్రితభాగమునకు ధర్మబుద్ధితోన మూల్యదానం బొనర్చిరి ధర్మాత్ములు. కీర్తిశేషులైన కాలంబులోఁ గష్టంబులు మెండుగావున శ్రీనాగేశ్వరరావుగారు దైవవశంబునఁ గొన్నిచిక్కులంబడి మహావైక్లబ్యము నొందఁగా గ్రంథకర్తగారు శిష్యుని లోకాంతరప్రాప్తి పిమ్మటను బూర్తిచేసిన గ్రంథశేషమునకు ముద్రణమూల్యం బడుగఁగా నోరురాక యూరకుండిరి. తక్కిన గ్రంథమునకు సయితము ముద్రణమూల్యము సుసరళహృదయుండైన యీ సీతారామమూర్తి సహాయ్యంబుననే లభింపఁగా గ్రంథంబు సాకల్యంబు నొందె.

ఈగ్రంథరాజంబు 'బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక' యనునామంబునఁ బరగుచున్నది—యీ గ్రంథమునందున్న సూత్రముల క్లిష్టార్థములను గరతలామలకంబుగా సోదాహరణ వివరణంబులతోనుండియుఁ జూ

గారణములయొద్ద సందర్భానుసారంబైన సూత్రము లమరంగా వ్యాక
రణమందలి యుదాహరణముల ననుసరించిన మహాకవిప్రయోగంబులు
ండోపతండంబులుగాఁ జూపఁబడి యాంధ్రలోకమున కత్యంతోపయో
కరముగాఁ దేజరిల్లుచున్నది. ఇందలి గుణాంశములను బూర్ణముగా
చియింప నావంటివాని కలవిగాదు. చదువరులే వానిని గ్రహింతురు
గాక. ఈగ్రంథకర్తగారు కాళిదాసకృత మేఘసందేశమునకు నాంధ్రీకర
ణమౌ పద్యకావ్యమును, సాత్త్విక బ్రహ్మవిద్యావిలాస నిరస మనుజో
త్కర్షసాధక సిద్ధాంత గ్రంథమునకుఁ గృత్యాద్యవస్థమైన వంశము
క్తావళియును రచించిరి. మృదుమధురమైన యుభయభాషాకవితాధోరణి
కమకుఁ బరిఢవిల్లుచున్నవీరలు శ్లో॥ శాస్త్రైర్విహీనాః కవయోభవంతి
'విద్యావిహీనాశ్చపురాభట్టాః పురాణహీనా కృషికాభవంతి భగ్నాః కృషే
ర్భాగవతాభవంతి అనువచన న్యాయంబునఁ గవితారచనయందుత్సా
హంబులేక వ్యాకరణ వేదాంతాది శాస్త్రపరకంబునందే సమయంబు
విని యోగించుచుందురు. ప్రకృతంబున శిష్ట కృష్ణమూర్తిశాస్త్రివిర
చిత హరికారికావళికి నాంధ్రమగు. చిన్నసూరి కృత బాలవ్యాకరణం-
బునకుఁ దేట తెల్లమగు మాటలతో సామాన్య పండితసాధ్యంబ
యీవ్యాఖ్యాన మొనరించితమయనన్యసాధారణ సంస్కృతాంధ్రభాషా
పాండిత్యమును సార్థకపఱచుకొనుచు లోకంబున కమితోపకారం బొన
ర్చిన బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిగారి పరిశ్రమంబునకు నెల్లరు
కోవిదులు కృతజ్ఞులగుదురుగాక!

మఱియు నీబాలవ్యాకరణంబు కృష్ణమూర్తిశాస్త్రులవారి హరి
కారికావళికంటెఁ బూర్వమందే యుద్భవిల్లినదని యీగ్రంథాంతమందలి
యుక్తులనుఖండించియు స్వేష్టసాధనంబులను గనంబఱచియు నేరేనిసమ

ర్థించినయెడల వారికి శాస్త్రులవారును నేనును ననేక వందనాచరణంబు లతోఁ గృతజ్ఞులము యిప్పటియభిప్రాయంబు మార్చుకొందుముగాని. కృష్ణమూర్తిశాస్త్రిగారి గ్రంథకర్తృతసమర్థనమునందే కేవలము నభినివేశముగలారముగాము. సత్యవాదమే సర్వశ్రేయోనువాదం బగుంగాత!

ఇట్లు గ్రంథకర్తగారి
ప్రియశిష్యుఁడు దేవరకొండ
21—9—15 జగన్నాధరావు బి. ఏ
టీచర్ మిస్సస్. ఏ.వి.యన్ కాలేజీ
విశాఖపట్టణము.

శ్రీరామాయనమః

# గ్రంథకర్తృవంశావతారవర్ణన

సీ. శ్రీరమ్యవిటపిశాలావనంతానాతి
శయసాంద్రతరభూమిసంవృతంబు
భూరిసారభయుక్తపుష్ప
వేలనిలినినాదార్భటి విలసితంబు
వివిధరూపాన్వితవిరాగతపోధన
సుమనస్కరారావశోభితంబు
సకలదేశాయాతనాథభక్తానీక
పూరితసేవలింగరాజితంబు
గీ. సిద్ధసాధ్యాదిఖచరసంసేవితంబు
భూరిభవనాశకరశృంగభూషితంబు
పుణ్యజనలోక వాంఛా ప్రపూరితంబు
వసుధ విలసిల్లు శ్రీశైలపర్వతంబు. 1

క. ఆపుణ్యశ్రీశైలము
దాపునఁ గల్గొన మహానద్యాచర
దీక్షితవిప్రవరేణ్యా
లోపేతం బగ్రహార మొకటి చెలంగున్. 2

గీ. అందు ధర్మపన్నాల వారనఁగఁ దనరు
బ్రాహ్మణులనంగసమునందు బాలుపుచు
వెలసె వీరన్న యనునొక్క విప్రతిలకు
డద్ధి వెలయించి పుట్టుమ్మగాంచుకరం 3

క. బాలుఁడు శమదమ సద్గుణ
జాలుఁడు నిగమాది వివిధ శాస్త్రాక్షీ శ్రీ

లోలుఁడు పశుపతిసేవా
ద్వేలుఁడు వీరన్నఁబోలు విప్రుఁడు గలఁడే 4

ఉ. వీరన బాలు డయ్యుఁ గడుఁబెద్దలయొద్దను విద్దెనేర్వఁగాఁ
జేరెను బట్టసంబునకుఁ జేరువఁ బోలవరాఖ్య మేల్మిమీఁఱ
దారపురంబు నయ్యెడ నుదారమనీషుఁడు మంగవేశుఁడన్
భూరమణీశుఁ డీతనిని బోషణఁ జేసెను బుత్రు కైవడిన్ 5

సీ. మంగళవేశునిసభా మండనులైనట్టి
విబుధోత్తములయొద్ద విద్యనేర్చె
నేయొజ్జలొద్దఁ దా నేవిద్దె గఱచెనో
యొరు లెఱుంగకయుండఁ దిరుగనేర్చె
వేదశాస్త్రపురాణ వివిధకళాజాల
ములఁ దన కీడులే కలుగుచుండె
విద్యాధికుఁడనిన విఱ్ఱవీగక నమ్ర
భావంబుతో నెల్లవారిఁగాంచె

గీ. వీరభద్రేశుచరణము ల్విడువ కెపుడు
రక్తిసేవించునే కాంతిభక్తుఁడగుచు
నీఱు గవిసిన మెఱయనినిప్పువోలెఁ
జెలఁగె వీరన్న జనముల లచ్చెరువునొంద

శా. అంతం గొండొకవేళ నాపురికి బ్రహ్మానందసామ్రాజ్య భా
స్వంతుండు న్నిగమాది సద్వ్యసుకళా సంపూర్ణుఁడు న్నిర్మల
స్వాంతుండైనఘనేంద్రనామకపరివ్రాట్చంద్రుఁ డేతెంచి భూ
కాంతుం జేరి తదీయపండితసభం గావింప వాంఛించినన్

క. అప్పుడు మంగపదేవుం
డప్పురమునఁ బండితాళి నంతయు నొకచో
రప్పించి సభను గూర్పఁగ

నప్పావనమూర్తిఁజూచి యాశ్చర్యమునన్

చ. చదువుఁ బ్రౌఢమై యపరసారసనంభవుఁ డోయనంగఁబెం
పొదవి సమస్తవిద్యలను నుద్ధతి దిగ్విజయంబుఁగొంచు నె
ల్లదిశలు చుట్టివచ్చుయతిరాజు నెదుర్కొనఁ జాలరైరి సం
విదితఘనైక విద్యలయి పేర్వడుమంగపరెడ్డిపండితుల్ 9

మ. తనయాస్థానపుఁ బండితావళి ఘనేంద్రస్వామితోఁ శాస్త్రగో
ష్ఠిని సల్పందగఁ జాలకుంటకుఁ గడుం జింతించునామంగపే
శునిఁ జేరంజని వీరనార్యుఁడనియెన్ సోమాభకీర్త్యాకరా
ననుమీరంపిన నెల్లవిద్యల ఘనేంద్రస్వామి మెప్పొందెదన్ 10

క. అని వీరన నెమ్మనమునఁ
దనవిద్యామహిమఁజూపఁ దఱి యిది యంచున్
ఘనకౌతుకమునఁ గోరఁగ
జనపాలుం డట మఱొక్కసభ గావించెన్ 11

సీ. అపుడు వీరన్న యాయతి శేఖరునితోడ
సకలశాస్త్రంబులఁ జర్చసలిపె
వేదార్థ మడిగిన వేదాంత సారమౌ
జీవేశతత్త్వంబుఁ జెలఁగ నుడివె
శాస్త్రార్థమును గోర షట్శాస్త్రములలోన
మేలైనయంశము లీలఁబలికె
గాతమీాయంబునఁ గాణాదమునఁ బాద
రాయణసూత్రాళిఁ బ్రౌఢి నెఱపెఁ

గీ. గావ్య నాటకాలంకార ఘనసమస్త
శాస్త్రజాలంబులందలిసరణి యొప్పఁ
దెలిపె సభయందుఁ గరతలా మలకముగను
బండితావళి మెచ్చి సెబాసనంగ 22

క లంతట యతివరుఁ డోహో
యింతటి విద్యాసమర్థుఁ డిచ్చటఁ గలఁడా
వింతయ్యె నింకనాతఁ
బంతముఁ బూనంగవలయుఁ బ్రజ్ఞాశక్తిన్ 12
సీ షణ్మాసములతిథుల్ సర్వాబ్దు నొకపరి
మూఁడవ వింతునే చోద్యమెసఁగఁ
నక్లానర్పఁగ నీకు నలవియే యనిపల్క-
సంవత్సరపుతిథుల్ సరవి నొక్క-
మాఱుమాదియె వాని మరలవచించెద
ననుచు వీరన్న తానానతిచ్చె
నంతనబ్బురపడి యతిచంద్రుఁ డట్లునే
యఁగవలెనన్న వీరన్నయప్పుడు
గీ పోలవరధారణీశు నద్భుతమునొంద
విబుధలోకంబు నయనము లిప్పి మాఱ
నేకవర్షపుఁ దిథులఁ బల్వేఁక నుడివి
తన యశేషపక్షిమహత్త్వంబుఁ జూపె. 13
చ అది గని సంయమీంద్రుఁ డహహా పులిమీఁదనుబుట్టియయ్యెనీ
పదమలబుద్ధిశాలియని సన్నుతిఁ జేయుచు దిగ్జయంబునం
దొదవినగండపెండెరము నొయ్యన వీరనయంఘ్రి గట్టె స [గన్
మ్మదమున 'నన్నుఁ గెల్చితని భూపతియుబ్బనుమిన్నుమట్టఁగన్
మ జనలోకాధిప యీఘరామరుఁడు ప్రజ్ఞాశక్తి వీక్షింప నూ
తనరూపంబున ధారణింబొడము మేధాదక్షిణామూర్తియై
కనుపట్టన్ సభకిట్టియుత్తముఁ డలంకారంబుగా నుండ నే
ఘనపుణ్యంబును జేసితో కద ప్రాగ్జన్మంబునం దిమ్ములన్ 16

క. అని మనుజాధిపుఁ డాడన
వినిపించి యతీంద్రుఁ డరిగె వీరన కంతన్
ఘనవిభవములు మెఱుఁగిరి పా
వనమగు పట్టనపు వీరభద్రాంశమునన్ 17

వ. అంత నామంగపధరాకాంతుండమందానంద కందళితహృదయారవిం
దుఁ డామాభాసురేంద్రుండు దిగ్విజయంబొనరించిన ఘనవేంద్రుని
జయించుట పరిజాచయంబునకుం దెలుప నాతని నొక్కగంధసింధు
రమునం దధిరూఢుం జేసి రాజమార్గంబున నిజసౌధమునకుం దోడ్కొ
ని పోవుచుండ 8

సీ. పుడమి నుద్భవమొందుట భవరేఖ్యులకెల్ల
భూషణంబగు పుణ్యపురుషుఁ డితఁడె
ఘనఘనేంద్రస్వామికళలెల్లఁ గడకాత్మ
ఖ్యాతినొందినకళాకాంతుఁ డితఁడె
సర్వసంపూజ్యమహా సద్గుణావళికెల్ల
స్థానమైపొసఁగిన ధన్యుఁ డితఁడె
మంగపేశునికీర్తి మచ్చనొందక యుండ
వెలయునట్లొనరించు వీరుఁ డితఁడె 19

గీ. సకలజన సేవ్యమగుపట్టసమునఁ దనరు
వీరభద్రేశ్వరునియవతార మితఁడె
యనుచు వినుతించుజనముల హర్షకలిత
భాషణంబులు మిన్నంటెఁ బ్రబలమగుచు. 20

క. అంతట వీరన నాభూ
కాంతుఁడు సదనంబుఁ జేర్చి గౌరవ మొప్పన్
వింతగుమణిమయభూషా
సంతతిఁ జీనాంబరాళిఁ జాఁ నొసంగెన్ 21

గీ అన్ని సదుపాయములు గల్గునగ్రహార
మొందు పంటవలంతి సర్వోచ్చగాఁగ
వీరభద్రపురంబను పేరొసంగి
దానమిడె వీరభద్రానతారుఁ డనుచు 22

సీ పదఁపడి వీరన్న బ్రహ్మచర్యంబును
విడిపింపఁ గోరి యాపుడిష్టితేడు
తనసభాస్థలిగల్గుఘనపండితులలోఁ
నగ్రగణ్యుండగునతనియనుఁగుఁ
గూతు భద్రను రూపగుణవంతురాలిన్
వీరన్నకిప్పించి పెండ్లిసేయ
నెంచి ముహూర్తంబు మంచిది పెట్టించి
వీరన్న వైపున వియ్యమందె 23

గీ బ్రాహ్మణోత్తములెంమి దీవనల నిడఁగ
సకలయాచకనికరంబు సంతసింపఁ
బెండ్లి యొనరించెఁ బ్రియముగ విందులిడుచు
నఖిలజనములు దప్పనౌరా యనంగ 24

వ అంతఁ గాలక్రమంబున వీరభద్రబిరుదం బొందినవీరవిబుధుని
పత్నీరత్నంబు పుష్పవతియై భర్తృగృహంబుఁ బ్రవేశించి. 25

చ వినయముఁ బేర్మి సంపదయు విశ్రుతనిర్మలకీర్తి పుణ్యవ
ర్తనముఁ గృహాంతరంగమును దానము భోగదృఢానురాగమున్
జనవును గల్గి భర్తకనుసన్న మెలంగెడు భద్రకాంత త
న్నినయముఁ దోడికాంతలు ప్రియంబున మెచ్చుచుఁ జెల్మి సేయఁగన్

సీ ఈవిప్రునకు నిట్టియింతి చేకూఱుట
బహుజన్మకృతతపఃఫలముగాదె
యీసతీమణికిట్టి హృదయేశుఁ డొదవుట

తొలి బాము నోముఁ ఫలము గాదె
యీభవ్యగుణునకు నిట్టియుత్తమురాలు
సతియౌట చిరపుణ్యసరణిగాదె
యీపుణ్యచారిత్ర కిట్టిధర్మాత్ముండు
మగఁడౌట ఘనదానమహిమగాదె
గీ యనుచు జనములు బొగడంగ ననవరతము
నొండొరుల కనురాగంబు నింపికొనఁగ
వీరనార్యుఁడు పత్నియు వివిధగతుల
నతులసౌఖ్యాంబునిధి నోలలాడుచుండె 25
శా. అష్టైశ్వర్యము గ్రక్కుచోట ధరలో నావిర్భవంబొందెనాఁ
దుష్టింజెందఁగ మంగపేశ్వరుఁడు సంతోషింప బంధుల్ మనో
భీష్టంబౌ తనయాష్టకంబుఁ గని యుర్వీదేవతాదంపతుల్
స్పష్టౌదార్యులఁ బుణ్యమూర్తుల సచ్చంద్రప్రభాకీర్తులన్ 26
క అష్టాశాంతులో మఱి
యష్టసుసిద్ధివ్రజంబో యష్టవసువులో
అష్టాశాకరులో యన
నష్టభ్రాతలు చెలంగి రష్టవిభూతిన్. 27
క వీరలలో నొక్కొక్కరి
కారయ జన్మంబు నొంద రష్టతనూజుల్
వారికపత్య పరంపర
వారక వర్ధిల్లె కదళి వంశము వోలెన్ 28
గీ ఇట్లు శాఖోపశాఖలై యెసఁగువంశ
మునకు ధర్మపన్నాలవారనెడు పేరు
విడియఁ గల్లూరి పేరయ్యె వీరనార్యుఁ
డరుగుదేరంగఁ గల్లూరియందునుండి
29

వ. ఈకల్లూరి వంశంబు నానాటికి విస్తరించి జనసంఖ్యయమితం
బయి జాతాశౌచాదులకతంబున శుభకార్యంబులకెల్ల నంతరాయంబు
వాటిల్ల నందలి బుద్ధిమంతు లీవంశంబును గడ్డీవృక్షంబున కెనయించి
బొంత యమృతపాణి చక్రకేళి యను ద్వివిధనామంబుల నీకల్లూరివం
శంబుఁ దేజరిల్లఁజేసియుం దొరకుం బరమపుణ్యంబులసంబంధంబు వోఁ
ద్రోలి శుభకృత్యంబులు నిర్వర్తించుకొనుచుండిరి అందుఁబొంకకల్లూరి
వంశంబున 30

మ. సకలామ్నాయనిగమావధానియును బాహ్యశ్రౌతవిద్యావిధి
ప్రకటప్రజ్ఞుఁడు భూరిశాంతుఁడుఁ గృపావంతుండు నాగంతుక
ప్రకరానల్పవితీర్ణకల్పభూరుహుఁడు శంభుభక్తిమంతుండుఁ ద్ర్యం
బక దేవార్చన నిష్ఠితాగ్రహుఁడు రామస్వామియొప్పెంగడున్

కం. శ్రీరామస్వామ్యవధా
న్యారాధిత పరమశివుఁడె యనఁగాంచు ఘనా
చారుం డతనకిఁ బ్రథమవి
శ్వేశ్వర దీక్షితుండు పెదకొమరుండై. 32

వ. అట్టివిశ్వేశ్వర దీక్షితుఁడు 33

సీ. శ్రుతిమూర్తి మాతృః సోమావధానిక
న్యాయ వేదవిద్యతోఁ దనకు నీయ
మొగి గణత్రయ విల్లు మూర్తిభవించెనాఁ
బొలుపారు సుతుల మువ్వురను గనియెఁ
దనయందు వాత్సల్య తత్పరుండై మెరయ
గౌరీరమణుఁ డెప్డుఁ దారసిల్ల
నవని యథాక్రతున్యాయంబునం దాను
శౌరిఘనుఁ డన్న పేరఁ బరఁగెఁ 34

ఆ. వె. పుడమిఁ దనకు మరలఁ బుట్టువు లేకుండ
భక్తిఁ జేసి యొందె భర్గపదము
విపులపుణ్యమూర్తి వీరేశ్వరాఖ్యదీ
క్షితుని నెనయువారె యితర నరులు. 35

ఉ. పూతచరిత్రుఁ డీసుని పుత్రులలోపల నగ్రజన్ముఁ డు
ద్గాతను తేజుఁ డుర్వి నుదార గుణుండును నప్రతిగ్రహ
ఖ్యాతుఁడు సత్కృతాంధ్ర సరసార్థగతి శ్రుతిపేయమాధురీ
వ్యాతతవాగ్విభుం డిలయందను వేంకటశాస్త్రి పేర్వడెన్ 36

చ. క్షితిసుతఁ గొన్న రామనృపశేఖరు పోలిక శీలగోత్ర రా
ట్సుత వరియించినట్టి పురసూదను భంగిఁ గులీనసద్గుణాం
కిత శుభలక్షణాంగి యనుకీర్తిని గాంచుటఁ గామ సోమదే
వ్యతిశయితాఖ్య కాహ్వయగు నాసతి వేంకటశాస్త్రి చేకొనెన్.

సీ. పతిభక్తియందు నీసతి యరుంధతితోడ
సాయుజ్య మొందఁగాఁ జాలుచుండు
సూనృతోక్తులయందు సుదతి భారతితోడ
సరసోక్తులాడఁగాఁ బఁగుచుండు
సౌభాగ్య మహిమ నీచాన యంబికతోడఁ
సరి చేసులాడఁగాఁ జాగుచుండు
సిరి సంపదలయందుఁ దరుణి యిందిరతోడ
నియ్యంబు నందఁగా వెలయుచుండు 37

గీ. నవఁగి నలువురు బిడ్డం జననియగుచు
నలరు వేంకటశాస్త్రి యర్ధాంగి కామ
సోమదేవమ్మ యని మెను సుదతి మిక్కు
కుపమ యగుదురె? తక్కిన యువిదలెల్ల 38

కం. ఇల నీసతికిని బతికిం

గల సంతతియందు నగ్రగణ్యుఁడు గిరిజా
లలనాపతి సేవకుఁ డు
జ్వాల వేంకటరామశాస్త్రి బ్రహ్మ మెసంగెఁ 39

సీ. భవ్య గీర్వాణాంధ్ర భాషాసముల్లస
త్సాహిత్య కవితావిశారదుండు
స్కంధ త్రయాన్విత జ్యోతిషోక్తులయందు
సవరరుచి మహిమతోఁ బ్రబలు బుధుఁడు
సద్వేదముఖశబ్ద శాస్త్రసముత్కృష్ట
పాండితీవైభవమండనుండు
వేదాంత సిద్ధాంత విపుల ధర్మాగమ
శాస్త్రార్థపరిచిత స్వాంతయుతుఁడు 40

గీ. రాజరాజేంద్రనగర విరాజమాన
రాజకీయాఖ్యకాలేజి రాజమందుఁ
జదువు శిష్యాళి కుభయభాషాగురుండు
రమణ విలసిల్లు వేంకట రామశాస్త్రి 41

సీ. తన విద్య లవనిసార్థకతఁ బొందెడునట్టు
లెవ్వరడ్గిన నెమ్మి నెలమి నుడువుఁ
దన కిప్పజీతమంతయు జీర్ణమగునట్లు
బంధు మిత్రుల గౌరవమ్ము సల్పుఁ
దన గృహస్థత్వంబు ఘనత నొందెడునట్లు
దార పుత్రాదులఁ దనుపఁ జూచుఁ
దన జన్మ మిలలోన ధన్యం బయగునట్టు
లబ్బురంబగుభక్తి హరునిఁ గొల్చు 42

గీ. మహితగురుజనానురాగసమన్వితుండు
సతత సద్గ్రంథ పఠన వాంఛాయుతుండు

నిరతహృదయస్థితైకపత్నీ వ్రతుం
జగతినొప్పు వేంకటరామశాస్త్రి

కం. శ్రీహరి లక్ష్మీదేవిని
మోహమున వరించినట్లు పూరితో
ద్దేహిని లక్ష్మీపతి ను
ద్వాహంబై తెలయు నితఁ డపారప్రేమన్

వ. అప్పుణ్యాసతీతిలకం బెట్టిదనిన—

సీ. ఈ యింతి పతిభక్తి నెల్లకాంతాళికి
నాచార్య యగుఁదగి యవని మెఱయు
నీతన్వియౌదార్య మెల్లబాంధవులకు
నమృతసంధానమై యలరుచుండు
నీచాన సౌజన్య మెల్లచూపఱకును
గన్నుల పండువై కానిపించు
నీరామమందిరంబే యన్నపూర్ణాంబి
కారామభూమియై యడరుచుండు

గీ. ననుచు లోకులు తన్నెప్డు వినుతిసేయ
నమలకులజాత తరుణీకులావతంస
మగుచు సౌభాగ్యసంపద ననవరతము
నలరు వేంకటరామ వామాంగలక్ష్మి

కం. ఈరమ్యదంపతులకుఁగు
మారులు నల్వురును బ్రకటమునఁ బుట్టిరి
స్ఫారులు గొమరికలిద్దఱు
ధారణి నిజయించి రతుల దానఫలమునన్

వ. అట్టి యపత్యవర్గంబులో దేఁబిర్లవేంకటవీరసుబ్రహ్మణ్యుండను
నతం డనమానహాపశేఖావిలాసుండును క్షమేయసద్గుణగణగరిష్ఠుండును

సత్య పరాయణుండునునై పదునాలుగు వత్సరంబుల ప్రాయంబుగలిగి

శా. భగవద్భక్తి రసానుభూతి నపరప్రహ్లాదుడున్ బుద్ధిసూ
క్ష్మగతిం జేసి తలంపఁగా వరరుచిఖ్యాతిం గనంగా నన్న శ్లా
ఘ్యగుణంబున్ బితృవాక్యపాలనరతుండౌ బాలుఁడొందెన్ ధ్రువో
ద్ధగతి న్వేంకటవీరపూర్వపద సుబ్రహ్మణ్యనామాహ్వయుండై

కం. ఏతత్పుత్రశేఖరునకు
నాతతసుగుణాకరునకు నవిరతభవిత
హేతునకుచితాచరణున
కీతున నగజాపతిపద నిష్ఠితమతికిన్ ౫౦

కం. సంతత పితృభక్తియుత
స్వాంతునకున్ సజ్జనతీర్థ్యబాలాద్భుతధీ
మంతునకున్ నిర్మలహృ
చ్ఛాంతునకున్ సద్యశోనిశాకాంతునకున్ ౫౧

కం. పావనలక్ష్మీదేవీ
శ్రీవేంకటరామశాస్త్రి భాగ్యసుతునకున్
శ్రీ వేంకటవీరసు" పద
భావితనామంబుగల్గు బ్రహ్మణ్యునకున్ ౫౨

వ. శాశ్వతపుణ్యలోకసిద్ధ్యర్థం బాతనిదివ్యనామం బీధాత్రీతలంబున విలసిల్లంగోరి జనకుండు స్వవిరచితంబైన బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక యనునాంధ్రవ్యాకరణగ్రంథం బీజ్యేష్ఠపుత్రశేఖరుని పరిచర్యాఋణంబుం దీర్పుటకై కృతిగాఁగ నర్పించెంగావున నిబాలచంద్రుండు శరచ్చంద్రచంద్రికా సాంద్రంబగుపరిశుద్ధయశోరూపంబుతో నిహపరలోకంబుల వర్ధిల్లి తేజరిల్లుంగావుత

ఇట్లు
గ్రంథకర్తగారి ప్రియశిష్యుఁడు
దోరకొండ జగన్నాథరావు బి. ఎ.
టీచర్, మిస్సన్ ఏ.వి.యన్. కాలేజీ

విశాఖపట్టణం
16—.—15

## —గ్రంథారంభమందలి మంగళాదికము—

మ. మనుపంజాలుదువీవు మాతాపితలై మమ్మర్థనాశ మూ
ర్తిన్ విశ్వంబుసృజియించి ప్రోచియును బేర్మిన్ నేహ నానాస్తికిం
చన యస్మచ్ఛ్రుతిప్రకారమున వీజాగ్రల్లలాటంతపా
క్షిని దుర్మార్గమసాక్షి నీకెరఁగుదుర్ శ్రీకోటిలింగేశ్వరా
(మద్రచిత కోటిలింగేశ్వరశతకస్థపద్యంబు)

శ్లో. వందే కుమారవినయై రిహ కామసోమ
దేవ్యంబికాం జనక వేంకటశాస్త్రివర్యమ్
యా సార్వమంగళగుణా యక ఉగ్రతేజా
కౌండిన్యగోత్ర రజతాద్రివతంసభూతౌ (మాతాపితృవందనము)

శ్లో. యా కల్లూర్యభిధానవంశరమణీముక్తామణి, ర్యాం దయో
త్కృష్టాం కష్టపరంపరానుభవనీం సీతోపమాం శిశ్రియత్
సిద్ధార్థి న్యధిశుక్రకృష్ణనవమి శ్రీకామసోమాఖ్యదే
వ్యస్మన్మాన్యజన న్యశీతిశర దాపుశ్యాయుషా ద్యా మగాత్

కం. తనయుఁడ జాతూకర్ణికి నన్నియ్యుత్తరరామచరిత నంబాన రణన్
జనకునకుమాతదశగుణ మనువిధిఁ దెల్పుఁ భవభూతి నొందెద దాల్మిన్

(శ్లో. "పితుర్దశగుణం మాతా గౌరవేణాతిరచ్యతే యనుస్మృతి ప్రకారంబున మహావీరచరితమందుంబలెఁ గాకయుత్తరరామచరితనాటకమందు నొక్కతల్లినే తలంచిన భవభూతికవికి నమస్కారమనిభావము)

మ. ప్రథితాస్మాకనగోత్రులై తమరుసూర్యాచంద్రముల్ నాన్ దయా
గ్రథితంబౌమతి కోడ నదుర్చికళాప్రాప్తున్ననుం జేయ హ్యా
త్పథమందుంతు న్నృసింహదీక్షితు మహాభాష్యాబ్ధిబంధుర్ గురుర్
బృథుమేధాస్పదసాంగ వేదపురుషు న్వీరావధానిం గురున్ ౪
(స్వవంశస్థ గురువందనము)

యందు ఇంద్రదస్రుకు లుండుటయును వారియుచ్ఛస్థితిం జెప్పుచున్నది "ప్రజ్ఞాచకర్మవిజ్ఞానం బుధేనైవ విచింతయేత్ అను ప్రమాణంబు ననుసరించి ప్రజ్ఞాకరుండైన బుధుం డుచ్ఛస్థుండై యుండుటయే వీరిప్రజ్ఞా ప్రభావము వేనోళ్ళ గొనియాడంబడుచున్నది రాజ్యమందుం బృహస్పతి యుండి వాగ్విద్యాస్థానము లను జూచుచుండుటచేత వారికి విశేషవిద్యా వైశద్యము కలిగిన దని వ్రాయు టతిశయోక్తి కాజాలదు

---

## విద్యాభ్యాసము.

వీరి కైదువత్సరములు వచ్చినప్పుడు వీరిమేనమామ గారగు బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతి సోమయాజులుగారిచే నక్షరాభ్యాసము చేయింపంబడి నాటినుండియు విద్యలయం దపారాసక్తి గలిగి పదిరెండు వర్షముల ప్రాయము వచ్చునప్పటికే బ్రహ్మశ్రీ బొడ్డపాటి గౌరీపతి శాస్త్రులవారియొద్దం గావ్యనాటకాలంకార సాహిత్యజ్ఞానము సంపాదించి జనస్తుతికిం బాత్రమై రని వినియుంటిని వీరు కావ్యములు చదువునప్పుడు ప్రతిదినము రెండు మూడుం శ్లోకముల చొప్పున జదువుము పాఠము చెప్పుకొనుటకుం బూర్వము క్రొత్తశ్లోకములు సమన్వయము చేసికొని రమ్మని గురువుగా రాజ్ఞాపింప గా మనశాస్త్రిగారా మరునాడు 90 శ్లోకములుగల సర్గ మంతయు సమన్వయించుకొనుటయే గాక కంఠపాఠమును జేసికొని వచ్చిరనియు ఇట్లే ప్రతిదినమును పాఠము చదివిం గురువుమెప్పునకుం బాత్రమై ప్రసిద్ధిగాంచి రనియుం బెద్దలుచెప్పుదురు

---

# శాస్త్రిపాండిత్యము

——(•:•)——

ఇట్లు సాహిత్యజ్ఞానము గలిగినపిమ్మట 13వ సం రమున తాళ్ళపూడి యను కుకునూరు వీరభద్రపురాగ్రహారంబునకుం జని యటఁ గాశీపురవాసులగు జగదీశపండేజీవారియొద్ద శిష్యులును, భాష్యాబ్ధిమథన సంగృహీత సుధీభావులును, కల్లూరివంశ ముక్తామణులును, నిరుపమానులైన బ్రహ్మశ్రీ నరసింహదీక్షితులుగారి శిష్టాచారమార్గగతి విశిష్ట చరణారవిందంబులయొద్ద శిక్షితులై వ్యాకరణ మహాభాష్యాబ్ధి పారంగతులైరి (సూత్రభాష్యము, గీతాభాష్యము, మహాభాష్యము, ననుభాష్యత్రయముం జదివిరి.) బ్ర కల్లూరి వీరావధానులుగారియొద్ద వేదవేదాంగ వేదాంత జ్యోతిష ధర్మశాస్త్రాదులయం దపారపాండిత్యము సంపాదించిరి మఱియును వైయాకరణసార్వభౌము లనిపించుకొనుటయే గాక కుశాగ్రబుద్ధి ప్రభాగరిష్ఠులనియు, సాహిత్య చక్రవర్తులనియుఁ బ్రఖ్యాతిం గాంచిరి.

---

# ఉద్యోగము

---

క్రీ. శ 1885 మొదలుకొని రాజమహేంద్రవరమున టౌనుస్కూలునందు శాస్త్రిలుగారు సంస్కృతోపాధ్యాయులుగా నుండి పిమ్మట బోధనాభ్యసన పాఠశాల (ట్రైనింగుకాలేజి) యందును, సర్వకలాశాలయందును సంస్కృతప్రధానోపాధ్యాయులై ప్రసిద్ధిఁ గాంచిరి. పాఠశాలలయం దుపాధ్యాయత్వమును నిర్వహించుచు వ్యాకరణాది శాస్త్రావలోకనము ఉభయభాషాకవిత్వ తత్త్వవిచారము చేయుచుండుటయే గాక స్వయంకృషిచే మాసత్రయంబులో మిడిల్‌స్కూలు పరీక్షయందుఁ గృ

తార్థులైరి! కళాశాలాధికారులగు నాంగ్లేయులును, హిందువులును, వీరి నెంతో ప్రేమాతిశయంబునం జూచుచుండిరి. వీరి కిచ్చిన యోగ్యతాపత్రములే యిందులకు నిదర్శనములు. రాజకీయకళాశాలలనుండి వీరు విశ్రాంతి నొందినతరువాతఁ గొవ్వూరు సంస్కృతకాలేజీ ప్రధానోపాధ్యాయులుగా దాదాపు రెండు సం రము లుండిరి. వీరియొద్ద నభ్యసించి నవిద్యార్థులు పెక్కుడు శిరోమణియం దుత్తీర్ణులైరి. ఇయ్యది వీరిబోధనాప్రభావంబుననే కలిగిన దని పాఠశాలాధికారులు ప్రస్తుతించిరి.

—గౌరవబిరుదములు—

రాజమహేంద్రవరము సర్వకలాశాలలనుండి విశ్రాంతి గైకొనిన వెనుక 1920సం॥ ఏప్రిల్ 1వ తేదీని ఆర్ట్సు కాలేజీలో మ. రా. రా. . డి. అప్పలనరసింహము. యమ్ ఏ. యల్. టి. గారి అధ్యక్షతక్రింద నొక్క మహాసభ గావించి శాస్త్రిలవారినిఁ బుష్పమాలాలంకృతులుగాఁ జేసి గౌరవించుచు "శ్రీశాస్త్రిలవారు గొప్పవైయాకరణులు, జ్యోతిశ్శాస్త్రంబున స్కంధత్రయంబును దెలిసినవారు, కొన్ని సం॥రములు పంచాంగములను గూడ గుణించిరి. ఉభయభాషాపాండిత్యమందును, వేదాంతశాస్త్రమందును మిగుల సమర్థులు. బాలవ్యాకరణమునకు వీరు రచించిన గూఢార్థప్రకాశిక యనువ్యాఖ్యానమే వీరియ ఖండపాండిత్యమ ను వెల్లడించుచున్నది. సూర్యరాయాంధ్రనిఘంటు పరిశ్రమలో వీరికిఁగలిగిన సన్మానమును బ్రశంసనీయము." అనిమొదలగువిషయములుగ్గడించి శ్లాఘించిరి.

1920 సం॥రముజూన్ 5,6 తేదులందు బరహంపురమున సమావేశమైన 5వ ఆంధ్రసారస్వత మహాసభవారు "ఆంధ్రగీర్వాణములయందసమాన ప్రజ్ఞాధురీణులును సాహిత్యసార్వభౌములును, శాస్త్రపారంగతులు నగు బ్ర॥ శ్రీ॥ కల్లూరి వేంకటరామశాస్త్రిగారి, కీసభవారు శ్రీమన్మహోపాధ్యాయ బిరుదము నొసంగుచున్నారు." అని తీర్మానించుకొని శ్రీమన్మహోపాధ్యాయ బిరుదము నొసంగిరి.

---

—గ్రంథరచనము—

వీరు సర్వదాభాష్యావలోకనముం జేయుచు, ఉపాధ్యాయకార్యముల నిర్వర్తించుచు గృహకృత్యములఁ జక్కబెట్టుకొనుచు, తీరుబడిలేని వారైనను అప్పుడప్పుడు తీరికచేసికొని సాత్విక బ్రహ్మవిద్యావిలాసనిరసన మను గ్రంథమందు వంశముక్తావళియను నొకగ్రంథమును కాళిదాస మేఘసందేశమున కాంధ్రీకరణమును, జార్జిముక్తావళి యను గ్రంథమును, కోటిలింగేశ్వరశతకమును, చతురాస్యము లోనగు మఱికొన్ని గ్రంథములును, రచించిరి. శైలిం జూపుట కొక్కొకపద్యము.

మ। తనచంద్రోపమకీర్తితోడ వెలయం దన్మండలం బెల్లహా
యనముల్ కొన్నిగతింపఁగా సదరమీనాభిఖ్యుఁడై యొప్పుచో
జనులెల్ల బొగడంగఁ దేల్చె శ్రుతుల సంతోషనీరాకరం
బునఁ దాఁబుణ్యజనాత్మహారి యగుచున్ మూర్తి ప్రభావంబునన్.

„వంశముక్తావళి"

ఉ॥ తమ్ముఁడ మేఘుఁడా! తిథులఁ దద్దయు నెన్నుచు సాధ్వి మన్నదుం
జమ్మి నిజంబుగా వదినెఁ జూచెదు పో గమనంబు సార్థమా
నెమ్మని నిండి పువ్వుసరణి విరహాంబునఁ దీఁగ బోండ్ల జీ
వమ్మపుడూడఁ జూడ సుమబంధము వైఖరి నాస నిల్పుగా॥

"మేఘసందేశము"

మ। పొగ కార్మబ్బులు మంటచాల్మెఱపులున్ బొంగారు కన్నీటియే
టిగముల్ సల్పిన దాండయాత్రికులఁ ధాటీవృష్టి పేచ న్మహా
యుగమై తోచినదుర్దినాళి బహుమహోగ్రంబు మాయించి బల్
సుగముం గూర్చెదు నాంగిలేయ విజయజ్యోతిశ్శరశ్చంద్రికల్

„జార్జిముక్తావళి'

శ్లో॥ అలంకృత్వా వాసం జలధిహృదయస్థాంగలమహా
నృణా మత్రత్యానాం సయసతిమిరం హంతు ముదతః

చిరాదాస్మాకీనా త్సుకృతపరిపాకా త్సముచితా
జ్జయ శ్రీమాఞ్ జార్జి ర్వ్యజతి విదితం డిల్లినగరం॥

"జార్జిముక్తావళి"

మ॥ విను నీవే దలిదం(డు లిద్దఱును గావే యర్ధనారీశ మూ
ర్తిని విశ్వంబు సృజించి ప్రోచియు నయారే నేహనా నాస్తి కిం
చన యన్నట్టిశ్రుతిప్రకారమున నీజాగ్రల్లలాటంతపా
క్షిని సర్వంబు లయింప సాక్షివి గదా? శ్రీకోటిలింగేశ్వరా.

"కోటిలింగేశ్వరశతకము"

---

మఱియు నాంధ్రమహాభాష్యం బన దగు బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక అనువ్యాకరణశాస్త్రభాష్యమునురచించి యాంధ్రలోకమున కెంతయో మహోపకారము చేసిరి. అయ్యది వీరి యపారశాస్త్రజన్య జ్ఞానమును వేనోళ్ళ వెల్లడించుచున్నయది.

## ప్రజ్ఞావిశేషము

మఱియు వీరు పెక్కుకృతివిమర్శనములు, హాస్యకుముదాకరములు, శాస్త్రచర్చలు పెక్కులు చేసియుండిరి. ప్లవసంర ఆషాఢ మాసనిర్ణయమున జరిగిన పండితమహాసభలో మూఁడుదివసంబులు వరుసగానిరర్గళధారాప్రవాహంబుగ నుపన్యసించి పండితమండలి కచ్చెరువు గలిగించిరి. అర్ధోదయ మహోదయ నిర్ణయము వినాయకచతుర్థీ నిర్ణయము మున్నగు ధర్మశాస్త్రాది జ్యౌతిష విషయములం గూర్చి అప్పుడప్పుడు విపులముగాఁ జర్చించి నిర్ణయ పత్రికలు వ్రాసి లోకపూజ్యతం గాంచిరి. రౌద్రిసంర పుష్కరనిర్ణయ విషయమై పలువురు పలువిధములఁ దగవు లాడ రాజమహేంద్రవర పురమున నొకసభ గావించి సందర్భవశమున నలికాయత్వముం గూర్చి చర్చించుచు శ్రావణ

శుద్ధ తృతీయా భానువారమే పుస్తకారంభమని నిర్ణయించి ప్రఖ్యాతిం గాంచిరి. ఆంధ్రదేశమునం బ్రఖ్యాతిం గాంచిన గౌతమీ గ్రంథాలయాధికారులు వీరిపాండిత్యమునకు మెచ్చి వీరినిం తమగ్రంథాలయమున గౌరవజీవగౌరవ సభ్యునిగ నెన్నుకొనిరి.

---

## జ్ఞాపకశక్తి

వీరి జ్ఞాపకశక్తి యత్యద్భుతము. ఏదేని యొకశబ్దమందు సందేహము గలిగి వీరి నడిగి నప్పుడు దాని సాధుత్వా సాధుత్వములు నిర్ణయించుచు, నిదియాయాపుస్తకములలో నాయాయాశ్వాసములలో నిన్నియిన్నవపద్యములలో నున్నదని చెప్పి యాపుస్తకములు తెప్పించి రుజువు చేయుట నే ననేకపర్యాయములు చూచియున్నాను. వా రాపద మెప్పుడు చూచియున్నారో అదియెట్టి జ్ఞాపకశక్తియో చెప్పుటకు శక్యముకాదు, అదియమానుషశక్తి యని చూచినవారికిం దోపక మానదు ఈలో వీరి కపస్మార రోగము వచ్చినప్పుడును నీశక్తిపోలేదు మఱియు నేజాతకచక్రమేని యొక్కమాఱు చూచినచో దాని మఱచుట వీరెఱుంగరు 30, 40 సం|రముల కైన నాజాతకుఁడు వచ్చి నాజాతకము చెప్పఁగలరా యని యడిగినప్పుడు చూచినవానివలెఁ జెప్పుట నేనెఱుంగుదును. ఈజ్ఞానము రోగకాలమందును నిలిచి యున్నది. ఇట్లేవీరు, బాల్యమునుండియుఁ జదివిన శ్లోకములు మొదలగునవి జ్ఞాపకమున నున్నవని చెప్పు టతిశయోక్తికాఁజాలదు ఇట్టిజ్ఞానముమున్ను శంకరాచార్యుల కుండెనని వినియున్నారము. ఈవిషయము వారి నెఱింగిన వారికందఱకు ననుభవమే గావున దాని నింతతో విడుచుచున్నాను.

---

## దైవభక్తి

వీరు ప్రతిదినము స్నానసంధ్యాద్యనుష్ఠాన
పార్థివలింగపూజ గావించి వెనుక లలితామంత్ర జపము
వారని

శ్లో॥ లలితాం కలితాంకదంబపుష్పై
ర్మిలితాం సాంబశివేన మాతరం
లలితాంబరధారిణీం లతాంగాం
ఫలితాంతారస వాచమర్థయే.

ఇత్యాది పద్యములవలనఁ దెలియుచున్నది. వీ ను
శతరుద్రీయపారాయణము ఉపనిషత్పారాయణముభగవద్గీతా పారాయణము రామాయణ పారాయణముం జేయుచుండెడివారు
విద్యాభ్యాసము నిమిత్తము కాశీక్షేత్రమునకుం బో ంచియు
యాజ్ఞంజేసి యదిలభింపమిం జేసి సర్వదా కాశీక్షేత్రమ
మనంబున నిలుపుకొన్ని ధ్యానించు చుండువారని తెలియుచున్నది. 60 వం రములు వచ్చునట్టులకుమఁ బ్రతిసాయంకాలమందును. శి నము చేయక భుజించువారు కారు.

---

## ఆర్థికము

వీరికిఁ బితృపితామహార్జితమైన భూములవలనసాలు 3నూర్ల
రూప్యములువచ్చును. ఉపాధ్యాయ పదమునందుండిన 30, 40, 50, 60 చొప్పున సాలునకు 5, 6, నూర్ల రూప్యములుమాత్రమేవచ్చుచుండును. ఈధనంబునఁ గుటుంబ భరణము చేసికొనుచు కొడుకులకు మనుమలకుంబెండిండ్లలోనగు శుభకార్యములు చేసికొనుచు ను
చెడకుండఁ గాలక్షేపము చేసినారు. వీరుజ్ఞానమువచ్చినది మొద ని
యెప్పుడు నెట్టియిక్కట్టు వచ్చినప్పుడు నొరులవద్ద ఋణపత్రము వ్రాసి

దెలుఁగేయని స్పష్టమగుచున్నది. మఱియు నిందుఁ దమవ్యాఖ్యానము నాక్షేపించుచుఁ బత్రికలలో వ్రాసిన వడ్డాదివారి చినసీతారామస్వామి శాస్త్రిగారియు మహామహోపాధ్యాయ తాతాసుబ్బారాయశాస్త్రిగారియు వ్రాఁతలను సహస్రముఖముల ఖండించుచు వ్రాసినవ్యాసములు ముద్రితములు (ఈవ్యాసములలో సమరాంగణపార్థమూర్తి, ధటాసూర్యప్రదర్శి, కన్నెపల్లివేంకటసీతాపతిశాస్త్రి, ఇత్యాది నామములు కలవు. ఇవియన్నియు నాయావిషయములకుఁ దగినట్లు కల్పించిన పేళ్ళు గాని యన్యులెవ్వరును లేరు. ఇవియన్నియు శాస్త్రిగారి వ్రాఁతలేయని లోకమెఱుంగుగాక) అవి చదివినవారికి శాస్త్రిగారి యసాధారణపాండిత్యము ప్రజ్ఞావిశేషము తెలియకపోదు. లోకములో మనశాస్త్రిగారి కన్నమిన్నగాఁ జదివినవారుండిన నుండవచ్చునుగాని వీరివలె "తిమ్మని బ్రహ్మనిగాను, బ్రహ్మని దిమ్మనిగాను,. జేయంగలసామర్థ్య మెవ్వారికి నుండఁబోదని నిశ్చయముగాఁ జెప్పఁగలను. "అపశబ్దభయం నాస్తి అప్పలాచార్యసన్నిధౌ" అనునట్లు వారియొద్ద నేయపశబ్దమైనను సుశబ్దము చేయు నేర్పుకలదని యిందులోఁ జేర్పఁబడిన "సుమనోల్లాసశబ్దమే" సాక్ష్యమిచ్చుచున్నది. మఱియు ననేకవిషయములు వారి పాండిత్యముం గూర్చి వ్రాయవలసినవియున్నవి కాని గ్రంథవిస్తరభయంబున నింతలో విరమింపవలసినవాఁడనైతిని కాని మఱియొక్కవిషయము మాత్రము చెప్పుచున్నాను.

"వివిధకళాప్రవీణు లతివిశ్రుత వైభవసాంద్రు లెందఱో
భువిమునుబుట్టి గిట్టిరొక పూరుషులైన నొకండెఱుంగునే
కవులగు తొంటివారలు జగత్త్రయమందిపుడున్ వసింతురా
శివకరులైనవారు మృతజీవులు కీర్తిశరీరులెన్నఁగన్"

అనిచెప్పినట్లు వారిపాండిత్యమునకుం దగనేదేనొక్కమహాగ్రంథము రచించియుండవలసి యున్నది. అట్లుచేసినవారు కారు. కొందఱు

మనశాస్త్రిగారిని సూర్యసిద్ధాంతము నాంధ్రీకరింపుఁ డనికోరిరఁట వారును మంచిపద్ధతిని దానిం దెనిఁగింప నిశ్చయించి రఁట కాని యదియును కొనసాగినదికాదు. నేను వారిదర్శనము చేసినప్పుడు సర్వదా "మీరు సర్వాలంకారగ్రంథములం గ్రోడీకరించి తెలుఁగున నొక యలంకార శాస్త్రగ్రంథము రచింపవలయు" నని కోరుచుండువాఁడను. వారును "నేను నీవుచెప్పినట్లలంకార సర్వస్వమను పేరితో నొక లక్షణగ్రంథము వ్రాయుదు" నని చెప్పినవారేకాని చెప్పినట్లు చేసినవారు కాకపోయిరి. వారికావిషయమునఁ గుతూహలములేక పోలేదుగాని కాలమలంఘ్యము కదా ఉపకారవేతనము నొందినది మొదలు వారికేవో యనివార్యము లైనపనులు తటస్థించుచునే వచ్చినవి. అంతలో నాల్గుసంవత్సరములు మహారోగము. తరువాతఁ బరమపదయాత్రయుఁ దటస్థించినది. వారి యుద్యమము నెఱవేఱిలోకము ధన్యముకాలేకపోయినది. అట్లయినను వారిగ్రంథములలోని "సుప్తార్థప్రకాశిక" పరమోత్తమమైనది. అదియేవారి కీర్తి నాచంద్రతారార్కముగాఁ బ్రకాశింపఁ జేయుటకుఁ జాలునని సంతసించుచున్నాను

ఉభయభాషావిశారదులును, వైయాకరణశిరోభూషణులు, సర్వసమర్థులునగు శ్రీ శ్రీ శాస్త్రిగారి పరమపదగమనము మారాజమహేంద్రవరమునకే గాక ఆంధ్రలోకమున కంతకును దీఱని లోపము ను గలిగించినదని చెప్పుట కావంతయును సందేహింప నక్కఱలేదు అయినను వారియాత్మయు, వారిప్రజ్ఞయు వారి విద్యావైశద్యమును, సుప్తార్థప్రకాశికయందు దావేశించి పాఠకమహాశయుల యుల్లములు పల్లవింపఁ జేయుచుండు నని నమ్ముచు నింతతో నీచారిత్రమును ముగించుచున్నాను

ఇట్లు

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

# అభివందనము



సీ. లోకబాంధవముచే, లోగొను నిరుగన
నిరుగడ వేదంబు గరిమఁ దనరు
రసములం దీయుట రహినొప్ప నిరుదెస
నిరుదెస లక్ష్మీగృహస్థతయగు
నంధకారంబు వోనఁద్రొర్ధు నిరువంక
నిరువంక నిజసేవ కేచ్ఛదీర్చు
వ్యాకరణాదిక వ్యాప్తియా నిరువైపు
నిరువైపు నిజకాంతి నెఱఁదరిర్చు
తే. గీ. సూర్యభగవాను సాదృశ్య సుకృతమబ్బి
సూర్యలోకముఁ బొందిన సుజనవర్య
మత్పితృభగవానుని మహామహిము మహిత
తేజు వేంకటరామశాస్త్రిని భజింతు.

ప్రథమపుత్రుఁడు వీరవేంకట సుబ్రహ్మణ్యము బి. ఎ. బి.ఇడి.



సీ. ఏమహామహుఁడు సురేంద్రపీటికి నేఁగి
సురకోవిదాళికిఁ జుఱుకుసూప
నే మహాశౌరి బుధేంద్రుల కిగి గూర్చె
నిజసమర్థత్వంబు నెఱి నెసంగ
నేపుణ్యచరితుఁ డెంతేఁ దపంబొనరించె
నాత్మనిజాత్మలో నరసికొంచు
నే భవ్యచరితుఁ డెన్నే సుగుణమ్ముల
రంజిల్లె నిర్ధర రహినెసంగ

తే॥ నట్టి మహనీయు ధీమహితాత్ము విద్వ
దగ్రసరుని కల్లూరి వంశాబ్ధి పూర్ణ
చంద్రు వేంకటరామ శాస్త్రీంద్రు నాదు
తండ్రి ననవరతము మదిఁ దలచి కొలుతు

ద్వి॥ పుత్రుఁడు రామచంద్రమూర్తి బి. యే. బి. ఇడి.

---

సీ. కలముచేఁ బూనినగాండీవమూను నా
పాండవమధ్యము పగిదినొప్పఁ
బాత్రంబు చేఁబట్టి బోధింప బుధులకు
ననిమిషేంద్రుని గురుననుకరించు
జపమున గూర్చున్న జారుతనొప్పు త
న్మూర్తి వేదవ్యాసమునిని బోలు
జనులమనంబుల నరగున రంజింపఁ
జేయంగ రఘుకులశ్రేష్ఠుఁ బోలు

తే. గీ. నట్టి సార్థకనాము గుణాభిరాము
సత్యసంధు నమలయశస్సాంద్రు నతుల
బుద్ధిమంతు బ్రహ్మాంశ సంభూతు మజ్జ
నకు భజింతు వేంకటరామనామశాస్త్రి.

తృ॥ పుత్రుఁడు వేంకటవీరసుబ్రహ్మణ్యము బి. యే. (బి. ఇడి. క్లాసు)

---

మ. తృణధాన్యాశనుఁడుఁ వనౌకసుఁడు శ్రీకృష్ణాంగుఁడున్ బాదరా
యణుఁడే శంభుపదారవింద మకరందస్వాద శుద్ధాత్మ వా
క్ప్రణితిం గన్గొని పల్లబాతెడునో! యాకల్లూరి వంశోజ్జ్వల
న్మణి శ్రీవేంకటరామశాస్త్రివరు బ్రహ్మన్ మద్గురుఁ బ్రొక్కెదన్.

ఒక శిష్యుఁడు.

సీ. వేదాంతశాస్త్రముల్ వెదజల్లి విలసిల్లు
శంకరాచార్యుల శక్తితోడ
శబ్దాగమములెల్ల సాధించి నిపుణుఁడౌ
పాణినీయుల మహాప్రతిభతోడ
న్యాయశాస్త్రములెల్ల నయమొప్ప రచియించు
భాస్కరాదుల ప్రభావంబుతోడ
నాటకాలంకార నయగుణయుక్తుఁడౌ
కాళిదాసునిలనత్కళలతోడ
తే. గీ. నిన్ను నిర్మించె భారతీనేతగాక
అనుపమాద్వైత తర్కశాస్త్రాదులందు
నిట్లపరిమితపాండిత్య మేరికుండు
ప్రథిత కల్లూరి వేంకటరామశాస్త్రి.

ఒకపండితుఁడు



శ్రీ

గురుభ్యోనమః

బాలవ్యాకరణ

# గుప్తార్థప్రకాశిక



## ఆంధ్రభాష, వ్యాకరణము.

ఆంధ్రదేశంబున వాడఁబడుభాషకు నాంధ్రభాష యని పేరు. భాషయనఁగా జనులు పరస్పరాభిప్రాయములను దెలియఁ జేసికొనుటకు సాధనంబులై యనాది సంకేతంబులైనశబ్దములు. ఇయ్యది వాగ్రూపము మఱియు, లిఖితరూపము మఱియు ద్వివిధము. ఎఱుకవాండ్రు మున్నగువారు భాషించు భాష వాగ్రూపముగానే కాని లిఖితరూపముగా లేదు. గీర్వాణాంధ్రాంగ్లేయాది భాషలు వాగ్రూపములుగాను, లిఖితరూపములుగాను, గలవు. భాషయందలి సుశబ్దాపశబ్దముల పరిజ్ఞానము గలుగఁ జేయునది వ్యాకరణశాస్త్రము. దీనికి లక్షణశాస్త్రమనియు, శబ్దశాస్త్రమనియు, నామాంతరములు గలవు. శాస్త్రమనఁగా శాసించునది (నియమించునది.) శాస్త్రము—తర్కము, వ్యాకరణము, ధర్మశాస్త్రము, మీమాంస, వైద్యశాస్త్రము, జ్యోతిషము; అనియాఱు విధములు.

## సంజ్ఞాపరిచ్ఛేదము

వ్యా.—సంజ్ఞ = పేరు: పరిచ్ఛేదము-భాగము పేరులనుగూర్చి చెప్పుభాగము సంజ్ఞాపరిచ్ఛేదము.

**1. సూ.—సంస్కృతమునకు వర్ణము లేఁబది.**

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః॥ క ఖ
గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య

## బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక.

వ్యా.— తెనుఁగు భాషకు నక్షరములు ముప్పది యాఱు (మూఁడు + పది + ఆఱు-) ఈ తెలుఁగునందు రేఫ మిరు దెఱంగుల గ్రహింపఁబడు చున్నదని బోధించెడి "రస్స్వక్రత్యస్యతే ద్వివిధ" యను వాగనుశాసనసూత్రంబునఁ శకట రేఫంబును సహితము వర్ణంబులలో లెక్కించిన పక్షంబున ముప్పదియే డక్షరంబులగు నని యుద్ఘోషించు నప్పకవి పుస్తక మందలి పాఠాంతరము పెక్కుఁ గారణంబులచే సమంజసంబుగ నున్నది. అహోబలపతియు నిది వక్కాణించెను. తక్కిన యనాద్య వర్ణంబుల భాతిని శకట రేఫంబును, వర్ణంబులలోఁ బృథక్కుగాఁ బరిగణించుట న్యాయ్యము. మఱియు నీ శకట రేఫము పరిశిష్ట పరిచ్ఛేదమందలి యిరువది నాల్గవ సూత్రమ్మునందుఁ జర్చింపఁబడును.

4. సూ.— ఋ ౠ ఌ ౡ విసర్గ ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష లు సంస్కృత సమంబులను గూడి తెలుఁగున వ్యవహరింపంబడు.

ఋతువు - పితౄణము - క్లృప్తము - ౡకారము - దుఃఖము - ఖడ్గము - ఘటము - ఛత్రము - ఝరము - కంఠము - ఢక్క - రథము - ధరణి - ఫణము - భయము - పఙ్క్తి - ఆజ్ఞ - శరము - షండము.

వ్యా.— ఈసూత్రమునందలి ఋ ౠ మొదలైన పందొమ్మిది యక్షరంబులును, తద్భవమునందుఁగాని, యాంధ్ర దేశ్యంబునందుఁగాని, వాడఁబడక సంస్కృతసమంబులను జేరి యాంధ్రంబున వాడఁబడుచున్నవి. ఉ. ఋతువు, పితౄణము, క్లృప్తము, ౡకారము, దుఃఖము, ఖడ్గము, ఘటము, ఛత్రము, ఝరము, కంఠము, ఢక్క, రథము, ధరణి ఫణము, భయము, పఙ్క్తి, ఆజ్ఞ, శరము, షండము. పఙ్క్తిశబ్దము ఙ కారమున కై యుదాహరింపఁ బడెను. ఈశబ్దమును "పంక్తి" అని సబిందువుగా వాడుకలో వ్రాయుట తప్పు.

5. సూ.— క చ ట త ప లు పరుషంబు లని గ జ డ ద బ లు సరళంబు లని చెప్పంబడు.

వ్యా.— "క, చ, ట, త, ప," అనునక్షరంబులు పరుషంబులనియు, "గ, జ, డ, ద, బ" అను నక్షరంబులు సరళంబు లనియుఁ జెప్పం బడును.

6. సూ.—ఇతరము లగు హల్లులు స్థిరములు.

ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ భ మ య ర ల వ శ ష స హ ళ

వ్యా.—కకారము మొదలుకొని ళ కారము దనుక నుండు ముప్పదినాలుగక్షరంబులలోని పరుష సరళంబులు పది యక్షరంబులు మాత్రము కాక యితరము లయిన యిరువదినాలు గక్షరములును స్థిరము లనఁ బడును.

7. సూ.—దంత్యతాలవ్యంబు లయిన చ జ లు సవర్ణంబులు.

తాలవ్య చకారంబు దంత్య చకారంబునకును దాలవ్యజకారంబు దంత్య జకారంబునకును గ్రాహకము లని తాత్పర్యము.

వ్యా.—సవర్ణంబులు =సజాతీయములు (మూలము) గ్రాహకములు=స్ఫురింపఁ జేయునవి (అన్యోన్యమిత్రములు.) దంత్యచకారంబునకుఁ దాలవ్యచకారంబును, దంత్య జకారంబునకుఁ దాలవ్యజకారంబును, మిత్రము లని యీసూత్రముయొక్క భావము. ఈ సవర్ణ యనెడి మైత్రివలన యతిప్రాసాది కావ్యములయందు దంత్యము తాలవ్యము లొకదానికొకటి ప్రతినిధిగా నుండఁ దగును.

8. సూ.—ఇ ఈ ఎ ఏ లం గూడిన చజలు తాలవ్యంబులు.

చిలుక - చీమ - చెలి - చేమ - జిల - జీడి - జెట్టి - జేజె.

వ్యా.—"ఇ, ఈ, ఎ, ఏ" అను నీయచ్చులతోఁ గలిసిన "చ, జ" అనునవి తాలవ్యములు(దవుడలసాహాయ్యమున నుచ్చరింపఁబడునవి) ఉ. చిలుక, ఈశబ్దమునందలి చకారము - "ఇ" అను నచ్చుతోఁ గూడినది--(చ్ + ఇ=చి) కనుకఁ దాలవ్యము. ఇట్లే చీమ, చెలి, చేమ, జిల, జీడి, జెట్టి, జేజె. "ఏచ ఇగ్ఘ్రస్వాదేశే"(1 అధ్యా1 పాద, సూ 47) అను సూత్రముయొక్క భాష్యమందు నైవలోకేనాన్యస్మిన్ న్వేదే-అర్ధఏ కారః, అర్ధఓకారోవాస్తి" అనుటంజేసి, హ్రస్వమైన "ఎ"కారంబును "ఒ" కారంబును సంస్కృతభాషయందు లేవు తెలుఁగుభాషయందే "ఎ" కారంబును, "ఒ" కారంబును గలవు. ఉ. ఎగ్గ ఒప్పిదము ఇత్యాదులు. సమాంశవాచకమైనప్పుడు గూఁడ "అర్ధ" శబ్దమునపుంసకముగాక, పుల్లింగముగాభాష్యమందుఁ బ్రయోగింపఁబడినది.

9. సూ.—అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లం గూడిన చజలు దంత్యంబులు.

చలి - చాప - చుక్క - చూపు - చొక్కు - చోటు - చౌక - జముఁడు - జాతర

జున్ను - జూలు - జొన్న - జోలి - జౌకు - ఐదంతములయిన చజలు సమేతరశబ్దములందు లేవు.

వ్యా.—"అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ" అను నీయచ్చులతోఁ గూడిన "చ, జ" అనునవి దంత్యములు (దంతముల సాహాయ్యమున నుచ్చరింపఁ బడునవి.) ఉ. చలి; దీని యందలి చకారము అకారముతోఁ గూడినది (చ్ + అ=చ) కావున దంత్యము ఇట్లే చాప, చక్కి, చాపు, చొక్కి, చోటు, చౌక, జముడు, జాగు, జున్న జూలు జొన్న, జోలి జౌకు, ఈ సూత్రాంతమునందు "ఐదంతము లైనచజలు సమేతర శబ్దంబులందు లేవు" అని యుండెను. [ఐకారము అంతమందుఁగల "చ, జ" అను నవి సంస్కృత సమేతరశబ్దంబులందు (తెలుఁగుశబ్దములయందు) లేవు.] అనఁగా "చై" గాని, "జై" గాని యాదియందుఁ గల పదములు తెలుఁగు నందు లేవు కనుక ఐకారముపై సూత్రమునందు సంఘటన చేయఁబడలేదు. ఇది యోచింపఁ గనమే కాఁబోలు. వైడిపాటి లక్ష్మణకవిగారు తమ యాంధ్రనామసంగ్రహమందు "చైవులసాకిచాయవగఁడు" అని ప్రయోగించిరి; కాని యిద్ది అప్రామాణికము. చెయువులనికాని, చెవ్వులనికాని, యుండవలెను. అప్పుడు యతిభంగం బని వాక్యం బే యగును.

10. సూ.—సంస్కృతసమంబులం దికారాంతములైన శబ్దముల యుపధాచజలు బహువచనంబు పరంబగునపుడు దంత్యంబు లగును.

తెనిగింపఁబడిన సంస్కృతసమంబులందు దంత్యచజలు లేవు. తాత్పర్యము- ఉపధ యనఁగాఁ దుదివర్ణమునకు ముందువర్ణము- అర్చి - అర్చులు - రోచి - రోచులు - వీచి - వీచులు - రాజి - రాజులు — వాజి - వాజులు- మఱియు రాజశబ్దంబు కృతి దంత్యయుక్తంబుగా నంబడియెడి. ఇతరము లయిన చజల కుదాహరణములు- చంద్రుడు - చామరము - చక్రిక - చూర్ణము - చోరుడు - చౌర్యము - జయము - జాతి - జుగుప్స - జూటము - ఇత్యాదులు.

వ్యా.—ఉపధాశబ్దమునకు [illegible]. సంస్కృతసమంబులయందు, ఇకారము తుదయందుఁ గలవాని యుపధాభూతములగు చజలు బహువచ

బాంతెంబు నందు దంత్య చజలుగామాఱును. ఉ. అర్చులు. సంస్కృతము "అర్చిస్" అనునది. దీనికిఁ దత్సమము "అర్చి". దీని యంత్యాక్షరము. ఇకారము, ఈయికారమునకుఁ బూర్వాక్షరము చకారము, గలదు. (అర్ + చ్ + ఇ) ఈ యికారము బహువచనంబగు లు లలు పరంబగునపుడు ఉకారంబగును. (అర్ + చ్ + ఉ + లు) ఇట్లు ఆదేశముగా వచ్చిన ఉకారముతోఁ గూడిన చజలు సాంస్కృతికములైనను, తాలవ్యములుగా నుచ్చరింపఁబడు నక్షరంబు గావున సూత్రోచ్చారణార్థ మీసూత్రమువే దంత్యము లని శాసింపఁబడ్డె. ఇట్లే రోచులు, వీచులు, రాజులు (రాజి) వాజులు (వాజి) మొదలయినవి.

అచ్చులు. ఈ శబ్దములోని చకారము పైని ఉకారము ఆదేశవర్ణము గాదు గనుక లు ల లు పరంబగునపుడు తాలవ్య చకారముగానే యుచ్చరింపఁబడును. ఇది దంత్యంబైనచో "ముచ్చి" అన్న యర్థంబిచ్చును: గాని స్వరము లన్న యర్థము రాదు. (మూలము) "రాజుశబ్దంబొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి" రాజశబ్దం బొక్కటి యేక వచనాంతంబును దంత్య యుక్తముగాఁ గనఁబడు చున్నది. అనఁగాఁ దత్సమ మైనను రాజశబ్దములోని జకారము దంత్యముగా నుచ్చరింపఁబడుచున్నదని యభిప్రాయము. "రాజు" అను శబ్దము వైకృతంబనుగలదని (తెనుఁగు శబ్దమని) కొందఱందురు. అట్లయినచో నంత్యము కావుటను సందియ మిందుకయు లేదు. ఇయ్యది ముఖ్యంబుగఁ గూచిమంచి తిమ్మకవిప్రభృతులు తమయచ్చతెనుఁగు గ్రంథముల యందుఁ బ్రయోగించిరి. కనుక నియ్యది యాలోచింపఁ దగ్గయంశము.

"ఆ. ఎందు వేఁట రారె యితరు లే మనసుతో
దారసంగసుఖము తప్పఁద్రోచి
తకట! పాండురాజయశ మెన్న వైతతి
క్రూరదశరథేశకులము రోయ"

అను రాఘవపాండవీయప్రథమాశ్వాసపద్యములో భారతార్థమునందు "పాండురాజ" అను నది తత్సమం బగు సంబుద్ధ్యంత పదంబు గావున నిచ్చట రాజశబ్ద జకారంబు చిన్నయసూరిగారి సంజ్ఞాప్రకరణమందలి యీసూత్రంబునం జేసి దంత్యంబు గానుండవలయు ననియు, రామాయణార్థమునందు "అజయశ" మని పదచ్ఛే దముచేతఁ దాలవ్యముగా నుండవలె ననియు, ననెడి హేతువులచేత "శ్లేషయందు జకారం బొక్కటియు యొకయర్థమున దంత్యమును, వేఱొక యర్థమునఁ దాలవ్యమును

నయ్యెడు' నని ప్రౌఢవ్యాకరణ సంజ్ఞాపరిచ్ఛేద మిరువదియైదవ సూత్రములో నర్థయాథార్థ్యసామరస్యమునకై బ సీతారామాచార్యులవారిచేత వివరింపఁ బడినది అయ్యది చింత్యంబు పరస్పరంబును విరుద్ధోచ్చారణంబులు గల దంత్య తాలవ్య జకారంబులు రెండును బద్యపఠనసమయంబున నేకీభావంబుగా నెట్లు స్ఫురింప శక్యం బగును? పద్యపాఠకాలంబున దంత్య ముచ్చరించినచో రామాయణార్థము చెడును తాలవ్యముగాఁ బలికినచో భారతార్థంబునకు భంగంబు సంభవించును కావున నర్థద్వయసాధకంబుగాఁ బాండురాజ శబ్దంబును బ్రయోగించిన పింగళిసూరకవీంద్రుల తాత్పర్యమిట్లని తోఁచెడిని ఇచ్చటఁ బాండురాజ శబ్దంబునకుఁ బాండురోగ మితనియందుఁ బ్రకాశించు నన్నవ్యుత్పత్తియందు నధికరణార్థంబున ఘుణ్ ప్రత్యయము వచ్చినది కావున నిచ్చటఁ బాండురాజ శబ్దంబు "పాండురోగము ప్రకాశించువాఁడా" అని విశేషణార్థమిచ్చును; కాని "పాండునామము గలరాజా" అని నృపాది విశేష్యార్థం బియ్యనేరదు విశేష్యార్థకంబై ప్రసిద్ధంబైన రాజశబ్ద జకారంబు దంత్యం బని వ్యాకరణకర్తల తాత్పర్యంబు కాని విశేషణార్థకంబైన రాజశబ్దజకారంబు దంత్యంబు గానేరదనియే వారితాత్పర్యంబు ప్రకృత పద్యంబులో "పాండురోగము ప్రకాశించువాఁడా" అన్నయుపాలంభార్థమే (నిందార్థము) శాపసమయంబు గావునఁ బ్రకరణంబున కనుకూలముగానున్నది కాఁబట్టి భారతార్థమందును బాండురాజ శబ్దజకారంబు తాలవ్యం బనియేయూహించుకొన వలయును కావుననే యప్పకవిగారు తమగ్రంథంబు నందలి ద్వితీయాశ్వాసములో నీపద్యంబునే యుదాహరించి "శుద్ధసంస్కృతిమైన పాండురాజ శబ్దంబునం గల జకారము తాలవ్యమే కాని దంత్యము కానేరదు ఇది తెలియక కేవలాంధ్రులు దంత్యాక్షరముగా నుచ్చరింతురు అది లాక్షణికమతముగాదు అట్లగుటం జేసి కవితాప్రవర్తకులైన సూరపరాజుగారు ఇంతివట్టుం విచారించి ప్రయోగించిరి' అని భారతార్థమునందును జకారము తాలవ్య మనియే సిద్ధాంతీకరించిరి క్రియావాచకమైన రాజశబ్దంబుతో విశేషణార్థ మిచ్చునట్టి యీ పాండు రాజశబ్దము యొక్క ప్రథమావిభక్తిరూపము 'రాజుఁడు' అన్నట్లుగ "పాండురాజుఁడు" అనియే యుండవలెను ఈవ్యాకరణమందలి తత్సమ పరిచ్ఛేదములోని డెబ్బదియెనిమిదవ సూత్రము ప్రసిద్ధంబైన నృపాది విశేష్యార్థక రాజశబ్దమునకే చెల్లును గాని ప్రకాశక్రియార్థము నిచ్చెడి యిట్టి విశేషణార్థకస్థలంబులలో "పాండురాజుఁడు" ఇత్యాద్యుపసర్జన స్థలంబులలో విశేష్యార్థకరాజశబ్దంబునకుం బోలె సంబంధింపనేరదనియెఱుఁగ వలయును రాజశబ్దంబును గుఱించి యింకను దత్సమ పరిచ్ఛేదము నందలి డెబ్బదియెనిమిదవ సూత్రంబు కొద్దిఁ జర్చింపఁ బడును కావన నాఁడు జూడు మాయనది

## సంజ్ఞాపరిచ్ఛేదము.

(మూలము) ఇతరములైన చ జ ల కుదాహరణములు, అనఁగా "అ ఆ ఉ ఊ" అను నచ్చులతోఁ గూడి వను వర్ణంబు లగుటచేఁ దాలవ్యములుగా నుచ్చరింపవలసిన చ జ లుగల యుదాహరణంబులిట్లైనవను: చంద్రుఁడు, చామరము, చుక్క, చూర్ణము, చోరుఁడు, చౌర్యము, జాతి, జాకప్పు, జూటము, మొదలైనవి

**11సూ. — నకారంబు ద్రుతంబు**

వ్యా — నకారంబునకు ద్రుతంబను పేరు ద్రుతంబనఁగా నక్కఱలేని యప్పుడు మఱుఁగుపడునదియని యర్థము. కేవల నకారంబు ద్రుతనామంబున సామాన్యంబుగా వాడఁబడుచున్నను ప్రత్యయంబును (ఫలమును, నేను, వెళ్లుచున్నాను) ఆగమంబును (వారిచేతను, చేయుచును, మఱియును) అవ్యయంబును (అప్పుడును, మఱియును, అన్నయును) నైన యుకారాంత నకారంబే ద్రుతసంజ్ఞ గలదని యని చెప్పుట యుక్తము ప్రథమా బహువచనంబగు లు ప్రత్యయంబునకు ఉకారంబు లేకున్నను "వనముల్, ఫలముల్" ఇత్యాదుల యందు శేషించిన లకారమే వెనుకటి ప్రత్యయార్థమును దెలిపినట్టులు ద్రుతసంజ్ఞ గలిగిన నుశబ్దము యొక్క ఉకారం బుచ్చరింపఁబడకున్నను మిగిలిన నకార మాత్రమే మునుపటి యర్థంబును దెలుపుచుండును "ఉన్నారు" ఇత్యాదుల యందలి ఉకారంబునకు ననభిధానంబున లోపంబు గలుగదు వాగనుశాసనుఁడు కేవల నకారంబునకు "ద్రుతాఖ్యోనః" అను సూత్రంబున ద్రుతసంజ్ఞ విధించెను ను శబ్దంబు యొక్క ఉకారం బుచ్చరింపఁబడకున్నను శేషించిన నకార మాత్రమే విశిష్టంబైన నుశబ్దార్థంబును జెప్పునని తాత్పర్యము

**12. సూ — ద్రుతాంతము లైన పదములు ద్రుతప్రకృతికములు.**

ప్రథమాకయిుషష్ఠియొక్కా తరములయిన విభక్తులు - ఉత్తమ పురుషైకవచనంబులు - భూత తద్ధర్మాద్యర్థక ప్రథమ పురుషైకవచనంబులు - ఆశీరాద్యర్థంబులయిన మధ్యమ వర్ణకంబులు - శతృగుమానంతర్య చేదాద్యర్థకంబులు - నేను తాను పదంబులు - వలెప్రభృతులును - ద్రుతప్రకృతికంబులు - నన్నున్ - నాచేతన్ - నాతోడన్ - నాకొఱకున్ - నావలనన్ - నాకంటెన్ - నాకున్ - మాలోపలన్ - మాయందున్ - వత్తున్ - వచ్చెదన్ - వచ్చెన్ - వచ్చున్ - వచ్చెదున్ - ప్రసన్నుండయ్యెదున్ - కావునన్ - కొట్టుమన్ - కొట్టన్ - కొట్టఁగన్ - కొట్టుచున్.

కొట్టినన్-వలెన్ - ఎంతయున్-పోలెన్-అయ్యున్ - ఇత్యాదులూ హ్యాంబులు.

వ్యా—ద్రుతముచివరంగలశబ్దములు ద్రుతప్రకృతికములు ఏవియనిన:—1 ప్రథమావిభక్తియును, (రాముఁడు) కయి పట్టి, యొక్క, లక్కడక్కడిన విభక్తులును, (నన్నున్, నాచేతన్, నాకొఱకున్, నావలనన్, నాకంటెన్, నాపట్టన్ మాలోపలన్, మాయందున్) 2 ఉత్తమ పురుషైక వచనంబులును (వత్తున్, వచ్చెదన్) 3 భూతార్థక ప్రథమపురుషైక వచనంబును, (వచ్చెన్) 4 తద్ధర్మార్థక ప్రథమ పురుషైక వచనంబును, (వచ్చున్, వచ్చెదున్) 5 ఆశీరాద్యర్థకంబులైన "ఎడు, త" అను వర్ణకంబులును, (ప్రసన్నులయ్యెదున్, కావుతన్) 6 శత్రర్థకంబును, (కొట్టుచున్) 7 ఋమున్నాద్యర్థకంబును, (కొట్టన్, కొట్టఁగన్) 8 అనంతర్యార్థకంబును (కొట్టుచున్) 9 చేదాద్యర్థకంబును, (కొట్టినన్) 10 "నేను, తాను" అను శబ్దంబులును, 11 వలె మొదలైనవియును, (ఎంతయున్, పోలెన్, అయ్యున్, మిగులన్, కడున్, వెంటన్, వెంబడిన్, మొ) ద్రుతప్రకృతికంబులుగా నూహింపఁదగ్గవి. "చ. ఘనవర ఘూర్జరీకుచయుగ క్రియ గూఢముగాక ద్రావిడీ స్తనగతిఁదేటగాఁ యజచాటునాం ధ్రవధూటిచొక్కపుం జనుగవ బోలిగూఢమునుజాటుఁ దనంబునులేక యుండఁదై ప్పిన నడవోకవిస్వ మనిపించు నగించటు కాక యుండినన్' ఇచ్చట "నగించు" అనునది తద్ధర్మార్థకంబు గావున ద్రుతాంతంబై పద్యములో "నగించు నటు" అని యుండ వలెను అప్పుడు గణభంగము గలుగును గానఁ బ్రథమములో "నగించెడు నట్లుగానిదోన్' అని కవిచే రచింపఁబడి క్రమక్రమముగా ద్రుతము లేని పాఠము ప్రమాద కృతమై యుండవచ్చును ఇప్పద్యము పెద్దన్నగారి చాటుపద్య మని కొందఱును, వేంకటనాథకవికృతంబగుపంచతంత్రములోని దని మఱికొందఱును జెప్పుదురు భాస్కర శతకమునందు "చ చీఁకపుర్వ్వుదాఁ జెడకొఱికింతె గాక పుడిసెండు జలంబిడి పెంపసేర్చునే' అను పద్యతృతీయ పాదములో "కొఱుకునింతె" "గాక" అనిద్రుతాంతముగా నుండవలసిన దానికి "కొఱుకింతెగాక' అనివ్యాకరణ విరుద్ధముగాఁ బ్రయోగింపఁబడినవి ఇట్టి ప్రామాదికప్రయోగంబులకు 'నిరంకుశాః కవయః' అనెడి లోకోక్తియే శరణంబు గాని వేఱొకగతి గానిపింప కున్నది

'తే గీ తన్ను నిన్ను నన్ను విన్ను మన్నా మిన్ను చన్నుకన్ను వెన్ను శబ్దములకు జడ్డలుండుఁబోవుఁ జర్చింపని వి ద్రుత ప్రకృతులెపుడుఁగావు భక్తసులభ' అప్ప 5-అ ఇప్పద్యమందలి "తన్ను, నిన్ను, నన్ను" శబ్దంబులు ద్వితీయాంతంబులు

కావున ద్రుతప్రకృతికంబులు. పై పద్యంబులో నప్పకవి కళాశబ్దంబులలోఁ బరిగణించుట కవిరథసహేతుకంబు

13. సూ—ద్రుతప్రకృతులు గాని శబ్దంబులు కళ లనఁబడు.

రాముఁడు - రాములు - హయము - విష్ణువు - గోడ - మేడ - అయ్య - అమ్మ - రామునికయి - జ్ఞానముఁబట్టి - నాయొక్క - వచ్చిరి- వచ్చితివి - వచ్చితిరి - వచ్చితిమి - రాఁడు - రారు - రామ - రావు - రాము - కొట్టక - తిట్టక - ఎత్తిలి - ఒత్తిలి - ఊరక - మిన్నక - బళి— అక్కటా - ఏల - ఇత్యాదులూహించునది

వ్యా—ద్రుతము కడపట లేని శబ్దంబులు కళ లనంబడును. రాముఁడు, గోడ, అమ్మ, మొదలైన ప్రథమలును, "కయి, పట్టి, యొక్క" అను ప్రత్యయంబులును, వచ్చిరి మొదలగు రేఫాంత క్రియలును, వచ్చితివి, వచ్చితిరి, మున్నగు మధ్యమ పురుష క్రియలును, వచ్చితిమి మొదలగు నుత్తమ పురుష బహువచన క్రియలును, రాఁడు మొదలగు వ్యతిరేక క్రియలును, ఎత్తిగి, ఒత్తిలి మొదలగునవ్యయంబులును, ఊరక, మిన్నక, మొదలగు తూష్ణీమర్థకంబులును, బళి మొదలగు ప్రశంస నార్థకంబులును, అక్కటా మొదలగు సంతాపార్థకంబులును, ఏల మొదలగు ప్రశ్నార్థకంబులును, "అట్టులు, ఇట్టులుఎట్టులు" అను ప్రకారార్థ కంబులును, "మఱి, మిక్కిలి" అను నత్యంతార్థకంబులును, "ఎ, ఏ, అ" అను నవధారణార్థ కంబులును, ఇత్యాదులు కళలు

క. అనఘ యిది యేటితపమే
మనుపమదుఃఖితులమగుటనాధారములే
కనుసంతానోచ్ఛేదం
బున వ్రేలెదమధమలోకముల తెరవుచనన్."

భార, ఆది 2 ఆ. అను పద్యమందలి "లేకను' అనుప్రయోగము చూచి కొందఱు "లేక" అనువ్యతిరేకక్త్వార్థకము ద్రుతాంతంబుగా నుండవచ్చునని యు, మఱికొందఱు నన్నయగారు "లేకయున్" అని యుశబ్దపూర్వకంబుగా నుండవలసినను నట్లుచ్చరింపకపోవుట పాదపూరణార్థమనియు, నుడువుదురు కాని సముచ్చయార్థంబునకు నవసరంబులేని యిట్టి కళాశబ్దంబులమీఁద నకారంబు కాన్పించిన చోట్లగల్గసను

ద్వయ వకారంబని సవరింపుట సులభంబుగావున నిట్టిని యీ భాససమాధానంబులని యెఱుంగ నది ,,లేకను' అనుచోట లేమిని అన పాఠమే. కవికృతమై యుండును. ఆధారము లేపని అను పాఠము వ్రాఁతప్రతులయందుఁ జూచి నట్లు కొందఱు నుడువుచున్నారు

14. సూ— హ్రస్వముమీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును

అడఁకువ - అడంకువ — అరఁటి - అరంటి - ఎలుఁగుటి- ఎలుంగుటి - బలుఁగము - బలుంగము - మగఁటిమి - మగంటిమి

వ్యా— హ్రస్వాక్షరము తరువాతనున్న యఱసున్న వైకల్పికము (విధికిఁ బ్రవృత్తియు నివృత్తియుఁ గలుగుట) గా నిండుసున్న యగును ఉ అడఁకువ దీనియందలి కుఱుచ యక్షరంబగు డకారము తరువాతనున్న యఱసున్న నిండుసున్నగా మాఱి "అడంకువ" అనియగును వైకల్పిక మనుటచే, అడఁక, అనరూపముంగలదు ఇట్లే అరఁటి ఎలుఁగుటి, మగఁటిమి, బలుఁగము మొద

15. సూ —దీర్ఘముమీఁద సాధ్యపూర్ణములేదు.

వాఁడు - వీఁడు - రాఁడు - లేఁడు - కాఁబోలు- కాఁబట్టి- గోఁగులు — తేఁగలు.

వ్యా —దీర్ఘాక్షరము తరువాతను నిండునన్న శబ్దము యొక్క పుట్టుకలోనే యుండవలయును గాని వ్యాకరణము చేత నిండుసున్న రానేరదు అరసున్న శాస్త్రము చేత రావచ్చును ఉ తాఁజెప్పె వాఁడు ఇచ్చట దీర్ఘాక్షరంబగు వకారముతరువాత నఱసున్న యున్నది. కావుననిండు సున్నవచ్చి "వాండు" అనరూపము సిద్ధింపదు ఇట్లే వీఁడు, రాఁడు లేఁడు, మొద

16 సూ—సంస్కృత సమేతరములైన తెలుఁగుశబ్దంబులయందుఁ బరుష సరళంబులకు ముందేబిందువు కానంబడుచున్నది

వంకర - కలఁకువ - మంచు - త్రాఁచు-దంట - దాఁటు-కొంత - కోఁత. ఇత్యాదులూహ్యంబులు

వ్యా —సంస్కృత సమేతరములు=సంస్కృత సమములు కానివి బిందువు అరసున్నయు, నిండుసున్నయు, తెలుఁగుశబ్దంబులలో నఱసున్న గానినిండుసున్న గా

యుండుచోఁ బరుషములను (క, చ, ట, త, ప లు) సరళములను, (గ, జ, డ, ద, బ లు) ముందుండునుగాని దిక్కునవర్ణంబులకు (స్థిరాక్షరములకు) ముందుండదు ఈ వంకర ఇచ్చట బరుషవర్ణమైన కకారమునకు ముందుఁ బూర్ణబిందువు గలదు కలఁకువ ఇచ్చటఁగు వర్ణమునకు ముందునర్ధబిందువుగలదు ఇట్లే మంచు, త్రాఁచు డంట మొదలైనవి గ్రహింపునది

**17. సూ యకారంబును వు వూ వోలును దెలుఁగుమాటలకు మొదటలేవు.**

ఎవఁడు - ఎక్కడ - ఏమి - ఏల - ఉంచు - ఊరు - ఒకఁడు - ఓడ హరియతఁడు నిద్రవోయెనిట్టి వోట్ల సంధివశంబున వచ్చినయకారవకారంబులుగాని పూర్వసిద్ధంబులుగావు - వోఢ్యవోఢవ్యశబ్దములుదప్ప సంస్కృతసమంబులందు సహితము వు వూ వోవర్ణాదులగుశబ్దంబులు లేవని యెఱుంగునది - ఉదకము - ఊర్మిక - ఓదనము.

వ్యా — యకారంబును, వు వూ, వో, వోలును దెలుఁగు మాటలకు మొదట సిద్ధములు లేవు ఉ ఎవఁడు, ఏరు మొదలైనవి 'హరి యతఁడు, (హరి + అతఁడు నిద్ర వోయె (నిద్ర + పోయె) అను నప్పుడీచోటుల నుండు యకార వోకారంబులు సంధి వశము చేత (అకారము యకారముగాను, "పో" అనునది వోకారంబుగాను)) నైనవి కాని సహజములైన యకార వోకారంబులు గావు (మూలము) వోఢ్య వోఢవ్య శబ్దములు దక్క సంస్కృత సమంబులందుఁ గూడ 'వు, వూ, వో" అను నక్షరంబులు మొదటఁ గల పదములు లేవని తెలిసికోవలెను ఉ ఉదకము, ఓదనము మొదలైనవి చిన్నయసూరిగారు యకారంబును వు, వూ వో, వోలును మాత్రమే పదాది యందుండ వని చెప్పిరికాని, శాగ శబ్దంబు లాదియందుఁగల పదములు గూడ లేవని చెప్పలేదు వోళిశా (ఒబ్బట్లు, పోళి) వోఢుః (పితృగృహ వాసియై పోషింపఁ బడిన (పోషిత భర్తృకాసుతుఁడు) వోడజః (గర్భిణీస్త్రీని పెండ్లి యాడిన పిదపఁ బుట్టిన కొమరుఁడు) వోఢా (కుమ్మరవాఁడు, సారథి) వోటా (దాసి) వోడః (పోఁక చెట్టు) వోండ్రః (గొనస సర్పము మత్స్యవిశేషము) వోడ్రీ (పాదచతుర్థాంశము) వోదః (ఆర్ద్రః=తడసిన) వోదాలః (మత్స్యవిశేషము) వోరకః (లేఖకుఁడు) వోరటః (కుందపుష్పము) వోరపట్టీ (మందుర=అశ్వశాల) వోరవః (ధాన్యవిశేషము) వోరఖానః (పాటలవర్ణాశ్వము) మున్నగు వోకార సహిత వకారాది శబ్దంబులు శబ్దార్థ కల్పతరు సర్వశబ్ద సంబోధినీ ప్రభృతి గ్రంథంబులలోఁ గనఁబడుచున్నవి

'సీ. 'జాతివాగలవోఢ్య శబ్దమొక్కటి దక్క
సంస్కృతాంధ్రముల ముజ్జగములందు
శబ్దంబుమొదల నిశ్చయముగాఁ గొమ్ములు
నోత్వంబులును గల్గ వొకటి కైన
వాకుశృంగముల కైవడి నోత్వములభంగి
శబ్దాదిఁగల యవి స్వరములగును" అప్ప. 2. ఆ.

అను పద్యమునందుఁ జూడఁగా వోఢ్యశబ్దం బొక్కండు దక్క ముజ్జగమ్ములఁ జెదకినను సంస్కృతాంధ్రములయందుఁ దెక్కిన పదములకు వోకారము మొదలనుండ దనిచెప్పిన యప్పకవిగారి వచనము సాహసమూలకము

18 సూ.—య ర ల వలు లఘువులని యలఘువులని ద్వివిధంబు లగు.

హరియతఁడు - ఇత్యాదులందాగమయకారములఘువు- తక్కినయకారమలఘువు వీఱుగుమొఱఁగిత్యాదులందు రేఫం బలఘువు - ఇదేశకట రేఫమని చెప్పఁబడును - శకటరేఫముతత్సమతద్భవములందు లేదు - పెరుగుకరుగిత్యాదులందు రేఫంబు లఘువు ఏళులుపాళులు త్రాళుఁ ని బహుత్వమందురలడలకాదేశమయినళకారమలఘువు - తలనెల యిత్యాదు లందలి లకారము లఘువు అతఁడువలికె నిత్యాదులందున్న వాదేశవకారములఘువు - తక్కినవకారమలఘువు వర్ణసమామ్నాయమందలి ళకారమువర్ణాంతరముగాని యలముళకారముగాదని యెఱుంగునది.

వ్యా — య్,ర్,ల్,వ్,లు లఘువులనియు నలఘువులనియు రెండువిధములు. లఘువులన నుచ్చారణలో లాఘవముగలవి అలఘువులననుచ్చారణలో గౌరవముగలవి. ఈ యక్షరంబులకే యంతస్థములని పేరు హరియతఁడు(హరి + అతఁడు) మొదలగువానియందలియకారము శాస్త్రముచేత వచ్చినదిలఘువు తక్కినయకారమనఁగా శబ్దమునొక్క పుట్టుకలోనుండిన యకార మలఘువు ఉ కాయ మొ క్రిమముగా సాధ్యయకార సిద్ధ "యకారంబులులఘ్వలఘువులు" ఇక్లే "న్ద్రదవోయె"ఇత్యాది వకారస్థలఁబునను

గ్రహింపవలెను. విఱుగు మెఱుగు మొదలగు వానియందలి శకటరేఫం బలఘువు (మూలము) శకటరేఫము తత్సమ తద్భవముల యందులేదు

వ్యా.—'గీ ఱేఁడు పలుకు దోఁటనోఁగిఁ దేల్చి పలికిన
రేఫగాదు శకటరేఫగాని
తద్భవపుఁ బదములఁ దవిలిన యారేఫ
రేఫగాని శకట రేఫగాదు."

ద్వితీ-త-29 ల అను కవిసంశయ విచ్ఛేదకారుని మతంబును

'గీ పదము మొదల నిడుదఁదుదిఁ దద్భవంబుల
రేఫగాని శకట రేఫగాదు.

అను దిట్టకవి వేంకటార్యవరుని మతంబును సూరిగారను సరించిరి కాని తిమ్మకవిగారు పైవేంకటార్యునిమాట విశ్వసింపక తమసర్వలక్షణసారసంగ్రహ శకటరేఫ ప్రకరణమునందు

"గీ పదము మొదల నిడుదఁదుదిఁ దద్భవంబుల
రేఫగాని శకట రేఫగాదు
నిక్కమనుచు సుగుణనిధి దిట్టకవి వేంక
టార్యవరుఁడు పలికెనది హుళిక్కి."

అని త్రోసివేసిరి మఱియు వహోబలపతి కవిశిరోభూషణమందు "తుక్కి (తుపకారికాశబ్దభవము) కఱకు (కర్కరమ్) మొఱకు (మూర్ఖ)' ఇత్యాది తద్భవముల యందు శకటరేఫము గలుగుట దోషముగాదని నొక్కివక్కాణించెను ఇంకను ప్రెలింగ లక్షణశేషకారకుని మతమునుఁ గూడఁ దద్భవములయందు శకటరేఫంబులుగలపదములు కొన్నింటినిమాత్ర మీదిగువనుదాహరించు చున్నాఁడను కాఱియ- కాటికాశబ్దభవము పెఱ- పరశబ్దభవము గోఱజము-గోరోచనశబ్దభవము పిఱికి-భీరుకశబ్దభవము గోఱపము- క్షురపశబ్దభవము. మొఱకు-మూర్ఖశబ్దభవము గిఱి-గరుచ్ఛబ్దభవము గఱువ-గుఱుశబ్దభవము ఇత్యాద్యుదాహరణంబులును, వీనికిఁ గావ్యలక్ష్యంబులును చెప్పాలు గలవు గాని, గ్రంథవిస్తరభీతిచె విరమించితిని ఇట్లు శకటరేఫంబు నుచితికిఁ గవుల యనాది ప్రయోగప్రవాహమేగతిగాఁదోఁచుచున్నది కాని, తక్కిన య, వ, ల, లయందుం బలె లఘ్వలఘుత్వజ్ఞానంబునకు స్థిరమైన లక్షణసూత్రము కానిపింపదు పెరుగ మొద

లైన వానియందలి రేఫంబులఘువు బహువచనమందు ర ల డ లకు నాదేశము (ఒకదాని స్థానంబును వేఱొకటి యాక్రమించుటని) గానెవ్వ ఏసులు' మొదలైన శబ్దంబులయందున్న ళ కారమలఘువు తల' మొదలగువానియందలి లకారము లఘువు అతఁడు వలికె (అతఁడు + పలికె) మొదలైనవానియందలి పకారమునకు వచ్చిన వకారము లఘువు పదము పుట్టకలోనేయుండు వకారమలఘువు ఈ చేప (మూ) వర్ణసమ్నాయ (వర్ణవేదము = వేదముకలె ననాది సిద్ధమైనది) మందలి ళకారము మఱియొక వర్ణము గాని యలఘు ళకారము గాదని తెలిసికోవలెను ళకారము వర్ణాంతరముకాదని చెప్పశక్యముగాదు అనగా వర్ణాంతరమే యని ఫలితార్థము సంస్కృత భాషయందు "ల' కారమునకు "ళ కారముకూడఁ బలుకవచ్చును ఇది యట్టిదిగాదు "గళము' "గలము, "మంగళము" "మంగలము ఇత్యాదిస్థలములయందు "ళ' "ల', లకు భేదము లేదు

ఈ తెలుంగుభాషయందు భేదము తప్పక యున్నది దీనికి ననుకూలముగా 'ఆద్యాయాః పంచాశద్వర్ణాః' అను యహోబలపండితీయసూత్రమునొద్ద "నళస్య వర్ణాంతరత్వం వక్తుంశక్యతే అనియున్నది గాన ళ కారము వర్ణాంతరము కాదని చెప్పశక్యముగాదు అనగా వర్ణాంతరమేయని చెప్పవలెను

"కాశీవాసి బ్రాహ్మణుఁడు విద్వాంసుఁడు గాని విప్రుఁడు గాఁడు, అనఁగా విద్వాంసుఁడైన విప్రుఁడే యని సందర్భార్థము చెప్పుకొన్నట్లు యిచ్చటం గూడ ళ కారము వర్ణాంతరము గాని యలఘు ళకారముగాదనగా వర్ణాంతరమైన యలఘు ళకారమే యనియర్థింబగును శ్లో॥ స్ఫుటతా నపదైరపాకృతా నచనస్వీకృతమర్థగౌరవమ్" భారవియనెడికిరాతార్జునీయము 2 స॥ 27 శ్లో॥

ఈశ్లోకమందు నర్థగౌరవముస్వీకరింపఁబడలేదన్నమాటలేదు వ్యా — అర్థగౌరవంచ-నచస్వీకృతం — స్వీకృతమే వేత్యర్థః — నైశద్యప్రసక్తార్థగౌరవాభావ నివర్తనార్థం నఞ్ద్వయం సంభావ్యనిషేధనివర్తనే ద్వౌప్రతిషేధా వితివామనః నఞ్ద్వయార్థము సంభావ్యంబైన నిషేధమును నివర్తింపఁజేయుటయందు అనఁగా పోఁగొట్టుటయందు వర్తించునని వామనుఁ డనెడి వ్యాఖ్యాత వక్కాణించెను అట్లే ప్రస్తుతంబునను, ళ కారము వర్ణాంతరముగాని యలఘు ళ కారము గాదనగా వర్ణాంతరమైన యలఘు ళకారమేయని నిశ్చితార్థమును నఞ్ద్వయార్థము సూచించును

## 19. సూ — సంస్కృతప్రాకృత తుల్యంబగుభాష తత్సమంబు.

సంస్కృతము ... ... ... సంస్కృతసమము
రామః ... ... ... ... ...రాముఁడు
విద్యా... ... ... ... ... విద్య
హరిః. . ... ..... ... హరి
ధేనుః . . . . . ... . ధేనువు
భూః. .. . . . భువి
పితా.. . ... ... . పితి
గౌః ... . . . . . . . .. గోవు
నౌః... .. . . ... ...నావ
ద్యౌః... . . . . ... . దివి
హృద్ ... .. ... ... ...హృది
జగత్ ... ... ... . . ... { జగత్తు / జగము }

ఇత్యాదులూహ్యంబులు.

సంస్కృతము - ప్రాకృతము - ప్రాకృతసమము
అగ్నిః... ... ... అగ్గి ... ...అగ్గి
అటిః ... ... అడీ ... . అడి
అలిః . . } ఓలీ.. . ఓలి
పఙ్క్తిః . }
కటుః ... కాఅో . కారము
గౌరవమ్ ... గారవం . గారవము
జటా. . జడా ... జడ
మిరా ... .. మేరా . మేర
యమః ... జమో. . జముఁడు

రాజ్ఞీ ... రాణీ ... రాణి
శృంగారః ... సింగారో సింగారము
శ్రీః ... సిరీ ... సిరి

వ్యా — సంస్కృతభాషకును, ప్రాకృతభాషకును సమానమైన భాష తత్సమము అనఁగా సంస్కృతశబ్దములయం, ప్రాకృతశబ్దములయం, నంతమందుండు నట్టి దీర్ఘము విసర్గము, మొదలగువానిని శాస్త్రప్రకారంబ నమార్చి లింగభేదములనుబట్టి ప్రథమా విభక్తులను జేర్చినఁ దత్సమంబులగు ఉ సం—హరిః— సం—సమ—హరి సం—ధేనుః సం—సమ—ధేనువు—సం—పితా సం సమ—పిత ప్రా—అగ్గీ ప్రా—సమ—అగ్గి ప్రా—జమో సమ—జముఁడు ప్రా—కారో—ప్రా సమ—కారము ఇత్యాదులైన సంస్కృత ప్రాకృతసమంబులు సారూప్యంబును బట్టిగ్రహించునది చ జ లు సంస్కృతసమంబులయందు దంత్యములు వురే గాని ప్రాకృతసమంబుల యందు దంత్యములు గలవు ప్రాకృతసమంబులు సంస్కృతభవంబులని వాడవచ్చును ఇందులకుఁ బ్రమాణము,—

'క వదలక సిద్ధాక్షరములు
పొదవిన వర్ణములు దూలిపోఁ బలుకఁగ న
ర్థదమై ప్రాకృత నిభమగు
నది తద్భవ పదమునాఁగ నభి మతమయ్యెక్"

అని కావ్యాలంకారచూడామణి పాకృతసమంబులగు అగ్గి, జముఁడుఁ, రాణి జడ, ఆయ్యవి, వరుసగా అగ్నిః, యమః, రాజ్ఞీ, జటా మొదలగు సంస్కృతశబ్దముల నుండి పుట్టినవి మఱియుఁ జిన్నయసూరిగారి యీపుస్తకమందలి ప్రాకృతసమంబుల లోని, "కారము" అను శబ్దము క్షారశబ్దభవంబనియు క్షారశబ్దము కటు శబ్దపర్యాయం బనియుఁ గొందఱ యభిప్రాయము శాసగనేయున్నది. దీనికి సారూప్యంబునుగాన బడియెడి"త్రిరాత్రి ముభయోరధశ్శయ్యా బ్రహ్మచర్యమ్ క్షారలవణ వర్జఞ్చ" ఆపస్తంబ సూత్రవాక్యము "కారము" అనుశబ్దము క్షారశబ్ద భవంబని కవి సంశయవిచ్ఛేదకారకుని మతముపూర్వోక్తమతంబును దృఢపఱుచుచున్న యది వ అక్షారంబులు నలవణంబలు ఉదకంబులు) కాశి-5 అ

20 సూ.—(సంస్కృత పాకృత భవంబగుభాష తద్భవంబు.

సంస్కృతము ... ... ... సంస్కృతభవము
ఆకాశః ... ... ... ఆకసము

| | | | |
|---|---|---|---|
| కుడ్యమ్ | ... | ... | ... గోడ |
| చన్ద్రః | ... | ... | ... చందురుఁడు |
| తిమఙ్గః | ... | ... | ... తమగము |
| తామరసమ్ | ... | ... | ... తామర |
| నారాచః | ... | ... | ... నారసము |
| నిభః | . | ... | . . నెపము / నెవము |
| ముఖమ్ | . . | ... | ... మొకము / మొగము |
| మృగః | .. | ... | ... మెకము / మెగము |
| వక్రః | ... | ... | ... వంకర |
| వేసరః | ... | ... | ... వేసడము |
| సముద్రః | ... | ... | ... సంద్రము |
| సూచీ | ... | ... | ... సూది |
| స్మరః | ... | ... | ... మరుఁడు |
| హారమ్ | ... | ... | ... అరణము |
| హరితాళమ్... | | ... | . . హరిదళము |

ఇత్యాదులు గ్రహించునది.

| సంస్కృతము | | ప్రాకృతము | | ప్రాకృతభవము. |
|---|---|---|---|---|
| అఙ్గారః | ... .. | ఇంగాలో | ... | ఇంగలము |
| అప్సరాః.. | ... .. | అచ్ఛరా | ... ... | అచ్చర |
| ఆశ్చర్యమ్ | ... . . | అచ్ఛేరం | ... | అచ్చెరువు |
| పఞ్చాశత్ | ... ... | పణ్ణాసా | ... ... | పనస |

| | | |
|---|---|---|
| పృథివీ … … .. | పుఢవీ .. .. | పుడమి |
| ప్రయాణమ్ … … | ప్రయాణం… … | పయనము |
| ప్రవాళః … … | పవాళో … | పవడము<br>పగడము |
| మత్సరః. . . | మచ్ఛరో . . . | మచ్చరము |
| యజ్ఞః … . . | జణ్ణో … … | జన్నము |
| లక్ష్మీః .. . … | లచ్ఛీ … … | లచ్చి |
| విష్ణుః … … | విణ్హూ . … | వెన్నుఁడు |
| వైద్యః .. .. … | వేజ్జో .. … | వెజ్జు |
| స్తమ్భః … . | ఖంభో .. .. | కంబము |
| స్థూలమ్ | థోరం … . | తోరము |

ఇత్యాదులు తెలియునది

వ్యా —సంస్కృతము నుండియుఁ బ్రాకృతమునుండియుఁ బుట్టినభాష తద్భవంబు అనఁగా వర్ణలోపము (అక్షరము కనఁబడకుండుట) వర్ణాగమము, (వేఱొక యక్షరమువచ్చుట) వర్ణాదేశము, (ఉన్నయక్షరమును ద్రోసి యాస్థానమున వేఱొక యక్షరము వచ్చుట) వర్ణవ్యత్యయము, (అక్షరములు తాఱుమాఱుకావుట) మున్నగు మార్పులు శాస్త్రప్రకారము పొంది తెలుఁగున వాడంబడు పదములు తద్భవములు ఉ. ఆగ-సం-రథః సం-భ-అరదము (అకారము క్రొత్తగాఁ జేరినది) ప్రా-అచ్ఛేరం-ప్రా-భ-అచ్చెరువు (వువర్ణంబాగమింపఁబు) ఆదే-సం-అంగణమ్ సం-భ అంకణము (గకారంబునకు, కకారమాదేశము) ప్రా-పుఢవీ ప్రా-భ-పుడమి (ఢకారవకారంబులకుఁ గ్రమముగా డకార మకారంబు లాదేశము) లోప-సం-తామరసమ్ సం-భ తామర (సకార లోపము) ప్రా-పణ్ణాసా ప్రా-భ-పనస (ద్వితీయణకారలోపము) వ్యత్యయము సం-శుచిః-సం-భ-చిచ్చు-(సంస్కృతపదంబులో నంత్యంబైన చివర్ణంబు నాంధ్రపదంబులో నాద్యస్థానంబునకు మాఱెను) ఇత్యాదిక మూహించుకొనునది

**21. సూ.—త్రిలింగదేశవ్యవహారసిద్ధంబగుభాష దేశ్యంబు.**

ఊరు - పేరు - ఇల్లు - ముల్లు - కోట - పేట - దూడ - మేడ - కోఁత - లేఁత - తావి - మోవి - ఇత్యాదు లరయునది.

వ్యా.—త్రిలింగదేశ మనఁగా:—శ్రీశైలము, దాక్షారామము, కాళేశ్వరము, ఈ మూఁడుక్షేత్రముల యొక్క మధ్యమందుండు నాంధ్రదేశము. మూఁడులింగములు గలదిగావునఁ ద్రిలింగము, ద్రాక్షతోటలు మెండుగానుండుటచే ద్రాక్షారామమను పేరువచ్చినదని ప్రాక్షవాదముగాని, యట్లుగాదు. "దక్షస్యారామ భూమిత్వా ద్దాక్షారామ ఇతీర్యతే" (దక్షునియారామభూమిగావున దాక్షారామము) అని స్కాందమున భీమేశ్వరఖండమునందుఁ జెప్పఁబడియున్న దనియుఁ గుమారస్వామియజ్వకృత ప్రతాపరుద్రీయవ్యాఖ్యానమగు రత్నాపణమందు వివరింపఁబడ్డది. కాళేశ్వరము విషయమై భిన్నాభిప్రాయములుగలవు. కాళేశ్వరమనఁగాఁ జిన్నతిరుపతి క్షేత్రమునకు సమీపముననున్న శ్రీకాళహస్తి యని సర్వజనుల యభిప్రాయము. ఈకాళహస్తీశ్వరుని గూర్చియే శివభక్తుండగు ధూర్జటికవి "శ్రీకాళహస్తీశ్వరా". అను సంబుద్ధ్యంతంబులగు పద్యంబులతో శతకమును రచించుటయే కాక, కాళహస్తిమాహాత్మ్యమును గూడ నాంధ్రీకరించెను. దీనంజేసి యిది స్వయంభువగు శివక్షేత్రమైనట్లు జగద్విదితమగు చున్నది కాని కాళేశ్వరవిషయమై యొకయభిప్రాయవిశేషముగలదు. హైదరాబాదు రాజ్యములోని నెలగొండల మండలమున గోదావరీనదితో నింద్రావతి సంగమించెడు స్థలంబందు మంథనియనుగ్రామంబు సమీపంబునఁ గాళేశ్వరమను శివక్షేత్రము గల దనియు, నీత్రిలింగములలో నదియే యొకటిగా నెన్నఁబడినదిగాని, కాళహస్తి గాదని యుఁ జెప్పుదురు. కాళేశ్వరము విషయమై ధూర్జటికవి వంటివారు క్షేత్రమాహాత్మ్యము గాని, శతకంబునుగాని, రచించినట్లు వినము. కాళహస్తిశబ్దములో "నామైకదేశే నామగ్రహణ" మ్మను న్యాయంబున హస్తిశబ్దంబును విడిచి కాళశబ్దంబుతో నీశ్వరశబ్దం బుచ్చరింపవచ్చును. శాస్త్రదూష్యంబులేదు సీతారామాచార్యులవారుశబ్దరత్నాకరములో "కాళహస్తి" అనియే నిశ్చయించిరి. "తెలుఁగు" అనుపదంబు త్రిలింగశబ్దభవంబనియు, దీనికిఁ దెనుఁగు రూపాంతరమనియుఁ, గావ్యాలంకారచూడామణ్యాదుల విన్నకోట పెద్దనామాత్యాదులు నెలవిచ్చిరి. మఱికొండఱు తెనుఁగు అను శబ్దము త్రినగశబ్దసంబంధినుడివిరి అట్లయినచో ననుస్వారహీనమైనత్రినగశబ్దమునుండి సానుస్వారరూపంబగు తెనుఁగుశబ్దము జనించుట దుర్లభంబగుటంజేసి తొలయొక్క రూపాంతరము తోన యగునట్లు తెలుఁగు శబ్దముయొక్క రూపాంతరము తెనుఁగనిన భాషగముండునని కొందఱు వ్రాసిరి. కవి[illegible]య్యని ఛ్ఛేకమునవలె [illegible] క్షేత్రములతో



జూడఁగా లకారముగల సంస్కృతశబ్దములకుఁ దద్భవమున నకారమువచ్చుటకిచ్చిన యుదాహరణంబులలోఁ ద్రిలింగశబ్దభవము తెనుఁగనియున్నది.

"సీ. కత్వహత్వములకు యత్వమాదేశమా
జ్ఞణలల నత్వంబు సంభవించు"

కవి-తృతీ-త. 48 ల. అనుస్వారరహితంబులగు సంస్కృతశబ్దంబులు తద్భవంబులలోనికి మాఱునపు డనుస్వారసహితంబులుగా నుండుటయుంగలదు. గావున బిందువు కూడదను పైవాదమంతగా సయుక్తికముగాదు. ఉదా. కీటము-కీఁటు. పూగము-పోఁక. వ్యాఘ్రము-వేఁగి. వైశాఖము-వేసఁగి మొదలైనవి. ఐనను ద్రిలింగశబ్దభవము తెలుఁగనియు రూపాంతరము దెనుఁగనియు గ్రహించుటయే పూర్వోక్తసరసయుక్తులంజేసి సమంజసము. (మూ) తెలుఁగుదేశమందు వాడుచున్న భాష దేశ్యము. ఉదా. ఊరు, కోట, పేఁట, ఇత్యాదులు.

వ్యా.— మూలమునందుఁ గోటపేఁట శబ్దంబులు దేశ్యములుగా నుదాహరింపఁబడ్డవి కాని యట్లుగాదు. కోట్టశబ్దభవము కోట. "కోట్టారఘట్టహట్టాశ్చ" అమరత్రికాండశేషము. పింఠా శబ్దభవము పేఁట. "పింఠా విటజనాశ్రియః" అమరపదపారిజాతము. కోట్టశబ్దపర్యాయంబు సంస్కృతమే కోట శబ్దంబొండు గనఁబడుచున్నది యని ప్రౌఢవ్యాకరణకారకుని యభిప్రాయము. దేశ్యములో, అన్యదేశ్యంబని మఱి యొండు విధంబుగలదు. ఉదా. తావు, పైరాణము, గాడీ, ఇత్యాదిహిందూస్థాని పదములును, తాయి తిరుమాంగమిత్యాదిద్రావిడ పదంబులును, బిడార్విత్యాది కన్నడపదములును, ఆంధ్రమునందుఁ గవిసంప్రదాయసిద్ధముగాఁ బ్రయోగింపవచ్చును.

"సీ. మిహికసిండి పరుంజు మొహదా కెలంకుల
తావు గుజ్జరివన్నె కేవడంబు"—మను 4 ఆ
"సీ. రాణనొప్పారు పైఠాణంబు సింగిణి
తళుకులకోరీలు తరకసంబు"—మను 4 ఆ

"సీ. రమ్యభూషణాలంకృత స్త్రీసహస్రంబుఁ
గాంచన శిబికాసహస్రంబుఁ జిత్రలలిత

గతినొప్పునే నూఱు గాడీలు సింధుజ
బాహ్లీక కాంభోజ పారసీక"—భార ఆది 8 ఆ

"సీ. కన్నబిడ్డల శేవఁగాందిసీకులఁ బ్రోవ
బంగారు తాయిమాడంగశాయి"—పాంచా 1 ఆ

"చ. ధనలోర్థ్వ పుండ్రములయందుఁ
గడున్ దిరుచూర్ణ మొప్ప"—పర 3ఆ

"తే. ఈవెలంది యొడల్ పైఁడిలో వెలంది
యీనెలంత లలాటంబులే నెలంత
యీసుపాణిరదశ్రేణియే సుపాణి
యీబిడారు మృగీమద శ్రీబిడారు"—విజ 1ఆ

22. లక్షణవిరుద్ధంబగు భాష గ్రామ్యంబు.

వస్తాఁడు. తెస్తాఁడు. వచ్చేని - తెచ్చేని - వచ్చేవాఁడు - తెచ్చే వాఁడు వచ్చేటివాఁడు - తెచ్చేటివాఁడు ఈభాష ప్రయోగంబున కన ర్హంబు.

వ్యా.—వ్యాకరణశాస్త్రమునకు వ్యతిరేకమైనభాష గ్రామ్యము. ఉదా. వస్తాఁడు, వచ్చేవాఁడు, తెచ్చేటివాఁడు మొదలైనవి. ఈభాష గ్రంథములయందు బ్రయోగింపఁదగదు. శా. "పా టింతు ర్వైద్దలు తద్దనమ్మి నుయిదాఁటే వానికిం జింత గూ। కొంతైనన్" పాండు-4ఆ. "క అచ్చెలిపందిరిలోపల ఐమ్ముమఁబోయేటి పరుసవానికి" హంస-2 ఆ. క. మద్దూరివనములమ్మా। ముద్దులు గుర్కేటితల్లి నుతాస్య లమ్మా సిద్దాబత్తుల లచ్చిని బ్రొద్దునచే పంపవమ్మ పోలేరమ్మా" భిమనచాటుధార. పై పద్యత్రియంబందలి "దాఁటేవానికి, గుర్కేటితల్లి, పోయేటి" ఇత్యాదికవిప్రయో గంబులును లక్షణ సురక్షితంబులు గావని యెఱుఁగునది. సంస్కృతనాటకంబులలోఁ బాకృతభాషయుం బోలె నొకానొకప్పుడు జాతీయభాషలు గ్రామ్యసంకరంబులు

పయితము పాత్రానుసారముగరసపుష్టికై యీతెలుంగునందుఁ బ్రయోగింప నగును. ఉదా. "మొక్కెమునామి" రామా-2ఆ. గీ. "ఇతని నూసినామేలు బాగాము నేసినాము" యయా- 1 ఆ. గీ. "సామి దవనురాజ సప్పన్న బూములు మాసిగాఁడు కట్టిమస్సిగాఁడు ఖాసిగాఁడు కూడిపోయిరి రేతిరి నూసివచ్చినారు సొద్దెనయ్యె" పట్ట-2ఆ. క. "సామిన్దోవముగాదే గామంబులు సొచ్చిసంపె గంపేఁడు లచ్చల్ గామిడిమెకములు మనుజుల బూములు రచ్చించవయ్య పున్నెపురాజా" పట్ట-2ఆ.

సీ "వేఁటసాగింపమివేగంబె దుంతెనుగానుక దెట్టేము కాటిఱేఁడ మాకుఁ దోడైరమ్ము నీకెక్కుఁదెచ్చేము। గరుడాలమంతుని గంబమయ్య మెకములలోఁ జేయు మిాసింగమును నీకుఁ దొలుతగా నిచ్చేము దుగ్గిదేవి జయమిమ్ము పోతాన బాతకలీసేపేము మాపాలేన్నను గొట్టి పులుగుల్ల" తే "అయను" పట్ట-2ఆ. ఇత్యాదులు కానంబడుచున్నవి

23. సూ—ఆర్యవ్యవహారంబులదృష్టంబు గ్రాహ్యంబు.

పెద్దలువ్యవహరించినమాట గ్రామ్యంబయిన గ్రహింపందగు ననితాత్పర్యము. కలకంఠుఁడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిలకన్నులు, కపిలగడ్డము, కపిలజడలు.

ఇది సంజ్ఞాపరిచ్ఛేదము

---

వ్యా.—పెద్దలవాడుకయందుఁ గనఁబడునవి గ్రహింపఁ దగ్గవి. అనఁగా నీభాషయందుఁ బ్రామాణికులు తమ గ్రంథములయందు నెయ్యవి ప్రయోగింతురో యయ్యవి శాస్త్రమునకు విరుద్ధముగా నున్నను, గ్రహింపవలెనని యభిప్రాయము. కనుకనే యథర్వణాచార్యులు వికృతివివేకమున "శాస్త్రప్రయోగయోశ్చ శాస్త్రం బలవదుచ్యతే అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణం హితం" అని నుడివిరి. అనఁగా నెచ్చట శాస్త్రముచేఁ బ్రత్యేకముగాఁ గార్యము చెప్పఁబడునో యచ్చట శాస్త్రము. బలముగలది. ఎచ్చట శాస్త్రముచేత సామాన్యముగా విధింపఁబడదో యచ్చటఁ బ్రయోగవిశేషము బలవత్తరమని భావము. కావుననే "కలకంఠుఁడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిలగడ్డము" మున్నగు ప్రయోగములు గ్రామ్యములైనను సాధువులని సూరిగారియభిప్రాయము. కాని త్రిలింగలక్షణమందు నయ్యవి గ్రామ్యములు కాక తద్భవంబులేయని చెప్పంబడినవి. ఎట్లనఁగా గరకంఠశబ్దభవము కలకంఠుఁడనియు, ప్రాణఘట్టక శబ్దభవము

# సంజ్ఞాపరిచ్ఛేదము.

ప్రాణగొడ్డమనియు, నియ్యవి యంపయానలోనగు వానివలె మిశ్రింబులనియు, కవిల శబ్దము కపిలశబ్దభవంబు కావునఁ "గవిలగొడ్డము, కవిల కన్నులు" అనియే ప్రయోగింప వలెననియు నుడివిరి. " జీవగఱ్ఱ" నీకీతిగా గ్రామ్యంబుగాకుండఁ జేయుటకుఁ దగిన యాధారంబేమియుఁ గానంబడదు. క॥ "ఎలుకని యెలుఁగక నీకుఁ। ముఱుపమా ర్గొన్న తప్పుమఱవుమునమ్మం। గఱకంఠా క్షమియింపుము నెఱి నెవ్వరికెఱుఁగ నగునె నీచరితంబుల్" భార-అర-1 ఆ. సీ। "ప్రాణగొడ్డములగుపనుల వారలఁ దీర దలఁచిన పుణ్యంబు కలిమిఁ జేసి" భార-ఉద్యో-1 ఆ

శా॥ "రాధాచిహ్నము జీవగఱ్ఱ హింపశిష్టప్రాప్త సంతోషణ। శ్రీవజ్రాంగి యజాతశత్రుఁడు మహీభృన్మాత్యుఁడే మానఁగన్" సుభ-1 ఆ. అక్కఱ॥ "అవసరజ్ఞుండ యివ్వానుఁడే తెంచె నంత నత్తపస। కవిలగొడ్డంబును గవిలజడలును గవిలకన్నులును దవిలయున్న నల్లనైనదీర్ఘపుఁదనువును జాది యొఱపు కన్నంగవ మెఱచి తెఱవక యుండె భయమున" భార-ఆది-4.

# సంధిపరిచ్ఛేదము.

సంధియనఁగాఁ గూడికయని శబ్దార్థము దీనిం గూర్చి తెలియఁజేయు భాగము సంధిపరిచ్ఛేద మనఁబడును. లక్ష్యములందు సంధిస్పష్టము కాఁగలదు. ఉత్తనఁగా హ్రస్వమైన ఉకారము. ఇట్టే అత్తు,ఇత్తు మొదలైనవి.ఉత్తు మొదలైనవానిలోనితకారమునకుఁ దపర కరణంబందురు. తపర కరణంబువలని ఫలంబేమనఁగాఁ దకారోచ్చారణమువలనఁ బూర్వాక్షరము దీర్ఘమైనచో దీర్ఘమునకును,హ్రస్వమైనచో హ్రస్వమునకును గ్రహణము.

1. సూ—ఉత్తున కచ్చుపరంబగు నప్పుడు సంధియగు పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధియనంబడు.

రాముఁడు ... ... అతఁడు ... ... రాముఁడతఁడు

సోముఁడు ... ... ఇతఁడు ... సోముఁడితఁడు

మనము... ... ... ఉంటిమి ... ... మనముంటిమి

అతఁడు... ... ... ఎక్కడ ... ... అతఁడెక్కడ

ఇతఁడు... ... ... ఒకఁడు ... ... ఇతఁడొకఁడు

వ్యా.—హ్రస్వమైన ఉకారమునకు నచ్చుపరమైయున్నపుడు సంధికలుగును. పూర్వపరస్వరంబులకున్=ముందటి యచ్చునకును, తరువాతి యచ్చునకును, ఈరెండింటికిని, పరస్వరంబు=తరువాతియచ్చు, ఏకాదేశంబగుట= ఒక యక్షరమే వచ్చుట (రెండువర్ణంబులస్థానంబున నొకవర్ణంబువచ్చుట) సంధియనంబడు=సంధియనంబడును. అనఁగా మొదటి పదము యొక్క కడపటి యచ్చు కనఁబడక సంధిలో రెండవ పదము యొక్క యచ్చే కనఁబడును, ఉ. రాముఁడతఁడు (రాముఁడు + అతఁడు) ఇచ్చట మొదటి పదముగా "రాముఁడు" అనుదాని కడపటి యచ్చు ఉకారము. (రాముఁడ్ + ఉ) "అతఁడు" అనుదానిలోని మొదటి యచ్చు అకారము. "ఉ, అ" అను నీరెండచ్చులకుఁ బరస్వరమైన అకారము వచ్చి "రాముఁడతఁడు" (రాముఁడ్ + అతఁడు డ్ + అ=డ) అని యగును. అనఁగా మొదటి పదము యొక్క యంత్యాచ్చు సంధిలోఁగనఁబడదని ఫలితార్థము ఇట్లే వానమంటిమి, ఇతఁడొకఁడు, మొదలైనవి గ్రహింపవలెను. మఱియు, సంధి, పూర్వరూప సంధి యనియుఁ బరరూప సంధి యనియు, రెండువిధములు. పూర్వరూప సంధి సంస్కృతమునందుఁ గాక తెలుఁగునందు లేదు. ఉదా. తమోంజనము (తమస్ + అంజనము)=తమో + అంజనము ఇచ్చటఁ బూర్వపరంబులగు నోకారాకారంబులకుఁ బూర్వాక్షరంబౌ నోకారమే వచ్చి, "తమోంజనము" అని యగును. సంస్కృతములో సకారాంత శబ్దములకు అకారాది శబ్దములు పరంబగు నపుడు, ఈపూర్వరూప సంధివచ్చును. ఇట్లే, "మనోఽశ్వము, యశోఽధికుఁడు, వేదోఽతిశయము" ఇత్యాదులు. ఈసంస్కృత పదంబుల సంధి యాంధ్రకవిత్వమందుఁ గవులు జాగ్రత్తతో గ్రహింపవలెను.

**2. సూ—ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణంబులందున్న యుకారంబునకు సంధివైకల్పికంబుగా నగును.**

నన్నుఁ........అడిగె............ { నన్నడిగె / నన్ను నడిగె

నాకొఱకుఁ......ఇచ్చె............ { నాకొఱకిచ్చె / నాకొఱకునిచ్చె

నాకుఁ ... ... ఆదరువు ... { నాకాదరువు / నాకునాదరువు

నాయందుఁ ... ఆశ ... ... { నాయందాశ / నాయందునాశ

# సంధిపరిచ్ఛేదము.-

| | | |
|---|---|---|
| ఇందుఁ ... ... ఉన్నాఁడు... | { | ఇందున్నాఁడు<br>ఇందునున్నాఁడు |
| ఎందుఁ ... ... ఉంటివి ... | { | ఎందుంటివి<br>ఎందునుంటివి |
| వచ్చుచుఁ ... ... ఉండెను ... | { | వచ్చుచుండెను<br>వచ్చుచునుండెను |
| చూచుచుఁ ఏగెను ... | { | చూచు చేగెను<br>చూచుచునేగెను |

వ్యా.—ప్రథమగాక దక్కిన విభక్తులయొక్కయు, శత్రర్థకమువర్ణకము యొక్కయు, (సంస్కృతములో శతృప్రత్యయమునకు వర్తమానకాల మర్థము. కాన శత్రర్థకమువర్ణక మనఁగా వర్తమానార్థకమువర్ణకము. "కాంచున్, వచ్చున్" ఇత్యాదితద్ధర్మార్థకరూపంబుల యందలి ధాతుమువర్ణోకారమునకు సంధి రాకుండుటకై యీసూత్రమునందు "శత్రర్థకమువర్ణక" మని చెప్పఁబడినది) ఉకారమునకు సంధి వైకల్పికముగా నగును. ఉదా. నన్నడిగె, నన్నునడిగె (నన్నున్ + అడిగె) ఇచ్చట నన్నుశబ్దముయొక్క కడపటి ఉకారము. మొదటి యచ్చు. (పూర్వస్వరము) "అడిగె" అనుదాని లోని అకారము తరువాతియచ్చు (పరస్వరము) ఈఉకారా కారములు రెండింటికిని బరాచ్చు (అకారము) వచ్చి, "నన్నడిగె (ఉ + అ = అ) అని యైనది. ఇచ్చట సంధి వైకల్పికంబుగావున. రానియపుడు ఈశబ్దములకు సహజమయినద్రుతంబు పూర్వపరాచ్చులనడుమను గనఁబడి "నన్నునడిగె" (న్ + అ = న) అని యైనది. ఇట్లే నాకాదరువు, నాకునాదరువు. ఎందుంటివి, ఎదునుంటివి. చూచు చేగెను, చూచుచు నేగెను మొదలైనవి. ఉకారాంతంబులైన ప్రథమేతర విభక్తులును, వర్తమానార్థకమువర్ణకంబును. తెలుఁగుభాషలో ద్రుతప్రకృతికంబులు. ఈశబ్దములఉకారమునకు సంధి కలుగనపుడు దుగ్రినకారంబు కూడ లోపించినంగాని సంధి సార్థకంబు గాదుకావున నకారంబు లోపించునని యెఱుంగునది.

3. సూ.—సంధిలేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబు నకు యడాగమంబగు. ఆగమంబనఁగా వర్ణాధిక్యంబు,

మా ... ...... అమ్మ ... ... ... మాయమ్మ
మీ ... ... ... ఇల్లు ... ... ... మీయిల్లు
మా ... ... ... ఊరు ... ... ... మాయూరు

వ్యా—సంధి కలుగనిచోట నచ్చునకు తరువాత పరమైన యచ్చునకు యడాగమంబు (యట్ + ఆగమంబు) అగును. ద్రుతప్రకృతికంబులు నకారాంతంబులు గావున నీవిధి యజంతంబులైన శబ్దములకే చెల్లునని ఫలితార్థము "ఆద్యంతౌటకితౌ" అను సంస్కృతవ్యాకరణసూత్రంబున టిత్తును, కిత్తును, ఏశబ్దములకు నాగమములుగా విధింపబడునో యవి క్రమముగా వానికి నవయవములై మొదటను, చివరను, వచ్చును. అనగా నిచ్చట టిత్తైన యడాగమము పరస్వరంబునకు విధింపబడినది కావున నాయచ్చునకు మొదట నిలిచి యవయవము గానుండును. ఉదా. మాయమ్మ (మా + అమ్మ) ఇచ్చట 'మా' అను దానిలోని ఆకారము పూర్వస్వరము. 'అమ్మ' అను దానిలోని మొదటి అకారము పరస్వరము. ఈఅకారమునకు మొదట యడాగమము (య్) రాగా 'య' (య్ + అ) అనియయి 'మాయమ్మ' అనురూప మయ్యెను. ఇట్లే మాయూరు మొదలైనవి. యట్, నుక్, టుక్, రుక్, ఇత్యాదులయందలి అకారమును, ఉకారమును, సుఖోచ్చారణార్థముగాని, శాస్త్రీయంబైన ప్రయోజనంబునకై కాదని యెఱుంగునది. ఇట్టి శబ్దంబులయంతమందు పొల్లుమాత్రమె యని గ్రహింపవలెను.

4. సూ—అత్తునకు సంధిబహుళముగా నగు.

మేన ... ... అల్లుఁడు ... ... { మేనల్లుఁడు / మేనయల్లుఁడు }
పుట్టిన ... ... ఇల్లు ... ... ... { పుట్టినిల్లు / పుట్టినయిల్లు }
చూడక ... ... ఉండెను...... ... { చూడకుండెను / చూడకయుండెను }

బహుళగ్రహణముచేత స్త్రీవాచకతత్సమసంబోధనాంతంబులకుసంధిలేదు.

అమ్మ ... ... ఇచ్చెను ... ... అమ్మయిచ్చెను
దూత ... ... ఇతఁడు ... ... దూతయితఁడు
చెలువుఁడ ... ఇందను ... ... చెలువుఁడయిందము

సంస్కృతీయంబునకు సంధియగునని యథర్వణాచార్యులు చెప్పి రిగాని దానికింబూర్వ కావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు-అధు నికకృతులందొకానొకచోట స్త్రీవాచక తత్సమంబులకుసంధిగానంబడి యెడు-గంగనుకాసె- వెలఁదిచ్చెను-వెలయాల్యాదులసంధిలేమిబాహుళ కముచేతనేయని యూహించునది.

వ్యా.—హ్రస్వమైన అకారమునకు సంధి బహుళముగా నగును. బహుళమన గా సంధినిత్యముగా వచ్చుట (ప్రవృత్తి), సంధియెంత మాత్రమును రాకుండుట (అప్రవృ త్తి) సంధివచ్చి యొకరూపమును, రాక మఱియొక రూపమును, గలుగుట (విభాష), ఆయావిధి సూత్రములలోఁ జెప్పినవాటికంటె గాక యన్యత్ర వచ్చుట (అన్యదేవ) శ్లో॥ క్వచిత్ప్రవృత్తిః క్వచిదప్రవృత్తిః క్వచిద్విభాషా క్వచిదన్యదేవ। విధేర్విధానం బహుధా సమీక్ష్య చతుర్విధం బాహుళకం వదంతి" అని కాశికావృత్తి కారవచనము. దీని నాలుగువిధంబులకును నుదాహరణంబులు ముప్పదియెనిమిదవసూత్రముక్రిందఁ జూపఁ బడును ఉ. మేనల్లుఁడు, మేనయల్లుఁడు (మేన + అల్లుఁడు) ఇత్యాది సంధివిభాష (వైక ల్పికము) కుదాహరణములు. మొదటి యుదాహరణంబులో సంధికలిగినది. రెండవ దానిలో సంధిలేక పోవుటచేత యడాగమము వచ్చినది; కనుక రెండురూపంబులు. ఇట్లే పుట్టినిల్లు, చూడకుండెను మొదలైనయుదాహరణంబులు. (సూ) బహుళగ్రహ ణంబుచే స్త్రీవాచకతత్సమసంబోధనాంతంబులకు సంధి లేదు.

వ్యా.—బహుళమని చెప్పుటచేత స్త్రీవాచకములకును, (స్త్రీలింగార్థమిచ్చునట్టి శబ్దములు) తత్సమపదంబులకును, సంబోధనాంతంబులకును, (సంబుద్ధిప్రత్యయ మంతమునం దాఁగలశబ్దములు) సంధియెప్పుడును రాదు. 'అమ్మ' ఇత్యాది స్త్రీవాచకము. 'దూత' ఇత్యాది తత్సమము. చెలువుఁడ! ఇత్యాది సంబోధనాంతము. ఈశబ్దములయంత్యాకా రంబునకు సంధిరాదనిభావము (సూ. వ్యా.) సంస్కృతశబ్దములచివరనున్న యత్వమునకు సంధికలుగునని యథర్వణాచార్యులు చెప్పిరి; కాని యట్లు సంధికలుగుటకుఁ బూర్వ గ్రంథంబులయందుఁ బ్రయోగము మృగ్యంబు (వెదుకఁ దగినది.) శ్లో॥ "భవంతి కేచిచ్ఛ బ్దాస్తు సాంగత్యేనైవ సాధవః। కుత్రచిత్సంస్కృతీయోపి ప్రాణోప్యత్రిమ్యతో భవేత్"

అథర్వణాచార్యవచనము. (మూ-వ్యా) ఇప్పటిప్రబంధములయందు (కృతులయందు) ఒకానొకచోట స్త్రీవాచకంబునకును, తత్సమంబునకును, సంధి గానంబడుచున్నది. ఉదా గంగనుకాసె (గంగ + అనుకాసె) గంగ శబ్దము తత్సమంబుగావున నిది తత్సమసంధి నెలఁతిచ్చెను (నెలఁత + ఇచ్చెను) ఇది స్త్రీవాచకసంధి. వెలయాలు మొదలైనవాని యందు సంధిలేకపోవుటు బహుళమనుటచేతనే యని యూహింపునది. అనఁగా "వెలాలు" అను రూపము కాదని భావము. తే. గీ. "కొమ్మసాత్త్వికలసిరి కొమ్మ యింద మనుమనిచ్చెదాఁ దెచ్చిన యంబరములు" భార-విరా. 5ఆ. ఇందు "కొమ్మ యిందము" స్త్రీవాచకసంబోధనాంతంబుల కుభయంబులకును సంధిలేమికై యుదాహరణము. ద "అడుగనసుండియుం బరిలమై చలంబెసఁ గోటనొప్పు ప్రో | ల్చెడని కడంకదంచెనపుఁజేతుల గంగనుకాసె దూఁగఁగా" అను. 2ఆ. (గంగ + అనుకాసె) చ. "పడకు పెకాని చేష్టుడఁగ పక్షము పక్షులు జానువుల్ చోరక" అను-4-ఆ (చేష్ట + ఉడిగ) శా. "ఈబ్రక్కన్ ద్వ్యాజుఁ జూడవయ్య సకవాకిరంగధర్తన్" అను. 6ఆ. రంగధర్త + అందు) ఇట్టితత్సమాకారసంధి ప్రయోగంబులు కూడఁ గ్రాచీత్యంబుగా నున్నవి. అకారంబునకు "అను, అంతే, అయ్య, అమ్మ, అప్పఅక్క, అన్న" మున్నగువాని యచ్చులు పరంబగునప్పుడు సంధి నిత్యమని పెక్కువ్యాకరణంబులు ఘోషించుచున్నవి; కాని "ఆకు" అను శబ్దము పరంబగునపుడు సంధి లేనిచోటి అకారశంబుగా నున్నది. శా "హా టింతు ర్వేద్దులు శోధనమ్ము నుయిదాఁచేవాని నంబునకై యాకంబైనన్" పాండు-4ఆ. ఇకారాంతస్థలంబులలో నాకుశబ్దము పరంబుగ గ్రహింపడు సంగ్రహిత కటువుగా నుండును; కాన 'ఉ॥ తా | టాకులలోన వ్రాసిరి గనఁ గూడినఁ బాపముండు" క "మజ్జాకున బండెమదర | గుజ్జానికి రెండు కోడికివలెనే" మొదలైనవాని యందు "తాటిగాకు, మజ్జియాకు" అని ప్రయోచుటయే నమణీయము. "చ॥ ఉదరమువందు విశ్వమును నున్నదివెల్పలకూన్యమిమ్మొయిక్ బొదనినమజ్జిగాకు పయిఁబొచ్చెపు బాలుఁడనై" హరి-ఉ-9ఆ. "సీ॥ అలరులు ఫణి పీచులభ్రమంబు సుడిరావి గాకు సైకత మంటులలను దోనలు" రుక్మాం-1ఆ. "సీ॥ ఈమఱ్ఱిగాకాకోదేకార్ణవమునాఁడు శేషాహిశాయికి సెజ్జమయ్యె" భో-2ఆ పరిమాణార్థకమైన "అంత" యను తెలుఁగు శబ్దంబు పరంబగు నపుడు ప్రాయికంబుగా సంధి సర్వత్ర నిత్యంబు. ఉదా కొండంత-గోడంత - "తనయంత" ఇత్యాదుల యందు వైకల్పికంబును గానంబడుచున్నది. "సీ గీ॥ కానగాఁదమ్మ వేఁడుపాగడ్డలాస పడక తనయంత జగములఁ బరఁగుచుండు" నిర్వ-1ఆ. పైని స్త్రీవాచకము మన్నగు వారి మాడంటకు సంధికూడదని గ్రంథకర్తగారి యభిప్రాయము; కానియేవార్థకంబైన (అరణార్థకంబైన) యకారంబునకుఁ గూడ నచ్చు పరంబగునపుడు సంధిలేదని తెలియుఁ

వచ్చితిమి... ... ఇప్పుడు ... ... { వచ్చితిమిప్పుడు / వచ్చితిమియిప్పుడు

వ్యా.—క్రియా పదంబులయందు హ్రస్వంబైన యికారమునకు సంధివైకల్పికము. ఈసూత్రంబునకు వక్ష్యమాణ సూత్రంబు బాధకంబుగావునఁ బ్రథమోత్తమక్రియలయికారంబు దీనికి విషయంబని యెఱుంగునది. ఉదా. వచ్చిరప్పుడు, వచ్చిరియప్పుడు, వచ్చితిమిప్పుడు, వచ్చితిమియిప్పుడు.

7 సూ,—మధ్యమపురుష క్రియలయందిత్తునకు సంధియగును.

ఏలితివి ... ... అపుడు ... ... ఏలితివపుడు
ఏలితి ... ... ఇపుడు ... ... ఏలితిపుడు
ఏలితిరి ... ... ఇపుడు ... .... ఏలితిరిపుడు

వ్యా.—మధ్యమ పురుషక్రియలయందు హ్రస్వంబైన యికారమునకు సంధి కలుగును. అనఁగా నిచ్చట సంధినిత్యము. ఉదా. ఏలితివపుడు. (ఏలితివి + అపుడు) ఇట్లే, ఏలితిపుడు, ఏలితిరిపుడు మొదలైన యుదాహరణంబులు. ఇచ్చట నిత్యము గావున. "ఏలితివియపుడు" అని చెప్పఁగూడదు: కాని "చ॥ ఇది శమనాజ్ఞఁ ద్రోచితిరియెచ్చటనుండిరి వచ్చినారలు" అను ప్రయోగము విసంధిగాఁ గనఁబడుచున్నది. ఇప్పద్యము కవులషష్ఠమునం దున్నట్లు సర్వలక్షణసారసంగ్రహమందుఁ గలదు. ఇట్టి ప్రయోగములు నిరాకరంబులు. ఆంధ్రశబ్దచింతామణి యందు మధ్యమపురుషేకారంబునకు సంధి "నిత్యమనుత్తమపురుష క్రియాస్విత:" అను సూత్రముచేత విధింపఁబడినది సూత్రార్థము—"అనుత్తమపురుష క్రియాసు = ఉత్తమపురుషవ్యతిరిక్తక్రియాపదంబులయందు, ఇత: = హ్రస్వేకారంబునకు నిత్యమ్ = నిత్యముగా సంధియగును" అని పూర్వులు వ్యాఖ్యానము చేయుదురు. ప్రథమోత్తమపురుషంబులు కిమాదిగణంబులోనివిగాన వాని యికారంబునకు సంధివికల్పమని వ్రాసి దానికిఁ బ్రోద్బలంబుగా "ప్రథమేచోత్తమేచైవక్రియేతో వా భవేద్యతి: నిత్యమన్యస్యవికృతౌ క్త్వార్థేతో నభవేత్సదా" అను. అథర్వణకారికలను బ్రమాణముగాఁ జూపిరి. అప్పకవ్యాదులు మూలసూత్రమునందు "అనుత్తమపురుషక్రియాసు" అని యుత్తమపురుషనే వర్జించినందున మధ్యమపురుషేకారంబునకుం బోలెఁ బ్రథమపురుషేకారంబు

నకును, నిత్యసంధి రావలయును కనుక "మ. బలభిత్స్వర్వహ్నిపరేతరాడసురుణుల్ పర్యుత్సు
కత్వంబునం ద్రిలఁగూర్చుండిరి యొండొరుంగనెపి యర్థింపత్ప్రదేశంబున న్నళనాళీక
మృణాలనాళలతికానవ్య ప్రణాళిమిష . ల్లలనాలాపకథాసుధానుభవలీలాలోలచేతస్కు-
లై" నైష - 3 ఆ "క. విరించి దేవ శ్రీనాథుఁడు కరణిని శృంగారనైషధంబున
గూర్చుండిరి యొండొరువని కానక పరపురుషక్రియలఁ బ్రకృతిభావముగలదే"
అప్ప-5 ఆ" అని బ్రథమపురుషంబులకు సంధి కూర్పని శ్రీనాథాదికవీంద్రుల నాక్షేపం
చిరి. అయ్యది యతిసాహసంబు. "నిత్యమనుత్తమపురుష క్రియాస్వితః" అను సూత్రం
బులో నుత్తమశబ్దంబుచేత నుత్తమపురుషంబును, పురుషశబ్దంబుచేఁ బ్రథమపురుషం
బును, గ్రహింపఁబడును. అట్లుగాక యీసూత్రంబునందు నొక యుత్తమపురుషనే
వర్జింపఁ దలంచినయెడల 'నిత్యమనుత్తమ క్రియాస్వితః' అనియే లాఘవముగా
సూత్రము చేయవలసియుండెఁగా వ్యర్థంబుగాఁ బురుషశబ్దంబు సూత్రంబులో గ్రహిం
చుట యేమిప్రయోజనంబు? కావున సూత్రగతమైన పురుషశబ్దంబుచేత 'ప్రథమాతి
క్రమణే కారణాభావాత్' అను న్యాయంబునఁ బురుషంబులలోఁ బ్రథమంబైన ప్రథమ
పురుషంబు గ్రహింపఁబడును. కావున 'ఉత్తము ప్రథమపురుష క్రియలఁ ఇకారంబు
నకుఁ దక్క మధ్యమపురుషైకారంబునకు సంధి నిత్యముఁ అనిన యర్థంబు ఫలించుచు
న్నది. పై సూత్రంబునకు నట్టియర్థం బూహించియే యథర్వణాచార్యులు 'ప్రథ
మేచోత్తమేచైవ' ఇత్యాది పూర్వోక్తకారికను విరచించియుండిరి. కాన నకారికశబ్ద
శాసనసమ్మతంబుగాని యపూర్వంబుగాదు. పూర్వోక్తమూలసూత్రంబులోఁ బురుష
శబ్దంబు నుచ్చరించిన వాగనుశాసనునికి నట్టితాత్పర్యంబున్నది యన్నందులకు నీక్రింది
హేతువులు కూడ నిదర్శనముగా నున్నవి ఆంధ్రశబ్దచింతామణి, హలంత పరిచ్ఛేదము,
సూత్రము 37 "పరేషాంతు నరోత్తమమధ్యమవత్" 38 సూ. "బహుషుసమధ్యవత్"
క్రియాపరిచ్ఛేదము. 18 సూ. 'ప్రథమైకవచనలోపస్తద్ధర్మాతీతయోః క్రియాణాం
స్యాత్' 25 సూ. "ఉత్వియుతౌవనకారౌ స్యాతాం మధ్యోత్తమైకవచనానాం"
ఇత్యాదిసూత్రములయందుఁ బురుష శబ్దంబు లేకుండనే సూత్రలాఘవంబునకై యుత్త
మమధ్యమాదిశబ్దంబులే సూత్రంబులో గ్రహింపఁబడినవి. కాఁబట్టి తక్కినసూత్రంబు
లకు విరుద్ధముగా నీమధ్యమపురుషసంధిసూత్రంబులో నుత్తమశబ్దంబేకాక పురుషశబ్దం
బుచ్చరించుట ప్రథమపురుష సంగ్రహణార్థంబని స్పష్టంబగుచున్నది. క్రియాపరిచ్ఛేద
ములో "తిజ్యత్యనామకాస్స్యుర్మధ్యమపురుషాశ్చయేరమాంతాశ్చ" అనుమున్నదియే డవ
సూత్రములోఁ గూడఁ బురుషశబ్దంబునకు సార్థక్యంబు గలదు. ఈసూత్రంబులో 'యే
రమాంతాశ్చ' అను రెండు వాక్యములోనికిఁ బూర్వవాక్యంబులో నున్న 'మధ్యమ పు

గపాః' అను పదంబులోని పురుషశబ్దంబు నుద్దేశించి శేషనకారాంతంబులైన పురుషం బులకుఁగూడ 'తిఙ్స్సు,' సంజ్ఞ కలుగవలసును: అనిష్టమర్థంబిమ్మును. కాన నిచ్చటి పురుష శబ్దంబు స్వార్థంబుగా ప్రయోగింపఁబడెను. అట్లే, స్థానేఽన్తరతమః (1-1-49) సూత్రభాష్యప్ర దీపోద్యోతమున (376 పుట.) "ఉత్తమే—ప్రత్యక్షరూపాహంకారాత్మకచేతనక ర్తృకే॥ మధ్యమే—అహంకారాస్పదచేతనకర్తృ పరోక్షస్త్వం, ప్రథమే త్వ నియతమ్" అని చెప్పఁబడెను

నియతచేతన, కర్తృసామ్యంబుగాన ఉత్తమపురుషభిన్నంబగు నియతచేతనకర్తృం బుగల మధ్యమపురుషము యొక్క ఇకారమునకు నిత్యసంధియగును. ప్రథమపురుషమునం దని చేతనకర్త నియతము

## 8 సూ. క్త్వార్థంబైన యిత్తునకు సంధిలేదు.

వచ్చి ... ... ఇచ్చెను ... ... వచ్చియిచ్చెను.

వ్యా. క్త్వార్థకమై హ్రస్వంబైన యికారమునకు సంధి గలుగదు. ఉదా. వచ్చి యిచ్చెను. (వచ్చి + ఇచ్చెను) ఇచ్చట 'వచ్చిచ్చెను' అని యనఁగూడదు. **అడిదము** సూరకవి తనకవిసంశయవిచ్ఛేదమందలి ప్రథమాశ్వాసమునందు 'గీ॥ ఇడఁగవచ్చును ల్యప్ప హ్రైనిత్యసంధి మాత్ర మొక్కొక్కచోటను పుట్టుమీఁదఁ! గొలుతు నఘమడంపఁగోరిందు శేఖరు! నన్నయాద్యుల కవిజనానుమతిని' అను లక్షణమును జూపి కొన్నిలక్ష్యంబులను జూపిరి. అట్లు చూపిన లక్ష్యంబులలో రెండు భారతములోనివి. 'క॥ ఇతఁడు మదీయా గ్రపుత్రుఁ! డీతఁ డితనికి నెల్లపనులు నెఱిఁగించిపుడే' భార-ఉద్యో-1. ఆ. పెక్కం॥ టియందు 'ఏర్పఱించి తెగఁ' అను పాఠముగలదు. 'క॥ నమ్మఁగ మునుపైదువు మోపగు జమ్మివెసం బ్రాఁకివిడిచి చాపము నాకం॥ దిమ్ముగ నుడు జేయునదిలే కమ్మురుండమ్మహీజ ముల నతని కెఱిఁగె' భార-విరా. 4ఆ. ఇప్పద్యమునందలి 'అందిమ్ము' అను ప్రయోగ మును జూచి పెక్కండ్రు క్త్వార్థకంబని భ్రమపడుచున్నారు; కాని యియ్యది 'నిలు చుండి' మున్నగువానివలె ధాతుపల్లవంబని యూహించుట సుకరము. సీ॥ తమసేఁగి జెప్పలోపదు మీఁదవిని చీకఁజించిచ్చు వారి డీవించువారు' ఆము-6-ఆ. వా॥ వెలిచిట్లం

బుధినాథనందనులు దోర్వీర్యంబు సారించియుం। దఱుపాఱంగ నిశాచరేంద్రుఁడు జయోత్సాహంబునన్ వెన్నడిగె। దఱుమంగా' నిర్వ-5ఆ. ('వెంటనిట్లంబుధి' అనిపాఠాంతరము) (చ॥ ఎటెంగెటెంగినా వలువిడిరయేల కట్టుకొని నమ్మునుదానవి, భాగ-9-స్క-౦౯. క. ఎటెఁగెటెఁగియుండియకటా। కొలవిందలఁ గోఁకు కొనుబకసం దలపెట్టెన్' రాజశే-2ఆ. 'శా నేఁడే తెంపు ప్రియత్నమున్న వకటా నీచేతఁ జెప్పింపఁడే' ప్రభా-4ఆ, ('చెప్పింపఁడే' అని కల్పితపాఠము) 'ఉ ఇమ్మొడం బదార్థ మడిగెమ్మనో తాడయసేయఁ గాదన న్వమ్మనో' విజయ-1ఆ. 'చ. అనవలసంటిగా కెలుఁగవారొకమాటనె మర్త్యకర్త్యముల్' విజయ-1ఆ (చ మీ రిదశేము నాజ్ఞఁ దోఁచితిరి యొక్కడినుండిట వచ్చివారు, కవుల పద్యము. (చ। నిగిడిరుపైపులక్ వెడలనేటయి నీటుకుపీటకోటడాల్, శుద్ధాంధ్రరామాయణము (అడిదము భాస్కరకవివిరచితము) 'ఉ॥ ఆ హానిపుణోక్తులుం జెనక నాబిడ చూచిటు రమ్మటన్నచో' హంస-3ఆ ఈప్రయోగంబులు నిరాకరంబులు.

9. సూ—ఇఁకాదులకుఁ దప్పద్రుతప్రకృతికములకు సంధిలేదు. ప్రథమేతర విభక్తి విధినిరవకాశంబుగావునదీనిని భాధించెడిని.

వచ్చున్ ... ... ఇపుడు ... ... వచ్చునిపుడు
చూడన్ ... ... అయితి ... ... చూడనయితి
ఉండెడిన్ ... ... అతఁడు ... ఉండెడినతఁడు

ఇఁక - ఇఁగ - ఎట్టకేలకు - ఎట్టకేని - ఈయవి యిఁకాదులనియెఱుంగునది, వీనికిసంధివైకల్పికము.

వ్యా.—ఇఁక మొదలైనశబ్దంబులకుఁ గాక ద్రుతమంతమందుఁగల శబ్దంబులకు సంధిలేదు. ప్రథమేతరవిభక్తి సూత్రము (రెండవసూత్రము) అవకాశములేని దగుటంజేసి యీసూత్రమును భాధించును. అనఁగా రెండవసూత్రమునందుఁ బ్రథమేతరవిభక్తులకును, వర్తమానార్థక చువర్ణకంబునకును, సంధివైకల్పికమని చెప్పంబడియె. ఆయుభయంబులును, ద్రుతప్రకృతికంబులు. ఈతొమ్మిదవసూత్రంబులో "ఇఁకాదులకుఁ దప్ప

ద్రుతప్రకృతికంబులకు సంధిలే" యని శాసించుటంజేసి ప్రథమేతరవిభక్త్యలందును; ద్రుత ప్రకృతికస్థలంబునందునుసయితము సంధిలేకపోవలసియుండును. అట్లయినచో సంధిప్రకరణం బులోని రెండవసూత్రము (ప్రథమేతరవిభక్తివిధి) నిరవకాశంబగును. అనఁగా నుదాహ రణములేక వ్యర్థంబగును; గాన నిరవకాశంబయిన యీ రెండవసూత్రము "వచ్చిని పుడు" ఇత్యాది ద్రుతప్రకృతిక స్థలంబులలో సంధి రానీయక సార్థకంబైన యీసూ త్రంబును బాధించునని భావము. "వచ్చినిపుడు" అనుదాహరింపవలె ఉండెడిన వండు, మాడనైతి మొదలగు మిగిలిన యుదాహరణంబులు గ్రహించుకొనునది. ఇఁక ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని: ఇత్యాది యిఁకాదులు వీనికి సంధి వైకల్పికము. ఉ. ఇఁక నైన, ఇఁకైన. ఇట్లే ఇఁగ మొదలైన యుదాహరణంబులు.

10. సూ.—అచ్చునకామ్రేడితంబు పరంబగునపుడు సంధితఱచుగనగు.

ద్విరుక్తముయొక్క పరరూపమామ్రేడితమనంబడు తఱచుగ ననుటచేత నొకానొకచోట వైకల్పికసంధియుంగలదని తాత్పర్యము.

| | | |
|---|---|---|
| ఔర... ... ... | ఔర ... ... | ఔరౌర |
| ఆహా ... ... | ఆహా ... ... | ఆహాహా |
| ఎట్టా... ... ... | ఎట్టా ... ... | ఎట్టెట్టా |
| ఓహో ... ... | ఓహో ... ... | ఓహోహో |
| ఏమి ... ... ... | ఏమి ... ... | ఏమేమి<br>ఏమియేమి |

ఏగిఏగియనుచో క్త్వార్థంబగుట సంధిలేదు.

వ్యా —అచ్చునకు నామ్రేడితము పరంబగునపుడు సంధి తఱచుగఁ గలుగును. రెండుమాఱు లుచ్చరింపఁబడు దానిలోని రెండవది యామ్రేడితమనంబడును. ఉదా. ఔరౌర (ఔర + ఔర) దీనిలోని రెండవ "ఔర" అనునది యామ్రేడితము. తఱచుగ ననుటచేత వైకల్పికముగా సంధి కలుగునని భావము. "అమ్రేడితంద్విస్త్రిరుక్తం" అను

నామలింగానుశాసనవచనంబువలన రెండుమూఁడుమాఱు లుచ్చరింపఁబడిన శబ్దంబులలో నన్నింటికిని నామ్రేడితమనునర్థము సిద్ధించినను వ్యాకరణపరిభాషచేఁ దుదిశబ్దంబునకే యాసంజ్ఞ చెల్లునని తాత్పర్యము. ఈసూత్రంబునందు "తెలుము" అనుశబ్ద ముపయోగించుటచేత "ఏమేమి" (ఏమి + ఏమి) ఇత్యాదులయందు వైకల్పికసంధియు "ఏగి యేగి" (ఏగి + ఏగి) ఇత్యాది క్త్వార్థంబులయందు సంధ్యభావంబును నిర్వాహ్యము. "ఆహాహా", ఓహోహో, ఎట్టెట్టు మొదలైనయుదాహరణంబులు "జాజా" అనుదాని వలె గ్రహింపవలెను.

11. సూ.—అంద్వవగాగమంబులందప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధియగు.

| | | | |
|---|---|---|---|
| మూర | ... ... | ఎఁడు | ... మూరెఁడు |
| వీసె | ... ... | ఎఁడు | ... వీసెఁడు |
| అర్థ | ... ... | ఇంచు | ... అర్థించు |
| నిర్జి | ... ... | ఇంచు | ... నిర్జించు |

అంద్వగాగమంబులు పరంబులగు నపుడు యథాసంభవము గ్రహించునది - రాములందు - రాములయందు - హరియందు - ఎనిమిదవది - ఎనిమిదియవది.

వ్యా.—విభక్త్యంతము కానిశబ్దముయొక్క మొదటియచ్చు పరంబగునపుడు సంధివచ్చును. "అందు, అవ" ఈశబ్దంబులు విభక్త్యంతములు కాకపోయినను బహుళ సంధింబొందవచ్చును. ఉ. మూరెఁడు (మూర + ఎఁడు (ఇచ్చట "ఎఁడు" అనునది పరిమాణార్థకమైన ప్రత్యయముగాని, విభక్త్యంతముకాదు? కావున సంధికలిగినది. అర్థించు) (అర్థ + ఇంచు) నిర్జించు (నిర్జి + ఇంచు)" ఇచ్చట "ఇంచు" అనునది ప్రాగమముగాని విభక్త్యంతముగాదు కావున సంధికలిగినది. "అందు, అవ" అనునవి పరంబగునపుడు కవి ప్రయోగానుసారంబుగా గ్రహింపవలెను. అనఁగా "అందు" అనునది పరంబగునపుడు "హరియందు" మొదలగువానియందు సంధిలేకయు, "రాములందు

రాములయందు,, మొదలైనచోటులందు వైకల్పికసంధియుఁ గలుగును. అగాగమంబు పరంబగునప్పుడు "ఎనిమిదవది, ఎనిమిదియవది. తొమ్మిదవది, తొమ్మిదియవది. పదవది పదియవది" ఇత్యాదులయందువికల్పంబగును. "పగునొక్కటవ" ఇత్యాదులనిత్యంబుగు సిద్ధించును.

12. సూ —కుఱు చిఱు కడు నడు నిడుశబ్దముల అ డ ల కచ్చుపరంబగునపుడు ద్విరుక్తటకారంబగు.

ఇఁకి

| | | | | |
|---|---|---|---|---|
| వైన, | ఱు | ... ... | ఉసురు | ... ... కుట్టుసురు |
| | చిఱు | ... ... | ఎలుక | ... ... చిట్టెలుక |
| | కడు | ... ... | ఎదురు | ... ... కట్టెదురు. |
| ఱ | నడు | ... ... | ఇల్లు | ... ... నట్టిల్లు |
| | నిడు | ... ... | ఊరుపు | ... ... నిట్టూరుపు |

వ్యా "—కుఱు, చిఱు, కడు, నడు, నిడు" అనుపదంబులయొక్క తుదనున్న అ డ లకు నచ్చుపరమైనపుడు ద్విత్వటకారమగును. ఉ. కుట్టుసురు (కుఱు + ఉసురు) ఇచ్చట నచ్చుపరమైనది. కావున "కుఱు" అను దానియందలి శకటరేఫమునకు టకారద్విత్వమువచ్చును. అప్పుడు "కుట్ + ట్ + ఉ + ఉసురు" అనియగును తరువాత టకార ద్విత్వము పదాంతమైన యుకారముతో మిళితంబై "కుట్టు + ఉసురు" అనియగును. పిమ్మట ఉకారసంధిచే "కుట్టుసురు" అనియగును. (కుట్టు + ఉసురు) ఇట్లే నట్టిల్లు, నిట్టూరుపు, చిట్టెలుక, కట్టెదురు మొదలైన యుదాహరణంబులు గ్రహించునది. "క. కడు నెంపెరయెక్కనంతకు నడుగక యచ్చునప నడిచి యుగ్రాటవిలో" భార—ఆర--2ఆ. క॥ కడునధికుతోడఁ దొడరినఁ। బొడిచిన నొడిచినను బురుషుపుడున్న ఘనంబేర్పడుఁగాక "భార—సభా—1ఆ." అనుపద్యములందలి "కడునెంప, కడునధికుతోడ" అనుప్రయోగములందిలకించి "కట్టెంప, కట్టధికుతోడ,, అనియుండవలసిన వంచునట్లుండుట దోషమని కొందఱు భ్రమింతురు. కాని యట్లనవలదు. "కడునెంప, కడునధికుతోడ,, అనునపుడు సమస్తపదము (సమాసపదము, కాకవ్యస్తపదము, అసమాసపదము) కావుననే యత్వసమున్నయనకారంబు గానిపించుచున్నది. ఈసూత్రములో సమాసవని చెప్పకున్నను నీసంధి సమాసస్థలంబులలోనే వచ్చునని యెఱుంగ

నది. ‘‘కుఱు, చిఱు’’ శబ్దంబులు క్రమంబుగా కుఱుచ, చిఱుత’’ శబ్దంబులయొక్క లుప్తశేషంబులు. ఈలోపమీశబ్దంబులకు వృత్తియందుఁగలుగును. కొందఱు ‘‘చిట్టెలుక, చిట్టాముదము, చిట్టుడుత, చిట్టడవి’’ ఇత్యాదులయందు ‘‘చిట్టి’’ శబ్దంబనియు, అచ్చుపరంబగునపుడు దాని ఇకారంబునకు సంధి నిత్యంబనియు, హల్లుపరంబగునపుడు వికల్పంబుగానేకటకారంబునకు మాత్రము లోపంబనియు. వక్కాణింతురు ఉదా. చిట్టిచాప చిటిచాప మొదలైనవి. ‘‘చిట్టిశబ్దమందలి ద్వితీయటకారము వైకల్పికముగా లోపించుటకుఁ బ్రకీర్ణపరిచ్ఛేదమందలి యెనిమిదవ సూత్రముదూమకొనునది.

13. ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగును.

వాఁడు ... ... కొట్టె ... ... { వాఁడుగొట్టె / వాఁడుకొట్టె

అపుడు... ... ... చనియె ... ... { అపుడుసనియె / అపుడుచనియె

నీవు... ... ... టక్కరివి ... ... { నీవుడక్కరివి / నీవుటక్కరివి

మీరు ... ... తలఁడు ... ... { మీరుదలఁడు / మీరుతలఁడు

వారు ... ... పోరు... ... ... { వారువోరు / వారుపోరు

అప్పుడిప్పుడెప్పుడను శబ్దములు నిత్యైకవచనాంతములు-వాగను శాసనులు యదాతదా యని గ్రహించుట ప్రపంచార్థ మని యెఱుఁగునది. ఈకార్యము కళలగు క్రియాపదములమీఁద సహితము కానంబడియెడి.

వ్యా — ప్రథమమీఁదిపరుషములకు (క, చ, ట, త, ప, లకు) గ, స, డ, ద, వలుబహుళముగానగును. బహుళశబ్దార్థము నాల్గవసూత్రమున వివరింపఁబడ్డది. ఉదా. వాఁడుకొట్టె, వాఁడుగొట్టె (వాఁడు + కొట్టె) ఇచ్చట కకారమునకు గకారము వచ్చినది. ఈ యాదేశము తఱచు వికల్పముగా వచ్చును. ఇట్లేమీరు తలఁడు మొదలైన యుదాహరణంబులు. మీరు తలఁడు (మీరు తొలఁగుఁడు) ఇయ్యది తలఁగుధాతువునుండి వచ్చిన రూపము. ఈరూపము పిలుఁడు మొదలైనవానికిఁ గ్రియాపరిచ్ఛేదమందలి నూటొకట్టవసూత్రంబున 'తలఁగు'. అను దానిలోని యంత్యవర్ణము లోపింపఁగా "తలఁడు" అనిద్దైనది. క. నలుఁడును ధరణీరాజ్యము । తలఁగఁగ సర్వంబు నపహ్నా లంబైనఁ గష్టఁ గలిసి దమయంతి నోడ్పాని వెడలెను "భార, అర, 2 ఆ. కొన్ని వ్యాకరణపాఠములయందు "తలఁడు" అని యున్నది కావున నిచ్చటిప్రకరణ ణముం బట్టి మార్చినను. క. "నిలువుము కొలువుము పిలువుము గెలువుము విడువు మనఁగాఁ దగినబహుశబ్దం బులకుం దృతీయవర్ణము । తొలఁగిన దోషంబులేదు తుహినాంశుధరా" అను కవిసంశయవిచ్ఛేదప్రథమతరంగమందలి యిరువదియొకండవ లక్షణమందు నిలుఁడు మొదలైన శబ్దములరూపు మారినఁ బ్రకరణంబున నన్నియుఁ జువర్ణాంతధాతువులగుటం బట్టి "తలఁడు" అనునది తలఁగు ధాతువునుండి వెడలిన మధ్యమపురుషప్రార్థనార్థకమని కొందఱ యభిప్రాయము. పక్షద్వయంబును విచ క్షణులు విమర్శింతురుగాక! "అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు" అను శబ్దంబులు నిత్యైకవచ నాంతంబులని మూలంబులోఁ జెప్పంబడియె. నిత్యైకవచనాంతంబులనఁగాఁ బ్రథమా విభక్తి నిత్యైకవచనాంతంబులనియే గ్రంథకర్తగారి తాత్పర్యము వేఱొక విభక్త్యంతం బులైనవోఁ బ్రథమావిభక్తిస్థలంబునఁ బ్రవర్తింపవనట్టి యీసూత్రము క్రింద "అపుడు చనియె" అని యుదాహరణంబుగఁ దీసికొనుట యెట్లు యుక్తంబగు? ఇచ్చట నొకపూ ర్వపక్షి అపుడులోనైన యవ్యయంబులు ప్రథమావిభక్త్యంతంబులు కావనియు, "శ్లో॥ తిఙ్సన్న్యశేషమప్ఖ్యసుప్కర్మప్రవచనీయాజవిభక్తిః కిఞ్చ్యత్ప్రశంసనాద్యుత్తరస్తాపయదాతదా కిమేవాంశ్చ । క్త్వాకీలతుమ్ణమాద్యానభీసనతికలా ద్రుకోనయమేసాంహ్యత్" అని నన్నయభట్టారకుండు కతిశబ్దములను వివరించిన యాంధ్రవృత్తంబులో "సుప్కర్మ ప్రవచనీయాజ విభక్తిః" అని ప్రథమావిభక్త్యంతంబులను గతులనుగాఁ బరిగణించి యా వృత్తిమధ్యంబులోనే "యదాతదాకిమేవాంశ్చ" అని యదాతదార్థకములైన "ఎపు డు, అపుడు" శబ్దంబులకు సహజఁ గతులని (నన్నపార్యుఁడు) చెప్పెననియు, నిజంబుగా యదాతదార్థకంబులకు ప్రథమావిభక్త్యంతంబులైనయెడల వృత్త్యారంభంబున "సుప్" అనువిభక్తిని (ప్రథమావిభక్తిని) గ్రహించినందుననే "ఎపుడు, అపుడు" శబ్దంబులకు యితమార్గహింపఁబడునుగానట్లు నిరూపించిచెప్పవలె పునరుక్తులనియు, నూహించి

యడుపులోనైనశబ్దంబులు ప్రథమావిభక్త్యంతంబులు కావని పూర్వపక్షము చేసెననియె యుంగునది. ఆపూర్వపక్షంబునకు "వాగనుశాసనులు యదార్థదాయని గ్రహించుటప్రపంచార్థమనియెయుండునది" అని బాలవ్యాకరణంబులోనివాక్యము సమాధానవాక్యము. అనఁగా నన్నయభట్టారకులు చెప్పిన పై పద్యంబులో "సుప్" అను విభక్తిని (ప్రథమావిభక్తిని) గ్రహింపవేతనే యదార్థదార్థకంబులును, (చెప్పుము, అప్పుడు శబ్దంబులు ప్రథమావిభక్త్యంతంబులు కాఁబట్టి గ్రహింపఁబడినవనియుఁ, దరికాగావాక్యములో "యదార్థ" అని గ్రహించుట ప్రపంచార్థము. (స్పష్టార్థము) కాని యనాసనగము లేదనియు, భావము. (సూ. వ్యా.) ఈకాక్షరము (గ, స, డ, ద, వ, విధానము) కళలైన క్రియలమీఁదఁ గూడఁ గనఁబడును. ఉదా. రారుగదా, రారుకదా (రారు+కదా) ఇందలి మొదటిశబ్దము వ్యతిరేకార్థకప్రథమపురుషబహువచనక్రియ దీని మీఁద వచ్చిన "కదా" అనుదానియందలి కకారమునకు గకారము వచ్చినది. ఇట్లే మిగిలినయుదాహరణములు. ఈగసడదవాదేశంబులవిషయమై వేనవేలు మతంబులుగలవు.

శ్లో. పరుషాణాస్వరూపేణ ప్రథమాంతోపరిస్థితాః కాకాసంబోధనేచాపి
హ్యవ్యయేకర్మధారయే అచేతనార్థకేశబ్దే ఇతిశృంగారభూషణే.'

అని శృంగారభూషణమందు, ప్రథమాంతంబులను, కాకుస్వరబోధకంబులైన "ఏ, ఓ, ఆ" ఇత్యాదులను, సంబోధనాంతంబులను, అవ్యయంబులను, అచేతనార్థకశబ్దంబులను, వెంబడించిన కచటతపలు వికల్పంబుగా గసడదవలగును. కర్మధారయసమాసమందుఁగూడ నీయాదేశమువైకల్పికమని చెప్పంబడియె "గీ. కాకుసంబోధనావ్యయకర్మధారయంబు లచేతనంబులను వికల్ప మరియె మనుమునగారు ర్యామనసుల త్ర్య మలువినము కాకుసంబోధనలకు భగ్గ" అని సర్వలక్షణసారసంగ్రహమందుదాహరించి తిమ్మకవిగారు కాకుసంబోధనలపై గసడదవాదేశములు గలిగినందులకు సదుదాహరణంబులు కనఁబడవని నుడివిరి. కవిలోకచింతామణియందుఁ తాతంభట్టుగారు ప్రథమాంతంబులమీఁది పకారంబునకు, ప్రాసస్థానమందు నిత్యముగా గసడవాదేశమనియు, యతిస్థానమందు రాదనియుఁ దక్కినచోట్లవైకల్పికమనియు, దెలిపిరి. కావున నింకనిట్టి యనేకమతంబులు సంగ్రహించుటకై సూరిగారు గసడదవాదేశవిధి "బహుళ" మనినుడివిరి. తిమ్మకవీంద్రుఁడు "తే కాకుసంబోధనావ్యయ" అనుపైపద్యములోఁ బరిగణించిన ప్రకారంబుగ నవ్యయముమీఁదను గసడదవాదేశము వికల్పమనుచు "మవవా వృత వృత్తంబులుగాని సింహములకుఁ వేగంబ చేటొందుఁగా వతగం బొందుట కార్యమీయుభయమున్సంతుష్టిపై నుక్కికిఁ"అను భారతోద్యోగ పర్వపద్యములోని

స్సపుత్రో వ్యాఘ్రాస్తే వైసంజయ పాండుపుత్రాః।......................

శ్లో॥ నిర్వనో వధ్యతే వ్యాఘ్రో నిర్వ్యాఘ్రం ఛిద్యతే వనం తస్మాద్వ్యాఘ్రో వనం రక్షేత్ । వనం వ్యాఘ్రంచ పాలయేత్". ఆంధ్రీకృతపద్యములు. "మ॥ ధృతరాష్ట్రుండును బుత్రులు న్వనము కుంతీనందనుల్ సింహము లతినూహింప నసింహమైన వనము న్మర్దింతు రెండున్వనా । వృతవృత్తంబులు గాని సింహములకు న్వేగంబ చేటొందుఁగా నతగంబొందుటకార్యమీయుభయము స్సంతుష్టిమై నున్కికిన్" పైనుదాహరించిన శ్లోకంబులో రేఖానిర్దిష్టములైన కడపటిరెండుపాదంబులకును బద్యంబులో రేఖాచిహ్నితమైన చతుర్థపాదము ప్రతినిధిగాఁ వ్రాయఁబడెను. వ్యాఘ్రము వనంబును, వనంబు వ్యాఘ్రంబును, రక్షింపవలెనని చెప్పిన శ్లోకతాత్పర్యమేమనఁగా వనవ్యాఘ్రములు పొందుగా నుండవలెనని ఫలితార్థము: కాననట్టితాత్పర్యమునే పైపద్యచతుర్థపాదము తెలియఁజేయుచున్నదని యెఱుంగునది. పైపద్యమునందలి చతుర్థపాదంబుయొక్కయర్థము:—ఉభయమున్=వనవ్యాఘ్రంబులు రెండును, సంతుష్టిమైన్ = సంతోషముతో ఉన్కికిన్=ఉండుటకై, కాన=వనము, తగన్ = యుక్తముగా, పొందుట = కలిసియుండుట, కార్యము = ఆవశ్యకము. పైపాదములో నుభయసంతుష్టికై వనంబు కలియుట మంచిదని స్పష్టమగుచున్నందున నుభయశబ్దముచేతనే సింహంబు కూడ వనంబుతోఁ గలిసియుండుట మంచిదన్న యర్థము కరతలామలకముగా స్ఫురించుచున్నది. కావున వాక్యంబులోని పదార్థంబుల సంబంధంబుచే సింహవాచకపదంబుయొక్క యవసరంబులేకుండనే యాక్షిప్తమైన సింహంబులు, అధ్యాహార్యంబులని తెలిసికొని సుధీమణులు "కానన్" అను దుష్టసంధిహేతుద్రుతాంతపదపాఠంబును, "కానతెగన్" అనుమూలవ్యతిరిక్త పునరుక్తదోషభూయిష్ఠ చ్ఛేదార్థకశబ్దయుక్తపాఠంబును, వితర్కించుచుఁగవిపై దోషంబుల నారోపింపకుందురుగాక! సంస్కృత శ్లోకములోనున్న వ్యాఘ్రపదంబునకుఁ బద్యములో "సింహము" గ్రహింపంబడియె. అందునఁ బద్యతాత్పర్యము మాత్రము చెడదుగాన నయ్యాదికవిరచనను దోషంబు మేళగింపదు.

14 సూ.—తెనుఁగుమీఁది సాంస్కృతికపరుషములకు గసడదవలురావు.

వాఁడు ... ... కంసారి ... ... వాఁడుకంసారి
వీఁడు ... ... చక్రపాణి ... ... వీఁడుచక్రపాణి
ఆయది ... ... టంకృతి ... ... ఆయదిటంకృతి

అది ... .. తథ్యము ... ... అదితథ్యము
ఇది ... ... పథ్యము ... ... ఇదిపథ్యము

వ్యా. తెనుఁగు శబ్దముల తరువాత వచ్చిన సంస్కృతపదముల క చ ట త ప లకు (పరుషములకు) గ స డ ద వలు రావు. ఉదా. వాఁడుకంసారి (వాఁడు + కంసారి) ఇచ్చట రెండవశబ్దము సంస్కృత సమముగనుక నాకకారము గకారముగా మాఱదు. కనుక "వాఁడుగంసారి" అనఁగూడదు. వీఁడుచక్రపాణి, ఆయదిటంకృతి, ఇది పథ్యము. మొదలైన విశ్లే. తిక్కనకవికృతంబగునిర్వచనోత్తరరామాయణమునందు "క. అవిమొనలుగాఁగవిష్ణుని గావిని యాతండునాకు మగఁడగునని యిట్లుదపంబు సేయుచుండెన" 5 ఆ. అనియుఁ, గాశీఖండము నందు "క. ఎవ్వండు సతించెడువాఁడు ధన్యుఁడు మునిప్రవరా" అనియును, వసుచరిత్రమునందు "మ. పెం | పువరీక్షింపవెు నింపమో చెలిమి యేభూపాలునం దైన" అనియును! ఉత్తరహరివంశంబునందు "శా. హీరఙ్గోపించిన నంతనుండుఁ జెడుమీఁ గామోర్చువారు" 4 ఆ. అనియును, నిత్యాది ప్రయోగంబులు సంస్కృతపదంబుల క చ ట త ప లు గసడదవలుగా మాఱియుండుటకుఁ గొన్ని కలవు. లిపశబ్దభవము "తబము, తబసు" అని యుంగలదుగావున "ఇట్లుదబంబు" అని గ్రహించిన నిర్దోషంబగును. తక్కనచోట్లఁగూడ వీరిమతంబున సవరింపవలసియుండును. "సవికృతిశబ్దాత్పరత స్సాంస్కృతికానాం భవంతి గ స డ ద వాః" అను నాంధ్రశబ్దచింతామణి సూత్రంబునకు సరియైన యాంధ్రీకరణముగా సూరిగారు సూత్రము రచియించినారు. దీనంజేసి తెలుఁగుమీఁది తత్సమశబ్దంబుల పరుషంబులకు సరళాదేశము రాఁగూడదు గాని తత్సమంబులమీఁది తత్సమంబులయొక్క గాని, వికృతిశబ్దంబులయొక్క కాని, పరుషంబులకు సరళాదేశము నిర్వివాదమని యెఱుంగునది. కావుననే "క। కావక్రైయి సురరాజ్య శ్రీపాలింపంగఁ బసుపు శేషంబునసం భావితుఁడు నహుషుఁడనఁజను" భార- ఉద్యో- 1ఆ. అను పద్యమందలి "శ్రీవాలింప" ఇత్యాదులందుఁ దత్సమంబైన "శ్రీ" శబ్దంబుకంటెఁ బరంబగు "పాలించు" అనుతత్సమ శబ్ద పకారంబునకు వాదేశప్రాప్తిసంగతంబగును.

15 సూ.—ద్వంద్వంబునం బదంబు పయి పరుషములకు గసడదవలగు.

కూర ... ... ... కాయ ... ... కూరగాయలు

| | | |
|---|---|---|
| కాలు ... ... ... | చేయి ... ... | కాలుసేతులు |
| టక్కు ... ... ... | టెక్కు ... ... | టక్కుటెక్కులు |
| తల్లి ... ... ... | తండ్రి ... ... | తల్లిదండ్రులు |
| ఊరు ... ... ... | పల్లె ... ... | ఊరువల్లెలు |

వ్యా. ద్వంద్వసమాసమునందు మొదటిపదము తరువాతఁగలుగు పరుషములకు గసడదవలగుగ్గను అనఁగా బ్రాయికంబుగానని యభిప్రాయము. ఉదా. కూరగాయలు (కూర + కాయ) కాలుసేతులు (కాలు + చేయి) ఇట్లే మిగిలినవి. తెలుంగులో నీద్వంద్వసమాసము సమాసపరిచ్ఛేదములోని యేడవ సూత్రంబుబట్టి మొదటి పదము తెలుగు శబ్దమై (ప్రథమైకవచనము లోపింపబడునై) యుండవలెను. ఈసమాసంబునందుఁ గూడ నచ్చటచ్చట సరళములు రాని ప్రయోగంబులు గలవు. ఉదా. అందచందములు అప్పాచెల్లెండ్రు- కండకుండెడు, రాకపోకలు, మొదలైనవి.
"వినుమన్నదితియు దితియును వనఁగశ్యపభార్య లక్కచెల్లెం డ్రనిమిషుల నసుర గణముం గనిరి" వ్య-4-త పజీయు "అప్పచెల్లెండ్రు" అనునట్లు సంస్కృతభాష లోఁగూడ నొక్క, ఉ "మాతాపితరౌ, పితాపుత్రౌ, మిత్రావరుణౌ, అగ్నీషోములు ఇత్యాదిద్వంద్వములయందు మొదటిపదంబు తుదిస్వరంబునకు దీర్ఘముగా స్త్రీయముగాఁ గాలిపించుచున్నది. ఇట్లే "అన్నాదమ్ములు, తల్లిదండ్రులు" మొన్నగునవి గ్రాంథ్ర మునందు గానఁబడుచున్నవి.

16. సూ.—ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు.

| | | |
|---|---|---|
| పూచెను .. ... | కలువలు ... ... | పూచెనుగలువలు |
| తోఁచెను ... ... | చుక్కలు ... ... | తోఁచెనుజుక్కలు |
| చేసెను ... ... | టక్కులు ... ... | చేసెనుడక్కులు |
| నెగడెను ... ... | తమములు ... ... | నెగడెనుదమములు |
| మొగిడెను... ... | పద్మములు ... ... | మొగిడెనుబద్మములు |

వ్యా.—క్రియాంతమందుఁగల శబ్దములతరువాతి పరుషములకు సరళములు

(గ జ డ ద బ) లగును. ఉదా. పూఁచెనుగలువలు. (పూఁచెను + కలువలు) ఇచ్చట "పూఁచెను" అను ద్రుతప్రకృతికములోని "ను" అను ద్రుతముతరువాతఁ బరంబైన కకారము గకారముగా మాఱి "పూఁచెనుగలువలు" అనియయ్యెను. "తోఁచెను జుక్కలు, నెగడెను దమములు, మొగిడెను బద్మము" మొదలైనవియు నిట్లే.

17. సూ.—ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాషనగు.

సంశ్లేషంబనఁగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట.

పూఁచెనుగలువలు ... ... ... { పూఁచెంగలువలు, పూఁచెఁగలువలు, పూఁచెన్గలువలు }

తోఁచెనుజుక్కలు ... ... ... { తోఁచెంజుక్కలు, తోఁచెఁజుక్కలు, తోఁచెన్జుక్కలు }

చేసెనుదక్కులు ... ... ... { చేసెందక్కులు, చేసెఁదక్కులు, చేసెన్దక్కులు }

నెగడెనుదమములు ... ... ... { నెగడెందమములు, నెగడెఁదమములు, నెగడెన్దమములు }

మొగిడెనుబద్మము ... .. ... { మొగిడెంబద్మము, మొగిడెఁబద్మము, మొగిడెన్బద్మము }

పక్షంబున స్వత్వంబగు — స్వత్వంబనఁగా ద్రుతంబునకుఁ బ్రకృతిభావము.

వ్యా — ఆదేశ సరళములకుఁ (పరుషాక్షరస్థానమందు శాస్త్రముచేత వచ్చిన సరళాక్షరములకుఁ) బూర్వమందున్న ద్రుతమునకు బిందువును, (అరసున్నయు, నిండుసున్నయు) సంశ్లేషమును, (మీఁదిహల్లుతోఁ గూడికొనుటయు) వైకల్పికముగాఁ గలుగును. అనఁగా "పూఁచెనుగలువలు" అనునప్పుడు "పూఁచెను" అనుదానిలోని ద్రుతమైన నకారంబునకు, దరువాతవచ్చిన క చ ట త ప లు, గ జ డ ద బ లు గా మాఱఁగాఁ బూర్వమునమున్న నకారమునకు నరసున్నయు, నిండుసున్నయు. సంశ్లేషమును, గలుగునని భావము. ఉదా. "పూఁచెనుగలువలు" అని యుండఁగా నకారమునకు నిండుసున్న రాఁగా "పూచెంగలువలు" అనియు, అరసున్న రాఁగా "పూఁచెఁగలువలు" అనియు "ను" ("ను" యొక్క ఉకారములోపింపఁగా "న్", హల్మాత్రమయినది) మీఁది హల్లుతోఁ గూడుకొనఁగా "పూఁచెన్గలువలు" అనియును, రూపములుగలిగెను. వేఱొకపక్షమునఁ బైదానికి స్వత్వమువచ్చును. స్వత్వమనఁగా ద్రుతంబునకు మొదటిరూపము (ను) అనఁగా "పూఁచెనుగలువలు" అను రూపముంగలదని భావము. ఇట్లే తోఁచెను జుక్కలు, చేసెను బనులు, మొగిడెను. బద్మము మొద.

18. సూ.— ద్రుతంబునకు సరళ స్థిరంబులు పరంబులగునపుడు లోపసంశ్లేషంబులు విభాషనగు.

వచ్చెను ... ... గోవులు ... ... { వచ్చెఁగోవులు / వచ్చెన్గోవులు / వచ్చెనుగోవులు }

మెఱసెను ... ... ఖడ్గము ... ... { మెఱఖడ్గము / మెఱసెన్ఖడ్గము / మెఱసెనుఖడ్గము }

వ్యా.— ద్రుతమునకు సరళాక్షరములును, స్థిరాక్షరములును, పరంబగునపుడు లోపమును, (ద్రుతమునకని భావము) సంశ్లేషమును, వైభాషికముగాఁ గలుగును. ఉదా వచ్చెను గోవులు (వచ్చెను + గోవులు) ఇచ్చట "వచ్చెను" అనుదానిలోని

మకారమునకు "గోవులు" అనునప్పుడు పరశవర్ణమైన గకారము పరమైనప్పుడు మకారమునకు లోపమువచ్చి "వచ్చెగోవులు" అనియును, ద్రుతము (న్) గకారముతోఁ గలిసి కాని "వచ్చెఙ్గోవులు" అనియును, లోపంబును సంశ్లేషంబునులేక సహజనుకారమున్నయపుడు "వచ్చెనుగోవులు" అనియు, విభాషయని చెప్పుటచేత గ్రహింపవలెను' ఇట్లే మెఱసెను ఖడ్గము- మొ. ఇట్లు వెనుకటి రెండుసూత్రంబులచే పరశస్థిరంబులు పరంబగునప్పుడు ద్రుతంబునకు సంశ్లేషాదికార్యంబులు విధింపఁబడినవి. శబ్దశాసనునిమతమందు, ఎకారస్వరంబాదియందుఁ గలిగిన "ఎదుట, ఎల్ల, ఎవఁడు" ఇత్యాదిపదంబులకు యకారము మొదట గలదని సంజ్ఞాపరిచ్ఛేదమునందు "అన్యః క్రియాసుభూతార్థద్యోతిన మాన్యగం వినాఽన్యః" అని యనువదిన్నాల్గవ సూత్రంబునయందు నిశ్చయింపఁబడినది. ఈసూత్రంబున "ఎదుట, ఎల్ల, ఎవఁడు" ఇత్యాదు లెకారాదిపదంబులు "యెదుట,యెల్ల, యెవఁడు" అని యకారాదులయియుండునని శబ్దశాసనసిద్ధాంతము ఇట్టి యకారాది శబ్దంబులయందు యకారంబు స్థిరంబుగావున యకారంబుపరంబగునపుడు పరశాదులు పరంబగునప్పుడువోలె ద్రుతంబునకు లోపసంశ్లేషంబులు ప్రాప్తింపమన్నవి. ఈకార్యంబులు శబ్దశాసనునికి సయితమిష్టములేదు. కావున సంధిపరిచ్ఛేదమునందు "సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్యద్రుతప్రకృతికేభ్యః" అను నిరువదియెనిమిదవసూత్రంబున "వచ్చెన్ + యెదుట, వారలన్ + యెల్ల" ఇత్యాదిస్థలంబులయందు ద్రుతంబునకు యకారనామక స్థిరంబు పరంబైనను, అచ్చుపరమైనప్పుడువోలెఁ గార్యంబగునని యకారంబందు స్వరధర్మంబారోపింపఁ బడ్డది. పూర్వోదాహరణంబులయందలి యకారంబునకు స్వరధర్మాతిదేశంబున నైమిత్తికంబని ప్రశ్నకలుగఁగా స్పష్టార్థమై "లుక్సంశ్లేషానాచి" అని తర్వాతి సూత్రంబు ప్రారంభింపఁ బడినది. కాన "వారలన్ + యెల్ల, వచ్చెన్ + యెదుట" ఇత్యాదిస్థలంబులయందు ద్రుతంబునకు, ఎకారాత్మమైన యకారస్థిరంబు పరంబైనను స్వరధర్మారోపణంబున నకారలోపసంశ్లేషంబులు రావు. కాన "వారలనెల్ల, వచ్చెనెదుట" ఇత్యాది ప్రకారంబుననే రూపంబులుండును. ఎకారాదులైన తెలుఁగుపదంబుల మొదటి యకారస్థిరంబున్నదన్న శబ్దశాసనమతమందు నకారలోపసంశ్లేషంబులు ప్రాప్తింపమన్నవి. కానఁ దన్నివారణార్థము "లుక్సంశ్లేషానాచి" అనుసూత్రంబు ప్రారంభింపఁబడినది. కాని సామాన్యముగా సర్వాచ్చులు పరంబగునపుడు లోపసంశ్లేషంబులు రాకుండుటకై యోగారంభము చేయఁబడె

శేష లోపసంశ్లేష విధాయకసూత్రంబులలో సర్వత్ర స్వరంబులు పరంబగునపుడే నకా
రలోపాది కార్యంబులు విధింపఁబడినందున హల్లు పరంబగునప్పుడు పైకార్యంబునకుఁ
బ్రాప్తియే లేకపోఁగా "ప్రాప్తిపూర్వో హి నిషేధః" అను న్యాయంబునకు విరోధం
బుగా సూత్రారంభ మేమియవసరంబు? కావునఁ దేశ్యపదంబులయందు సామా
న్యంబుగా సర్వాచ్చులు పరంబగునప్పుడు నకారలోప సంశ్లేషంబులు ప్రాప్తించును
న్నవనియు, దానంజేసి యీనిషేధసూత్రం బారంభింపఁ బడినదనియు, గ్రహింప
వలదు పైనిం జెప్పిన యభిప్రాయమే సంజ్ఞాపరిచ్ఛేదమందలి 'అస్యక్రి కగాసుఘాతార్థ
ద్యోతినమాప్యగం వినా సర్వం' ఇత్యాదిసూత్రంబులను వివరించు సమయంబున 'లుక్సం
శ్లేషానాచి ద్రుతస్యేతి సూత్రే విహితమచి లుక్సంశ్లేషాభావలక్షణం కార్యం ద్రుత
ప్రకృత్యుపస్థిత స్యయస్యాదితిశ్యతే, అచిలుక్సంశ్లేషాభావే ద్రుత స్యాచాసహా స్వ
సంబంధక్లృప్తః' అని యహోబలపండితీయంబులో, ఏకాక్షరంబులైన తెలుఁగుపదం
బులయందే ప్రాప్తించుచున్న నలోపసంశ్లేషంబులను నివారించుటకై సూత్రంబు
యకారంబున కతిదేశింపఁ బడుచున్నదని స్పష్టపఱుపఁబడినది. ఇట్లు సుందరపదంబైన
మార్గంబు ప్రకాశించుచుండఁ గొందఱు సూత్రవ్యాఖ్యానకర్తలయభిప్రాయంబు నెఱుఁగ
క. "చ॥ వరదుఁడు పార్థుశౌర్య విభవంబున కాతనిధైర్యశక్తికి న్నరుదుగ' భార-ఆర-
1ఆ. (శక్తికిన్ + ను + అరుదుగ) ఉ॥ వర్తిల్లక సర్వమున్నతని దివ్యకళామయమంచు
విష్ణునం దుల్లముచేర్చి' భాగ-7 స్కం. '(సర్వమున్ + ను + అతని) 'వ ఘనచక్రా
యుధ నిష్ఠురక్షాగళద్రక్తాస్యసర్వాంగుని న్ననుసూతాగ్రతినుగ్రపగల్భపరివాదాంత
హితోద్వ్రక్రమున్' ఉ- హరి- 6ఆ. (సర్వాంగునిన్ + ను + అను ఘూత) 'వ పడఁ
తులమీఁదనేయురతి పయ్యెదకున్నను జైనచేతులన్" మను- 3ఆ. (పయ్యెదకున్ +
ను + అనువైన) 'క అవ్విబుధజగతీలోపలఁ గ్రొవ్వెదఁగి సురగణంబు క్షోభము
నొందె॥ న్నివిధముతో' ఉ- హరి- 6ఆ. (ఒందెన్ + ను + ఇవ్విధము) 'మ తరుణీశాత
కటాక్షవీక్షలకొనల్ద్రొక్కన్నచోట్లుంబలె॥ న్నురుశోభావిభవాకరంబులగుచు న్నోమం
కురస్థానముల్' కళా--7ఆ. (బలెన్ + ను + ఉరు) ఇత్యాదిప్రయోగంబుల నిదర్శనం
బుగాఁ జూపుచు "లుక్సంశ్లేషానాచి, అనుసూత్రంబున స్వరంబు పరంబగునప్పుడు నకార
సంశ్లేషంబు మాత్రకం లేదని నిషేధించుచుండఁగాఁ బైనిం జెప్పిన నకారసంశ్లేషయుక్త
కవిప్రయోగంబులెటు సాధులైనవని శంకింతురు. 'లుక్సంశ్లేషానాచి' అను సూత్రంబు

నని విషయస్థలంబు, ఏకారస్వరాదిపైన శబ్దంబులేయనియు, శబ్దశాసనమతంబున నట్టిపదంబుల మొదట యకారస్థితంబున్నది కావునఁ బ్రాప్తించిన నకారలోప సంశ్లేషముల నిషేధించుట యనవసరంబైనదనియు, నీవలనే పైని వివరించియున్నాఁడ. పైనిఁ గనంబఱచిన పద్యములలో "ధైర్యశక్తికిన్నరుఁడుగ, సర్వమున్నతని, సర్వాంగనిన్నను భూతా,పయోదమున్ననుపైన, ఒంపెన్నివ్వనముదక్, బలెమున్నరుశోభా" ఇత్యాదులు నకారసంశ్లేషంబని భ్రమసదగు నాస్పదంబైన స్థలంబులు ద్రుతంబునకు అకారాదులు పరమైనవోష్ఠ్యలుగాని, ఏకారాదిగాదు. ఇట్టి ద్రుతంబునకును వాగనుశాసనమతంబున యకారయుక్తస్వరాదులైన శేషంబగు పదంబులు లేకపోవుటచేత సంశ్లేషంబునకుఁ బ్రాప్తియేలేదు. కావున నిషేధంబునకును నవసరంబులేదని స్పష్టమగుచున్నది. కాఁబట్టి పైనిం జెప్పిన నకారద్వయసహితస్థలంబులు సంశ్లేషంబులనఁగూడదని గ్రహింపవలయును. ఇఁకను ద్విత్వనకారయుక్తమైన పైప్రయోగంబులకుశరణం బేమియని శంకింతురేని సావధానమనస్కులై నాకర్ణింపుడు. ఐలనసిద్ధాంగ్యావిచ్ఛేదంబుగా ద్రుతంబుపై ద్రుతంబు ప్రయోగింపవచ్చునని వ్యాకరణకర్తలెల్లరును నిర్వివాదంబుగా సమ్మతించుచున్నారు. బాలవ్యాకరణ సంధిపరిచ్ఛేదమందలి యిరువదియొకండవసూత్రము పైయర్థమునే తేటపఱచుచున్నది. "ద్రుతాద్ద్రుతస్య విచ్ఛిత్తిర్దృశ్యతే కవిభాషితే" అని యథర్వణకారికయును "ద్రుతంసద్రుతాత్" అని వాసుదేవవృత్తియును, ద్రుతంబుపై ద్రుతంబు క్వాచిత్కంబుగఁ బ్రయోగింపవచ్చునన్న యంశము నుద్ఘోషించుచున్నవి. పైనింజెప్పినసంశ్లేషభ్రమదాయక ప్రయోగంబులన్నియు, ద్రుతంబుపై ద్రుతంబుచే సాధువులగును. "దివంబునుం బోలె" ఇత్యాదులందు హల్లు పరమగునపుడే గాకుండ నచ్చు పరంబగునపుడును ద్రుతంబుపై ద్రుతంబున్న ప్రయోగంబులు కొన్ని ప్రవర్తింపఁబడుచున్నవి. ఇట్టి ప్రయోగంబులు కవిత్రయంబుచే నయితేమింక నుపయోగింపఁ బడినవి కలవు. క। సంతత సత్కీర్తి పిండ సత్కృతియుతున త్యంత మహీరాజ్యమును, భార. సీ। ఆబాలగోపాల మఖిలసద్ద్విజయును నానందముగ మున్నె నతిశయిల్లె" మ। తే టపడంగాంచెడఁబంపుమన్ననున ఖండపేర్మినసామగ్రితోన్."

ద్రుతంబుపై ద్రుతప్రయోగము క్వాచిత్కంబు గావున నిట్టి ప్రయోగంబులు సాధారణముగా వాడఁగూడదు. కొందఱు లక్షణ[illegible]లు పైనింజె[illegible] నకారద్విత్వ



ప్రయోగంబులు సంశ్లేషంబులని భ్రమించి నకారద్విత్వ ప్రయోగంబులు గ్రంథం బులలోఁ గ్వచిత్కంబుగ నుండవచ్చునని నుడివిరి. వారి వచనంబు శాస్త్రీయతర్కం బునకు విరుద్ధంబుగాని ఫలంబున నావాక్యంబుతో నైకకంఠ్యముగానే యున్నది. కాన" క॥ ఎన్నఁగ నకారపొల్లుల కున్నచ్చులు సంధిఁజేసి కూర్పఁగవచ్చున్ । బన్నగ పతిశయనుండో 'ర్చన్నఘములఁ బాపభక్తసులభుండయినన్" సర్వలక్షణసారసంగ్ర హమున నకారసంధియ విధించుట భ్రమంబు. మత్తకోకిల. దీని నెట్టులు గ్రమ్మరింతు వదీ య భాషితమెన్నఁడు న్నేని మోఘముగాదు దిగ్ధరణీరవీందు లెఱుంగగాన్." భార. ఆది. 7 ఆ. క. అవ్విబుధఁ జగతిలోపలఁ గ్రొవ్వుదఱిఁగి సురగణంబు క్షోభ మునొందె న్నివ్విధమున నుత్పాతము" ఉ.-హరి-6 ఆ." పాదావసానంబునందున్న యిట్టి ద్రుతోపరిద్రుతంబులను జూచి పైపద్యంబులలో "భాషితమెన్నఁడున్ ఏని" "నొందెన్ । ఇవ్విధము" ఇట్లు విసంధిగా నుండవలెననియు, నకారసంశ్లేషం బుండఁ గూడదు కాన వాక్యావసానంబున విసంధి లోపంబులేదనియు, వాక్యశబ్దంబు నకుఁ బాదమన్న యర్థంబున్నదనియు, వాదించుచున్నారు. పై పద్యంబులలో సయి తము నకారద్విత్వంబు ద్రుతోపరిద్రుతంబువలనఁ గలిగినదిగాని స్వరపరక సంశ్లే షంబున లభ్యమైనది కాదు. కొందఱు చెప్పినట్టులు వాక్యావసానంబున సంహిత (వ ర్ణంబులు మిక్కిలి దగ్గఱగా నుచ్చరించుట) నిత్యంబుగావని యంగీకరించి "ఎన్నఁడున్ । ఏని" ఇట్లు విసంధిగాఁ జదివితిమేని పైరిం జూపిన భారతపద్యంబులోని చతు ర్థపాదంబులో మొదటనున్న, ఏకారస్వరంబునకు "ధరణీ" శబ్దంబులోని ణీకారము యతిగానుండుట యశాస్త్రీయం బగును. కావున నకారద్విత్వంబుతో సంధిచేసి పద్య పాదము పఠించితిమేని పాదాదియైన నేకారంబునకును, ధరణీశబ్ద ణీకారంబునకును, యతి కవిసమ్మతంబుగా నుండును. ఏనిశబ్దంబు భయయతులలోఁ బఠింపఁబడినది కావు న, ఏకారస్వరంబునకును, ఏకారపూర్వవర్తియైన ప్రాణికిని యతిమైత్రి చెల్లును. ఇందు లకు—క. ఏనియను నాంధ్రశబ్దము । తోనది 'నపూర్వపదము తుదిన్రాయికిన। చ్చైననువ్యంజనవర్ణం । బైనరచింపుదురు నిత్యయతులను మఱగవుల్." అప్ప-3 ఆ. క. పెట్టఁడు నారకమార్గం । బెట్టిమహాక్రూరకర్ముఁడేనియుఁ దుదని । ట్టట్టనక నెమ్మనమ్ము న । నెట్టనహరిఁదలఁపఁగలిగనేనిమహాత్మా." మఱియు క. విదితముగ నేనియనియె డు । పదమన్యపదంబులోడ బద్యంబులలో । వదుకు నెడనియదెఱుంగుల్గఁ । బొదవుని

త్య యతియనఁగ భుజగవిభూషా" సర్వ-విక్రమ-ప్ర-22 ల తే. గీ. రాజసరుఁ డైన పార్థివరాజుగాని । యాతఁడవివేయఁగాదగఁడేనివాని." భార. ఆది.

19. సూ.—వర్గయుక్సరళములు పరములగునపు డోకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబయెడి.

వచ్చెను ... ... ధాత్రీపతి ... ... వచ్చెంధాత్రీపతి
పాడెను ... ... గంధర్వుఁడు ... పాడెంగంధర్వుఁడు
కన్ ... ... దోయి ... ... కందోయి

వ్యా.—వర్గయుక్కులు = వర్గాక్షరము లైదింటిలోను సరియక్షరములు. అనఁగాఁ బ్రతివర్గులోని రెండవయక్షరమును, నాల్గవయక్షరమును,నని గ్రహింపవలెను (ఖ, ఘ, ఛ, ఝ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ) వర్గాక్షరముల సరియక్షరములలో నేది పరమైనను, సరళాక్షరములలో నేది పరమైనను, కొన్నిచోట్ల ద్రుతంబునకు నిండుసున్న కనఁబడుచున్నది. ఉదా. వచ్చెంధాత్రీపతి (వచ్చెను + ధాత్రీపతి) ఇచ్చట మొదటిపదములోని "ను" (ద్రుతము) తరువాత ధకారమువచ్చినది. తవర్గులోని నాల్గవది యైన యీధకారము వర్గయుక్కుగాన నియ్యది పరంబగునపుడు నువర్ణమునకు నిండుసున్నవచ్చి "వచ్చెంధాత్రీపతి" అని యయ్యెను. "పాడెనుగంధర్వుఁడు." ఇచ్చటగంధర్వశబ్దములోని గకారము సరళంబుగావున నిది పరమైనయపుడు పూర్వమందున్న నువర్ణమునకు నిండుసున్నవచ్చి "పాడెంగంధర్వుఁడు" అని యయ్యెను. ఇట్లే "కందోయి" మొదలైనవి. ఉ. క । ల్పింజనియించు దుర్యశము మేల్కనిలే హానవేళ హాజాలూ । ర్పంజెడుమాణిమంగని కరంబుల కాళిమపేరఁ దాల్చెనన్." ఆముక్తమాల్యద. క. అంజదపుగాకననుజెం । తం జేరఁగనీక యెంత తగ్గినమిరియా । లుం జొన్నలు సరిగావే । లంజతనములందుఁ గొమరులన్ గెలువనోకో." ఉ. హరి. 1ఆ. శా. నీ।కుండకెక్కెన్ జగురాననత్వగుణయుక్తుల్ మీఁఅవాణీమనో । భండారోద్ధతమారకారబిరుదప్రఖ్యాతి సార్థంబుగన్." కవులవష్టము. మఱియు ద్రుతంబునకుఁ బ్రాసస్థానంబున మకారంబు పరంబగుచో నిండుసున్న యగునని తిమ్మకవీంద్రుల యభిప్రాయంబును, అట్టి ద్రుతంబునకు మకారంబే కలుగునని మఱికొందఱ యభిప్రాయంబు

ను గలను. ఉచ్చారణ సమయంబునఁ బూర్ణబిందువైనను, మకారంబుతోఁ గూడినప్పు
డు మకారద్విత్వంబు గానే వినంబడును. కావుననే "అహమాదీనాంద్విత్వం" అనుసూ
త్రంబును వివరించుతఱి నహోబల పండితీయంబునందు "శ్లో. శబ్దానామంత్యభాగే
షు కేవలోనుస్వారః ప్రదృశ్యతే। తస్యాపిపరతోమస్యాత్సర్వత్ర కవిసమ్మతేరితి.
శ్లో. కేచిదత్రాప్యభేదస్య మనుస్వారమకారయోరితిప్రోక్తం సర్వత్రసంస్కృతాంధ్ర
గోంత్రిర్వ్యక్తః అనుస్వారమకారయోరభిన్నత్వం మకారేపరేసతి" అను వచనంబునన
నుస్వారంబునకు మకారము పరంబగునో మకారమేయగునని స్పష్టపఱుపఁబడినది.
లయుగాహి. కమ్మనిలతాంతములకుమ్రొవసినమ్మ మధుపమ్ములనుగీతనినదమ్ములెసగం
బూనమ్ములు" (సన్ + మొనసి) భార. ఆది. 5 ఆ. మత్తకోకిల వృష్టిఁజేసెమ్మహానది
దీర్ఘికాసరసీసమూహంబు నిండఁగన్." (జేసెన్ + మహా) భార-ఆర-3 ఆ. సంస్కృత
వ్యాకరణంబందును బదము తుది నిండుసున్నకు మకారంబు పరంబగునపుడు మకారం
బు వైకల్పికంబుగా నగును. ఉ. రామంమనసాస్మరామి, రామ్మనసాస్మరామి అట్లే
తెలుఁగున మత్తద్వయంబున్ను నుచ్చారణంబులో భేదంబులేదు.

20. సూ.—అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగును.

వాఁడువచ్చెన్। వాఁడువచ్చె। వాఁడువచ్చెను ఈలోపంబు పద్యాంతములయందు గణానుసారంబుగ వ్యవస్థితంబయియుండు గుర్వవసాయియగు పద్యాంతమున హ్రస్వత్వంబు లేదు। అతిశయముగబుద్ధిమంతుఁడగుబుధసేవన్.

వ్యా.—అవసానమునందు (సమాప్తియందు=నకారాంతపదము తరువాత వర్ణములేనప్పుడు) ద్రుతముయొక్క యచ్చునకుఁ గాని, ద్రుతమునకుఁగాని లోపము బహుళంబుగాఁ గలుగును. ఉదా. 'వాఁడు వచ్చెను.' ఇచ్చటఁ గడపటనున్న ద్రుతముయొక్క యవయవమైన ఉకారము (అచ్చు) పోఁగా మిగిలిన రూపము 'వచ్చెన్' అయ్యెను. 'వాఁడువచ్చె'. ఇచ్చట ద్రుతము (ను) పోఁగామిగిలిన రూపము "వచ్చె" అయ్యె

స్వంబుమీఁద ఖండబిందువును, ద్రుతంబునకు లోపంబును లేవు.
ముంగొంగు క్రొంబసిఁడి కన్దోయి

వ్యా.— "అఁట, ఇఁక, చుఁడు" అనుశబ్దంబులయందుఁ దప్ప మాట (నుడి) యొక్క మొదటి (తొలి) హ్రస్వముమీఁద నఱసున్న గాని, ద్రుతంబునకు లోపంబు గాని, కలుగదు. మఱియుఁ గొందఱు పైమూఁడింటియందుఁ దక్క బ్రథమ హ్రస్వంబు మీఁద నఱసున్న యుండదనుట చూచి "ఏఁడు" అనుదానియం దెట్లుకలిగెనని భ్రమం పడుచుండిరి కాని, "ఏఁడు" అనునది ప్రత్యయంబు కాని పదంబుకాదు. అందుచేతనే పదునొకండవసూత్రంబునన పదంబులలోఁ జేర్చి "మూరెఁడు" అని యుదాహరించి నాఁడు. "ఇఁగ" అనునది "ఇఁక" శబ్దముయొక్క రూపాంతరమగుటచేఁ బైసూత్రంబు చేతనే సంగ్రహింపఁబడియె. 'చుఁడు' అనునది 'చూడుఁడు' అనుదాని సంక్షిప్త రూపము. 'అంట, ఇంక, చుండు' అనియుం జెప్పనొప్పను. 'ముంగొంగు' ప్రథమమున 'ముందు + కొంగు' అని యుండఁగా నీపరిచ్ఛేదమందలి ముప్పదిమూఁడవసూత్రంబునఁ దొలియచ్చుమీఁది వర్ణంబులు లోపించెను. అనఁగా 'ందు' అనునది లోపించి ముపర్ణము మాత్రము మిగిలెను. పిమ్మట ముప్పదియేడవ సూత్రంబున, లుప్తశేషంబైన ముపర్ణము నకు 'కొంగు'శబ్దంబులోని పరుషకకారముపరంబగుచుండఁగా, నుగాగమంబువచ్చి 'ముఙ్ + కొంగు' అనియగును. తరువాతఁ బదునాఱవసూత్రంబున 'ముఙ్' అను ద్రుత ప్రకృతిక శబ్దంబుమీఁది 'కొంగు' శబ్దంబులోని కకారము (పరుషము) గకారము కాఁగా 'ముఙ్ + గొంగు' అగును. ఇపుడు పదునేడవ సూత్రంబుచేత నొకపర్యాయము పూర్ణబిందువు వచ్చి 'పూఁచెంగలువలు' అన్నచోటునఁబలె 'ముంగొంగు' అను రూపంబును, వేఱొకపర్యాయము, అర్ధబిందువువచ్చి 'పూఁచెగలువలు' అన్నట్లు, అర్ధబిందువువచ్చి 'ముఁగొంగు' అనునవిష్టరూపమునగుచుండఁగా నీ యిరువదిరెండవ సూత్రంబున నేకాచ్ఛబ్దంబుపై నర్ధబిందువుండ దని తెలియవలెను. మఱియుఁ బదునేడవ సూత్రంబున సంశ్లేషము వచ్చి 'పూఁచెన్గలువలు' అన్నట్లు 'ముఙ్గొంగు' అను నట్టియనిష్టసంశ్లేషరూపము ప్రాప్తింపఁగా ముప్పదియేడవ సూత్రముక్రింద సూరిగారిచే వ్రాయఁబడిన 'వ్యవస్థితవిభాష'చే నీనుగాగమద్రుతంబునకు సంశ్లేషంబులేమి, అన్నవా

క్యంబుననుండఁగూడదు. అనఁగా సంధిపదంబులలో మొదటిపదంబు ఏకాచ్చుకలదైనప్పుడు పదునేడవసూత్రంబు ప్రవర్తించి సంశ్లేషార్ధబిందుస్వత్వరూపంబులుండవు. 'ముంగొంగు' అన్న పూర్ణబిందుసహితరూపమే యుండును. "కన్దోయి" ఇత్యాదులందు "కన్" శబ్దము ఏకాచ్చుకలదైనను నుగాగమద్రుతంబు కామి కావున సహజనకారంబుతో సంశ్లేషరూపంబుండవచ్చును. ముప్పదియేడవసూత్రంబుచేతఁ జేయఁబడిన లుప్తశేషశబ్దంబుల నుగాగమనకారంబునకే సంశ్లేషంబు రావలె నని సూరిగారిచే నాసూత్రముక్రింద వివరింపబడినదని యెఱుంగవలెను. "క్రొంబసిఁడి" (క్రొత్త + పసిఁడి) ఇచ్చట 'ముంగొంగు' అన్నరూపంబు నొందఁ బ్రవర్తించిన సూత్రంబులన్నియుఁ జెల్లునని యూహింపకొననది. "కన్దోయి" (కన్ను + దోయి) ఇట్లుండఁ బ్రకీర్ణకపరిచ్ఛేదములోని యేడవసూత్రంబున ద్విత్వనకారలోపంబు గలిగి "కనుదోయి" అగును. ప్రకీర్ణకపరిచ్ఛేదములోని పదునాఱవసూత్రంబున "కను" శబ్దంబుయొక్క ఉకారంబునకు లోపంబు రాఁగా 'కన్ + దోయి' అగును. ఇప్పుడీ సంధిపరిచ్ఛేదములోని పదునేడవసూత్రంబున నీద్రుతంబునకు దకారపరశంబు పరంబగుచుండఁగా 'వచ్చెఁగోవులు' అయినట్లులు నకారలోపము గలిగి 'కదోయి' అనిన యనిష్టరూపము ప్రాప్తించుచున్నయది. 'కను' శబ్దనకారము ప్రథమ హ్రస్వంబుమీఁదిది కాన నిరువదిరెండవదియగు నీప్రకృత సూత్రంబున ద్రుతలోపంబు కలుగక 'కన్దోయి' అని సంశ్లేషరూపము నుండును. ఈపరిచ్ఛేదములోని నుగాగమనకారంబుతో సంశ్లేషంబుండదనియు, సహజనకారంబుతో సంశ్లేషరూపంబు నిర్బాధంబనియు, వెనుకనే చెప్పంబడియె. 'కందోయి' అను పూర్ణబిందుసహితరూపముగూడ నీపరిచ్ఛేదమందలి పందొమ్మిదవసూత్రంబుచే నగును. క. 'కందోయి చల్లగానిటు | గందోయి నృపాలలెస్సగా నిఁకనొకమా | టందఱిముందఱనీవని | చిందఱవందఱలగుట్టుచిట్టాడంగన్' సా-౫ఆ. 'చెన్ను, కెంపు' ఇత్యాదిశబ్దంబు లావ్యక్షురశేషంబులైనప్పుడు సిద్ధించిన రూపంబులు గానవచ్చుచున్నవి గ్రహింపవలెను "సీ. చెందొవ (చెన్ను + తొవ) యను ముఖ్యంవంబుగాఁ దీర్చికపనీయముగఁ దలకంబు వెట్టు' నిర్వ-౮ఆ. 'క. అంపలనుంపలలేకపు డింపలమంపలను గూర్చు నయ్యోమేకంబుల్ చెందామర (చెన్ను + తామర) కొలనువలెన్ | చెందెప్పలవేమి చెప్ప దేవుఁ డెఱుంగున్' సా-౧ఆ. 'సీ. కెంపమ్మి (కెంపు + తమ్మి) యపుల యందంబుగ లిఖిన కనుగవకోపాన్ని గడలు కొనఁగ' భాస్క-యు

23. సూ. తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.

తాను ... ...చదివె ... ... { తాఁజదివె / తానుజదివె }

తాను ... ...విసె ... ... { తావిసె / తానువిసె }

దీర్ఘంబుమీఁదదిగాన దీనికి నెఱసున్న లేదు.

వ్యా — "తాను, నేను" అనుశబ్దంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు రాదు. అనగా "తాఁజదివె, తానుజదివె, నేఁజదివితి, నేనుజదివితి." అనురూపంబులు దప్ప సంశ్లేషముతో "తాఞ్జదివె" ఇత్యాదులు రావు మఱియు "దీర్ఘముమీఁదనున్న యఱసున్న నిండుసున్న కాదు" అను సంజ్ఞాపరిచ్ఛేదమందలి పదునేనవసూత్రంబున 'తాంజదివె' అనియును రూపముండెను ఇచ్చట "తాను, నేను" శబ్దములు ఉపలక్షముగా గ్రంథకర్తగారిచే గ్రహింపఁబడినవిగాని యిట్టిదీర్ఘపూర్వకద్రుతాంతశబ్దంబులకు నెచ్చటను సంశ్లేషంబు ప్రతివిరసంబాటు నుండఁగూడదు. "రాఞ్జూచితి, లెస్సగాఞ్జదివె," ఇత్యాదులుండవు. తిక్కనాది ప్రభృతులు "తాను, నేను" శబ్దంబులు నకారాంతంబులగుటచేఁ బరుషంబులకు సరళాదేశకార్యంబును, ద్రుతాంతంబులగుటచే బహుళంబుగ గసడదవాదేశకార్యంబును, ఉభయంబును నీశబ్దంబులపైఁ జెప్పనొప్పునను నీశబ్దంబులపై సరళాదేశము రానియందులకు భారతోద్యోగపర్వద్వితీయాశ్వాసములోని యీ క్రిందిపద్యంబును లక్ష్యంబుగా సర్వలక్షణసారసంగ్రహాదులయందుఁ జూపిరి "క నీచెప్పినపెద్దలు ద్రోణాచార్యులు మొదలుగాఁగనని కొల్లనివారై చన్నవారలం గొని యేచక్కంబెట్టువాఁడ నే పాండవులన్." అన్నచోటున "చన్నవారలన్=వెళ్ళినవారిని, కొని = గ్రహించిరి, ఏ(ఏన్)=ఏను. పాండవులన్ = పాండవులను, చక్కంబెట్టువాఁడనే=సంహరించువాఁడనా?" అని యర్థమూహించుచుఁ బైపద్యచతుర్థపాద ప్రమొదటిఏకారము "ఏను" శబ్దంబనియు, నది ద్రుతాంతంబుగావునఁ దరువాతి చకారంబునకు సరళాదేశము రాదనియు, నిశ్చయించిరి. మఱికొందఱు నాల్గవపాదమందలి మొ: టిఏకారము కాకుస్వరార్థము కలిగిన ఆకారమువంటిదనియు "చక్కం బెట్టువా

డనే" అనుపదము చివరనున్న ఏకారము ''ఏను,, శబ్దంబనియు,''చక్కఁబెట్టువాఁడనే పాండవులన్" అని పాండవశబ్దంబు పరసాదిగాఁ బలుకవలె ననియు, నిశ్చయించుచు ''నన్నవారలంగొనియే చక్కఁబెట్టువాఁడనేన్,, అన్నచ్చో నన్నవారలంగొనియే= నన్నవారలంగొనినవాఁ డేన్ = నేను, చక్కఁబెట్టువాఁడన్ = సంహరించువాఁడను. అనఁగా ''ద్రోణాదులనుగొని (నమ్మి) పాండవులను జక్కఁబెట్టను" అనుచుఁ జతుర్థ పాదాదియందున్న ఏకారము కాకుస్వరార్థకమైన ఆకారము వంటిది గాని అన్యదర్థక ముగాదని చెప్పిరి. అందువనే "చక్కఁ" లోని చకారంబునకు ద్రుతకార్యంబైన పరసా దేశంబు రాలేదని నుడువుచు "తాను, నేను" శబ్దంబులు సర్వదా ద్రుతప్రకృతికంబు లేయనియుఁ, గాన సదా యాశబ్దంబులపై ద్రుతకార్యంబులే వచ్చుననియు, బహుళం బగు గసడదవాదేశ కార్యంబెన్నఁడును రాదనియు, సిద్ధాంతీకరించిరి. "తాను, నేను" శబ్దంబులపై ద్రుతకార్యమే కలుగనుగాని వేఱొకటి రాదని మాయభిప్రాయము. కావునఁ బైవారిలో నేకీభవింపము గాని పూర్వపద్యచతుర్థపాదాదియైన ఏకారంబు నకు నట్టిసందర్భంబులో మామతంబున కాకుస్వరమర్థముగాదు. ఆకారంబునకుంబోలె ఏకారంబునకుఁ గాకుస్వరార్థమున్నను, వాక్యాంతమందలి ఏకారంబునకే కాకుస్వరార్థ ము ప్రయోగంబులఁ గానంబడుచున్నది కాని వాక్యమధ్యంబున నట్టియర్థంబు రానే రదు. వాక్యమధ్యంబుననే వకారార్థమైన యవధారణంబే తోఁచుచుండును. లోకంబు లో "పుస్తకము గైకొనియే వచ్చెదను" అన్నవాక్యంబునకుఁ బుస్తకము నిశ్చయముగాఁ దీసికొనివచ్చునని వినువారు తలంతురుకాని "పుస్తకంబు దీసికొనియే వచ్చెదను" అన్న వాక్యంబునకు "తీసికొనియావచ్చెదను?" అన్నయర్థంబు చేసికొని పుస్తకము దీసికొని రాఁడన్న విపరీతార్థము లోకులెవ్వరును జేసికొనరు. కాఁబట్టి పూర్వపద్యచతుర్థపాదాది లోని ఏకారంబునకుఁ గాకుస్వరార్థంబు చెప్పఁగూడదు. అవధారణంబె యర్థంబని మాతాత్పర్యము. "చక్కఁబెట్టువాఁడనే" అన్న వాక్యాంతమందలి ఏకారంబు కాకు స్వరార్థకముగాని "ఏను" శబ్దముగాదు. ''నన్నవారలంగొనియే చక్కఁబెట్టువాఁడ నా?'' అనువాక్యంబులోని యభిప్రాయము నిశ్చయముగా ద్రోణాదులనుగొని పాండ వులను సంహరించువాఁడను గానని యభిప్రాయము. "వాఁడను" అను నుత్తఁ మ పురుషైకవచనము చేతనే "ఏను" శబ్దార్థమాకాంక్షింపఁబడును. కావున బద్యంబు లో "నేను" శబ్దార్థంబనసరంబులేదు, చతుర్థపాదాదియందలి ఏకారంబునకు లోకప్రదిశంబైన

ఏవకారార్థంబే యనియు, వాక్యాంతమందున్న ఏకారంబనియు, నదికాకుస్వరార్థకమనియు, "ఏను" శబ్దంబుగాదనియు, నెఱుంగనగు. ఒకరు "క॥ కనవానలును గాండీవము॥ వవలనిఁదంబనుపుమం బెరదముడి నమే నునిసపడిగియొనళుభకర మవులిర్విననిమ్ము సేయుమనుఁడు నతండుస్,, భార-శల్య 2ఆ. అనుపద్య తృతీయపాదమందలి "ఏనువిపప,, అన్నచోటునఁ గళయును, బ్రకమంబును, అవుటచేత నే ప్రకారము వకారముగా మాఱినదని "ఏను,, అనుపదము కళయని వాదించువారై సాహసించుచుండిరి. కొందఱు "ఏను,, శబ్దంబు ద్రుతప్రకృతికమే కానఁ గళాకార్యంబు నొందదనియుఁ, భాగవతపద్యంబులో "ఏనువిపప,, అన్నపాఠమే యుండవలెననియు, "నబమోరశేగ,, అన్నశాస్త్రంబున యతిమైత్రియే కాకుండఁ బ్రాసమైత్రియుం జెల్లుననియు, నింకొక ద్వితీయమార్గమవలంబించుచున్నారు. మాతాత్పర్య మాయిద్దఱి యాశయంబులో నేకీభవింపదు. పైపద్యములో "ఏనువిదప,, అన్నచోటున "ఏనవిదప,, అనియె యుండవలెను. "ఏనవిదప,, అనఁగా "ఏనే,, అనియవధారణార్థకమైన యకారంబు అవ్యయంబుగావున "అప్పుడు, ఇప్పుడు" శబ్దంబులఁబోలెఁ బైపరుషంబులకు గసడదవాదేశంబు రాదు. కావున సర్వనామంబుల "తాను, నేను,, శబ్దంబులపైఁ గేవలద్రుతకార్యమే కాకుండఁ గళాకార్యముకూడ గ్రంథాదులయందుఁ గనిపించుచున్నదని భ్రమింపవలదు. మఱియు "ఏనుబిసపడిగియొన,, అనుపాఠంబునకు "ఏనువెనుకడిగియొద,, అను పాఠాంతరంబు కొన్ని వ్రాతప్రతులయందుఁ గానిపించెడిని.

## 24. సూ.—సమాసంబునయందు ద్రుతంబునకు లోపంబగు.

ఎల్లియర్థములు - ఎల్లికలుషములు సర్వపర్యాయంబయిన యెల్లశబ్దంబు ద్రుతాంతంబయిన యవ్యయంబు దీనికి సమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబులేదు.

వ్యా — సమాసంబునందు ద్రుతమునకు లోపము కలుగును. ఉదా. ఎల్లన్ + అర్థములు. ఇచ్చట సమాసంబు కావున ద్రుతములోపించి కళగా భావింపఁబడి యాదాగమంబుచే ఎల్లయర్థములు, అనురూపమయ్యెను. "ఎల్లన్ + కలుషములు, ఈకర్మధార

యసమాసమందు ద్రుతంబునకు లోపంబువచ్చి 'ఎల్ల' కలుగుచుండు, అయ్యెను ద్రుతలోపంబుచేఁ బరునాతని సూత్రంబుచేత, కకారమునకు గకారము రాలేదు. సర్వశబ్దము యొక్క పర్యాయపదమై (సమానార్థము నిచ్చునట్టిశబ్దము) న 'ఎల్ల' శబ్దము ద్రుతమంతమందుఁగల యవ్యయము. (సంగ్రహక్రియ భేదములేనిది) ఈ 'ఎల్ల' అనుదానికి నసమాసమున (సమాసముకానియప్పుడు) విశేష్యంబునకుఁ బూర్వమునఁ బ్రయోగము లేదు. అనఁగా 'ఎల్లన్ శిష్యులు' అని ద్రుతంబుతోఁ బ్రయోగింపఁ గూడదని భావము. కాని శ్రీనాథునిచే భీమఖండము (భీమేశ్వరపురాణము 2ఆ) నందు 'శా॥ ఏనో కంకనే భిక్షానకు న్వత్తునో యెల్లన్ శిష్యులఁ గొంచువత్తునో,' అని యసమాసమున విశేష్యమునకుముందు 'ఎల్ల' శబ్దము ద్రుతాంతముగాఁ బ్రయోగింపఁబడియె. ఇఁకను పై మూలసూత్రమునందు, 'సమాసంబున యందు' అను చిన్నయసూరిగారి ప్రయోగము తప్పనియు, సమాసమందని కాని, సమాసమునందని కాని యుండవలెననియుఁ, గొందఱు భ్రమపడుచుండిరి. కాని 'సమాసమునయందు' అనిహూడను రసువని కవిసంశయవిచ్ఛేదకారకుఁడు లోనగువారు చెప్పిరి. ఇట్టులకుఁ బ్రయోగంబులు తిక్కనవారియందకాక కవిత్రయమువారియందును చెక్కులుగలవు. 'చ ఉరమునయందుఁ గన్నులు బృగూదరదేశమునందు నోరుఁ బ్ర స్ఫురితభుజద్వయంబుగల, భార-ఆర. 6ఆ. 'చ అనుగాడనిందుఁ గ్రీడిట్లనియె నట్లయినంగడు లెస్సదేవనీ వనిమిష నాయకత్వమునయంద భిషిక్తుఁడవై ముదంబుతో, భార. ఆర. 6ఆ. 'క ముని! ప్రవరుని తనువునయందు! ద్భవమై నమృతము హారనము ఒప్పెన్,, భార. ఆర. 3ఆ. ''ను॥ ఒకరత్నంబు విదర్భదేశమునయందు మూర్తిమైపార్థివ ప్రకరంబు గ్రమియింపుమన్న,, నైష- 3 ఆ. ''క వినుపింపఁదానసమయంబునయందును భక్తిపూర్వముగ,, హరి. పూ. 2. ఆ. "క మనుజుఁడు కార్యంబొనర్పమానుగ దైవం। బునయందుఁ బౌరుషమునం,, మార్క. 3 ఆ. "ఆ. వె జీర్ణమగుచునుండు చెనఁటిదేహంబున। యందునీవు మమతఁ బొందవలదుశ" మార్క. 8ఆ. ''క॥ చనుదెంచినకార్యమేను సర్వంబుమనంబునయందుమున్న యెఱుఁగుదు" మార్క. 5ఆ. ''ఉ॥ డక్కగ ప్రాసితిన్మనుపటమ్మునయందుసుశర్మపాపముల్" పాండు.6 ఆ, ఇఁకఁ గాశీఖండమునందిట్టి ప్రయోగంబులు లెక్కకు మిక్కిలిగానున్నయ

వి. "సీ॥ సంతరించితినిందుజన్మవంబునయందుబాల్యనైషధ కావ్యమాంధ్ర భాష" "తే గీ అట్టిగోలోకమునయందు నధివసింతు" "సి అర్ధంబుకాశీపురాంగణంబునయందునానా ప్రకారగమైపీనుమిఁపలు" "తే.గీ। ఎన్నఁడును సేనలేనట్టియున్నహర్మ్య వాసమునయందుఁగా పున్న జంతువులకు" "సీ ఉడుపదంబునయందు నుండినగతిఁ దారగమనవేగంబునఁగా గానఁబడఁగ" "సీ కట్టురింగలవారు కటిభాగమునయందుఁ బసిఁడికమ్ములపట్టుపట్టుచేల" "సీ। వన్మగృహమునయందు నవరాంస శేఖరునగ్రేశవిద్యాపరియోగసరణి" "తే। గీ ఆప్రేతాయుగంబునయందొకండు" "సీ యదువంశమునయందు నవనిభారాపనోదార్థంబు దుష్టదైత్యావలేప".

25. సూ.—సమాసంబుల నుదంతంబులగుస్త్రీసమంబులకుంబుంపులకుం బరుషసరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు.

ఇచటంబరుషంబులు పరంబులగునపుడు ద్రుతంబునకు బిందుసంశ్లేషంబులచేమూఁడురూపంబులు సరళంబులు పరంబులగునపుడులోపసంశ్లేషపూర్ణబిందువులచేత మూఁడు రూపములు విధానసామర్థ్యము వలన దీనికిలోపములేదు వక్ష్యమాణవిధిచే స్వత్వములేదు.

| | | | |
|---|---|---|---|
| చిగురు | ... | కయిదువు ... | చిగురుంగయిదువు<br>చిగురుఁగయిదువు<br>చిగురున్గయిదువు |
| తళుకు | ... | ...గజ్జెలు ... ... | తళుకుంగజ్జెలు<br>తళుకునగ్జెలు<br>తళుకుంగజ్జెలు |
| సింగపు | ... | కోదమ ... | సింగపుంగోదమ<br>సింగపుఁగోదమ<br>సింగపున్గోదమ |

ఉన్నతంపు ...గొడుగు... ... { ఉన్నతంపుఁగొడుగు / ఉన్నతంపున్గొడుగు / ఉన్నతంపుంగొడుగు

నలుగడాదుల నీయాగమంబు లేదండ్రు - ఈయాగమంబు కొన్నిచో ట్ఠిరించు పరంబగుచోఁ గానంబడియెడి - గెలువవున్మరువు.

వ్యా.—సమాసములయందు ప్రాప్తోకారము (హ్రస్వ + ఉకారము) అంత మందుఁగల స్త్రీసమములకును, (లోకములో వాడునప్పుడు ప్రాతిపదికక్వైకవచనము లోపించిన శబ్దములు) పుంపులకును, పరుషములుకాని సరళములుకాని పరంబులగునప్పు డు నుగాగమంబువచ్చును (నకారాగమము చివరవచ్చును) అనఁగాఁ బరుషంబులుపరం బగునప్పుడు "అలుసున్న, నిండుసున్న, సంశ్లేషము" అను వానితో మూఁడు రూపము లును సరళములు పరంబగునపుడు "లోపము, సంశ్లేషము, నిండుసున్న" అనువాని తో మూఁడురూపంబులును గలుగును (మూలము) విధానసామర్థ్యముచేత నీద్రుతమునకు లోపములేదు. విధానసామర్థ్యము:- ఈ యిరువదియైదవ సూత్రముచేత నుగాగమమును విధించుటయనెడి బలముచేత. అనఁగా సమాసమందు వచ్చునట్టియీనుగాగమనకారంబు నకు "ఎల్లకలుషములు" ఇత్యాదులయందుంబలె నిరువదినాల్గవసూత్రంబుచేత లోపము వచ్చునేని యీనుగాగమవిధి "ప్రక్షాళనాద్ధి పంకస్య దూరాదస్పర్శనం వరం" (బురద తొక్కనేల కాళ్లుకడుగనేల) అనున్యాయంబున వ్యర్థంబగును. ఇరువదినాల్గవ సూత్రము చేవచ్చునట్టి ద్రుతలోపము సహజద్రుతప్రకృతికశబ్దంబులకే కాని శాస్త్రముచేసన "చిగురున్గయిదువు" ఇత్యాది ద్రుతాంతశబ్దములయందుఁ బ్రవర్తిల్లదు. (మూలము) వైకల్య మాగవిధిచేత (చెప్పఁబోయెడు నిరువదియాఱవ సూత్రముచేత) ప్రాప్తము (ను) లేదు. పదునాఱవ సూత్రముచేత "పూఁచెనుగలువలు". అట్లు "చిగురుగయిదువు" కాదని భావము. "చిగురు + కయిదువు" ఈసమాసమునందు ఉకారాంతంబైనందునఁ గల స్త్రీసమపదమునకుఁ బరుషాక్షరంబులగు కకారము మొదలైనవి పరంబగునప్పుడు నకా రంబువచ్చి "చిగురు + ను + కయిదువు" అగును. తరువాతఁ బదునాఱవ సూత్రంబున "చిగురుఁగయిదువు" అగును. తరువాతఁ బదునేడవసూత్రంబున ద్రుతసంశ్లేషంబులు

రాఁగా "చిగురుంగయిదువు, చిగురుఁగయిదువు, చిగురుగ్గైదువు" అనుమూఁడు రూపంబులు సిద్ధించును. పరసాక్షరములు పరంబగునపుడు పదునెనిమిది పంధొమ్మిదియవ సూత్రంబులచేత "ఉన్నతంపుగోదుగు" అనుచో నకారలోపముచేతను "ఉన్నతంపున్గోదుగు" అనుచో సంశ్లేషంబుచేతను, "ఉన్నతంపుంగోదుగు" అనుచోఁ బూర్ణబిందువుచేతను గలిగిన మూఁడురూపంబులును ప్రైవానివలె గ్రహింపవలెను. ,ఇట్లేమిగిలినవి, నలుఁగడలు మొదలైనవానియందు నీయాగమము (ఇరువదియైదవ సూత్రముచేత వచ్చునాగమము=సంశ్లేషరూపము)లేదందురు అనఁగా "నలుఁగడలు,నలుంగడలు" అనురూపములుండవచ్చునుగాని "నలున్గడలు" అనురూపంబుండఁగూడదని భావము. (మా—వ్యా) కాని యీయాగమము ఒకానొకచోట స్థిరాక్షరంబు పరంబగునపుడును గనంబడుచున్నది. ఉ. గలువపున్మొరువు.

26. సూ.—సమాసంబులందు ద్రుతంబునకు సత్వంబులేదు.

వ్యా.— సమాసములయందు ద్రుతమునకు స్వత్వములేదు. ఉదా. "చిగురుగ్గైదువు," ఇచ్చట "చిగురును గైదువు, ఇత్యాది నకారస్వత్వరూపం బుండదు.

27. సూ.—తలఁబ్రాలు మొదలగు సమాసంబుల ద్రుతమునకు లోపములేదు.

తలఁబ్రాలు - ఒడిఁబ్రాలు - సేసఁబ్రాలు - ఊరఁబంది - ఊరఁబిచ్చిక - తోడఁబుట్టువు - తోఁబుట్టువు - ఒల్లఁబోలు - ఒడఁబాటు - ఇత్యాదులు.

వ్యా.—తలఁబ్రాలు మొదలైన సమాసముల యందలి ద్రుతమునకు లోపము లేదు. అనఁగా "తలఁబ్రాలు" ఇత్యాదులయందు నిరువదినాల్గవసూత్రముచే ద్రుతలోపంబుగలిగి "తలప్రాలు" ఇత్యాదులుకానేరవు. "తలఁబ్రాలు" "తలంబ్రాలు" ఇత్యాదులుండవచ్చును.

28 సూ.— కర్మధారయంబులందుత్తునకచ్చుపరంబగునపుడు టుగాగమంబగు.

కఱుకు ... ... అమ్ము ... ... కఱుకుటమ్ము
నిగ్గు ... ... అద్దము ... నిగ్గుటద్దము
సరసపు ... ... అలుక ... ... సరసపుటలుక

వ్యా.—కర్మధారయ సమాసమునందు హ్రస్వోకారమునకు (హ్రస్వ + ఉకారము) నచ్చుపరంబగునపుడు 'టుక్' (ట్) అనునది వచ్చును ఉదా. 'కఱకు + అమ్ము' ఇచ్చట మొదటిపదముయొక్క కడపటనున్న ఉకారమునకు నచ్చు పరంబుకాఁగా 'ట్', వచ్చి 'కఱకుటమ్ము', (కఱకు + ట్ + అమ్ము) అయినది. ఇట్లే నిగ్గుటద్దము, సరసపుటలుక. మొ. సూరిగారు కర్మధారయ సమాసంబులకే చెప్పినారు కాని యీయాగమము ఉకారాంతవ్యతిరిక్తస్థలంబులయందును, అకర్మధారయసమాసములందుం గూడ నొకానొకప్పుడు గనుపట్టెడిని. ఉకారాంతవ్యతిరేక కర్మధారయందునకు- మిద్దెటిల్లు, పల్లెటూరు, దుక్కిటెద్దు, తేనెటీఁగ, పక్కటెముక మొ. కర్మధారయేతర సమాసంబునకు- వేల్పుటావు, మదపుటేనుఁగు. మొ.

29. సూ.—కర్మధారయంబునందుఁ బేరాదిశబ్దముల కచ్చుపరంబగునపుడు టుగాగమంబు విభాషనగు.

పేరు ... ... ఉరము ... { పేరుటురము / పేరురము }
చిగురు ... ... ఆకు ... ... { చిగురుటాకు / చిగురాకు }
పొదరు ... ... ఇల్లు ... { పొదరుటిల్లు / పొదరిల్లు }

వ్యా.—కర్మధారయమునందు 'పేరు' మొదలైనవానికి అచ్చుపరంబగునపుడు

టకారంబు (ట్) పదాంతమందు విభాషగా నగును. ఉదా. 'పేరు + ఉరము' ఇచ్చ ట 'పేరు' అనుదానికి 'ట్' అనునదివచ్చి 'పేరుటురము' (పేరు + ట్ + ఉరము) అని యైనది. విభాషగనుక టుగాగమము రానియపుడు 'పేరురము' అని యయ్యెను. ఇట్లే చిరుటాకు, పొదరుటిల్లు, మొదలైనవానికి రూపద్వయము.

30. సూ—పేదాదిశబ్దంబుల కాలుశబ్దము పరంబగునపుడు కర్మధారయమునందు రుగాగమంబగు.

పేద ... ... ఆలు ... ... పేదరాలు
బీద ... ... ఆలు ... ... బీదరాలు

పేద- బీద - ముద్ద - బాలెంత - కొమ - జవ - అయిదువ- మనుమ- గొడ్డు - ఇట్టివిపేదాదులు— ఇందుజవ్వనిశబ్దంబునకు జవాదేశం బని యెఱుంగునది - ఏకాంతమునందునున్న జవరాంద్రదనని ప్రయో గము.

వ్యా.—'పేద' మొదలైనశబ్దములకు 'ఆలు' శబ్దముపరంబగునపుడు కర్మధా రయంబునందు రుగాగమంబు (ర్) కలుగును. ఉదా. పేద + ఆలు. ఇచ్చట పేదశబ్ద మునకు 'ఆలు' శబ్దముపరమైనది గనుక 'ర్' అనునదివచ్చి 'పేదరాలు' (పేద + ర్ + ఆలు) అయినది. ఇట్లే బీదరాలు, ముద్దరాలు, బాలెంతరాలు, కొమరాలు, జవరాలు, అయిదువరాలు, మనుమరాలు, గొడ్డురాలు, మొదలైనవి. 'జవ్వని + ఆలు' ఇచ్చటనా లుశబ్దము పరంబగుటచే వృత్తియందు జవాదేశంబు 'జవ + ఆలు' ఇచ్చట రుగాగమం బువచ్చి 'జవరాలు' (జవ + ర్ + ఆలు) అయినది. 'ఉ. ఏ! కాంతమునందునున్న జవరాల్ద్రదనైపంబడి.' మను— 2ఆ. (మూలము.) ఇచ్చట వృత్తియందు ఆలుశబ్దము స్త్రీమాత్రపరము. వ్యా.—ఇచట సమాసవృత్తియందు 'ఆలు' శబ్దము 'స్త్రీ' అనిన యర్థముకలదిగాని 'భార్య' అనునర్థమియ్యదు.

31. సూ—కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరంబగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబు నగు.

ధీర ... ... ... ఆలు ... ... ... ధీరురాలు

గుణవంత ... ... ఆలు ... ... ... గుణవంతురాలు

ఇచ్చట వృత్తియందాలుశబ్దము స్త్రీమాత్రపరము.

వ్యా.—కర్మధారయమునందు దత్సమశబ్దములకు ఆలుశబ్దము పరంబగునపుడు మొదటిశబ్దముయొక్క తుది అకారంబునకు ఉకారమును, రుగాగమమును (ర్) వచ్చును. ఉదా. 'ధీరురాలు.' ఇచ్చట 'ధీరా' అని దీర్ఘాంతము సంస్కృతంబులో స్త్రీలింగము. తత్సమపరిచ్ఛేదములోని యేబదినాల్గవసూత్రంబున హ్రస్వంబురాఁగా 'ధీర + ఆలు,' అగును. ఇచ్చట ఆలుశబ్దము పరంబగుచుండఁగాఁ దుదిఅకారంబునకు ఉకారంబును, రేఫాగమంబును, రాఁగా 'ధీరురాలు' (ధీరు + ర్ + ఆలు) అయినది. 'గుణవంతురాలు' ఇచ్చట మొదటిశబ్దము సంస్కృతభాషలో 'గుణవంతమ్' అనునది ద్వితీయైకవచనాంతము. తెలుఁగుభాషలో నీద్వితీయైక వచనాంతమే నామవాచకముగాఁ దత్సమపరిచ్ఛేదములోని డెబ్బదివసూత్రముచేత గ్రహింపఁబడి డెబ్బదియొక్కవ సూత్రముచేఁ దుదిమకారంబునకు లోపంబు రాఁగా 'గుణవంత + ఆలు' అగును. ఇప్పుడు ప్రకృతసూత్రముచేత ఉకారాదేశంబును, రేఫంబును, రాఁగా 'గుణవంతురాలు' (గుణవంతు + ర్ + ఆలు) అగును.

32. సూ—కర్మధారయంబులందు మువర్ణకంబున కుంబుంపులగు.

సరసము ... ... మాట ... ... { సరసపుమాట<br>సరసంపుమాట

విరసము ... ... వచనము ... ... { విరసపువచనము<br>విరసంపువచనము

వ్యా.—కర్మధారయమునందలి మువర్ణకమునకు, పువర్ణమును, ంపువర్ణమును, వచ్చును. ఉదా. 'సరసము + మాట.' ఇచ్చటి మొదటిశబ్దముయొక్క కడపటి మువర్ణకమునకు, పువర్ణమునచ్చి 'సరసపుమాట' అనియు, ఆమువర్ణకమునకు దాపట నున్నతోఁ గూడిన పువర్ణమునచ్చి 'సరసంపుమాట' అనియుఁ, గలుగునని భావము. ఇట్లె విరసపు వచనము లౌ.

33. సూ—ఉదంతమగు తద్ధర్మార్థకవిశేషమున కచ్చుపరమగునపుడు నుగాగమంబగు.

చేయు ... ... ... అతఁడు ... ... ... చేయునతఁడు
చేసెడు ... ... ... అతఁడు ... ... ... చేసెడునతఁడు

వ్యా.—ఉకారమంతమందుఁ గల తద్ధర్మార్థకవిశేషణమునకు అచ్చు పరంబగునపుడు నుగాగమంబు (న్) కలుగును. ఉదా. 'చేయు + అతఁడు.' ఇచ్చట 'చేయు' అనునదితద్ధర్మార్థకవిశేషణము. దీనికి అచ్చుపరము కాఁగా నుగాగమమువచ్చి 'చేయునతఁడు' (చేయు + న్ + అతఁడు) ఆయెను. ఇట్లే చేసెడునతఁడు 'సీ అమరులకడవినోదము చూపుసమయ మాంత్రికునోరవెడలగ్ని దీప్తులనఁగ' హంస-౨ఆ. (వెడలు + అగ్ని) ఇట్టి నుగాగమంబులేని ప్రయోగంబులును గొన్నియెడలఁ గానంబడియెడి. కానియగ్రాహ్యములు.

34. సూ—షష్ఠీసమాసమునందుకార ఋకారంబులకచ్చుపరమగునపుడు నుగాగమంబగు.

రాజుయొక్క ... ... ఆజ్ఞ ... ... రాజునాజ్ఞ
విధాతృయొక్క ... ... ఆనతి ... ... విధాతృనానతి

వ్యా—షష్ఠీసమాసమునందు ఉకారమునకును, ఋకారమునకును, అచ్చుపరంబగునపుడు నుగాగమంబు గల్గును,

అట్టి గ్రామ్యంబులే మహాకవులు ప్రయోగించినంతమాత్రన గ్రాహ్యంబైనప్పుడు సుశబ్దంబై తత్సమంబైన రాజుశబ్దంబచ్చ తెనుంగులోఁ బ్రయోగింపఁబడినంతమాత్రన నేల గ్రాహ్యంబుగాదు? కవులచ్చతెనుఁగు గ్రంథంబులని చెప్పు నన్యదేశ్యపదంబులను వేనవేలు ప్రయోగించుచున్నారు. మహాకవులు నియమంబుసప్పి యన్యదేశ్యపదంబులనచ్చ తెనుంగులోనికి నాహ్వానము చేసి గౌరవించినట్టే యీ బాలగోపాలము ప్రసిద్ధంబైన తత్సమరాజుశబ్దంబును బొత్తంబులలోఁ బొత్తుపఱిచిరని తోఁచుచున్నది. కావున నేతిమ్మకవిగారు తత్సమశబ్దప్రకరణంబులో "సీ॥ ద్విప్పదంబునకు విద్విషుఁడనం జెల్లు భూభృత్పదంబునకు భూభృత్తులయ్యె। రాట్పదంబునకును రాట్టనునట్టియును రాజపదంబొప్పరాజనంగ॥ సర్వ॥'—అనుపద్యంబున రాజుశబ్దంబు నుదాహరించిరి. వైకృతంబుగూడనున్నదని వారికిఁదోఁచినయెడల నీశబ్దంబు వైకృతమన్న సంశయంబొండు గలదని, యేల చెప్పకుందురు? విశేషపరిశోధకులైన సీతారామాచార్యులవారును దమనిఘంటువునందు రాజుశబ్దము నిరూపించునపుడు, దీనిఁ గొందఱు వైకృతంబుగా వాడియున్నారనియు, నయ్యది చింత్యమైనయంశంబనియుఁ జెప్పిరి. వారు రచించిన ప్రౌఢవ్యాకరణంబునందుఁ గూడ రాజుశబ్దంబు వైకృతత్వంబును గూర్చి కొందఱమతమనియే వ్రాసిరి కాని సర్వకవిసమయసిద్ధంబని నిశ్చయింపరైరి. తాలవ్యజకారంబుతో నుండుట విధియని యంగీకరించి రాజుశబ్దంబును బహుశ్రమాపాదకప్రతిసముఖీభావముతోఁ బరిహాసాస్పదమైనవిసపోచ్చారణ సేయుటకంటె నచ్చతెనుంగులో నీశబ్దంబును సకలజనప్రసిద్ధంబగుటం జేసి మహాకవులు నన్యదేశ్యాదులతోఁ బాటుగఁ బ్రయోగించిరియని సంతృప్తిఁజెందుచు నీశబ్దంబు దంత్యజకారఘటితమైన తత్సమంబేయని యేకవిధంబుగా నంగీకరించుట మేలని మదాశయము.

79 సూ—జగదింద్రజిత్తులతకారంబునకులోపంబు విభాషనగు.

జగము - జగత్తు - ఇంద్రజి - ఇంద్రజిత్తు - ఋత్విగాదియగుటం జేసియింద్రజితుండనియు వాడంబడు.

వ్యా—'జగత్', అనుశబ్దంబుయొక్కయు, 'ఇంద్రజిత్', అనుశబ్దంబుయొక్కయు, తకారంబునకు లోపము వైకల్పికంబుగానగును. 'జగత్" అనుశబ్దంబులోని త

కారము ప్రకృతిసూత్రంబున లోపింపఁగా నపుంసకంబు గావున ముప్పదితొమ్మిదవ సూత్రంబున మువర్ణకంబు వచ్చి 'జగము" అనియైనది. వైకల్పికంబగుటచే లోపము రానియపుడు అరువదియేడవసూత్రంబుచే "జగత్" అను తకారాంతంబై ప్రాతిపదికంబై యిరువదితొమ్మిదవసూత్రంబుచే నుగాగమద్విత్వంబులుగల్గి "జగత్తు" అనియైనది. 'ఇంద్రజిత్' అనునపుడు ప్రకృతిసూత్రంబుచే, తకారములోపింపఁగా "ఇంద్రజి" అని యొకరూపంబును, తకారలోపము లేనియపుడు అరువదితొమ్మిదవసూత్రంబుచే నుగాగమద్విత్వంబులు గల్గి "ఇంద్రజిత్తు" అను మఱియొకరూపంబును, డెబ్బదిమూఁడవసూత్రంబుంబట్టి ఋత్విగాదులతోఁ జేరినదగుటచేఁ బ్రాతిపదికము ద్వితీయైకవచనాంతతుల్యంబుగావున "ఇంద్రజితమ్" అనికాఁగా డెబ్బదియొకండవసూత్రంబుచే నంత్యమకారము లోపించి యిరువదియొకటి యిరువదిరెండవ సూత్రంబులచే నుత్వడుమ్వర్ణకంబులు రాఁగా "ఇంద్రజితుఁడు" అను రూపాంతరంబును నయ్యెను. "నాకొమరుఁ డింద్రజిత్తుఁడు । లేకుండుట చేటువాటిలెక" అధ్య-రా- యుద్ధకాం. ఆ॥ వె॥ ఇంద్రజిత్తుఁడప్పుడినకులోద్వహునిచే ! మూర్ఛనొంది తేఱి మూర్ఛగతిని' మొల్ల-యుద్ధ- ఆ॥ వె॥ చాఱుఁదుననంచి సౌమిత్రిచే నింద్రి । జిత్తుఁడీల్గెననుమఁ జెప్పుటయును" మొల్ల-యుద్ధ-2 ఆ. పైప్రయోగంబులు, ఉగాగమద్విత్వంబులపై డుమ్వర్ణకంబుతోఁ బ్రయోగింపఁబడెశాస్త్రీయసాధుత్వంబునకు సంశయాస్పదంబుగ నున్నవి. పైమూఁడవ ప్రయోగంబు "ఇంద్రి । జితుఁడీల్గెననుమఁ జెప్పుటయును" అని సవరించినసలక్షణంబుగనుండును. ఆంధ్రకౌముదియందు మాత్రము 'ఇంద్రిజిత్తుఁడు' అను ప్రయోగము సాధీయముగాఁ జెప్పఁబడినది. ఇంద్రజి, ఇంద్రజిత్తు" శబ్దంబులకు నింద్రజిత్తుండనుపదంబు రూపాంతరంబేకాన దీనియర్థము-ఇంద్రుని జయించువాఁడు. మఱియు నీశబ్దంబు-ఇంద్రునిచేత జయింపఁబడినవాఁడనియు, నర్థమిచ్చును. కావున "ఇంద్రజితుండు" అను శబ్దంబునకు-ఇంద్రుని జయించిన రావణజ్యేష్ఠపుత్రుఁడును, ఇంద్రునిచేజయింపఁబడినవాఁడును ననియు, నర్థమై శ్లేషయందును, ! ప్రయోగింపఁదగెఁ జమత్కృతిగానుండును.

80 సూ—సాంతంబులతుదిసకారంబునకు లోపంబు బహుళంబు గానగు.

ఉరము - ఉరస్సు - వక్షము - వక్షస్సు — అర్చి-అర్చిస్సు -ధనువు - ధనుస్సు - ఆయువు - ఆయుస్సు ॥ బహుళగ్రహణంబునం జేసి పయఃప్రభృతుల సకారంబునకు లోపంబులేదు ॥ పయస్సు -వయస్సు- సరస్సు.

వ్యా—సకారాంతంబులయందుఁ గలపదముల కడపటిసకారంబునకు లోపంబుబహుళంబుగానగును. ‘ఉరస్’ అనుశబ్దము సకారాంతపదము. దీనియందలి యంత్యాక్షరంబైన సకారము ప్రకృతసూత్రంబున లోపింప నదంతనపుంసకలింగమవుటచే ముప్పదితొమ్మిదవసూత్రంబున ముప్రత్యయంబు రాఁగా ‘ఉరము’ అనిరూపమైనది సవర్ణములోపింపనియప్పుడు అలుపదియేనిమిదవసూత్రంబు చొప్పుననుగాగమద్విత్వంబులతో ‘ఉరస్సు’ అనిరూపమైనది. ‘వక్షము’ అనుశబ్దంబు పైదానివలెనే యెఱుంగునది. ‘అర్చిస్’ అనుశబ్దంబునందలి కడపటి యక్షరంబైన సకారంబు ప్రకృతసూత్రంబున లోపింపఁగా‚అర్చి‚ అని రూపమైనది. మఱియు నలువదినాల్గవసూత్రంబుచేఁ బ్రథమైకవచనంబునకు లోపంబు గలిగినదని యెఱుంగునది. సవర్ణలోపము కలుగనియప్పుడు అలువదియేనిమిదవసూత్రంబుచే నుగాగమద్విత్వంబులచే ‘అర్చిస్సు’ అయినది ‘ధనుస్’ అనునపుడు కడపటియక్షరంబగు సకారంబు ప్రకృతసూత్రంబున లోపించి నలువదియేనిమిదవసూత్రంబుచే వువర్ణకంబువచ్చి ‘ధనువు’ అనియు, సవర్ణములోపింపనియప్పుడు అలువదియేనిమిదవసూత్రంబుచే నుగాగమద్విత్వంబులుగలిగి ‘ధనుస్సు’ అయినది. ఇట్లే ‘ఆయువు’ మొదలగు శబ్దంబులు గ్రహింపనగు. బహుళమని చెప్పుటచేత ‘పయః’ మొదలైన వానియొక్క సకారంబునకు లోపంబుకలుగదు. అనఁగాఁ గడపటివర్ణమైన సకారంబునకు లోపంబు కలుగక ‘పయస్సు’ అనియేకాని ‘పయము’ అనియుండదు. అధునికులు ‘డాకంబు పయము’ అని ప్రయోగించెదరు, ఇయ్యది కావ్యంబులమృగ్యంబు. ‘వయస్’ అనుశబ్దము పక్షికర్థమైనపుడు ‘వయస్సు’ అనియు, ప్రాయమున కర్థమైనపుడు వయస్సు, వయసు, అను రెండురూపంబులుగలవు. కాని ‘వయస్సు’ అనునపుడు పక్షిపర్యాయముగాఁ దెలుఁగునఁ బ్రయోగంబు మృగ్యంబు. ‘ఓజస్సు’ అనస్సు, అంభస్సు, వర్చస్సు, రక్షస్సు, పాథస్సు, సరస్సు, ఆయుస్సు, హవిస్సు, చేతస్సు, మహస్సు, అంహస్సు, ఆగస్సు, ఇత్యాది శబ్దంబులకు ముప్రత్యయంబు రాదు. తుదిసలోపంబు బహుళంబుగ నగు ‘పథిన్’ శబ్దంబునకు ‘పథము’, ‘పుంస్’ అనుశబ్దంబునకు ‘పుంసము’, ఇవ్వియవి. ప్రథమైకవచనాంతంబు

…గును. 'సరము' అనుటకు- సీ॥ తే॥ గీ॥ ఘటితకిసలయసమజటాపటలరిటల। ఫలకతిలకితశశిసితభసితలసిత। రసితపరమసమాధిసాద్విపరరుచిర। రసఘురభరంబు వొల్చుమానససరంబు॥ ఘటికాచలమాహాత్మ్యము- 1ఆ, అను సీసపద్యముయొక్క ముఖస్థమగు సీసమందలి ప్రతిపాదాంత్యమందును గ్రసుముగా, పరిసరంబు, కలధురంబు, మౌక్తికసరపరంబు, రోలంబపరికరంబు, అను సంత్యనియమముతో 'మానససరంబు' చేర్పఁబడి ప్రయోగింపఁబడినది. ఈప్రయోగంబునకు సహాయమైన ప్రయోగాంతరంబుగాఁ నిపింపదు.

81 సూ—మహద్వాచకంబులగుసాంతంబులకంతలోపంబేనిద్వితీయైకవచనాంతతుల్యత్వంబేనగు.

అంగిరుఁడు - అంగిరసుఁడు - ఉగ్రశ్రవుఁడు - ఉగ్రశ్రవసుఁడు- ప్రచేతుఁడు - ప్రచేతసుఁడు - ఊర్ధ్వరేతుఁడు - ఊర్ధ్వరేతసుఁడు.

వ్యా.—మహత్తును జెప్పునట్టి సకారాంతపదంబులకుఁ గడపటియక్షరములోపించుటగాని ద్వితీయైకవచనసమత్వముగాని కలుగును. ఉ. అంగిరుఁడు - అంగిరసుఁడు. ఇచ్చట 'అంగిరస్' అనియుండఁగాఁ గడపటియక్షరంబగు సకారంబు ప్రకృతసూత్రంబున లోపించి యిరువదియొకటి యిరువదిరెండు సూత్రంబులచే నుత్వదువర్ణకంబులు రాఁగా 'అంగిరుఁడు' అయినది. పక్షంబున 'అంగిరసమ్' అను ద్వితీయైకవచనాంతంబే తెలుఁగునఁ బ్రాతిపదికంబై- డెబ్బదియొకటవసూత్రంబువే మకారంబు లోపించి యిరువదియొకటి యిరువదిరెండు సూత్రంబులచే నుత్వదువర్ణకంబులతో 'అంగిరసుఁడు' అయినది. ఇట్లే 'ఉగ్రశ్రవుఁడు, ప్రచేతుఁడు, ఊర్ధ్వరేతుఁడు' మొదలైనవారికి రూపద్వయంబు గ్రహింపవలెను తే। గీ। ఉక్తసూత్రమునిష్ఠితుఁడూర్ధ్వరేతుఁ। డైనకణ్వమహాముని యనఘుచరితుఁ! డట్టిముని కెట్లుగూఁతురవైతిదీని। నాకు నెఱుఁగంగఁ జెప్పుము నలిననేత్ర। భార- ఆది- 4ఆ. క॥ సుతు లనఘులు వేవురునవ యుతులయి యుపయించి సాంఖ్యయోగాభ్యాసోన్నతిఁజేసి ముక్తులయి భూరితేజులంపు బుధు నూర్ధ్వరేతసులైనన్, భార-ఆది- 3 ఆ.

82 సూ—వేధపురోధపురోధసుఁడు.

వేధశ్శబ్దమునకు నిత్యంబుగాఁ బురోధశ్శబ్దమునకు వైకల్పికముగా సలోపస్త్రీవద్భావంబులు దీనిచేనిపతింపంబడియె.

వ్యా—వేధ - పురోధ - పురోధసుఁడు. అనఁగా తైయెనుబదియొకండవ సూత్రంబుచేత నవి సాంతంబులగుటచే వేధుఁడు - వేధసుఁడు - పురోధుఁడు–ఇట్లు నిష్టరూపంబులగుచుండ ‘వేధ’శ్శబ్దంబునకు సకారలోపంబును; స్త్రీత్వాదిదేశంబును, నిత్యంబుగాను; ‘పురోధ’ శ్శబ్దంబునకు సకారలోపంబును, స్త్రీత్వాతిదేశంబును, దీనిసూత్రంబుచేత వైకల్పికముగాను; నిపతింపఁబడినవి, (నిపాతమనఁగా—శబ్దముయొక్క రీతిప్రయోగము సామాన్యసూత్రముచేతఁ గలుఁగుచుండఁగా దానికి విరుద్ధముగాఁ బలికిన, రూపము.) ‘వేధ’, ఇచ్చట సకారములోపించి స్త్రీత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచనలోపంబుగలిగినది. ‘పురోధ’– పురోధసుఁడు, ఇచ్చట సకారములోపించి స్త్రీత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచనలోపంబుకలిగి ‘పురోధ’, అయినది పక్షంబున ‘పురోధసమ్’, అను ద్వితీయాంతము ప్రాతిపదికంబై డెబ్బదియొకండవసూత్రంబుచే నంతిమమకారలోపంబును, ఇరువదియొకటియిరువదిరెండుసూత్రంబులచే నుత్వడుప్రత్యయాదేశకంబులు గలిగి ‘పురోధసుఁడు’ అయినది.

83 సూ—మనఃప్రభృతులసకారంబునకుద్విత్వంబువిభాషనగు.

మనసు - మనస్సు - శిరము - శిరస్సు - సదసు - సదస్సు - సలోపంబయ్యెనేని - మనము - శిరము - సదము.

వ్యా—‘మనస్’ మొదలైనశబ్దములయొక్క సకారంబునకు ద్విత్వంబు విభాషగానగును. ఉ. మనసు- మనస్సు. ఇచ్చట "మనస్" అనియుండఁగా నలువదియొనిమిదవసూత్రంబుచే నుగాగమద్విత్వంబులు రాఁగా ‘మనస్సు’, అయినది. పిమ్మట నీసూత్రంబునందు ద్విత్వంబు విభాషగావున నేకసకారంబుకో నుగాగమాంతరూపంబును నుండు. ఉ. మనసు– మనస్సు ఇట్లే ‘శిరసు. సదసు, ఉరసు- వక్షసు- యశసు -

తపసు - తమసు - తేజసు - మొదలైనవి గ్రహింపవలయును. వీనియంత్యసకారంబునకు నెనుబదియవసూత్రంబుచే లోపంబుగలిగి యదంతనపుంసకలింగంబుగావున ముప్పదితొమ్మిదవసూత్రంబుచే ముకారకంబు రాఁగా మనము, శిరము, సదము, ఉరము- వక్షము- యశము- తపము- తమము- తేజము, మొదలైనవి యయ్యెను.

84 సూ—ద్యుహృచ్ఛబ్దంబులకుదివిహృదియగు.

దివి - దివులు - హృది - హృదులు॥

వ్యా—(దివ్, అను వకారాంతశబ్దంబునకు (దివి అనియు, హృద్, అను దకారాంతశబ్దంబునకు "హృది" అనియుఁ ప్రథమావిభక్తి యగును. ఉ. దివి-దివులు హృది-హృదులు.

85 సూ—స్త్రీలింగంబులెల్లస్వస్వనియతంబులగుస్త్రీప్రత్యయంబులంగూడియిందుఁబ్రవర్తిల్లు.

| | | |
|---|---|---|
| నామము... | ...స్త్రీప్రత్యయాంతము... | తత్సమము. |
| కర్తృ... | ... కర్త్రీ ... | ... కర్త్రి |
| జనయితృ... | ...జనయిత్రీ ... | ...జనయిత్రి |
| భాగ్యశాలిన్ | ...భాగ్యశాలినీ... | ...భాగ్యశాలిని |
| బుద్ధిశాలిన్ | ...బుద్ధిశాలినీ ... | ...బుద్ధిశాలిని |
| మతిమత్... | ...మతిమతీ ... | ...మతిమతి |
| గుణవత్... | ...గుణవతీ ... | ...గుణవతి |
| విద్వత్... | ...విదుషీ ... | ...విదుషి |
| వనజముఖ ... | వజనముఖీ ... | ...వనజముఖి |
| | వనజముఖా... | ...వనజముఖ |
| మీననేత్ర... | ...మీననేత్రా ... | ...మీననేత్ర |

అంగాదులకుఁదప్ప సంయోగోపధంబులకు ఙీప్రత్యయంబులేమింజేసి - మీననేత్రి - పద్మనేత్రి - ఇత్యాదులసాధువులు.

వ్యా—సంస్కృతభాషలో స్త్రీత్వము బోధింపఁబడినపుడు స్త్రీప్రత్యయంబు లేచేవి సంస్కృతవ్యాకరణంబునఁ గలుగునో యట్టిప్రత్యయాంతంబులే యీ భాషయందుఁ బ్రాతిపదికంబులగును. ఉ. కర్త్రి, జనయిత్రి, బుద్ధిశాలిని, గుణవతి, మీననేత్ర- మొదలైనవి. (కర్త్రి, జనయిత్రి, ఈశబ్దంబులకు సంస్కృతభాషలో కర్తృ జనయితృ, శబ్దంబులు మహద్వాచకంబులైనపుడు ఋకారాంతంబులుగా నుండును. సాంస్కృతికంబులైన ఋకారాంతశబ్దంబులు స్త్రీలింగంబులో నీకారాంతంబులై "కర్త్రీ-జనయిత్రీ" అని దీర్ఘాంతంబులగును. పిమ్మట నేఁబదినాల్గవసూత్రంబుచే హ్రస్వాంతంబులగు. (భాగ్యశాలిన్- బుద్ధిశాలిన్" ఇత్యాదిసాంస్కృతికనకారాంత పుంలింగంబులు సంస్కృతభాషలో నీకారాంతంబులై తెలుఁగున హ్రస్వాంతంబులై "భాగ్యశాలిని, బుద్ధిశాలిని" ఇట్లుండును. (మతిమత్, గుణవత్ ఇత్యాదితకారాంత సాంస్కృతికపుంలింగంబులు స్త్రీత్వంబున నీకారాంతంబులై తెలుఁగున హ్రస్వాంతంబులగును. ఉ. మతిమతి-గుణవతి. సంస్కృతభాషలో ఋకారాంత నకారాంత తకారాంతశబ్దంబులు సామాన్యంబుగా నీకారాంతంబులగు. తెలుఁగులో నట్టిదీర్ఘంబునకు, హ్రస్వంబు కలుగును. ధాతృ-ధాత్రి. దుష్టశాసితృ-దుష్టశాసిత్రి నేతృ-నేత్రి గుణిన్ - గుణిని. ధనిన్ - ధనిని. కాశీవాసిన్ - కాశీవాసిని. ధీమత్-ధీమతి మహత్ - మహతి. సౌందర్యవత్ - సౌందర్యవతి. (మూలము) అంగాదులకుఁ దప్ప సంయోగోపధంబులకు ఙీప్రత్యయంబులేమింజేసి, మీననేత్రి, పద్మనేత్రి, ఇత్యాదు లసాధువులు. (వ్యా) అఙ్గమొదలైనశబ్దంబులకుఁ దక్క హల్సముదాయం బుపధాస్థాన మందుఁగల తక్కినశబ్దంబులకు ఙీప్రత్యయము (స్త్రీలింగబోధకమైన ఈకారము) లేకపోవుటచేత (మీననేత్రి – పద్మనేత్రి, మొదలైనశబ్దంబులు దుష్టములు. ఉపధయనఁగా:—శబ్దంబుతుదినుండి లెక్కించినచో రెండవదియైనయక్షరము. కాఁబట్టి ప్రకృతంబున శబ్దముయొక్క యక్షరంబుల నంతంబునుండి లెక్కిం మతటిని సంయోగము (హల్లులకమి) రెండవస్థానమం దుండవలయును. మీననేత్రి, అనుశబ్దంబులో దువవర్ణంబకాదు. పూర్వవర్ణంబు తకారరేఫంబులు.

ఆవర్ణంబులకే సంయోగమని పేరు. ఈశబ్దంబులలో సంయోగముపరమైనందున నీకారాంతం బుకాలేదు. ఇట్లే పద్మనేత్ర మొదలైనవి. (మీననేత్రి, ఇత్యాదులు, 'మత్స్యములవంటి నేత్రములుగలది, అనునర్థంబున సాధువులైనను (మీనంబులకు నాయకురాలు, అనునర్థంబున సాధువేయగును. మీనంబులకు నాయకురాలనఁగాఁ దననేత్రంబులు మీనంబులనుమించి యున్నవిగావునఁ దన్నయనంబులద్వారంబున మీనంబుల నేలుచున్నదని నేత్రంబులకు నుత్కర్ష ముల భించును. మీనంబులు కన్నులకుసమానములగుట జగద్విదితంబుగావున నయనార్థకశబ్దంబులేకపోయినను, ఉపమానవాచకమీనశబ్దంబుచేతనే నేత్రంబులూహింపఁబడు. ఇట్టియర్థము సౌందర్యవర్ణనాప్రకరణంబునందుఁ బైశబ్దంబులు ప్రయోగింపనప్పుడు స్ఫురింపననియోజింపవలెను. (నాసిక - ఉదర-ఓష్ఠ - జఙ్ఘ - దన్త - కర్ణ - శృఙ్గ- అఙ్గ - గాత్ర- కణ్ఠ, ఈశబ్దంబు లీకారాంతస్త్రీలింగంబులుగను, ఆకారాంతస్త్రీలింగంబులుగాను నుండును; గానఁ దెలుఁగులో హ్రస్వంబుగలిగి ఇకారాంతంబులుగాను అకారాంతంబులుగాను నుండును. ఉ. చంపకనాసికి-చంపకనాసిక. కలకణ్ఠి కలకణ్ఠ. పల్లవోష్ఠి-పల్లవోష్ఠ. మొదలైనవి. ఇట్లు రెండువిధంబుల స్త్రీబోధకములైనప్పుడు వాడవచ్చును. మిగిలిన బహ్వచ్-శబ్దంబులకు (రెంటికన్న నెక్కువచ్చులుగలశబ్దంబులకు) స్త్రీత్వబోధకమగు జీప్రత్యయంబు రాదు. ఉ. (పద్మలోచన-కుటిలకుంతల-పల్లవాధర' మొదలైనవీనిని, పద్మలోచని, కుటిలకుంతలి, పల్లవాధరి, ఇత్యాదికమికారాంతబుగా వాడవలదు. పెక్కురు తెలియక 'నేత్రి' అనియే ప్రయోగించుచుండిరి. గీ॥ శరణు జగదంబ లలితవాచాకదంబ | చంపకము సంపదపన ప్రార్థించుచువదన | సత్ప్రణామంబు మృగనేత్రి చారుగాత్రి | దండములినేశి నీకుఁ బద్మజునిరాణి మత్స్య. ౪అ. తే॥ గీ॥ పద్మదళనేత్రి ప్రౌఢభూపాలపుత్రి | చిక్కవిరుపాక్షి మగుని రాచిల్క తేజి చాటుధార. ఇచ్చోనంత్యప్రాసనియమము. ఈప్రయోగమునకు నాధునికుల గ్రంథములయందు లెక్కయేలేదు. మఱియు దంతశబ్దంబునకు మత్వర్థమందు 'సు' వర్ణంబు పూర్వమందున్నచో 'దతి' గా మాఱును. ఇది తెలియక పెక్కురు 'సుదతి' అనుటను 'సుదంతి' అని ప్రయోగించిరి. సీ॥ 'దాడిమీఫలమియ్యెడను నేల కొనియెదన్ను దాడిమీఫలము సుదంతికిమ్ము' అప్ప-2ఆ. (ఇచ్చో (దాడిమీఫలము సుదతికిమ్ము' అన్నదిసరిగా నుండును) క॥ (తానూరక యరిగి యాసుదంతినిఁజేరెన్' అప్ప-3ఆ. (ఇచ్చో (తానూరక యరిగి యా సుదతినిఁజేరెన్' అన్నసరిపోవును) మ॥ ఎవరోఁగూడి దినపో సుదంతికిఁ గొలంతి శాంతి

యొప్పంచుఁజె | పృథుపే' పాంచా-5ఆ. ఇచ్చో 'యోగ్యమైనదంతంబులుగలది' అన్నయర్థంబునందు 'సుదతి' అనిసవరించుటకు వలనుపడదు; కాని స్త్రీలకు గజయాన లన్నప్రసిద్ధపుకలదుగావున నడకచే నేనుంగువంటిదని యర్థము చెప్పుకొనుచుఁ శైశబ్దంబులున్న రీతినుంచి కవిప్రయోగమునందు గౌరవముంపవచ్చును.

86 సూ—మహతీతరంబులగు స్త్రీలింగంబులవిశేషణంబులకుఁ గ్లీబత్వంబు విభాషనగు.

పద్మలతమనోహారి - పద్మలతమనోహారిణి - హృద్యంబగువిద్య - హృద్యయగువిద్య॥ మొదవులలోఁగపిల వరిష్ఠంబు - కపిలవరిష్ఠ

వ్యా.—మహతులుకాని స్త్రీలింగంబుల విశేషణంబులకు నపుంసకలింగధర్మంబు విభాషగానగును. అనఁగాఁ దిర్యగ్జడబోధకములైన స్త్రీలింగంబులవిశేషణంబులు స్త్రీలింగముగాను, నపుంసకలింగంబుగాను, నుండును. ఉ. పద్మలతమనోహారి — పద్మలత మనోహారిణి. ఇచ్చట 'లత' అనునది జడంబుగావున 'మనోహారి' అనినపుంసకలింగముగాను, 'మనోహారిణి' అని స్త్రీలింగంబుగాను, విశేషణంబుచెప్పనచ్చును. 'మనోహారిన్' శబ్దము సంస్కృతంబులో నాంతంబుగనుక నెనుబదియైదవసూత్రప్రకారంబున స్త్రీలింగరూపము 'మనోహారిణి', అనవలయును. ఇట్లే 'హృద్యంబగువిద్య-హృద్యయగువిద్య' మొదవులలోఁగపిలవరిష్ఠంబు, మొదవులలోఁగపిలవరిష్ఠ, మొదలైనవి గ్రహింపవలెను.

87 సూ—భవచ్ఛ్రుతాదులకిందుఁబ్రయోగంబులేదు.

భవదాదులగు హలంతసర్వనామంబులకును శత్రు రేఫాంతాదులకును దెనుఁగుభాషయందువ్యవహారంబు లేదనియర్థము - సమాసంబులం దొలుతంగడిసి యిందుఁ బ్రయుక్తంబులగు॥ భవద్గుణంబులు - త్వదాశయము - మత్పుణ్యము - లస్మద్రూపము - భవిష్యత్కాలము- ధూర్వహము -ఇత్యాదులెఱుంగునది.

వ్యా—భవత్ మొదలైనశబ్దంబులును, శతృప్రత్యయాంతరూపంబులును, రేఫాంతంబులును, దెనుంగుభాషయందుఁ బ్రయోగింపఁగూడదు. అనఁగా భవత్-త్వత్-మత్, మొదలైనశబ్దంబులును, లసత్-భాస్వత్, మొదలైనశతృప్రత్యయాంతంబులును, ఘూర్-గీర్, మొదలైన రేఫాంతశబ్దంబులును, దెనుఁగుభాషయందుఁ బ్రయోగింపఁదగవుకాని సమాసాంతంబులయందుఁ గాక తక్కినసమాసాదిమధ్యభాగంబులయందుఁ బ్రయోగింపవచ్చును. ఉ. భవద్గుణంబులు - త్వదాశ్రయము - మత్స్వామ్యము, ఇత్యాది సమాసస్థలంబులయందు భవత్ - త్వత్ - మత్. మొదలైనశబ్దంబులు సమాసాంతర్భాగంబుగాఁ బ్రయోగింపఁ బడ్డవి. సమాసాంతంబునందును, వ్యస్తంబునందును వీనికిఁ బ్రయోగములేదు.

# ఆచ్ఛికపరిచ్ఛేదము

—:o:—

అచ్చతెనుంగుంగూర్చి తెలుపునట్టిభాగమునకు నాచ్ఛికపరిచ్ఛేదమని పేరు

1 సూ—సంస్కృతసమేతరంబయిన యీభాషయచ్ఛయనంబడు స్పష్టము.

వ్యా—సంస్కృతసమములుకాని యీభాష యచ్చతెనుఁగనఁబడును.

2 సూ—ఆచ్ఛికశబ్దంబులెల్లందఱుచుగస్త్రీసమంబులుంక్లీబసమంబులయియుండు.

స్త్రీసమత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచన లోపాదికంబును క్లీబసమత్వాతిదేశంబుచే మువర్ణకంబునగునని యెఱుఁగునది॥ అన్న-మిన్న -

అద్ద - గద్ద - జాణ - గాణ - ఓడ - గోడ - ఇత్యాదులు స్త్రీసమంబులు॥ బియ్యము - నెయ్యము - అల్లము - మొల్లము - సున్నము - సన్నము - ఇత్యాదులు క్లీబసమంబులు ॥ తఱచుగననుటచేఁ బుంలింగతుల్యంబులుం గొండొకకలవని తాత్పర్యము ॥ కొమరుఁడు - చందురుఁడు - జముఁడు - కందుఁడు - ఇత్యాదులు.

వ్యా—అచ్చతెనుఁగు శబ్దంబులన్నియు సాధారణంబుగ స్త్రీలింగసమంబులు గాను, నపుంసకలింగసమంబులుగాను, నుండును. స్త్రీత్వమారోపించుటచేతఁ (స్త్రీలింగసమములని చెప్పుటచేత) బహువచనైకవచనంబులకు లోపంబు కల్గుట మొదలైనవియు నపుంసకలింగత్వమారోపించుటచేత (నపుంసకలింగసమములని చెప్పుటచేత) మువర్ణకము వచ్చుటయుఁ గలుగునని తెలిసికొనునది. ఉ. అన్న-మిన్న-అద్ద-గద్ద-జాణ-గాణ-ఓడ- గోడ మొదలైనవానికిఁ బహువచనైకవచనలోపంబు గలదు గావున స్త్రీలింగసమంబులు. బియ్యము-నెయ్యము-అల్లము-మొల్లము-సున్నము-సన్నము మొదలైనవానికి మువర్ణకముండినదిగనుక నపుంసకలింగసమంబులు. తఱచుగ, (సాధారణముగ) అని సూత్రింబునయందుఁ జెప్పుటచేత స్త్రీలింగసమంబులును, నపుంసకలింగసమంబులును మాత్రమే కాక పుంలింగముతో సమానంబులును కొండొక (కొన్ని) కలవని తాత్పర్యము. ఉ. కొమరుఁడు - చందురుఁడు - జముఁడు - కందుఁడు - మొదలైనవి, ఇచ్చటఁ బుంలింగసమంబులని చెప్పుటచేత డువర్ణకంబు వచ్చినదని గ్రహింపవలెను.

3 సూ—బల్లిదాదులు సంస్కృతతుల్యంబులు.

మహత్త్వంబున వీనికుత్వము డాదులు నమహత్త్వంబున మువర్ణకాదులును స్త్రీత్వంబునందాలు శబ్దముతోడ సమానంబునుంగలుగునని యెఱుంగునది॥ బల్లిదుఁడు - బల్లిదము - బల్లిదురాలు ॥ బల్లిద - అక్కజ - కావల - బెట్టిద - బెడిద - మిసిమింత - మొక్కల - ఇత్యాదులు బల్లిదాదులు.

గణశబ్దంబులు 'మగనిన్, రాయనిన్, మనుమనిన్' ఇత్యాదికముగా నిత్యనిగాగమము బుతోఁ బ్రయోగింపఁడును. ప్రస్తుతకాలంబున నొకానొకరు 'రాయ' శబ్దంబుకారాంతం బని భ్రమించి 'రామున్' అన్నట్లు 'రాయున్' అనిప్రయోగించె. అయ్యది ప్రామాదికంబు. ఈశబ్దంబునకు రామశబ్దంబునకుఁబోలె సంబుద్ధియందు డుద్వర్ణకలోపంబు మాత్రంబు మహాకవిప్రయోగంబులఁ గానంబడియెడి. కాని నిగాగమంబునకు వైకల్పికత్వంబును, ఉకారాంతత్వంబును, జూపట్టవు. కనుకనే వక్ష్యమాణలక్ష్యంబు లకారఘటితంబులు సంగతమ్ములుగానున్నవి. మ॥ కృష్ణరాయల. బాహామృగనాభి సంకుమదసాంద్రాలేపపంకంబునన్. మను- 1ఆ- చ॥ కనితనురాజులెన్నకొనఁగాఁ బెనుపోఁడులతో సిరంగరా। యనికడకేగి మాటలనె యాయనఁదెలిచి తెచ్చెమల్కాకున్. య. యూ. 1ఆ. మ॥ అ। గ్గలిక న్బాహులచేతగ్న్చి ఓరుకుల్గైకొన్న శ్రీరంగరా। యలచిత్తంబిగురింపరాయసము వ్రాయంజాలితౌనౌ సుధీ। తిలకా! లక్ష్మీవిలాసము. 1ఆ చ॥ వనజసగాక్షుశంకరులు వార్థికినర్రికిఁబోలెఁ గృష్ణరా।యనికి ననుంగుఁబల్లుఁడెటులై తనరున్ విరచక్షమానవుణ్డు' కాకుస్థ 1ఆ మ॥ కలఁగెన్ శత్రునయంకరప్రకటవోర్గర్వస్ఫురత్కృష్ణరా। యలసద్వైరిఘనాంధనస్వనములా శాంతఁబులం బ్వఁగన్॥' కృష్ణరా- 3- ఆ తే॥ గీ॥ అతఁడు దీవించి తగనురాయలమనిమ్మ హాత్మురాలని మదలోన హర్షమలర కృష్ణరా - 4- ఆ. మ॥ శ్రీకృష్ణరా। యలసంపు వదింమనట్టి యెడనత్యాశ్చర్య'-'మొప్పారఁడ। ల్లలనారత్నము వింతమాటనొక చిల్కంబంపె నచ్చోటికిన్' కృష్ణరా 4 ఆ. తే॥ గీ॥ తనకుపట్టోడవు నొకరాజు ఘనతరాన్వయమునఁగలిగెను గృష్ణరాయలయి సత్యమ కృష్ణరా 4 ఆ. తే॥ గీ॥ అప్పుడప్పాజి కృష్ణరాయలను బెండ్లి। కొ- కుఁ జేయంగనెంచి పుత్త్రడిమెరుంగు' కృష్ణ - 4 ఆ

5. సూ— పగతాదుల బహువచనలకారంబునకు రేఫంబగు.

పగతురు - అల్లురు - నెయ్యురు - బలియురు - మార్తురు.

వ్యా—'పగత' శబ్దము మొదలైనవానియొక్క బహువచనలకారంబునకు రేఫంబగును. ఉ. పగతురు. ఇచ్చట 'పగత + లు' అనియుండఁగా, తత్సమపరిచ్ఛేదమందలి యుదంతియొక్కంశవ సూత్రంబుచేతమత్వంబు రాగ్ర । తన్నరసూత్రమ్మేఁట అనేర్చ

ంబునకు రేఫంబు కలుగఁగా 'పగఱు' అనియైనది. ఇట్లే అల్లురు-నెయ్యురు-కలియురు- మార్తురు మొదలైనవి గ్రహింపవలెను. 'మల్ల' శబ్దము సాంస్కృతికంబైనను దానిబహువచనలకారంబునకు రేఫంబు పాక్షికంబుగఁ గానిపించెడిని. ఉ. మల్లలు 'మల్లురు. చ. బలమును విన్నలావు మెయిపర్వముఁ జేర్చి పెనంగుజెట్టిమల్లులవిఱుతుర్ మజేర్ గడియలోనననూడ్చి తేఱ్చి దేయుమర్' భార- వి రా. 2 ఆ. మవీరారిమల్లురకున్నట్లియుగుండపవీయబలనూపుల్ సంగడాలౌవియు। చ్చరకాంతాననపాళివిన్న రడికాశ్చర్యంబు చర్చింపఁగన్' రామాభ్యుదయము. 1ఆ.

6 సూ—కొన్ని డుమంతంబుల బహువచనలకారంబునకు రేఫంబును దానికిముందు పూర్ణబిందుపూర్వకడకారంబునగు.

గండండ్రు - మిండండ్రు - ఇత్యాదులు.

వ్యా—'కొన్ని డుమంతంబులయొక్క బహువచనలకారంబునకు రేఫంబును, ఆరేఫంబునకుఁ బూర్వము నిండుసున్నదాపలగలిగిన డకారంబునువచ్చును. ఉ. గండఁడు- గండండ్రు. మిండఁడు - మిండండ్రు. ఇచ్చట 'గండ+లు' అనియుండఁగాఁ బ్రకృతసూత్రంబున లకారంబునకు రేఫంబురాఁగా 'గండ+రు, అయ్యె. ఈరేఫంబునకుముందు దాపలసున్నగల డకారంబురాఁగా 'గండండ్రు' అయినది. ఇట్లే 'మిండండ్రు' గ్రహించునది. నరసింహవ్యాకరణకారకునిమతంబున 'గండలు, మిండలు, అను బహువచనరూపంబులునుగలవు.

7 సూ—కాప్రత్యయంబుమీఁది బహువచన లకారంబునకు లఘ్వలఘు రేఫంబులును లఘురేఫంబునకు ముందు బిందుపూర్వకడకారంబునగు.

విలుకాండ్రు - విలుకాఱు - వేఁటకాండ్రు - వేఁటకాఱు
వేడుకకాండ్రు - వేడుకకాఱు.

కూఁతురు - కూఁతులు కూఁతురులు - కూఁతుళ్లు - కూతురిని త్యాదిరూపంబులు గ్రామ్యంబులని యెఱుంగునది.

వ్యా—'కూఁతు' అనుశబ్దంబుయొక్క ప్రథమైకవచనంబునకు 'రు' అనునక్షరంబు వచ్చును. ఉ॥ కూఁతురు—దీనిబహువచనము-కూఁతులు. కూఁతురులు-కూఁతుళ్ళు-కూఁతురిని, ఇత్యాదిరూపంబులు దుష్టంబులు. 'కూఁతు' శబ్దంబు నామవాచకంబు; కావున దానిపైని బహువచనప్రత్యయమొక్కటియె యుండునుగాని యేకవచనంబు రువర్ణంబుండనేరదు ఏకవచనబహువచనంబులను! నొక్కవచనాంతంబున సమావేశంబు విరుద్ధముకావున "కూఁతురులు" ఇత్యాదిప్రయోగంబు లసాధువులు.

10 సూ—చెయువు బహువచనలకారంబున కలఘురేఫంబు విభాషనగు.

చెయువ్రులు - చెయువులు - చెయువ్రులను - చెయువ్రుంను.

వ్యా—'చెయువు' అనుశబ్దంబుయొక్క బహువచనలకారంబునకు శకటరేఫంబు విభాషగానగును. ఉ॥ చెయువ్రులు-చెయువులు. చెయువ్రులను-చెయువులను. ఈ శబ్దంబుయొక్క యకారంబుమీఁది యుకారంబునకు లోపంబును గాన్పించెడిని. ఉ॥ ఇంపు దనర్కొత్తఁగ నొక్కచో నొకటి నొక్కటిగాంచి యెలర్చు చెయ్వులం జిత్తజాకేళిఁదేలె విలసిల్లుచు జక్కవ దోయివేమవక్ 'భార-ఉద్యో- 2ఆ. శా॥ । చేరం జోటూకటెంయఁ గానక భ్రమంజెయ్యేది భృంగావలిం ! గారామారఁగ నుద్ధరించె ప్రెగ్గడ హరివంశము. సీ। మఱవక ప్రాణమై మరువవరూథిని చెయ్వులన్నియు దక్కఁ జిత్రరేఖ 'వసు-౬ ఆ. ఉ॥ సింగంబులుగ్రనిబాలికల్ దిరుగుచుం జెగ్వేది మోదించుచా రంగంబుద్దిరుగండపోవ నపత్రులాజీవముల్ గోయుటల్ ఉత్తర రామాయణము.

11 సూ—అల్వాదుల బహువచనలకారంబునకు రేఫంబును మఱుగని యువర్ణంబునకు బిందుపూర్వకడకారంబునగు.

ఆండ్రు - ఆండ్రను - ఆలు - చెలియలు చెల్లెలు - కోడలు మఱఁదలు- ఇవి యాల్వాదులు.

వ్యా—ఆలు, మొదలైనశబ్దంబుల బహువచనలకారంబునకు రేఫంబును ముందఱనున్న ప్రకృతిలువర్ణంబునకు దాపలనున్నగల డకారంబును వచ్చును. ఉ. ఆలు-ఆండ్రు. ఇచ్చట ఆలు + లు, ప్రత్యయలకారంబునకు రేఫంబురాఁగా ఆలు + రు, ప్రకృతిలువర్ణంబునకు దాపలనున్నగలడకారంబు రాఁగా ఆండ్రు, (ఆండ్ + రు) అయ్యెను. ద్వితీయాబహువచనము- ఆండ్రను. ఇట్లే చెలియలు-చెల్లెలు, కోడలు- మఱఁదలు. మొదలైనవి. గ్రహింపవలెను.

12 సూ—బహువచనముపరంబగునపుడు డలటరలయుత్వంబునకులోపంబు బహుళంబుగానగు.

గుండ్లు - గుండులు-గిండ్లు - గిండులు - కాళ్లు - కాలులు మొనల్లు - మొనలులు - గొంట్లు - గొంటులు - తుంట్లు - తుంటులు గోర్లు - గోరులు - సీవిర్లు - సీవిరులు - బహుళగ్రహణముచే విల్లులు పిల్లులు పులు లిత్యాదులందు లోపంబులేదు ॥ తత్సమంబులంగోటి పిప్పలిశబ్దంబుల కీకార్యంబు చూపట్టెడు । కోట్లు - కోటులు-పిప్పళ్ళు -పిప్పలులు.

వ్యా.—బహువచనలకారము వచ్చునప్పుడు 'డ - ల - ట - ర' ఈయక్షరంబుల ఉకారంబునకులోపంబు బహుళంబుగాఁ గలుగును. ఉ. గుండులు-గుండ్లు. ఇచ్చట 'గుండు' అనునపుడు బహువచనలకారంబురాఁగా డకారముయొక్క ఉకారంబు లోపించి 'గుండ్లు' (గుండ్ + లు) అయినది. బహుళమని చెప్పుటచేత 'గుండులు' అని సంయోగరహితంబుగనుగలదు. ఇట్లే 'గిండ్లు' మొదలైనవి. 'కాలు' శబ్దంబునకు 'కాలులు - కాళ్ళు' అని రూపద్వయంబు. ఇచ్చట 'కాలు + లు' అనియుండఁగాఁ బ్రకృతసూత్రంబునఁ బ్రకృతిలువర్ణముయొక్క ఉకారంబునకు లోపంబురాఁగాఁదు

నాల్గవసూత్రంబుచేతను బహువచనసంశ్లిష్టమయిన ప్రకృతిలకారంబునకు వలఘులకారంబు గలిగి 'కాళ్లు', అయ్యెను. పదమూఁడవసూత్రంబున 'కాళులు' అనియునుండ నమ్చును. ప్రకృతసూత్రంబున నుకారలోపంబు బహుళంబుగావునఁ బక్షంబున 'కాలులు' అని సంయోగరహితంబుగ నుండును. గొంటులు – గొంట్లు. తుంటులు – తుంట్లు. ఈశబ్దంబులు 'గుండు, శబ్దంబునకుంబలె గ్రహింపవలె. గోరులు – గోర్లు. సీవిరులు – సీవిర్లు. ఈశబ్దంబులు ప్రకృతసూత్రంబున నుత్వలోపంబుచేతనే గ్రహింపవలెను. పైనుదాహరింపఁబడిన 'గుండులు – కాలులు – తుంటులు – సీవిరులు' శబ్దంబులు క్రమముగా 'డ – ల – ట – ర' లకుదాహరణంబులు మఱియు శ్లో॥ దాసః క్రమస్సమచ్ఛత్రో వ్యాప్యదుత్వం ఘేదనంఘటాః ఉపాయముపాయశ్చ 'వ' పూర్వాః పతితాఇమే ॥ శకటరేఫనిర్ణయము. ఈశ్లోకమునందలి ఛత్రిశబ్దంబునకు గ్రంథకర్తగారు 'సీవిరులు' అని తెలుఁగువ్రాసి, చిఱుగొడుగులు' అని యర్థమువ్రాసిరి. కాని వింజామరలను నర్థము సరియైనది. సీ॥ వింజామరములనవింజామలనంగవీచోపులనఁ సీవిరులనంగఁ । జామరాహ్వయములు' వేంకటేశ్వరాంధ్రము – మానవవర్గము. క॥ సీవిరుల నవీచోపులు । నావింజామరములకును నామములయ్యెన్' దేశ్యనామార్థకోశము. శకటరేఫనిర్ణయంబును, శుద్ధాంధ్రపదపారిజాతంబును, బట్టిచూడఁగా 'సీవిరులు' అను బహువచనరూపంబును నున్నయట్లు గానిపించుచున్నది. కాని 'వీచోపులనఁగ సీవిరులనంగ' అను వేంకటేశ్వరాంధ్రనిఘంటుపద్యమందలి యతిస్థానంబుచూచినను, దత్సమపరిచ్ఛేదమునందలి నలువదియేడవసూత్రంబుచే యోజించినను 'సీవిరులు', అనియేకాని 'సీవురులు' అని యుత్వవకారంబుగాదు. సీతారామాచార్యులవారు 'సీవిరుల్ కవలిడన్' భార– శాంతి. 1ఆ. అనుప్రయోగంబుదాహరించి '(ఇది వ్రాఁతప్రతులయందలి పాఠము)' అని వ్రాయుట ఇత్వవకారపాఠమనెడియూహచేతనేయని గ్రహింపవలెను. సీవిరులనఁగా వింజామరములనుటకు భారతప్రయోగంబులు. శా॥ సారథ్యంబు వహింప భీముఁడు సితచ్ఛత్రంబు గాండీవి చె । ల్వారంబట్టఁగ సీవిరుల్గవలిడన్' భార– శాంతి– 1 ఆ. క॥ రచియించిన వజ్రంబుల । రుచులంబొలుపారు సీవిరులు చెరయంగన్, భార క॥ ద్విరదంబుల వరదంబులఁ । దురగంబులఁ గాల్బలములఁ దూర్యంబులసీ । విరులన్గొడుగులఁ బడగలఁ । బరిస్ఫురితమన్యౌవతని పయనంబునడున్, భార. పైమూలమందు

బహుళమని చెప్పుటచేత (విల్లులు, పిల్లులు, పులులు, ఇత్యాదులందు నుత్వలోపంబు లేదు. తత్సమపదంబులలో (కోటి-పిప్పలి, శబ్దంబులకు నుకారలోపంబును, గనంబడుచున్నది. ఉ. కోళ్లు - కోటులు. పిప్పళ్లు - పిప్పలులు. మొదలైనవి. అప్పకవి తే॥ గీ॥ యుష్మత్పంచకమునఁ (దిక్కయజ్వపారికాళ్ళటంచు రచించుటఁ గాంచికవులు అనియుష్మత్పంచకంబులోఁ. దిక్కనసోమయాజులు కాళ్ళని ప్రయోగించినాఁడనియు, దానం జేసి మీఁగాళ్ళని కవులు తఱచుగఁ బ్రయోగింతు రన్నారనియు, వక్కాణించుచు, సారంగధరచరిత్రమందలి (సీ॥ ఉమ్మెత్తపువ్వుగానోక పైనిరుచ్చిళ్లు దెలఁగి మీఁగాళ్ళపైఁ జిందులాడ' అను ప్రయోగంబును జూపెను అప్పకవిగారి మతంబున (వారి మన్యకాళ్లనళ్ళనఁగరాదు, అనుపద్యంబుచే (కాళ్లు, అని ప్రయోగింపఁగూడదనియే సిద్ధాంతపఱచిరి; కాని కాళ్ళనుటకుఁ గవిశేఖరుల ప్రయోగంబులు భారతమునందుఁ బెక్కులుగలవు. క॥ ఉరుగకరక ప్రవాహ మొలుకుచునుండం। గడకాళ్లుపట్టివానిని' భార- ఆది. క॥ వినిరోయుతిఁ గకాళ్ళం। జెనఁగెఁ గదాయుధుఁ బొంగిభీష్ముఁడు ద్రోణుఁడా, భార - ఆది - 5 ఆ. సీ॥ కాళ్ళ యొప్పిదమాదుకట్ల నుజ్జ్వలముచేయంగ నంఘల బాహులందమెడల, భార - విరా - 1 ఆ. ఇంకను ప్రయోగంబులు పెక్కులుగలవు.

13 సూ—బహువచనము పరంబగునపుడు సంయుక్తంబులయి యుదంతంబులయిన డలరలకు లఘు లకారంబు బహుళంబుగా నగు.

త్రాళ్లు - త్రాడులు - గుమ్మళ్లు - గుమ్మడులు - మొగిళ్లు మొగిలులు - పిడికిళ్లు - పిడికిలులు - ఊళ్లు - ఊరులు-పందిళ్లు పందిరులు.

వ్యా—బహువచనంబు పరంబగునపుడు సంయుక్తంబులు కానివై ఉదంతంబులైన (డ - ల - ర, లకు నలఘు లకారంబు బహుళంబుగానగును. ఉ. త్రాడు - త్రాళ్లు - త్రాడులు. (త్రాళ్లు, ఇచ్చట బహువచనలకారమున్న (త్రాడు + లు) అని కాఁగాఁ బ్రకృతిసూత్రంబున డకారంబునకు నలఘు లకారంబు (ళ) గలిసి (త్రా

సులు' అనురూపాంతరంబయ్యెను. (సమ్మతి + లు, ఇట్లుండెఁదత్సమపరిచ్ఛేదమునంద నలువదియైదవసూత్రంబుచే ఇకారంబునకు ఉకారంబువచ్చి ఉదంతంబైనదగును) ప్రకృతసూత్రంబున సమ్మసులు - సమ్మతులు, అనురూపంబులయ్యెను. ఇట్లే పిఁకిలిపండిగిఇత్యాదులయందు ఇకారాంతపదంబులయందుఁ దత్సమపరిచ్ఛేదమంద నలువదియైదవసూత్రంబు ప్రవర్తించినపిమ్మట ప్రకృతసూత్రంబు ప్రవర్తిల్లుననియే యెఱుఁగునది. (త్రాడు - మొగులు - పేరు, ఇవి సహజంబుగానే, ఉకారాంతంబులు. ఈసూత్రంబు బహువచనపరంబు నలఘులకారంబునసూత్రంబు కలుగును.

14 సూ.— బహువచనశ్లిష్టంబులును ద్విరుక్తంబులయినడకారలకారంబుల కెల్లను లకారంబు నిత్యంబుగనగు.

త్రాళ్లు - సమ్మళ్లు - మొగిళ్లు - మొపళ్లు - విళ్లు - పిళ్లు.

వ్యా.— బహువచనలకారముతో సంయుక్తములై ద్విత్వములైన డకారంబునకును, లకారంబునకును, నలఘులకారంబు నిత్యంబుగానగును. ఉ. త్రాళ్లు. 'త్రాడు + లు' ఇచ్చట పన్నెండవసూత్రంబుచే డకారంబుమీఁది యకారంబునకు లోపంబుగలిగి పిమ్మట డకారంబునకును, ప్రత్యయలకారంబునకును, సంయోగంబుగలిగి 'త్రాడ్లు' అయ్యెను. పిమ్మట ప్రకృతసూత్రంబుచే డకారంబునకు నలఘులకారంబు గల్గి త్రాళ్లు, అనురూపంబు నిష్పన్నంబయ్యెఁ. పన్నెండవసూత్రంబుచే నుత్వలోపంబు బాహుళకంబుగావునఁ బదునాలుగవసూత్రంబున త్రాడులు - తాడుల్లు, అని యుత్వలోపాభావమందు రూపద్వయము సిద్ధించును; సమ్మళ్లు - మొగిళ్లు - మొపళ్లు - విళ్లు - పిళ్లు, వీనికి దేశ్యపదంబులు క్రమంబుగా సమ్మతి - మొగిలు - మొపలి - విడి - పిడి, అనియుండును. వీనిలో నికారాంతనామంబులకు బహువచనలకారంబు పరంబగునప్పుడు తత్సమపరిచ్ఛేదమునందలి నలువదియైదవసూత్రంబున వీని ఇకారంబునకు ఉకారంబుగలిగి యాపరిచ్ఛేదములోని పన్నెండవసూత్రంబున లోపంబుగలుఁగగాఁ బ్రకృతసూత్రంబున నలఘులకారంబు నిత్యంబుగవచ్చి బహువచనరూపంబులు సిద్ధించెనని యెఱుంగునది.

నం ౧౧. ప్రేమ ... వచనం౧. ప్రేమ (గిల్లలు) స్త్రీపరిత్యయరూపము ప్రేత (గోపికాస్త్రీ)

16 సూ.—ఔపవిభక్తికంబుల లివర్ణంబులకు బహువచనంబు పరం బగునపుడు పూర్ణబిందుపూర్వక డువర్ణంబు బహుళంబుగానగు.

కొడవలి - కొడవండులు - ఉల్లోపంబు - కొడవండ్లు -పక్షంబున దలఘులకారంబు - కొడవళులు - కొడవళ్లు- కొడవలులు॥ రోఁకలిప్రభృతులకిట్లు రూపంబు లెఱుంగునది । ఇల్లు - ఇండులు - ఇండ్లు - ఇల్లులు । ఇట్లు - కల్లు - పల్లు ముల్లు - విల్లు శబ్దంబులకు రూపంబులు తెలియునది । మద్యవిమ్నార్థకంబులయిన కల్లు పల్లుశబ్దంబులును త్రెల్లు ప్రభృతి శబ్దంబులు ననౌపవిభక్తికంబు లగుటంజేసి వాని కీకార్యంబు లేదు.

వ్యా—ఔపవిభక్తికంబులనఁగా విభక్తిసంబంధంబున మార్పునొందు శబ్దంబులు. అట్టిశబ్దంబుల లివర్ణంబునకును, లకారముతోఁ గూడిన లువర్ణంబునకును, (పలలువర్ణంబునకు = లకారముతోఁ గూడిన లువర్ణమునకు - ఉ. ఇల్లు - విల్లు మొ) బహువచనంబు పరంబగునపుడు నిండుసున్న పూర్వమందుఁ గలిగిన డు, అనునక్షరము బహుళంబుగావచ్చును. కొడవలి, ఇన్నది బహువచనపరంబు లున్నకంబురాఁగా నాలివర్ణంబునకు నిండుసున్న పూర్వమందుఁగల డువర్ణంబువచ్చి కొడవండులు, అనియును, డువర్ణంబుయొక్క ఉకారంబునకుఁ బండ్రెండవసూత్రంబుచే లోపంబుగలిగి కొడవండ్లు, అనియును, డకారయుక్తమైనరూపంబులు రెండేర్పడును. డువర్ణంబుపాక్షికంబుగావున కొడవలి, శబ్దంబునకు బహువచనలకారంబు పరంబగుచుండఁ దత్సమపరిచ్ఛేదంబువందలి నలువదియైదవసూత్రంబుచే నుత్వంబుగలిగి యీపరిచ్ఛేదంబులోని పదుమూఁడవసూత్రంబున నలువు లకారంబు రాఁగా కొడవళులు, అనియును, పదునాల్గవసూత్రంబుచే కొడవళ్లు అని బహువచనశిష్టంబుగాను, లకారయుక్తమైన రూపము

నిత్యలోపంబు చూపఁబడెడి, అనిచెప్పెను. ఉ. కన్నియ — కన్య — దివ్వియ — దివ్య కల్లియము — కల్యము. పల్లియము—పల్యము. వీడియము — వీడ్యము. మొ. సీ॥ "ధృతిఁగుంతిఁ మద్రభూపతులనెయ్యపుఁగన్యకలననవాలుఁదూపులజయించి, రాఘ 1 ఆ. ఇచ్చట 'కన్య' శబ్దంబు రామాయణార్థమందు పయితమతస్సమపదంబనికొందఱయభిప్రాయంబు; కాని 'కన్యా' శబ్దంబునకు వికృతియందే 'క్రొత్త' అనునర్థమువచ్చును. సంస్కృతంబునందు లేనియర్థంబులు వికృతియందుఁ గలుగుటసహజంబులుగావునఁ దత్సమపదంబని భ్రమపడవలదు. ఉ. అగ్గవ - (అర్ఘః) అలతి - (అలకా) (అవగడ్డము-)అవకటః) అసదు (అసత్) కంచము (కంసః). గంధము-(గన్ధః) తొండము - తుణ్డమ్)నాన - (జ్ఞానమ్( నిచ్చ- (నిత్యమ్) నిజము (నిజమ్) మొదలగునవి. ఇందులకు వగ్గ్వణాచార్యులు - శ్లో॥ క్వచిదాద్యస్యశబ్దస్య వికారే త్వన్యవాచ్యతా॥ అనిచెప్పినారు. తే। గీ। గువ్వ(గద్ద దివ్యాలుపుఁ బ్రుహ్వగూబ । యిల్లుసొచ్చిన శాంతి సేయింపవలయు" భార - అను - 4 ఆ. సీ॥ కళ్యాలఁ బదిలంబు గాని గుణంబులఁ గ్రొత్తముట్టున కియ్యకొలుపు వెరవు" భార - విరా. - 1ఆ. ఉ. అంబుజబాంధవాన్వయ నృపాగ్రణిబోనము సేఁడు సూర్యపా । కంబున నాయితంబయిన కజ్జము భోజనశాలలోనఁ బళ్యంబిడినారు పంకజదళాక్షులు రెండవజాముగంటవేగ్రయంబడె నారగింప సమయంబని చెచ్చెరవిన్నవించినన్, కాశీ - 5 ఆ. ఇప్పద్యముంబట్టిచూడఁగాఁ బూర్వము మనవారు సూర్యకిరణంబులచే వంటచేయుట కనుపెట్టినట్లు తేలుచున్నది. మనప్రాచీనులుపూర్వకాలమందు బ్రకృతిశాస్త్రప్రవీణులయి సుకరంబును, జమత్కారంబును, నైనకార్యంబులు సలిపినట్లు ఈపద్యంబువలన గ్రహింపవలెను. తే॥ గీ॥ తరుఁధావన ఖగఖగర్దళనవ్రణుల పాత్రు కొల్పిరి లేఁతవీడ్యములనాఁడు, రాఘ - 3 ఆ తే। గీ॥పిడియము వక్కలాకులు విడెము తమ్మలంబు వీడెంబు వీడ్యమనంబురారి" ఆంధ్రనామసంగ్రహము, మానవవర్గు సీ॥ తే॥ తనరుదాంబూలనామంబు తమ్మలమన వీడెమన వీడియమ్మనవీడ్యమనఁగ।విడియమన విడ్యమనఁగను విడెమనంగ ,భూరిభవభంగశాంభ్రమాతృభూతలింగ" ఆంధ్రభాషార్ణవము, మనుష్యవర్గము. "పరియాచకము - పర్యాచకము - పరేచకము" ఇట్లు రూపత్రయంబు యహోబలపపతి. ఉ॥ నన్నుఁబరాచక మేల చేసెదు సువాక్యముచేఁ గరుణింపవే చెళ్లీ" అనిప్రయోగము. పైప్రయోగంబులంబట్టి చూడఁగా సూరిగారు సెలవిచ్చినట్లు

గాక ముత్తియశబ్దేతరంబులయందుఁ గూడ, ఇకారంబునకు లోపంబుగలదని గ్రహింప వలెను. "నామములయందు కాక క్రియలయందును, ఎత్వంబు చూపట్టెడి" నని యహోబలపతి. ఉ. కడియంబడె - కడె బడె" ఇత్యాదులు.

## సర్వనామప్రకరణము.

విశేష్యములయొక్క పునరుక్తిదోషంబు కలుగకుండఁగ వానికి బదులుగా ప్రయోగింపఁబడుపదంబులు సర్వనామంబులు. (పూర్వోక్తపదార్థపరామర్శకములు అట్టివానిం గూర్చి తెలుపునట్టిభాగంబునకుసర్వనామప్రకరణము

### 24 సూ—అన్నిప్రభృతులు సర్వనామంబులు.

అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - పెక్కు - పలు- ఆ -ఈ - ఏ - నీ - నా - మన - తా - సంఖ్యావాచకంబులు - అన్నిప్రభృతులు। వీనికిం బ్రథమాంతరూపంబు లుదాహరించెద- వీనిలోడుమంతంబులకెల్ల న్వాగమంబు పూర్వోక్తంబు స్మరించునది ॥ బహువచనలకారంబునకు రాదేశంబును బూర్వాగమంబును ప్రథమాబహువచనంబునకుంబోలె నెఱుంగునది । విశేషాకారంబులు గలిగెనేనిఁ గొండొకచో ద్వితీయవఱకును గొండొకచోఁ దృతీయయందొక్కరూపంబువఱకును రూపభేదంబులు వక్కాణించెద - శేషంబూహించునది ॥ అన్ని మొదలగుశబ్దంబులాఱు నుద్విప్రభృతిసంఖ్యావాచకంబులును మహదర్థంబులు బహువచనాంతంబులగు - అమహదర్థంబులేక వచనాంతంబులగు । ఇందు నీమొదలగునాలుగుశబ్దంబులు సర్వార్థంబులందుల్యరూపంబులయి యుండు.

మ - అనునది మహదర్థమనుటకు - అ- అనునదియమహదర్థమనుటకు - ప్ర - మొదలయినవి ప్రథమావిభక్త్యులకును సంకేతములుగా నిందు గ్రహించునది.

మ. అ.

సర్వతావదర్థకము.

ప్ర { అందఱు / అందఱును } ...అన్ని

ఇయదర్థకము

ప్ర। ఇందఱు......ఇన్ని.

కియద్యావదర్థకము.

ప్ర। ఎందఱు......ఎన్ని.

కతిపయార్థకము

ప్ర॥ కొందఱు......కొన్ని,

బహ్వర్థకము. పెక్కు-

ప్ర { పెక్కండ్రు / పెక్కురు } దీనికిబహు వచనముంగ లదు। పెక్కులు

ఈశబ్దంబు లౌపవిభక్తికంబులగు టంజేసి - అన్నిటి - అన్నింటి - ఇన్నిటి - ఇన్నింటి - ఎన్నిటి - ఎన్నింటి - కొన్నిటి - కొన్నింటి - పెక్కిటి - పెక్కింటి - యనురూపంబులు ద్వితీయాద్యేకవచనంబులు పరంబగునపు డమహత్వంబునంద గునని తెలియునది.

బహ్వర్థకము.

ప్ర। { పలుగురు / పలుగుండ్రు } అమహత్వంబున దీనికిప్ర యోగంబు లేదు.

మ.

తదర్థకము.

ప్ర వాఁడు..... { వారు / వారలు / వాండ్రు }

ద్వి। వానిని..... { వారిని / వారలను / వాండ్రను }

అ.

ప్ర { అది.........అవి / అద్ది... ...అవ్వి / ఆయది......ఆయవి / అయ్యది.....అయ్యవి }

ద్వి { దానిని / ఆదానిని / అద్దానిని } ......వానిని..

మ.

ఇదమర్థకము.

ప్ర॥ వీఁడు { వీరు / వీరలు / వీండ్రు }

ద్వి॥ వీనిని { వీరు / వీరలను / వీండ్రను }

అ.

ప్ర { ఇది............ఇవి / ఇద్ది............ఇవ్వి / ఈయది...... ఈయవి / ఇయ్యది.......ఇయ్యవి }

ద్వి { దీనిని... / ఈదానిని / ఇద్దానిని } వీనిని

మ.

యత్కిమర్థకము

ప్ర

ఏఁడు............ఏరు

ఏవాఁడు { ఏవారు / ఏవారలు / ఏవాండ్రు }

ఎవ్వాఁడు { ఎవ్వారు / ఎవ్వారలు / ఎవ్వాండ్రు }

ఎవ్వఁడు { ఎవ్వరు / ఎవ్వండ్రు }

ఎవఁడు { ఎవరు / ఎవండ్రు }

ద్వి

ఏనిని........ఏరిని

ఏవానిని { ఏవారిని / ఏవారలను / ఏవాండ్రను }

ఎవ్వానిని { ఎవ్వారిని / ఎవ్వారలను / ఎవ్వాండ్రను }

ఎవ్వనిని { ఎవ్వరిని / ఎవ్వండ్రను }

ఎవనిని { ఎవరిని / ఎవండ్రను }

| | | | | |
|---|---|---|---|---|
| | ఎది... ... ...ఎవి | | | |
| | ఏది... ... ...ఏవి | | | దేనిని.........వేనిని |
| ప్ర. | ఎద్ది... ... ...ఎవ్వి | ద్వి | | ఏదానిని......ఏవానిని |
| | ఏయది ... ...ఏయవి | | | ఎద్దానిని......ఎవ్వానిని |
| | ఎయ్యది ... .. ఎయ్యది | | | |

మహతివాచ్యంబగు నేకత్వంబున యత్కిమర్థకశబ్దంబు - ఎవ్వరిత - ఎవర్త - ఎవ్వత - ఎవరిత - ఎవర్త - ఎవత - ఎవ్వరితి - ఎవ్వర్తి - ఎవ్వతి - ఎవరితి - ఎవర్తి - ఎవతి - ఎవ్వరితె - ఎవ్వర్తె - ఎవ్వతె - ఎవరితె - ఎవర్తె - ఎవతె - ఎవ్వర్తుక - ఎవ్వతుక - ఎవర్తుక - ఎవతుక - అని యిరువది రెండురూపంబులు వడయు

తదాదులు మూఁడు మహద్వాచకంబు లేకత్వంబునం బూజవివక్షించునపుడు - అతఁడు - ఆతఁడు - ఇతఁడు — ఈతఁడు - ఎతఁడు - ఏతఁడు అనురూపంబులువడయు ॥మహతీవాచకంబులు. ఆమె - ఆపె - ఆకె - ఈమె - ఈపె - ఈకె - ఏమె - ఏపె - ఏకె-అను - రూపంబులు వడయు.

యుష్మదర్థకము.

| | | |
|---|---|---|
| ప్ర | నివు, ఈవు | మీరు, మీరలు, ఈరు, ఈరలు |
| ద్వి॥ | నిన్నును... | ...మిమ్మును |
| తృ॥ | నీచేతను ... | ...మీచేతను |

అస్మదర్థకము,

| | | |
|---|---|---|
| ప్ర | నేను, ఏను ... | మేము, నేము, ఏము |
| ద్వి॥ | నన్నును... | ...మమ్మును |

తృ౹ నాచేతను......మాచేతను

ఉభయార్థకము.

నిత్యబహువచనాంతము.

ప్ర౹ మనము. ద్వి౹ మనలను.
తృ౹ మనచేతను – మనలచేతను

ఆత్మార్థకము.

ప్ర౹ తాను... { తాము / తారు / తమరు

ద్వి తన్నును...తమ్మును.

తృ౹ తనచేతను...తమచేతను

ఇంకసంఖ్యావాచకంబులు

వక్కాణించెద.

మ.

ఏకార్థకశబ్దము.

ప్ర.

ఒకఁడు.... { ఒకరు / ఒకండ్రు

ఒకోఁడు...... { ఒకోరు / ఒకోండ్రు

ఒక్కాఁడు...... { ఒక్కారు / ఒక్కాండ్రు

ఒక్కోఁడు... { ఒక్కోరు / ఒక్కోండ్రు

ఒకరుఁడు...... { ఒకరులు / ఒకళులు / ఒకళ్లు

ఒకోరుఁడు... { ఒకోరులు / ఒకోళులు / ఒక్కాళ్లు

ఒక్కారుఁడు { ఒక్కారులు / ఒక్కాళులు / ఒక్కాళ్లు

ఒక్కోసుఁడు... { ఒక్కోరులు / ఒక్కోళులు / ఒక్కోళ్లు

ఒకరువుఁడు.........ఒకరువులు
ఒకోరువుఁడు......ఒకోరువులు
ఒక్కారవుఁడు......ఒక్కారువులు

ఒక్కొక్కరువ్రుఁడు. ఒక్కొక్కఁడువులు
ఒరుఁడు ... ... ఒరులు
ఒరువ్రుఁడు ... ... ఒరువ్రులు

ఒండు...... { ఒండులు / ఒండ్లు

ఒడ్డు ..... { ఒడ్డులు / ఒడ్లు

ద్వితీయాది విభక్తిరూపంబులూహించుకొనునది.

౮.

ప్రథమైకవచనాంతములు.

ఒకటి - ఒకొంటి - ఒక్కటి - ఒక్కొక్కటి - ఎక్కటి - ఒకఁడు - ఒకొఁడు - ఒక్కఁడు - ఒక్కొక్కఁడు - ఒండు - ఈశబ్దంబులకు సంఖ్యావాచకంబునకు బహువచనంబు లేదు.

దీనికి మహతి వాచ్యంబగునపుడేకత్వంబున వక్ష్యమాణ రూపంబు లెఱుంగునది.

మహత్యర్థకము.

ఒకరిత - ఒకర్త - ఒకర్తు - ఒకర్తుక - ఒకత - ఒకతుక - ఒకొరిత - ఒకొర్త - ఒకొర్తు - ఒకొర్తుక - ఒకొత - ఒకొతుక - ఒక్కరిత - ఒక్కర్త - ఒక్కర్తు ఒక్కర్తుక - ఒక్కత - ఒక్కతుక - ఒక్కొక్కరిత - ఒక్కొక్కర్త - ఒక్కొక్కర్తు ఒక్కొక్కర్తుక - ఒక్కత - ఒక్కొక్కతుక - ఒకరితి - ఒకర్తి - ఒకతి - ఒకొరితి - ఒకొర్తి - ఒకొతి - ఒక్కరితి - ఒక్కర్తి - ఒక్కతి ఒక్కొక్కరితి - ఒక్కొక్కర్తి - ఒక్కొక్కతి - ఒకరితె - ఒకర్తె - ఒకతె - ఒకొరితె - ఒకర్తె - ఒకొతె - ఒక్కరితె - ఒక్కర్తె - ఒక్కతె - ఒక్కొక్కరితె - ఒక్కరితె - ఒక్కొక్కర్తె ఒక్కొక్కతె - ఓర్త - ఓర్తి - ఓర్తు - ఓర్తుక.

ఇంక ద్విప్రభృతి సంఖ్యావాచకంబులు ప్రథమాంత రూపంబులు వక్కాణించెద.

మ. అ. బహునొక్కరు... పదునొకటి

| పుం. | ఇత్యాదులు |
|---|---|
| ఇద్దఱు ... } ...రెండు | పన్నిద్దఱు } పన్నెండు |
| ఇరువురు... } | పన్నిరువురు } |
| మూగురు... } ...మూఁడు | పదుమూగురు } పదుమూఁడు |
| ముగ్గురు ... } | పదుముగ్గురు } |
| ముగురు ... } | పదుముగురు } |
| నలుగురు ... ... నాలుగు | పదునలుగురు ... పదునాలుగు |
| అయిదుగురు ... అయిదు | పదునయిదుగురు ..పదునయిదు |
| ఏగురు ... ... ఏను | పదునేగురు ... పదునేను |
| ఆఱుగురు ... ... ఆఱు | పదునాఱుగురు... పదునాఱు |
| ఏడుగురు ... ... ఏడు | పదునేడుగురు ... పదునేడు |
| ఎనమండ్రు ... ఎనిమిది | పదునెనమండ్రు... పదునెనిమిది |
| తొమ్మండ్రు ... తొమ్మిది | పందొమ్మండ్రు ... పందొమ్మిది |
| పదుగురు } .. పది | ఇరువండ్రు ... ... ఇరువది |
| పదురు } | ఇరువదియొకరు ... ఇరువదియొకటి |
| పదుగుండ్రు } | ఇత్యాద్యూహ్యములు. |
| పదుండ్రు } | |
| పదునొకరు ... ...పదునొకటి | ముప్పండ్రు ... ముప్పది |
| | నలువండ్రు ... నలువది |
| | ఏఁబండ్రు ... ఏఁబది |
| | అఱువండ్రు... అఱువది |

ఇప్పటి వేఱశబ్దార్థంబులఁ జూప
21 లైన ర్థానుసారంబుగా నూ
హ్యకొనునది.

దేశంబు ఈ వారు యూర్ణకంబునకుఁ బక్షంబున బిందుపూర్వకడకారంబగు ఈ వాండ్రు లువర్ణకంబునకుఁ ముందు రవర్ణంబగు. ఈ వారలు ఇట్టి 'వా' శబ్దంబునకు బహువచనరూపంబులు మూఁడు— ద్వితీయాదిబహువచనంబులు 'వారిని- వాండ్రను — వారలను, ఇత్యాదికముగాఁ బ్రథమాబహువచనమునందలి రేఫాదేశాదులతో రూపత్రయంబగు

### అమహదర్థకమైన 'ఆ' శబ్దము

| | ఏ | బ | | ఏ | బ |
|---|---|---|---|---|---|
| ప్ర | అది | అవి | ద్వి | దానిని | వానిని |
| | అద్ది | అవ్వి | | ఆదానిని | |
| | ఆయది | ఆయవి | | అద్దానిని | |
| | అయ్యది | అయ్యవి | | | |

మహదర్థకమైన 'వా' శబ్దంబుయొక్క రూపంబులవలెనే 'వీ' శబ్దంబుయొక్క ప్రథమాదివిభక్తుల యేకవచనబహువచన రూపంబులగును

| | ఏ | బ | | ఏ | బ |
|---|---|---|---|---|---|
| ప్ర | వీఁడు | వీరు | ద్వి | వీనిని | వీరిని |
| | | వీరలు | | | వీరలను |
| | | వీండ్రు | | | వీండ్రలు |

### అమహదర్థకమైన 'ఈ' శబ్దము.

| | ఏ | బ | | ఏ | బ |
|---|---|---|---|---|---|
| ప్ర | ఇది | ఇవి | ద్వి | దీనిని | వీనిని |
| | ఇద్ది | ఇవ్వి | | ఈదానిని | |
| | ఈయది | ఈయవి | | ఇద్దానిని | |
| | ఇయ్యది | ఇయ్యవి | | | |

| | | | |
|---|---|---|---|
| ఏడుగురు | ఏడు | ఇరువండ్రు | ఇరువది |
| ఎనమండ్రు | ఎనిమిది | ఇరువదియొకరు | ఇరువదియొకటి |
| తొమ్మండ్రు | తొమ్మిది | మొదలైనవి గ్రహింపఁదగినవి. | |

| | | | |
|---|---|---|---|
| పదుగురు | పది | ముప్పండ్రు | ముప్పది |
| పదురు | పది | నలువండ్రు | నలువది |
| పదుగండ్రు | పది | ఏఁబండ్రు | ఏఁబది |
| పదుండ్రు | పది | అఱువండ్రు | అఱువది |

| | | | |
|---|---|---|---|
| పదునొకరు | పదునొకటి | డెబ్బండ్రు | డెబ్బది |
| ఇచట 'ఒకటి' అనునర్థ | | ఎనుబండ్రు | ఎనుబది |
| మిచ్చు 'ఒకొరు, ఒక్కరు, ఇత్యాది | | తొంబండ్రు | తొంబది |
| రూపంబులన్నియు నర్థమునను సరిం | | నూఱుగురు | నూఱు |
| చిచేర్చుకొనునవి. ఉ. పదునొకొరు | | వేవురు | వేయి |
| పదునొకటి మొదలైనవి. | | పదివేవురు | పదివేలు |

పన్నిద్దఱు, పన్నిరువురు } పండ్రెండు

'ఒకరు' అను శబ్దంబునకును ఎక్కుడు దక్కిన 'ఇద్దఱు' మొదలైన సంఖ్యావాచకంబులకు ద్వితీయాదివిభక్తిబహువచనంబులు పరంబులగునప్పుడు డకారాంతంబులుగా నుచ్చరింపఁబడును. ఉ. ఇద్దఱిన్ — ఇద్దఱిచేతన్, మొ. తత్సమపరిచ్ఛేదములోని ముప్పదియొకండవ సూత్రంబుచే విధింపఁబడిన ఆగమంబునకుఁ దైశబ్దంబులలోని లఘువుల ఘుశోషంబులాదేశింపఁబడినవిగాన నీశబ్దంబులు విభక్తులకు ముందదంతంబులయ్యెనని యూహింపనగును. 'ఒకరు' అనువానికి ద్వితీయాదులు పరంబులగునపుడు ఇకారాంతంబగు ఉ. ఒకరిన్ — ఒకరిచేతన్ మొ. మహద్వాచకసంఖ్యావాచకంబులకుం గొన్నియెడల నమహత్త్వంబు చూపట్టెడి" (ప్రౌఢ — శబ్ద — 104 సూ.) సీ॥ జనవంద్యుఁడగు ధర్మతనయుని బంతినిత్యంబు గుడిచెడి పల్లెఁగాఁపులుఁగుఱ్ఱ బ్రాహ్మణులతిపుణ్యులెనిమిదివేలు (ఎనిమిదివేవురు) సముద్ధతులు॥ తే॥ గీ॥ యతులు పదివేలు (పదివేవురు) వారక కడుదినంబు నన్నపానంబులందు సహాయులగుదు' భార — అర — [illegible]. సీ॥ వారాక

కాలు - కాలిని- కాలిచే నాఁగలి - నాఁగటిని - నాఁగటిచే
నేయి - నేతిని - నేతిచే ద్వితీయైకవచనంబు పరంబగు నపు డౌపవిభక్తికంబులు రావని కొందఱు వక్కాణించిరి-అయ్యది లక్ష్యలక్షణవిరుద్ధంబగుటం జేసి యనాదరణీయంబు.

వ్యా—'ఇ-టి-తి' అను వర్ణంబులు ద్వితీయ మొదలైనవిభక్తులయొక్క యేకవచనంబులు పరంబులగునపుడు కొన్ని ప్రాతిపదికంబులకుఁ దుగాగమంబుగాఁ గలుగును. ఉ. కాలు. ద్వితీయావిభక్తి 'కాలిని' ఇచ్చట 'కాలు + ను' అనియుండఁగా నీసూత్రంబుచే 'కాలు' శబ్దంబుయొక్క ఉకారంబునకు ఇకారంబు వచ్చి 'కాలి + ను, ఇట్లుండగా పిమ్మట 'ఇకారంబుమీఁది, అను తత్సమపరిచ్ఛేద (పది యొకండవ) సూత్రంబున నుగ్ణకంబుయొక్క ఉకారంబునకు ఇత్వంబు గలిగినది. 'కాలిన్', ఇత్యాది సమాసస్థలంబులయందలి షష్ఠ్యాదివిభక్తులు లోపించినను, ఇత్వంబనపాయంబుగనుండును. 'కాలిచే' ఇత్యాదులిట్లే. 'నాగలి - నాగటిని - నేయి - నేతిని, ఇత్యాదులయందు 'టి - తి' వర్ణంబులు గ్రహింపఁగనయ్యెను ఈద్వితీయాంతంబులయందు 'కాలిని' అను చోటునందుంబలె సూత్రంబులచేఁ బ్రక్రియయూహించుకొనునది. ద్వితీయావిభక్త్యేకవచనంబు పరంబగునపుడు, ఔపవిభక్తికంబులు రావని కొందఱు చెప్పిరనియు, ఆవచనము లక్ష్యలక్షణవిరుద్ధంబనియు, సూరిగారు వాక్రుచ్చిరి. ఉ॥ 'విన్నవనేరుతామరల విందుకిభాత పుటీపలెప్పు తేఁ, యయా- 2 ఆ. క। 'మీరుచదివించెనయ్యెడ మీవని వేమకబలారివిబుధులతోనే పీరుమణులనఁగఁ బరుతన పీరునఁగలమానికమును వివిధాంబరముల్, వసు- 6 ఆ. క॥ కనకమయమైనయూపా లునఁ దమసుతులావహంబులోనమరులచే, భార- అర- 4 ఆ. ఇట్లు, ఔపవిభక్తికరూపంబులకు ప్రయోగంబులు గలవు. కావునఁ దైవిధికొన్ని చోటుల నిత్యంబుగాదు.

30 సూ—ఊరు మొదలగువాని కిత్వంబగు.

ఊరు — ఊరిని-కాలు-కాలిని-మ్రాను-మ్రానిని-నోరు - నోరిని
చోటు - చోటిని.

సున్న బహుళంబుగాఁ గలుగును ఉ అన్నింటిని ఇచ్చట ౘన్ని, అనునక్షరము హ్రస్వముగనుక దీనికి టి వర్ణంబు పరంబగునపుడు పూర్ణబిందువాగమంబయ్యె ఇట్లే ఎనిమిదింటిని పగంటిని, పగలింటిని, రెండింటిని మూఁడింటిని, ఇత్యాదులయందుఁ బహుళ్యాయంబుగ ననుస్వార పూర్వకటివర్ణంబుండునని యూహింపవలెను

33 సూ—పదాద్యంబగు హ్రస్వంబుమీఁది టివర్ణంబునకు ముందు పూర్ణబిందువగు.

కన్ను - కంటిని మిన్ను - మింటిని ఇల్లు - ఇంటిని పల్లు - పంటిని.

వ్యా—పదము యొక్క మొదటిహ్రస్వంబునకు టివర్ణంబు పరంబగునపు డనుస్వారం బాగమంబగును ఉ కన్ను - కంటిని ఇచ్చటను హ్రస్వంబునకును ముప్పదియొకండవ సూత్రంబున టివర్ణంబాదేశంబు కాఁగా నీముప్పదిమూఁడవ సూత్రంబున టివర్ణంబునకు ముందు బిందువాగమంబయ్యెను ఇట్లె మింటిని ఇంటిని- (ఇల్లు) పంటిని (పల్లు) వింటిని (విల్లు), ఇత్యాదిశబ్దంబులయందు ముప్పదియొకండవ సూత్రంబున టివర్ణంబు గలిగి ప్రకృతసూత్రంబున ననుస్వారాగమంబుగలుగను

34 సూ—అట్టు మొదలగు శబ్దముల కంతాగమంబు టివర్ణంబును శేషంబున కొక్కటి లోపంబునగు

అట్టు - అటితిని ‖ అట్టు - కట్టు-కొట్టు - గొట్టు - మిట్టు - వట్టు- ఇవి యట్టు మొదలయినవి

వ్యా—అట్టు మొదలైన శబ్దంబులకు నంతమందు టి అనునక్షరంబు వచ్చుట యు శేషంబునొక్కదానికి లోపంబును గలుగును ఉ అట్టు అటితిని ఇచ్చట

అత్తు + ను ఇట్లుండఁ బ్రకృతసూత్రంబువలనా ముంబు చివర తివర్ణాగమంబును శకట రేఫంబొక్క దానికి లోపంబును గలుగ అతు + తి + ను అయ్యెను తత్సమపరిచ్ఛే దంబు నందలి యిరువది రెండవ సూత్రంబున తి వర్ణంబుమీఁది నువర్ణకంబుయొక్క ఉకారంబునకు ఇత్వంబుగలిగి అతు + తి + ని అయ్యెను పిమ్మట నిరువదియుప్పది యాఱవసూత్రంబుచేత శకటరేఫంబుయొక్క ఉకారంబునకు ఇత్వంబు గలిగి అతితిని అను రూపము సిద్ధించెను ఇట్లే కత్తు-కొత్తు-గొత్తు-మిత్తు-వత్తు ఇత్యాదుల ద్వితీయా దివిభక్తులందు రూపసిద్ధి యెఱుంగునది

35 సూ—విభక్తిపరంబగునపుడు గోయిప్రకృతుల తుదియకారంబు తివర్ణంబగు.

గోయి - గోతులు - గోతిని - గోతులను ॥ గోయి - చేయి- దాయి - నూయి - నేయి - వాయి - రోయి - ఇత్యాదులు

వ్యా—విభక్తి పరంబగునపుడు (ప్రథమాబహువచనాదివిభక్తులు) గోయి మొద లైనశబ్దంబుల కడపటి యివర్ణంబునకు తి అను నక్షరంబాదేశంబగును ఈ గోయి - గోతులు గోతిని - గోతులను గోయి ప్రకృతులు స్త్రీసమంబులు గావునఁ బ్రథమైక వచనము లోపించెడిని అందున విభక్తిపరత్వంబులేమింజేసి ప్రథమైకవచనాంతమందు యివర్ణంబునకు తి వర్ణాదేశంబు రాదు గోయి + లు ఇట్లుండఁ బ్రకృతసూత్రం బున యికారంబునకు తి వర్ణాదేశంబు గలిగి గోతి + లు అయ్యెను పిమ్మటఁ దత్సమ పరిచ్ఛేదమందలి నలుబదియేడవసూత్రంబునఁ దివర్ణంబుయొక్క ఇకారంబునకు ఉత్వం బుగల్గి గోతులు అయ్యెను గోతిని ఇచ్చట గోయి + ను ఇట్లుండఁ బ్రకృతసూత్రం బున ఇకారంబునకు తి వర్ణంబుగల్గి తత్సమపరిచ్ఛేదమందలి యిరువదియాఱవ సూత్రం బున నువర్ణంబుయొక్క ఉత్వంబునకు ఇత్వంబుగలిగెను ఇట్లే చేయి-దాయి-నూయి- నేయి - వాయి- రోయి ఇత్యాదిశబ్దంబుల శబ్దసిద్ధి యూహించినది ఈతివర్ణాదేశంబు జౌపవిభక్తికమైన టివర్ణంబువలె ద్వితీయాద్యేకవచనమందే కాకుండఁ బ్రథమా బహువచనంబును మొ॥ గాఁగల యేకవచనబహువచనంబులయందును సామాన్యేన

యీయంద ప్రకృతసూత్రంబున చేవర్ణతవర్ణంబులు రెండిటికిని అకారంబును ఇరువదితొ మ్మిదవసూత్రంబున శవర్ణంబునకు టవర్ణంబును గలుగఁగ గొడ్డటి + అను అయ్యెను వివృత సంధిపరిచ్ఛేదంబులోని పదునొకండవసూత్రంబున టవర్ణంబుయొక్క ఇకారం బు అపదాదిస్వరంబుగావున సంధిగలిగి పరస్వరాదేశంబై గొడ్డటను (గొడ్డట్ + అను) అయ్యెను గొడ్డటన = గొడ్డటిచేతన గొడ్డటియందును వఱుతను - వఱ్ఱు + (చేత)ను ఇరువద ప్రకృతసూత్రంబున చేవర్ణతవర్ణంబులకు రెండిటికిని అకారంబాదేశంబయి వఱ్ఱు + అను ఇట్లుండె పూర్వోక్తంబైన ముప్పదినాల్గవసూత్రంబుచే తి వర్ణాగమంబును రేఫద్వ యంబులో నొక్కదానికి లోపంబుగలిగి వఱుతి + అను అయ్యె వివృత సంధి పరిచ్ఛేదంబులోని పదునొకండవసూత్రంబున తి వర్ణంబుయొక్క ఇకారంబు అప దాదిస్వరంబగుటచే సంధిగలిగి వఱుతను అయ్యెను గోరుశబ్దంబునకుం బలె రువర్ణాంత శబ్దంబులకును గొడ్డలిశబ్దంబునకుంబలె లికారాంతశబ్దంబులకును వఱ్ఱుశబ్దంబునకుంబలె ద్విరే ఫాంతశబ్దంబులకును, తృతీయాసప్తంబులయందు రూపంబు లెఱుంగునది చేతశబ్దంబు ను స్వీకరించి యుదాహరణంబు చెప్పఁబడినది కావి చేన్, తోన్, కోడన్, వర్ణం బులకును ఈసూత్రంబుచే నకారాదేశంబుగల్గి గోరను ఇత్యాదికముగానే రూపంబు లుగ్రహింపునది చేతను ఇత్యాదివిభక్తులయందు చేవర్ణతవర్ణంబులకుబోలె నుకారంబు నకుఁ గూడనేల యకారాదేశంబురాదని శంకింపవలదు అనుకారము విభక్తికిఁ దత్సమ పరిచ్ఛేదంబులోని యేనిమిదవసూత్రంబున నాగమంబుగా వచ్చినది కావున దానిని విడిచి కేవలవిభక్తికే అకారాదేశంబగునని తెలిసికొనునది ఈవిధి బాహుళకంబైనందు నఁ బక్షంబున గోరిచేతను గోరియందును గొడ్డటిచేతను, గొడ్డటియందును, వఱుతి చేతను, వఱుతియందును ఇత్యాదిరూపంబులగును

ఇది యాచ్ఛికపరిచ్ఛేదము

# కారకపరిచ్ఛేదము

ప్రథమాదికారకంబులనుగూర్చి చెప్పునట్టిభాగము ఇయ్యది కర్తృకారకము, కర్మకారకము కరణకారకము, సంప్రదానకారకము అపాదానకారకము అధికరణకారకము, అని షడ్విధంబు కారకమనంగా క్రియాన్వయంబు గలదని కొందఱును, క్రియాజనకంబని మఱికొందఱును లక్షణంబును జూపుదురు అనంగా క్రియతో నన్వయించునది కారకంబని కొందఱియభిప్రాయము క్రియను బుట్టించునదియని మఱికొందఱియభిప్రాయము లక్ష్యాన్వయంబును బర్యవసానంబుగ నిర్వివాదంబు

1 సూ—ప్రాతిపదిక సంబోధనోక్తార్థంబులం బ్రథమయగు

ప్రాతిపదికార్థమునందు - రాముడు రావణుడు - నియతోపస్థితికము ప్రాతిపదికార్థము సంబోధనమునందు - ఓరాముడ - ఓరావణుడ ఉక్తార్థమందు - రాముడు రావణునిసంహరించెను - ఉక్తమనంగాఁ జెప్పఁబడినది - ఈవాక్యమందు నాఖ్యాతము కర్తను జెప్పినదిగానఁ దద్వాచకమగు - రామశబ్దమునకుఁ బ్రథమ యయ్యె ॥ రామునిచే రావణుడు సంహరింపఁబడెను ఈవాక్యమందాఖ్యాతముకర్మమును జెప్పినదిగావునఁ దద్వాచకంబగు రావణశబ్దంబునకుం బ్రథమయయ్యెనని యెఱుంగునది.

వ్యా—ప్రాతిపదికార్థంబునందును సంబోధనార్థంబునందును, ఉక్తార్థమునందును, ప్రథమయగును (సూ) ప్రాతిపదికార్థమునందు—రాముడు; రావణుడు నియతోపస్థితికము ప్రాతిపదికార్థకము (వ్యా) ప్రాతిపదికార్థములు '1 జాతి, 2 వ్యక్తి, 3 లింగము 4 సంఖ్య, 5 కారకము' అని పంచకంబుగాఁ జెప్పంబడెను. ఇందునకుఁ బ్రమాణము. వైయాకరణభూషణసారము. 'శ్లో॥ ఏకంద్వికంత్రికంచాథచతుష్కంపంచకంతథా

నామార్థ ఇతి సర్వేఽమీ పక్షాశ్శాస్త్రే నిరూపితాః' ఇట్లు జాతివ్యక్తిసంఖ్యాకారకంబులలోఁ బ్రాతిపదికార్థము క్రమంబుగా 'ఏకంబనియు, (జాతి) ద్వికంబనియు, (జాతివ్యక్తులు) త్రికంబనియు, (జాతివ్యక్తిలింగములు) చతుష్కంబనియు,(జాతివ్యక్తిలింగవచనంబులు) పంచకంబనియు, (జాతివ్యక్తిలింగవచనకారకంబులు)' అని వివిధమతంబులు గలవు అనఁగా జాతివ్యక్తిలింగసంఖ్యాకారకంబు లైదింటిని నామవాచకమే బోధించుననియు నామంబుమీఁది ప్రథమాదివిభక్తులు. అగ్నికి సహజంబైన దహనశక్తిని బ్రకటింపఁజేయుటలో శుష్కేంధనము (ఎండుకట్టె) సాధనమైనట్లులు పైనిం జెప్పిన నామవాచకార్థంబులను నామంబుమీఁది ప్రథమావిభక్తి స్ఫుటీకరించుననియు, (ద్యోతకమనియు) శాస్త్రజ్ఞులయభిప్రాయంబు 'రాముఁడు' ఇచ్చట రామత్వము జాతి (రామత్వసర్వముతోఁ గూడిన) రాముఁడు వ్యక్తి ఈశబ్దంబు పుల్లింగము; ఏకవచనము, కర్తృకారకము. ఈయైదర్థంబులును రామశబ్దంబునకే కలవనియు, ప్రథమావిభక్తియైన డుప్రత్యయంబుపైని నిరూపించిన నామార్థంబులకు ద్యోతకంబనియు, (నామములకున్న యర్థములను స్పష్టపఱచుటలో సహాయమైనది తాత్పర్యము. 'రాముఁడు' అన్నప్పుడు 'రామత్వరూపజాతియును, రాముఁడనెడివ్యక్తియును పుంలింగంబును, ఏకవచనంబును, కర్తయనునర్థంబును,' ఈయైదును బుద్ధికి గోచరమవుచున్నవి జాతియనునది పదార్థంబు లనేకంబులైనచో వానియందు వర్తిల్లుధర్మము వృక్షంబు లనేకంబు లున్నచో వృక్షత్వజాతి యాచెట్లయందుండును బ్రాహ్మణులనేకులున్నచో బ్రాహ్మణత్వజాతి వారియందు వర్తిల్లును ప్రకృతంబున 'వ్యక్తేరభేదస్తుల్యత్వం' అనుశాస్త్రంబున నేకవ్యక్తియేయుండునప్పుడు జాతి సంభవింపనేరదు గావున నేకవ్యక్తియైన దశరథజ్యేష్ఠాపత్యరామునియందు రామత్వజాతి యెట్లుసంఘటిల్లునని శంకింతురనియే యాకర్ణింపుఁడు. కల్పభేదంబులచే మత్స్యాది దశావతారంబులునుబ్రతికల్పంబునననవతరించునని శాస్త్రంబులుద్ఘోషించుచున్నవి. కనుక రామాద్యవతారంబులు కల్పంబుల బాహుళ్యంబున ననేకంబులు సంభవిల్లును. అందునఁ గల్పభేదంబున ననేకులైన రాములను నాశ్రయించుకొని రామత్వజాతి వర్తిల్లుట నిర్బాధంబని యెఱుంగునది కొందఱు శాస్త్రజ్ఞులు జాతివ్యక్తిలింగంబులే నామంబున కర్థంబులనియు, సంఖ్యాకారకంబులుమాత్రము విభక్త్యర్థంబులేయనియు, వక్కాణింతురు పైనింజెప్పినజాతివ్యక్తిలింగవచనకారంబులైదును 'రావణుఁడు' అనెడి యుదాహరణంబునొద్దఁగూడఁ పూర్వోక్త ప్రకారంబున సమన్వ

యించుకోవలెను 'నియతోపస్థితికము ప్రాతిపదికార్థము' అనఁగా: ఏప్రాతిపదికంబును (నామవాచకంబును) ఉచ్చరింపఁగా నెట్టియర్థంబునకు నియతంబుగ (సర్వదా) స్ఫురణగలుగునో యట్టియర్థము నియతోపస్థితిక మనంబడును. నియతోపస్థితికము; నియత = యెల్లప్పుడును గలుగునట్టి ఉపస్థితికము = స్ఫూర్తిగలయర్థము అనఁగా నిత్యలింగంబులుగల పదంబు లర్థనియతోపస్థితికి నుదాహరణంబులగును ప్రకృతంబున రామరావణశబ్దంబులు సర్వదా పుంలింగంబులై రామ రావణులనెడి పురుషులను దెలుపుచున్నవి కాఁబట్టి ప్రాతిపదికార్థనియతోపస్థితికి నుదాహరణంబులయ్యె 'లక్ష్మి', ఈశబ్దంబు సర్వదా స్త్రీలింగంబై లక్ష్మీరూపస్త్రీని బోధించుచున్నదిగాన స్త్రీలింగంబులో నియతోపస్థితికి నుదాహరణము 'జ్ఞానము', ఈశబ్దంబు సర్వదానపుంసకలింగమై తెలివిని బోధించుచున్నది కావున నపుంసకలింగంబులో నియతోపస్థితికి నుదాహరణమ్మని యెఱుంగునది ప్రాతిపదికార్థము నియతోపస్థితికము కానియందులకు నుదాహరణంబేదనఁగా వినుండు పరమాత్మశబ్దంబులోనైన శబ్దంబులకు డువర్ణవిభక్తిలోపమువర్ణకంబులు గలుగునప్పుడే పుంస్త్రీనపుంసకలింగంబులు (పరమాత్ముఁడు, పరమాత్మ, పరమాత్మము) క్రమంబుగా స్ఫురించుచున్నవి కాని కేవలనామవాచకమువలనను నెట్టి లింగంబును నియతంబుగ స్ఫురించుచుండలేదు కావున నేతాదృశలింగరూపార్థము ప్రాతిపదికముచేత నియతోపస్థితికముగాదని యెఱుంగునది కాఁబట్టి యిట్టి యనియత లింగశబ్దంబులకుఁ బ్రాతిపదికార్థంబునందు మూలసూత్రముచేత బ్రథమవచ్చుననుట యసందర్భంబు కావున సూత్రంబులో 'ప్రాతిపదికలింగసంబోధనోక్తార్థంబులం బ్రథమయగు' అని సూత్రము రచియించుట యుక్తమ్ము. 'నియతోపస్థితికము ప్రాతిపదికార్థము' అని చిన్నయసూరివివరణము చేయకుండెనేని యుక్తంబుగానుండును. అపుడు జాతివ్యక్తిలింగసంఖ్యాకారకంబులైదును పైవింజూపిన వైయాకరణభూషణసారశ్లోక ప్రామాణ్యముచేఁ బ్రాతిపదికార్థమే కావున ననియతలింగ ప్రాతిపదికంబులమీఁద సయితము ప్రాతిపదికార్థమందే నిర్బాధంబుగాఁ బ్రథమవచ్చును మిత్రశబ్దము సంస్కృతభాషలో నిత్యనపుంసకమైనను దెనుఁగునందుఁ దత్సమపరిచ్ఛేదంబులోని పదునేఁడవ సూత్రంబుచేఁ బుంలింగంబునునయి యుండునని చెప్పంబడినది కనుక మిత్రశబ్దంబు సర్వదా నపుంసకలింగార్థబోధకంబేగాక పుంలింగార్థబోధకంబగును ఈశబ్దంబునకుఁ

బులింగనపుంసకలింగంబులు పాక్షికంబులగుటం జేసి మిత్రశబ్దార్థము నియతోపస్థితికము గాదు కాఁబట్టి 'మిత్రము' అనుచో మువర్ణకంబును, 'మిత్రుఁడు' అనుచో డువర్ణకంబును, ప్రాతిపదికార్థమందే వచ్చునని చెప్పం గూడదు. ఈయుదాహరణంబునందు మిత్రశబ్దంబు సఖుఁడన్న యర్థంబును దీనిపైనుండు మువర్ణకము డువర్ణకంబులు పుంలింగనపుంసకంబుల నెడిలింగార్థంబును బోధించునని యెఱుంగునది. 'రాముఁడు-రావణుఁడు' అనునుదాహరణంబులయందుఁ బ్రాతిపదికార్థంబులు రామరావణులని చెప్పినవెంటనే పుల్లింగార్థముకూడ భాసిల్లుచున్నది కావున లింగమనెడి యర్థము ప్రాతిపదికార్థంబులో నంతర్భూతమైనది. మిత్రనామవాచకమువొద్దసఖిరూపార్థంబు స్ఫురించినవెంటనే పుల్లింగనపుంసకంబులు స్ఫురింపక యాశబ్దంబుపై డువర్ణకమువర్ణకంబులు చేర్చినప్పుడే పుల్లింగనపుంసకలింగంబులన్న యర్థము స్ఫురించును గాన నిచ్చట విభక్తి ప్రాతిపదికార్థమందుఁ గాక లింగార్థమందని యెఱుఁగునది ఇట్లనేక లింగంబులు గలశబ్దంబులయొద్ద లింగము ప్రాతిపదికార్థంబులో నంతర్భూతంబని యంగీకరింపక విభక్త్యర్థమే యని గ్రహింపఁదగునది ఈసూత్రంబుచేఁ బంచకంబులో నొక్కటియైన కారకార్థమునందుసహితము ప్రథమావిభక్తిసామాన్యంబుగా విధింపఁబడినప్పటికిని దరువాతి సూత్రంబులచేఁ గర్మకారకాద్యర్థంబులయందు విశేషించి విధింపఁబడిన ద్వితీయాదివిభక్తిప్రత్యయంబులు ప్రథమావిభక్తికి బాధకంబులని యెఱుంగునది. ఈ ప్రాతిపదికార్థాదికంబునందు నింకను వ్రాయవలసియున్నను గ్రంథవిస్తరంబునకు భీతిల్లి సంగ్రహంబుగా సారాంశంబు ప్రదర్శింపంబడెను (మూలము) సంబోధనంబునందుఁ ఓరాముఁడ; ఓరావణుఁడ

వ్యా-ఇచ్చట రామరావణశబ్దంబులమీఁది ప్రథమావిభక్తులకు సంబోధనమర్థము. సంబోధనంబన వక్త (పిలుచువాఁడు) తనకు నితరుల నభిముఖముగాఁ జేసికొనుట (మూలము) ఉక్తార్థమందు-రాముఁడు రావణుని సంహరించెను. ఉక్తమనఁగాఁ జెప్పఁబడినది. ఈవాక్యమందు నాఖ్యాతము కర్తను జెప్పినది కావునఁ దద్వాచకమగు రామశబ్దమునకు బ్రథమయయ్యె. (వ్యా) పైనుదాహరించిన 'సంహరించెను' అనుశబ్దంబునయందు భూతార్థకలిట్ప్రత్యయంబు కర్త్రర్థంబునందు విధింపంబడియె. కావుననే 'సంహరించెను.' అనిచెప్పుటతోడనే 'ఎవ్వఁడు' అని ప్రథమావిభక్త్యంతంబునకుఁ బ్రశ్నవేసి కర్తను నాకర్షించుకొనుచున్నది అందువలన "సంహరించెను" అనుచో లిట్ప్రత్యయంబుచేతనే కర్త

చెప్పంబడియె. కనుక రామశబ్దంబుకంటెఁ బ్రాతిపదికార్థమాత్రమందే ప్రథమావిభక్తి వచ్చినదని యెఱుంగునది. ఆఖ్యాతంబునఁ దిఙ్విభక్తి (క్రియావిభక్తి) (మూలము) రామునిచే రావణుండు సంహరింపఁబడియె. ఈవాక్యమందాఖ్యాతము కర్మమును చెప్పినది కావునఁ దద్వాచకంబగు రావణశబ్దంబునకుం బ్రథమయయ్యెనని యెఱుంగునది. (వ్యా) 'సంహరింపఁబడియె' అనుశబ్దంబునందు భూతార్థకలిట్ప్రత్యయము కర్మార్థమందు విధింపఁబడియె. కావుననే 'ఎవ్వఁడు సంహరింపఁబడెను' అని కర్మకారకమాకర్షింపఁబడుచున్నది. పైవాక్యంబునందు సంహరించుటకుఁ గర్త రాముఁడును కర్మకారకము రావణుండును కర్మకారకంబు క్రియావిభక్తిచేతనే చెప్పంబడినది కావున రావణశబ్దంబుకంటెఁ బునరుక్తంబుగఁ గర్మార్థంబునందు ద్వితీయావిభక్తిరాక ప్రాతిపదికార్థమాత్రంబునందుఁ బ్రథమావిభక్తి వచ్చినదని తెలిసికొనునది

2 సూ—కర్మంబునద్వితీయయగు.

ధాత్వర్థఫలాశ్రయంబుకర్మమునాఁబడు దేవదత్తుఁడువంటకమును వండెను ॥ ఇటవండెననుమాటకు వంటచేసెననియర్థము - వంటఫలము- చేయుటవ్యాపారము - వంటయనఁగాఁ బాకము - పాకమున కాశ్రయము కావునఁ దీనిచే వంటకము కర్మంబయ్యెనని యెఱుంగునది.

వ్యా—కర్మార్థంబున ద్వితీయావిభక్తియగును ద్వితీయకు విభక్తియని వ్యవహారము కానిపించెడిని. (మూలము) ధాత్వర్థఫలాశ్రయంబు కర్మమునాఁబడు. వ్యా. ధాతువుయొక్క యర్థమైన ఫలమునకు నాధారము కర్మమనఁబడును అనఁగా ఫలమును బొందునది యనియర్థము. ఉ. దేవదత్తుఁడు వంటకమును వండెను ఇచ్చట వండెననఁగా వంటచేసెనని యర్థము. చేయుట వ్యాపారము. వంటయనఁగాఁ బాకము (విక్లిత్తి- మెత్తఁబడుట) మెత్తనగుట కాశ్రయమైనది వంటకము (అన్నము) కనుకఁ గర్మసంజ్ఞగలదైనది కావునఁ గర్మమైన యన్నమర్థమిచ్చునట్టి వంటకముశబ్దంబునకు ద్వితీయావిభక్తియయ్యెను. ధాతువునకు ఫలమును వ్యాపారమును అర్థములు వంటఫలము చేయుటవ్యాపారము. ఫలాశ్రయము కర్మమగును, వ్యాపారాశ్రయము కర్తయగును, ప్రకృతమందు

వంటచేయుట, అనెడుక్రియకు నాశ్రయుఁడు దేవదత్తుఁడు కావున నతఁడు కర్తయయ్యె అట్టియాశ్రయుఁడు చేసెను, అనుశబ్దంబులోని చేయుధాతువుపైని విధింపఁబడిన తిఙ్ప్రత్యయముచేఁ జెప్పంబడెను అనఁగా తిఙ్ప్రత్యయంబునకు నాశ్రయుఁడర్థము కావుననే వైయాకరణభూషణసారంబునందు నిట్లు చెప్పఁబడినది శ్లో॥ ఫలవ్యాపారయోర్ధాతు రాశ్రయేతుతిఙఃస్మృతాః ఫలేప్రధానం వ్యాపారస్తిఙర్థస్తువిశేషణం అర్థము—ఫలమును వ్యాపారమును, ధాతువునకు నర్థంబులు తిఙునకు (క్రియపైఁ బ్రయోగింపఁబడు భూతాదికాలబోధకప్రత్యయమునకు) నాశ్రయి మర్థము. ధాత్వర్థఫలంబు ధాత్వర్థవ్యాపారంబునకు విశేషణంబగు వ్యాపారంబు విశేష్యంబగు అనఁగా దేవదత్తునివ్యాపారంబు వంటకమందలి మెత్తనను గలిగించినది; కావున వ్యాపారంబు విశేష్యంబును, వంటకంబుయొక్క మెత్తనవిశేషణంబునునయ్యెను మెత్తన, అనుఫలంబునకు నాశ్రయం బన్నంబు కావున వంటకము (అన్నము) కర్మంబాయెను

3 సూ—చేతవర్ణకంబుకర్తకగు.

ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్తనాఁబడు ॥ దేవదత్తునిచే తవంటకమువండఁబడియె - వండఁబడియెననఁగా వంటచేయఁ బడియెననియర్థము - చేయుటకాశ్రయుండగుటంజేసి దేవదత్తుండుకర్తయయ్యె.

వ్యా—చేత, అను ప్రత్యయంబు కర్తృవాచకశబ్దంబుకంటెఁ గలుగును. (సూ) ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్తనాఁబడు. వ్యా- ధాతువుయొక్కయర్థంబైన వ్యాపారంబునకు నాధారంబగు పదార్థంబు కర్తయనంబడును ఉ: దేవదత్తునిచేత వంటకము వండఁబడియె ననఁగా వంటచేయంబడియెనని యర్థము. ఇచ్చట చేయుట, అనుక్రియకు నాధారభూతుఁడు గనుక దేవదత్తుఁడుకర్తయాయెను అట్టి కర్తృవాచకపదంబు కంటె చేత, విభక్తి కలిగెను ఇచ్చట ధాత్వర్థమైన వంట, (విక్లిత్తి = మెత్తపడుట) అనుఫలంబునకు నాధారంబన్నంబు కాఁబట్టి తద్వాచకంబైన పదంబు వంటకమనెడిశబ్దంబు ఇచ్చట వంటకము ఫలాశ్రయమైనది. కావ, వంటకము గర్మమైనను వండఁబడియె, అనుక్రియచేఁ నాకాంక్షింపఁబడి యభిహితమై (తిఙ్ప్రత్యయం

బుగఁ జెప్పంబడినది) నదికాన ప్రథమ సూత్రప్రకార ముక్తార్థంబునందు నన్వాచకం బైన వంటకమను శబ్దంబుకంటెఁ బ్రథమావిభక్తి కలిగెను

4 సూ—చేతవర్ణకంబు హేతుకరణంబులకు గ్రాహ్యాదియోగజంబగు పంచమికిని బహుళంబుగానగు

ఫలసాధనయోగ్యంబగుపదార్థంబు హేతువు ॥ క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు ॥ హేతువునకు - ధనముచేత సౌఖ్యంబుగలుగు - విద్యచేతయశంబుగలుగు - పక్షంబునవలన వర్ణకంబగు - కరణంబునకు - ఖడ్గంబుచేతఖండించె - కోలచేతఁగూలనేసె - పక్షంబునం దోడవర్ణకంబగు గహ్యాదియోగంబునందు - జరాసంధుండు రాజులచేతఁగప్పంబుగొనియె - మైత్రుండుచైత్రునిచేత ఋణంబుగొనియె - ఈయర్థంబును నీచేత నెఱింగితి — ఈవృత్తాంతంబువానిచేతవింటి - పక్షంబునఁబలనవర్ణకంబగు ఇత్యాదికంబు లెఱుంగునది.

వ్యా— హేత్వర్థమందును, కరణార్థమందును, గ్రహింపు మొదలైనధాత్వర్థంబులతో సంబంధించుపంచమ్యర్థంబునందును, బహుళంబుగా ,చేత, అను ప్రత్యయంబు వచ్చును. (మూలము) ఫలసాధనయోగ్యంబగు పదార్థంబు హేతువు వ్యా—ఫలమును సాధించుటకుఁ దగినపదార్థంబు హేతువనంబడును. ఈహేతువు ద్రవ్యముతోడను, గుణములతోడను, అన్వయించునది ఉ. ధనముచేత సౌఖ్యంబు గలుగు; విద్యచేత యశంబుగలుగు ప్రథమోదాహరణంబునందలి ,సౌఖ్యము, అనునది గుణమును తెలియఁ జేయునదిగనుక గుణహేతువైన ధనంబును జెప్పుపదంబుకంటెఁ ,చేత, వర్ణకంబు గలిగెను. ద్వితీయోదాహరణమ్మునందలి ,యశము, అనునది ద్రవ్యంబును దెలియఁ జేయునదిగనుక ద్రవ్యహేతువైనవిద్యను జెప్పునట్టి పదంబుకంటెఁ ,చేత, వర్ణకంబుగలిగెను. వీనికి వికల్పంబుగ ,వలన, అను ప్రత్యయంబుకూడవచ్చును. ఉ. ధనమువలన సౌఖ్యంబు గలుగును. మొ. మఱియు గుణంబును, ఫలంబును హేతువగు మూలంబులో ద్రవ్యము హేతువైనంతులకే యుదాహరణంబు లీఁబడెను. గుణఫలంబులు హేతువులుగా నున్నం

దులకు నుదాహరణమ్ములు—పుణ్యంబుచేత హరిచూడంబడియె అధ్యయనంబుచేత నివ
సించెను. పైప్రథమోదాహరణంబునందలి పుణ్యము గుణము. ఇయ్యది హరిదర్శనంబునకు
హేతువుకావునఁ జేత, వర్ణంబుగలిగె ద్వితీయోదాహరణంబునందు నివాసమునకు
ఫలంబు విద్యాధ్యయనంబుకావునఁ దద్వాచకపదంబుకంటెఁ జేత, వర్ణకంబుగలిగె
(సూత్రము) క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు వ్యా—క్రియసిద్ధించుటలో
నతిశయంబుగనుపకరించునది కరణము. అనఁగాఁ గ్రియాసాధనంబు. ఉ. ఖడ్గంబుచేత
ఖండించె, కోలచేతఁ గూలనేసె మొదటిదానియందు ఖండించుటకు సాధనంబు ఖడ్గంబు
గావున దానిం జెప్పునట్టిశబ్దంబుకంటెఁ జేత, వర్ణకంబుగలిగె రెండవదానియందుఁ గూ
లనేయుటకు సాధనము కోలగాన తదర్థంబునందుఁ జేత, వర్ణంబుగలిగె వీనికి వికల్పంబు
గఁ దోడ, వర్ణకంబునగు. ఉ. ఖడ్గముతోడ ఖండించె మొ॥ గ్రహ్యాదియోగంబునకు-
జరాసంధుఁడు రాజులచేతఁ గప్పంబుగొనియె: కొనియెననఁగా గ్రహించుట, ఇచ్చట
గ్రహించుటతో రాజులన్వయించిరి కావునఁ దద్వాచకరాజశబ్దంబుకంటెఁ దృతీయ
వచ్చెను. ఇట్లే ఎఱుంగుట వినుట, తెలిసికొనుట, మొదలైనవానికి గ్రహింపవలెను.
మైత్రుఁడు చైత్రునిచేత ఋణంబుగొనియె; ఈయర్థంబును నీచేత నెఱింగితి; ఈవృ-
త్తాంతంబు వానిచేత వింటి. మొ వీనికి వికల్పంబుగ వలన, అనుప్రత్యయంబుగలుగును
ఉ జరాసంధుఁడు రాజులవలనఁ గప్పంబుగొనియె ఇత్యాదికముగాఁ దక్కుంగలయు
దాహరణంబులు గ్రహించునది కొన్నియెడలఁ జేతవర్ణ కార్థకప్రత్యయంబులకును,
వలనవర్ణకంబునకును జేసి, అనుక్త్యంతంబనుప్రయుక్తంబగు ఉ॥ కాదనకిట్టిపాటియుప
కారముఁ దక్షకుఁడేకవిప్రసం బోధనఁ జేసి జేసె భార- ఆది-1 ఆ చ॥ మజ్జనకుఁ
బరీక్షితుఁ భుజగజాలుక్రఁ డనహ్యావిషాగ్రధూమకే ॥ తనహతిఁ జేసి చేసెనతిదాంతుఁ
గృతాంతనికేతనాతిథిఁ, భార-ఆది-1ఆ. చ ప్రీతినేగుడెంచిరి బహువేదఘోషములఁ
జేసి నిరస్తసమస్తకిల్బిష స్ఫురులగుచున్న ధన్యులు, భార-ఆర- 1ఆ ఇత్యాదిప్ర
యోగంబులు పెక్కులు గలవు చేతవర్ణకార్థకప్రత్యయాంతంబులు పెక్కులు సముచ్చ
యంబుగా నున్నయప్పుడు వానిలో నంతిమపదంబునకు జేసి, అను ప్రియుక్తంబగు
సీ॥ పలగాజు సచివులవడువున బెడఁగగు కర్కశస్తనముల గరమువాఁడి చూడ్కు
లసితోఁగ సురిచిరాధరముల మదవిలాసాలసమందగతుల వక్రాలకంబుల వలుద పిఱుఁ
దుల ధర్పగద్గదభాషితములఁ జేసి, భార-ఆది- 8ఆ. ఇచ్చోఁ జేతవర్ణకార్థకలవర్ణకంబు నై

క్షల్ల రోసలనుండవలసిన 'చేసి, యొక్క-చో' లనే యున్నయది 'తోడ', అనుదానికి స్వతంత్రప్రయోగంబును గొండొకచోఁ గానంబడియెడి. తే. గీ. స్తంభితశరత్నపుత్రి కతవదు బోటి యనివిలోకించి తోడమాటాడకునికి నలుగడలు చూచి తెలిసి యచ్చె లువరేగి వెవెలనుంకింపఁ జేదమ్మి యొడిసిపట్టె' రామా - 4 ఆ. ఇచ్చోఁదోడనన వనతోడనని గ్రహించునది. కొన్నిప్రతులయందు 'వెవెల నూహింప' అను పాఠముంగల దుగాని పైపాఠమే సందర్భశుద్ధిగ నున్నయది ఒకానొకచో సముచ్చయార్థశబ్దంబుతో నన్వయంబుగలుగునప్పుడు 'తోడ' కు లోపంబును, వ్యవధానంబును, బహువచనంబును గానంబడియెడి ఆ. వె. అమపురికిఁ జనినవతనికిఁ బరలోక విధులశాస్త్రదృష్టినెలయఁ జేసె నాపగాతనూజుఁడఖిలబాంధవులయు బ్రాహ్మణులయుఁ దోడ భానునిసుఁడు' భార-ఆది-8ఆ. క॥ నిమ్మునిముఖ్యజనులువురు దమ్ముల దమశస్త్రములయుఁ దమ శస్త్రవరాస్త్రములతోడను, సకలహిరణ్మయ బాయుఁగఁగలయు దాస్యముఁ గలనన్, భార-సభా-2ఆ. 'అఖిలబాంధవులయు' అనుచోట నఁ దోడకులోపంబుగల 'బ్రాహ్మణులయుఁదోడ' అనులక్ష్యంబునఁ దోడ వర్ణకంబునకును, దానిపూగమంబు లఘాగమంబునకు, సముచ్చయార్థకయుశబ్దంబు వ్యవధానంబుగలిగించె. ఇత్యాదులూహించునది ఒకానొకచోఁ దోడకుఁ దోడుతనము రూపాంతరం బుపయోగింపంబడును తే. గీ॥ కౌరవాన్వయజాతులై గారవమునఁ బెరిగినట్టి మీరొండొకనరునిఁగొలిచి మసలివర్తిల్లుమానావమానములకు నోర్చియుడఁకువతోడుతనునికియరిది' భార - విరా-1 ఆ. చ॥ పగకునచేతిలోఁ బడక ప్రాణములతోడుత నున్నవాఁడవే' భాగ 10 - స్కం ఉ సహార్థకపదంబుమీఁది 'తోడ' వర్ణకంబునకు, బాక్షికంబుగ 'మెయి, పై' లాదేశంబగు. ఉ॥ అందఱుఁగూడి మోసలకుఁ బ్రద్ధ మెయింజనుఁ డెంచి నిర్వ- 3ఆ. చ॥ ఏ గృహ నొనరింపవో మచిత్రభక్తి మెయి స్గరు సేవసేయుకై పడివడివాలకింపఁ జలనాంబుఁ బరాకగుఁ గొంతవింతగన్, కావ్యా-3ఆ చ॥ ముక్తికి న్ముఖతవహింపఁగానలయు మోహముఁబాయఁగ ద్రోచిభక్తిమై, లక్ష్మీ-4ఆ. సీ॥ ఓర్మిమైనుప్పిండి యుపవాసముండనిమగనాలిపరిబోల్పఁదగదువినవె, కాశీ - 2ఆ కొన్నిప్రతులయందు 'ఓర్పుమైనుప్పిడియుపవాసములనుండి, అనియుంగలదు. (ఉప్పు + ఇఁడి) ఇచ్చట 'ఇఁడి, ప్రత్యయంబ భావార్థకంబు. (చూ—తద్ధిత-24సూ) 'ఉప్పిఁడి, అనునప్పుడు సంజ్ఞాపరిచ్ఛేదంబునందలి

పదునాల్గవసూత్రిఁబునంజేసి సెటసున్నగఁ ఁఉప్పిండి, అనురూపంబులునయ్యె. 'ఇఁడి, ఎఁడు, ఇత్యాదిప్రత్యయంబులు తొలిహ్రస్వంబుమీఁద వఱసున్నగలవైనను బదంబులు కావు గావున సంధిపరిచ్ఛేదమునందలి యిరువదిరెండవసూత్రంబులోని పరిగణనకు విరోధంబు లేదని యెఱుంగునది. (చూ-సంధి 22సూ)

5 సూ— కరణసహార్థతుల్యార్థయోగంబులం దృతీయకుం దోడవర్ణకంబగు.

కరణంబునందు — కోలతోడఁ గూలనేసె సహార్థంబునందు- రాజు సేనలతోడవచ్చె - సేనాసహితుండయి వచ్చెననియర్థము తుల్యార్థయోగంబునందు - చైత్రునితోడ మైత్రుండు తుల్యుఁడు - తృతీయకనుటంజేసి చైత్రునకు మైత్రుండు తుల్యుండని తుల్యార్థయోగంబున షష్ఠియునగు.

వ్యా—కరణంబునందును, సాహచర్యార్థంబునందును, ఉపమానార్థమందును, తృతీయకుఁ దోడవర్ణకంబుకల్గు. కరణంబునందు— కోలతోడఁగూలనేసె. ఇచ్చటఁగూలనేయుటయను క్రియకు విశేషసాధనమ్ము బాణమ్ముగావునఁ గోలశబ్దంబుకంటెఁదోడవర్ణకంబుగలిగె. సహార్థంబునందు— రాజు సేనలతోడవచ్చె, ఇచ్చట సేనాసహితుండని యర్థంబు కావున సేనశబ్దంబుకంటెఁ దోడవర్ణకంబు. తుల్యార్థయోగంబునందు— చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు ఇచ్చట సామ్యంబును దెలియఁజేయుచున్నది. కాఁబట్టి యుపమానార్థకశబ్దంబుకంటెఁ దోడవర్ణకంబు. (మూలము) తృతీయకనుటంజేసి చైత్రునకు మైత్రుండు తుల్యుండని తుల్యార్థయోగంబునషష్ఠియునగు వ్యా— మూలసూత్రంబునందుఁ దృతీయకుఁ దోడవర్ణకంబని చెప్పుటవలనఁ దృతీయావిభక్తి వివక్షింపఁబడునపుడే తోడవర్ణకంబు వచ్చునుగాని షష్ఠివివక్షింపఁబడునప్పుడు తోడవర్ణకంబు షష్ఠికి నాదేశంబుగాదని భావము.

6 సూ—వచ్యర్థా-ముఖ్యకర్మంబు కు దోడకువర్ణకంబులు పాక్షికంబుగానగు,

మైత్రుండు చైత్రునితోడ నిట్లనియె - మైత్రుండు చైత్రునకిట్లనియె - ప్రాయికంబనుటచే నొకానొకచో ద్వితీయయునగు.

వ్యా—అను, పలుకు మొదలగునవి వచ్యర్థకంబులు. వీనిలో నముఖ్యకర్మంబునకు, తోడ, కు, అను ప్రత్యయమ్ములు తఱచుగాఁగలుగును. అనఁగా, అను, ఇత్యాది ధాతువులు ప్రయోగించునప్పుడు ముఖ్యకర్మయనియు, నముఖ్యకర్మయనియుఁగర్మంబులు రెండు ఏశబ్దంబుపై ద్వితీయయేకాని తక్కుంగలవిభక్తులు సంపర్కింపవోయయ్యది ముఖ్యకర్మార్థకంబు. ఏశబ్దంబుపై ద్వితీయయేకాకతృతీయాషష్ఠీవిభక్తులు సంపర్కవశంబున నుంపఁదగునోయవిముఖ్యకర్మార్థకంబులు. అముఖ్యకర్మంబునకు గౌణ (అప్రధానము) కర్మంబనియు వ్యవహారంబుగలదు. ఇట్టి యముఖ్యకర్మంబునకుఁదోడ,కువర్ణకంబులువచ్చును. ఉ. మైత్రుండు చైత్రునితోడనిట్లనియె ఇచ్చట సంధి విగ్రహంబున, చైత్రునితోడన్ + ఇట్లు + అనియె, అనికలదు ఇచ్చట, అనియె, అనునది వచ్యర్థకధాతువు, ఇట్లు, (ఈప్రకారమైనవాక్యము) అనునది ముఖ్యకర్మంబు, చైత్రునితోడన్, అనునది యముఖ్యకర్మంబు, అట్టి యముఖ్యకర్మంబునకుఁ దోడ కువర్ణకంబులు గలుగును గావున "మైత్రుండు చైత్రునితోడ నిట్లనియె; మైత్రుండు చైత్రున కిట్లనియె" అని యీపద్వయంబు మూలంబునఁ బ్రాయికంబనుటచే నొకానొకచో ద్వితీయావిభక్తియుఁ గలుగును. కావునవే "మైత్రుఁడు చైత్రునిట్లనియె" ఇత్యాదిప్రయోగంబులు సాధువులు. తే॥ గీ॥ కాంతప్రొద్దు । జరపుమంతీసుతాగ్రణిసంయమీంద్రుఁ బిగికనిట్లని వినయసంపదలువాలఁగ" హరిశ్చంద్రోపాఖ్యానము. ఇచ్చట "పలుకు" అనునది వచ్యర్థకధాతువు గావున నముఖ్యకర్మమైన సంయమీంద్రుని దెప్పునట్టిపనంబుకంటె ద్వితీయకాఁగను సంయమీంద్రునసఁగా సంయమీంద్రునితోడ నని యర్థము.

7 సూ—ఉ. యోగంబునం దాఖ్యాతకుం దోడవర్ణకంబగు.

నియమపూర్వక విద్యాస్వీకారం బుపయోగంబనంబడు ॥ రామకృష్ణులు సాందీపునితోడ వేదంబులం జదివిరి - సాందీపునివలన నని యర్థము.

వది. త్యాగక్రియలేదు, అయినను నుద్దేశ్యవాచకమైన పురుషార్థశబ్దంబుకంటెఁ జతుర్థి కలిగె చతుర్థీవిభక్తికిమాఱుగా షష్ఠీవిభక్తియే సామాన్యంబుగాఁ బ్రయోగంబులఁ గానం బడుచున్నది. ఉ. జనకుండు రామునకుం గన్యనిచ్చెను. ఇచ్చట రాముడుద్దేశ్యుండు కానఁ దదర్థకంబైన రామశబ్దంబునకంటె షష్ఠికలిగెను. ఉ. పురుషార్థంబునకు యత్నింపవలయు. ఇచ్చోట నుద్దేశమాత్రమైన పురుషార్థంబును బోధించునట్టి పురుషార్థ శబ్దంబుకంటె షష్ఠీవిభక్తి కలిగెను. నిమిత్తార్థమందును గొఱకువర్ణకంబగు. నిమిత్తంబునాఁ ఫలము. అట్టిగొఱకువర్ణకంబునకు (పొంటె), అను నన్వయంబును నాదేశంబయ్యెడిని. మధ్యాక్కర. ధరణిఁ జరాచరభూతసంఘంబునకు విషవహ్ని నురగంబు లేర్చుచునునికిఁ బయోరుహగర్భుఁ డురగవిషాపేతజీవసంజీవనోపదేశంబు కరుణఁ గశ్యపునకు నిచ్చె నఖిల లోకహితంబుపొంటె" భార-ఆది-2 ఆ. క అనఘుల శాస్త్రవిధిజ్ఞుల ననువర్తులఁ బితృపితామహక్రమమున వచ్చినవిప్రులమంత్రులగా నొనరించితె కార్యసంప్రయోగ ముపొంటెన్" భార-సభా-1ఆ అఖిలలోకహితంబుపొంటెన్ = సమస్త లోకంబుల యొక్క హితంబునిమిత్తమని యర్థము. కార్యసంప్రయోగముపొంటెన్ = కార్యము యొక్క చక్కని ప్రయోగము (నెఱవేర్పు) నిమిత్తము.

౪ సూ___అపాయభయజుగుప్సాపరాజయప్రమాదగ్రహణభవనత్రాణవిరామాంతర్ధివారణంబు లెద్దాననగు దానికి వలన వర్ణకంబగు.

అపాయము - విశ్లేషము ॥ భయము - వెఱపు జుగుప్స-ఏవ పరాజయము - పయ్యుట ॥ ప్రమాదము - పరాకు। గ్రహణము - కొనుట - ఎఱుంగుట - వినుట - ఇత్యాది ॥ భవనము - పుట్టుట ॥ త్రాణము - కాచుట॥ విరామము - విరమించుట। అంతర్ధి - మఱుగుట॥ వారణము - వారించుట అపాయంబునకు - మైత్రుండు రాజ్యంబువలనభ్రష్టుండయ్యె ॥ భయంబునకు - చోరునివలన భయపడెను

జుగుప్సకు - పాపంబువలన నేవగించె ॥ పరాజయమునకు అధ్యయనమువలనఁ డస్సె ప్రమాదంబునకు - పాడివలనం బరాకుపడియె గ్రహణంబునకు - మనువువలనం బ్రజలుపుట్టిరి త్రాణంబునకు - చోరునివలనంగాచె। విరామంబునకు భోగంబులవలనవిరమించె అంతర్ధికి - కృష్ణుండుతల్లివలనదాఁగె వారణంబునకు - శోకంబువలన వారించె ॥ ఈపంచమికి షష్ఠియుంగొండొకయెడలనగు - చోరునకు వెఱచె పాపంబునకేవగించె - అధ్యయంబునకుడస్సె - పాడికింబరాకువడియె - మనువునకు నిక్ష్వాకుండు పుట్టె ఇత్యాదులూహించునది.

వ్యా—అపాయము, (విశ్లేషము = ఎడఁబాటు) భయము, (వెఱపు) జుగుప్స (ఏవగించుట = నింద) పరాజయము, (ఓడుట = (డస్సుట) ప్రమాదము, (పరాకు) గ్రహణము, (కొనుట, గ్రహించుట, తెలియుట, ఎఱుంగుట, వినుట మొదలైనవి) భవనము, (పుట్టుట) త్రాణము (కాచుట) విరామము, (విరమించుట=ఉడుగుట) అంతర్ధి (మఱుగుట=దాఁగుట) వారణము, (నివారణము) ఇయ్యవి దేనివలనఁ గలుగునో యావస్తువును జెప్పునట్టిశబ్దంబునకు వలనవర్ణకంబగు. అపాయంబునకు-మైత్రుండు రాజ్యంబువలనభ్రష్టుండయ్యె. ఈవాక్యంబునందు "భ్రష్టుడయ్యెను" అనఁగా నెడఁబాసినాఁడని యర్థము. రాజ్యంబునుండి యెడఁబాటు కలిగినందున నట్టియెడఁబాటునకు నవధి (మేర) భూతమైన రాజ్యంబును బోధించునట్టి రాజ్యపదంబుకంటె వలనవర్ణకంబుగలిగినది. భయంబునకు — చోరునివలనభయపడియె. ఇచ్చోట భయంబునకు నవధి (మేర)యైన చోరుని దెలుపునట్టి చోరశబ్దంబుకంటె వలనవర్ణకంబుగలిగినది, ఈసూత్రంబువలన భీత్యాదులైనయర్థంబులతో యోగంబునఁబంచమియే విధింపఁబడినందున చోరభీతి, ఇత్యాదిసమాసంబులయందుఁ బంచమీతత్పురుషంబే తప్పక జెప్పుకొనవలయును. షష్ఠీతత్పురుషాదులశాస్త్రీయంబులు. షష్ఠీతత్పురుషంబు చెప్పికొనినచోఁ జోరుండే భయంపడినయట్టు లర్థమిచ్చును. అట్టియర్థంబునకు శాస్త్రవ్యవహారంబుల రెంటింటివలనను, శీఘ్రస్ఫురణంబు కలుగనేరదు. కావుననే సమాసపరిచ్ఛేదంబునందలి తృతీయాసూత్రం

బునొద్ద దొంగభయము, అనునది పంచమీతత్పురుషంబునకు నుదాహరణమ్ముగా నీయబడినది, జుగుప్సకు— పాపంబువలన నేవగించె. ఇవాక్యంబున నేవగించుటకునవధి (మేర) పాపంబుగావునఁ బాపశబ్దంబుకంటె వలవర్ణకంబు లిక— పరాజయమునకు— అధ్యయనమువలనడస్సె. ఈ వాక్యంబునందు శ్రమపడుటకు బుద్ధికృతంబైన యవధి యధ్యయనంబుకాఁబట్టి తద్వాచకంబుకంటె వలనవర్ణకంబుగల్గెను. ప్రమాదంబునకు— పాడివలనంబరాకుపడియె. ఈవాక్యంబునయందుఁ బాడి (ధర్మము) యవధిగాభావింపబడినందున దానికంటె వలనవర్ణకంబువచ్చె గ్రహణంబునకు—మైత్రునివలన ధనంబు గొనియె. ఇందు (ధనంబు) పుచ్చుకొనుటలో మైత్రునికిని ధనంబునకును నెడఁబాటు కలిగినందున దానికి నవధియైన మైత్రుని బోధించు మైత్రశబ్దంబుకంటెఁ బంచమికలిగెను. భవనంబునకు— మనువువలనం బ్రజలుపుట్టిరి. ఇచ్చటఁ బ్రజలు పుట్టుటకు హేతువు మనువుకావునఁ దద్వాచకమైనశబ్దంబుకంటె వలనవర్ణకంబాయె. త్రాణంబునకు— చోరునివలనంగాచె. ఇచ్చోట రక్షణార్థకధాతుప్రయోగంబునఁ గూడ భయంబునకుఁ గారణంబైనయెట్టిపదార్థంబును జెప్పుశబ్దంబుకంటె వలనవర్ణకంబువచ్చునని యెఱుంగునది. ఇచ్చట భయహేతువు చోరుండుగావునఁ దద్వాచకశబ్దంబునకు వలనవర్ణకంబయ్యె. విరామంబునకు—భోగంబువలన విరమించె ఇచట భోగించువానికిని భోగంబునకును నెడఁబాటు తెలియంబడుచున్నందున నవధియైన భోగంబును బోధించుశబ్దంబుకంటె వలనవర్ణకంబుపయోగింపఁబడియె; అంతర్ధికి—కృష్ణుండు తల్లివలనదాఁగె ఇట దాఁగుటకుఁ దల్లి యవధికావున వలనవర్ణకంబు. వారణంబునకు-శోకంబువలన వారించె. ఇచోటశోకవంతునకును, శోకంబునకు, నెడబాయుట తోఁచుచున్నది. కావుననవధిభూతశోకార్థకశబ్దంబుకంటె వలనవర్ణకంబుప్పతిల్లె: ఈవలనవర్ణకంబునకుఁ గొన్నియెడలఁ బష్ఠియుంగలుగును ఉ. చోరునకువెఱచె. ఇయ్యెడఁ జోరునివలన వెఱచెనని యర్థము. ఇట్లే తక్కుంగల యుదాహరణంబుల షష్ఠికిఁ బంచమ్యర్థము భావించుకొనవలయును పాపంబునకేవగించె. అధ్యయనంబునకుడస్సె, పాడికింబరాకుపడియె, మనువునకు నిష్వాసంబుపుట్టె; మొదలైనవి యూహించుకొనునది.

10 సూ—ఉండిపదం బొకానొకచో వలన వర్ణకంబునకనుప్రయుక్తంబగు.

హిమగిరివలననుండి గంగవొడమె - నాకంబువలననుండి నారదుండువచ్చె.

వ్యా—"ఉండి అనుక్త్వార్థకావ్యయంబు పంచమీవిభక్త్యర్థంబును స్ఫుటపఱచుచు సహాయమైవలన వర్ణకంబును వెంబడించునని యర్థము. ఉ. హిమగిరివలననుండి గంగవొడమె. ఇటహేత్వర్థంబునందు వలనవర్ణకంబు విధింపఁబడియెను. గంగయుత్పత్తికి హిమవత్పర్వతము హేతువన్న యర్థంబును స్ఫుటపఱచుటకై వలన వర్ణకంబునకు "ఉండి" అనుక్త్వార్థకావ్యయంబు జతపఱుపఁబడినది. "నాకంబువలననుండి నారదుండు వచ్చెను. ఇచ్చట నారదుఁడు నాకంబునువిడిచివచ్చెనని ఫలితార్థము. నారదుని రాఁడ బాటునకు స్వర్గమవధి (మేర) యైనదికావున నట్టియర్థమందు వలనవర్ణకంబు విధింపఁబడఁగాఁదాదృశార్థంబును స్పష్టపఱుచునిమిత్తము "ఉండి" పదంబు వలనవర్ణకంబునకు జోడింపఁబడియె కాఁబట్టి "ఉండి" అనుదానికిని వసియించియున్న యర్థంబిట్టిచోటుల నెప్పుడును లేదని యెఱుంగునది:

11 సూ—ఉండిశబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగనగు.

వనమునుండివచ్చె - వనమందుండివచ్చె ఊరినుండివచ్చె ఊరనుండివచ్చె ॥ వనమునుంచి ధనమునుంచి యనియుంచి శబ్దానుప్రయోగంబుతోఁ గొందఱు వ్యవహరించెదరుగానియది సాధుకవిప్రయోగారూఢంబుగాదని యెఱుంగునది.

నితరంబు దోషంబు లేదు - ఇచట షష్ఠియునగు ౯ రామునకన్యుండు ధాను ష్కుండు లేదు - అన్యము - ఇతరము - పూర్వము - పరము - ఉత్తరము - ఇత్యాదులన్యాదులు.

వ్యా — అన్యము మొదలైన యర్థములతో సంబంధించిన యప్పుడు పంచమికి కంటె, వర్ణకంబగు. ఉ. రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు ఇచట నన్యార్థము ప్రయోగింపఁబడినది. కావున రామశబ్దంబుమీఁద (కంటె), వర్ణకంబు వచ్చెను (లోభంబుకంటె నితరంబు దోషంబు లేదు, ఇచ్చటఁ గూడ నితరశబ్దంబన్యార్థకంబే కావున (కంటె), వర్ణకంబయ్యె ఇచ్చట షష్ఠియు నగును. ఉ. రామున కన్యుండు ధానుష్కుండు లేఁడు. లోభంబునకు నితరంబు దోషంబు లేదు, అనఁగా రామునికంటె నన్యుండనియు, లోభంబుకంటె నితరంబనియు, షష్ఠికి బంచమ్యర్థంబు చెప్పికొనవలయును (అన్యము, పూర్వము, పరము, ఉత్తరము, దక్షిణము, దూరము, సమీపము, ఇత్యాదు లన్యాదులు. (లోఁతి, పెఱ, దవ్వు, దగ్గఱ, తూర్పు, పడమర, ఇత్యాదు లన్యాద్యర్థకంబులు కావున నిట్టి పర్యాయపదయోగంబునయందుఁ బంచమికిఁ గంటె వర్ణకంబగును.

## 13—సూ. కంటెవర్ణకంబు నిర్ధారణ పంచమికగు

ఎచ్చట నిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదంబు కలిగియుండు నచటం బంచమియగు - ఆపంచమికిం గంటె వర్ణకంబగునని యర్థము - జానపదులకంటె నాగరులు వివేకులు - మానహానికంటె మరణము మేలు.

వ్యా— ఒకానొక హేతువుచేత నొక పదార్థంబుకంటె వేఱొకవానికిఁ బృథక్కరణంబు (వేఱుచేయుట) తోఁచునప్పుడాని వాచకశబ్దంబుమీఁద (కంటె), వర్ణకంబగు నని పర్యవసానార్థము. (మూలము) ఎచ్చట నిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదంబు కలిగియుండు నచటం బంచమియగు. వ్యా— ఎచ్చోటను (ఏవాక్యమునందు) బృథక్కరింపఁబడుచున్న పదార్థము (వేఱుచేయఁబడుచున్నది) జాతిగుణక్రియలచేఁ దారతమ్యము కలిగి యుండునో యచ్చట (ఆవాక్యమునందు) నవధి (మేరను) బోధించు శబ్దంబు

కంటెఁ బంచమియగు షష్ఠీపంచమికిఁ గంటె వర్ణకంబగునని యర్థంబు ఉ: జానపదుల కంటె నాగరులు వివేకులు. జానపదులు = పల్లెయందుండువారు. నాగరులు = నగర నివాసులు. కుత్సితత్వంబును, ప్రావీణ్యంబును, తోఁచుచున్నప్పుడు నాగరకులనఁబడు దురు. చోరశిల్పకులు నాగరకులు. నాగరులనఁగా బురనివాసులనియె తోఁచునుగాని కుత్సితత్వప్రావీణ్యంబులు వివక్షితములు కావు. కొందఱాధునికకవులు గ్రంథంబుల యందు నాగరికులని యికారాంతరేఫఘటితంబుగ వాడుచున్నారు. శబ్దరత్నాకరాది నిఘంటువులయందును నట్లే యున్నది అయ్యది ప్రామాదికంబు. నాగరకులని యకా రాంతరేఫంబుతో నుండవలయును. పైయుదాహరణంబునందు నాగరత్వ జానపదత్వ ధర్మంబులొండొరులతో [illegible] భేదంబులు గాకుండ నత్యంతభిన్నంబులు అట్టిభేదం బిచ్చట స్పష్టంబగుచున్నది కావున నిర్ధారణము నవధిభూతులైనజానపదులను బోధించు నట్టి జానపదశబ్దంబుమీఁద కంటె, వర్ణకంబు గలిగెను సామాన్యవిశేష ధర్మంబులుండి పృథక్కరణంబున్నచోటనఁ బనునాయుపసూత్రంబుచేనిర్ధారణమప్ప వమ్మనని యెఱుంగునది. మానహానికంటె మరణముమేలు' ఇచ్చట మానహానిమరణ క్రియలన్యోన్యము నంశభూతంబులుకాక యత్యంతభేదవంతంబులు కావున నిర్ధా రణంబునకు నవధియైనమానహానిని బోధించునట్టి మానహానిశబ్దంబుమీఁద కంటె. వర్ణకంబాయె.

14—సూ. షష్టివర్ణకంబు హేతువులగు గుణక్రియలకగు.

జ్ఞానముఁబట్టిముక్తుఁడగు - నీవువచ్చుటంబట్టిధన్యుఁడ నయితి
ఇచటవలనవర్ణకంబునగు - జ్ఞానమువలనముక్తుఁడగు.

వ్యా—షష్టి, అనుపంచమీవిభక్తి కారణంబులగు గుణంబులకును, క్రియలకును, గలుగును, గుణమునకు —ఉ. జ్ఞానముంబట్టి ముక్తుఁడగు ఇచ్చటను ముక్తుండగుటకు హేతువు జ్ఞానంబు. జ్ఞానంబనునది గుణంబు కావున దీనికంటె షష్టి, విభక్తి వచ్చెను. క్రియకు- ఉ. నీవు వచ్చుటంబట్టి ధన్యుండనైతి ఇచట ధన్యుండను కొనుటకు వచ్చుట యనుక్రియ హేతువయ్యెంగావున దద్వాచకశబ్దంబుకంటె షష్టి, వర్ణం బాయె. ఇచటవలనవర్ణకంబునగు. ఉ. జ్ఞానమువలన ముక్తుండగు.

15—సూ. శేషషష్ఠికియొక్కయునగు.

ఇచట శేషంబనఁగా సంబంధంబు - రామునియొక్క గుణములు నాయొక్క మిత్రుఁడు - వానియొక్క తమ్ముఁడు - కువర్ణకంబును గొన్ని యెడల సంబంధంబునందగు నాకుం దమ్ముఁడు - మీకు నెచ్చెలి.

వ్యా— శేషంబనఁగాఁ

కర్మకరణాదులు చెప్పంబడి తత్తదర్థములయందుఁ ద్వితీయా తృతీయావిభక్త్యాదులు విధింపఁబడినవి. అట్టియర్థంబులకంటె మిగిలినవియని తాత్పర్యంబు. అవగా స్వస్వామిభావము (సేవకత్వంబును, సేవ్యత్వంబును) గుణగుణిభావమును, మొదలైనవి. అట్టిసంబంధంబులు దెలియఁజేయుచు షష్ఠీవిభక్తి యగును. ఉ. రామునియొక్క గుణములు. గుణములు గుణియందు గుణగుణిసంబంధము (నిత్యసంబంధము) చేత నుండును. కాఁబట్టి రామునియొక్క గుణములన్న వాక్యంబున శేషషష్ఠియయిన యొక్క విభక్తిచే సమవాయసంబంధము తెలియఁజేయఁబడుచున్నది. రామసమవేతము (నిత్యసంబద్ధము) లైనగుణములని యర్థము ఇట్లే నాయొక్క మిత్రుఁడు - వానియొక్క తమ్ముఁడు, మొదలైనచోటులందు షష్ఠ్యర్థంబులు స్నేహసోదర్యాపత్యజన్యాది సంబంధంబులు సందర్భవశంబున నూహించుకొనునది. కువర్ణకంబుకూడ గొన్నియెడలఁ గారక షష్ఠియందేకాక (రామునికిచ్చె నిత్యాదులయందుఁ గ్రియాన్వయముగల షష్ఠియందే కాక) సంబంధార్థంబునందు సయితము వచ్చును. ఉ. నాకుందమ్ముఁడు మీకు నెచ్చెలి, మొదలైనవి.

16—సూ. నిర్ధారణషష్ఠికి లోపలవర్ణకంబగు.

జాతిగుణక్రియాసంజ్ఞలచేత సముదాయంబునుండి యేకదేశంబు నకుం బృథక్కరణంబు నిర్ధారణంబనంబడు - ఎద్దానివలన నిర్ధారణంబగు నచ్చటి షష్ఠికిలోపల వర్ణకంబగుననియర్థము మనుష్యులలోపలఁ క్షత్రియుఁడు శూరుండు - గోవులలోపలఁ గపిల బహుక్షీర లవ్వకులలోపం

బాలుఁడు శీఘ్రగామి - ఛాత్రులలోపల మైత్రుఁడు సమర్థుఁడు ఇచట షష్ఠియుంగలదు - మనుష్యులయందు క్షత్రియుఁడు శూరుఁడు- ఇత్యాదులెఱుంగునది.

వ్యా—నిర్ధారణంబైన షష్ఠీవిభక్తి, లోపల, అనుప్రత్యయంబువచ్చును. (మూలము) జాతిగుణక్రియాసంజ్ఞలచేత సముదాయంబునుండి యేకదేశంబునకుఁ బృథక్కరణంబు నిర్ధారణం బనంబడును (వ్యా) జాతిచేతను, గుణంబుచేతను, క్రియచేతను, సంజ్ఞచేతను, సముదాయమునుండి (విశిష్టమునుండి) యేకదేశంబునకు, (అంతర్భూతమైన వస్తువునకు) వేఱుచేయుట నిర్ధారణమనంబడును. పైచెప్పిన జాత్యాదుల నాలుగింటిలో నొకటిం బురస్కరించుకొని యెద్దానివలన (యేవస్తువు నవధిగాఁ జేసికొని) నిర్ధారణంబగునో యట్టియవధిని దెలియఁజేయు శబ్దంబుయొక్క షష్ఠికి లోపలవర్ణకంబగునని యర్థము. జాతికి— మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు. మనుష్యత్వము విశిష్టధర్మము. (సామాన్య ధర్మము) క్షత్రియత్వము మనుష్యత్వధర్మంబులో నేకదేశధర్మము. అనఁగా నంతర్భూతమైన విశేషధర్మము, మనుష్యత్వరూపమైన సామాన్యధర్మంబుతో విశిష్టులైన మనుష్యులనుండి క్షత్రియత్వరూపవిశేషధర్మంబును బురస్కరించుకొని క్షత్రియుండు వేఱుచేయఁబడినందున నిర్ధారణావధిభూతులైన మనుష్యులను దెలియఁజేయునట్టి మనుష్యశబ్దంబునకుం బైని షష్ఠీవిభక్త్యర్థమైన లోపలవర్ణకంబుగలిగె. క్షత్రియత్వము జాతికావున నియ్యది జాతికుదాహరణము. గుణమునకు- గోవులలోపలఁగపిలబహుక్షీర. ఇచ్చటఁ గపిలయనఁగాఁ గపిలవర్ణంబుగల యావు. గపిలవర్ణంబుగల యావు గోత్వవిశిష్టంబైన గోజాతినుండి నిమిత్తముఁ బృథక్కరింపఁబడుచున్నది. అవధివాచకమైన గోశబ్దంబునకుం బై లోపలవర్ణకంబుగలిగె. ఇయ్యది కపిలగుణముచే వేఱుచేయఁబడినది. క్రియకు-అశ్వికులలోపలం బాలుఁడు శీఘ్రగామి ఇచ్చటఁ బాలుఁడనఁగాఁ బరుగెడువాఁడు ఈయది క్రియ కావునఁ గ్రియచే వేఱుచేయఁబడెను. అవధివాచకమైన యశ్వికశబ్దంబునకుం బై లోపలవర్ణకంబయ్యె సంజ్ఞకు - ఛాత్రులలోపల మైత్రుఁడు సమర్థుండు. ఇట మైత్రుండనునది సంజ్ఞ, ఛాత్రులలో నొకండు. ఛాత్రత్వము సామాన్యధర్మంబును, మైత్రత్వంబు విశేషధర్మంబునని యెఱుంగునది సామాన్యంబునుండి విశేషంబు గ్రహింపబడినందున నవధియైనశిష్యులను బోధించు

శబ్దంబుకంటె లోపలవర్ణకంబుగాక పదునాఱవసూత్రంబులోను, ప్రకృతసూత్రంబులోను, నిర్ధారణంబు సమానంబైనను నిర్ధారపంచమివచ్చుటవలన సామాన్యవిశేషధర్మస్ఫురణలేదు కావునఁ గంటె వర్ణకంబునకే కాని 'లోపల' వర్ణకంబునకుఁ బ్రసక్తిలేదని యెఱుంగునది. ఇచట సప్తమీవిభక్తియుం గలదు ఈ మనుష్యులయందు క్షత్రియుండు శూరుండు అన్నంగలయుదాహరణమ్ములను నిట్లే పంచమీవిభక్తి గ్రహింపవలెను.

17—సూ. అధికరణంబునకు సప్తమియగు.

అధికరణంబు నా నాధారంబు ఔపశ్లేషికంబు వైషయికంబు అభివ్యాపకంబని యాధారంబు త్రివిధంబు ఘటమందు జలమున్నది - మోక్షమందిచ్ఛగలదు - అన్నింటియందీశ్వరుండు గలండు.

వ్యా—అధికరణార్థమందు సప్తమీవిభక్తి ప్రత్యయంబయిన 'అందు' అనునది కలుగును. (సూ-వ్యా) అధికరణంబన నాధారంబు (ఆశ్రయము) ఆధారము—'ఔపశ్లేషికము, వైషయికంబు, అభివ్యాపకంబు' అని మువ్విధంబులు. ఔపశ్లేషికంబనఁగా సంయోగ (కూడిక) సంబంధంబుతో నున్నది. దీనికి వ్యుత్పత్తి; శ్లేషంబునకు (సంబంధంబునకు) సమీపము ఉపశ్లేషంబు. తత్కృతంబౌపశ్లేషికంబు. వైషయికంబనఁగా విషయతా సంబంధంబు ప్రయోజకంబుగాఁ గలది. విషయంబులనఁ బదార్థంబులు. విషయీభూతంబులు జ్ఞానేచ్ఛాకృతులు (ప్రయత్నము) ఇత్యాది పదార్థంబులయందు విషయతా సంబంధంబుతో సంబంధించునది. అభివ్యాపకంబనఁగా నేవస్తువు సర్వపదార్థంబుల నాధారంబుగఁ జేసికొని వ్యాపించియుండునో యావస్తువుయొక్క యాధారంబు. ఔపశ్లేషికంబునకు—ఘటమందు జలమున్నది. ఇచట జలము సంయోగసంబంధంబుచే ఘటంబును నాధారంబుగాఁ జేసికొనియున్నయది కావున నౌపశ్లేషికాధారమున కుదాహరణము 'చాపయందు మనుష్యుండు కూర్చుండెను' అను వాక్యంబులోఁ జాపలో నేకదేశంబందు మనుష్యుఁడు కూర్చున్నందున మనుష్యునకుఁ జాప సర్వవస్తువు నాధారంబుగాక యేకదేశంబే యాధారంబైనను నట్టియేకదేశసంబంధంబునను మిగిలిన చాపసమీపస్థంబగుటచేఁ జాపయంతయు నాధారంబుగ భావింపఁబడి చాపశబ్దముపై సప్తమీవిభక్తి వ్యవహరింపఁబడుచున్నది. ఇట్లు ఘటంబున స్వల్పజలంబుండి తక్కిన యవకాశభాగము శూన్యంబుగా నున్నను జలసంబంధ ఘటభాగంబునకుఁ బక్కను ఘ-

భాగము సమీపస్థంబగుటచే యీయాత్మ ఘటంబును నాధారంబుగ నొందం బడి లోకంబులో సప్తమీవిభక్తి వాడంబడుచున్నది కావున నౌపశ్లేషిక (ఏకదేశసంబంధమాత్రంబుచే నెన్నంబడిన విశిష్టాధారము) శబ్దంబన్వర్థసంజ్ఞ గలది యయ్యెను వైషయికంబునకు—మోక్షమందిచ్ఛగలదు. ఇచ్చట నిచ్ఛ సవిషయకపదార్థంబుగావున మోక్షంబును విషయతా సంబంధంబుచే నాధారంబుగాఁ జేసికొనియె. ఆధారవాచకమైన మోక్షశబ్దంబుకంటె సప్తమీవిభక్తి కలిగినది. అభివ్యాపకంబునకు-అన్నింటియందీశ్వరుండు గలఁడు ఇచట సర్వపదార్థంబులను వ్యాపించి యీశ్వరుండున్నందున నభివ్యాపకాధారంబును దెలియఁజేయు నన్ని, శబ్దంబుకంటె సప్తమీవిభక్తి కలిగినది.

18—సూ. ఉకారాంతజడంబునకు నవర్ణకంబగు.

ఘటంబున జలంబున్నది. దేవదత్తునకు మోక్షమున నిచ్ఛగలదు.

వ్యా—ఉకారంబంతమందుఁగల జడవాచకశబ్దంబునకు 'న' వర్ణకంబువచ్చును. ఉ. ఘటంబునజలంబున్నది ఇచ్చట ఘటంబుశబ్దం బుకారంబంతమందుఁగలజడవాచకంబు (జ్ఞానహీనమైనవస్తువు) గావున 'న', అనుసప్తమివచ్చెను ఉ. దేవదత్తునకు మోక్షమున నిచ్ఛగలదు ఇట మోక్షమను శబ్దంబుకారాంతజడవాచకంబుగావున దీనికంటె నవర్ణకంబుగలిగె మూలసూత్రంబున జడంబునకు వర్ణకంబని, విధింపఁబడినది. జడపదార్థంబుకంటె నశబ్దంబుండుట యసంభవము గావున జడవాచకశబ్దంబునకని లక్ష్యార్థంబూహింపవలయును.

19—సూ. విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు విభక్తివచనంబులగు.

నందతనయుండు కృష్ణుండునాకుదిక్కు - దేవకీపుత్రుమురారిని నుతింతునెపుడు - శుభవిధాయులరామకృష్ణులభజింతు - భువనవంద్యను రుక్మిణిఁబొగడుచుందు.

వ్యా.—విశేష్యంబునకువలెనే విశేషణంబునకును లింగము విభక్తి, వచనము, గలుగును. ఈ నందతనయుండు కృష్ణుండు నాఁడెక్కె. ఈవాక్యంబునందు 'కృష్ణుండు' అనుకర్తకు 'ఎక్కెన్' అనెడి యధ్యాహార్యక్రియతో నన్వయంబు. 'నందతనయుండు' అనుపదార్థంబునకు 'కృష్ణుండు' అనుప్రథమాకారకద్వారంబుననే క్రియాన్వయంబు కాని సాక్షాదన్వయంబు లేదనుకొని విశేషణంబునకుఁ బ్రథమావిభక్త్యాదులు ప్రాప్తింపకపోవుచుండఁగా నీసూత్రంబుచే నవి యపూర్వంబుగా విధింపఁబడినవి. 'దేవకీపుత్రుహరినిఁ దలఁతు' ఇందు 'హరిని' అనునది కర్మార్థకంబైనవిశేష్యము, దీనికి విశేషణంబగు 'దేవకీపుత్రున్' అనుశబ్దంబునకు 'హరిన్' అనువిశేష్యంబు ద్వారంబునఁ గ్రియాన్వయంబే కాని సాక్షాత్తు 'దలఁతు' అనుక్రియతో నన్వయంబు లేదనుకొన్నందునఁ గర్మార్థకద్వితీయావిభక్త్యాదుల ప్రాప్తంబగుచుండె నపూర్వంబుగా నీసూత్రంబుచే విశేషణంబైన దేవకీపుత్రుశబ్దంబునకు గర్మార్థకద్వితీయావిభక్త్యాదులు బోధింపబడుచున్నవి. 'శుభవిధాయులరామకృష్ణులభజింతు' ఇచ్చట రామకృష్ణులకు విశేషణమైన 'శుభవిధాయులన్' అనుదానికి 'భజింతున్' అనుసకర్మకక్రియతో సాక్షాదన్వయంబు లేదనుకొన్నందునఁ బ్రకృతసూత్రంబుచే ద్వితీయావిభక్త్యాదులు విధింపఁబడెను. 'భువనవంద్యమరుక్మిణిఁ బొగడుచుందు' ఇచ్చట పైవాక్యంబులయందుంబలె విశేషణంబునకు విభక్త్యాదికంబాలోచింపవలయు. విశేషణవిశేష్యంబులు కొన్నియెడల వేఱొకశబ్దార్థంబులచే నెడఁబెట్టబడుచుండుగలవు. తే. గీ. భక్తవరిష్ఠుభజియింతు భక్తిఁ గృష్ణుఁ। కృష్ణుభజియింతు భక్తవరిష్ఠుచిష్ణు, ఇచ్చట విశేషణవిశేష్యంబులు రెండును క్రియయైన 'భజియింతున్' అనుదానిచే నెడఁబెట్టఁబడెను.

20—సూ. స్త్రీసమంబులగు విశేషంబులయుమువర్ణకాంత విశేషణంబులయు బహువచనంబున కేకవచనంబు బహుళంబుగానగు.

---

శాస్త్రంబున నాలోచింపఁగా విశేష్యంబునకుంబోలె విశేషణంబునకును కృష్ణుండుదిక్కుఁగుఁ, నందతనయుండు దిక్కుఁగున్' అని ప్రత్యేకముగాఁ గ్రియాన్వయంబు కలదని యంగీకరింపకతీరదు, కావుననే గీర్వాణాదిభాషలలో విశేషణంబులపైంగూడఁ గారకవిభక్తి గలుగుచున్నది. కారకవిభక్తి పుట్టినపిమ్మట విశేషణవిశేష్యభావము కల్పింపవలెను.

మాటలు పెక్కేల - మాటలుపెక్కులేల - కులిశధారల్కుంఠితంబులయ్యె - ఇష్టమగుపదార్థములు - ఇష్టములగు పదార్థములు.

వ్యా— స్త్రీసమంబులగు విశేషణంబుల యొక్కయు, మువర్ణకంబు కడపటఁగల విశేషణంబుల యొక్కయు, బహువచనంబునకు నేకవచనంబు బహుళంబుగనగు: స్త్రీసమంబులనఁ బ్రథమైకవచనలోపంబుగలవి. ఈసూత్రంబునందు స్త్రీసమంబులును, మువర్ణకాంతంబులును, జవిశేషణంబులే గ్రహింపవలెను ఇందులకుఁ బ్రమాణములు. తెలుఁగునఁ బ్రాతిపదికంబులు వెలిగా బహువచనమునకు విస్పష్టముగా నిలుచును విశేషణంబై పొలుపొందఁగ నేకవచనము మనుస్వాంసీ, సర్వల— క్రియా ప్ర 3 ల. క॥ జనపదబహువచనములకు విశేష్యముల నేకవచనముల్ వ్రాయుదురే కీర్తిమ వెలుఁగ గపిరెన్ పట్టుమయి దశలనన్నిదినములన్, కవిసం-పరి-మ- 20 ల. ఉ. 'మాటలు పెక్కేల; మాటలు పెక్కులేల, ఇచ్చట 'పెక్కు' శబ్దంబు ప్రథమైకవచనలోపంబుగలద్రిగావున స్త్రీసమంబు. ఇయ్యది 'మాటలు' అనుబహువచనంబునకు విశేషణంబైనను బ్రకృతసూత్రంబు పూర్వసూత్రంబునకు (సూ19) బాధకంబుకావున నేకవచనాంతంబై వికల్పంబుగ నుండవచ్చును. మువర్ణకాంతవిశేషణంబునకు— కులిశధారల్కుంఠితంబయ్యె. 'కులిశధారల్కుంఠితంబులయ్యె" ఇచ్చట 'కుంఠితంబు' అనునది మువర్ణకాంతంబు (తత్సమపరిచ్ఛేదంబందలి నలువదిరెండవసూత్రంబుచే మువర్ణకంబునకుఁ బూర్ణబిందుపూర్వకంబువర్ణము విధింపఁబడెను) ఇయ్యది యేకవచనంబైనను బ్రకృతసూత్రంబున 'కులిశధారల్' అను బహువచనాంతంబునకు విశేషణంబు కావచ్చును. 'ఇష్టమగుపదార్థములు, ఇష్టములగుపదార్థములు' ఇట 'పదార్థములు' అను బహువచనాంతంబునకు 'ఇష్టము' అను నేకవచనాంతంబు నీసూత్రంబుచేత విశేషణంబు కావచ్చును. మాలిని॥ సురపతిసభఁజూపం జూపనంగారవృష్టుల్ గిరిసిఁగుకులిశధారల్ కుంఠితంబయ్యె దిక్కుం జనమదములపేర్మిన్ సర్వదిక్పాలకాంతుల్ కరఁగిములు భయోద్వేగంబునన్నంపరించెన్. భార- ఆది- 2ఆ. శా॥ ప్రాతర్వేళలఁబట్టిపెట్టెసాగస్సాయిట్లు గంభీరంభోధిసౌ। మ్మాత్కోబుస్సనివాద్యమై మరుదగ్రపుంజీకరత్వాటల ప్రాతఃపేరిశిగ

శా॥ భూతంబుల్ భయముజ్జగించి చోరుఁ డీభవ్యాఘ్రి చాటంపయుక్ హరి-పూ-7 ఆ (చాటునందు) మ॥ కనుఁగొంటిం బరమేష్ఠిఁదోట్టిసురసంఘంబేకతంబుఁ బేఁగగా హరి-పూ-6ఆ. (సంఘమందు) క॥ అదియుగా మేనుచ్చి, రా- అర, కాం-2ఆ. (మేనియందు) సీ॥ వినుకేసరిధ్వజాఖ్యుఁడు నభాగ్యుఁడు మాలతోరయుండుటయ మయ్యె। నొకకొన్ని దివసంబులకు వైరుల నెదిర్చి జనకుండు గండవోపమునఁ జచ్చె। జనయిత్రి చిచ్చుఁజొచ్చిన దానులా బాలకునిఁ గొంపలమునకుఁ గొంచువచ్చి జైమిని-8ఆ. (చిచ్చునందు) తే॥ గీ॥ పంకము గోరి జవెగఁబడి పఱవలేవు మన్నుఁ లిట్టే శరేగటేమన్ను లందు, మను-4ఆ. (పంకమునందు) ఇత్యాది ప్రయోగంబులందునే, "అవ్యస్యాత్కృచిద్ధవేచ్చాన్యా" హలంత- 41 సూ., అనుశబ్దశాసనుల సూత్రంబు సార్థకంబగుచున్నయది.

22—సూ. జడంబులతృతీయాసప్తములకుద్వితీయ బహుళంబు గానగు

రాముఁడు వాలినొక్క-కోలంగూలనేసె - కోలతోననియర్థము. లంకంగలకలంబుపుట్టె - లంకయందనియర్థము. బాహుళకంబుచే నిక్కార్యం బుదంతంబునకుబహుత్వమందెయగు - అర్జునుండు—శత్రుసేనలను బాణంబులనుమాపుమాపె- బాణములచే ననియర్థము ॥ మీనంబుజలంబులనుండు - జలంబులందని యర్థ

వ్యా—జడవాచకశబ్దంబుమీఁది తృతీయావిభక్తికిని, సప్తమీవిభక్తికిని, ద్వితీయావిభక్తి బహుళంబుగావచ్చును. తృతీయకు—ఉ. "రాముఁడు వాలినొక్క-కోలంగూలనేసె". ఇచ్చట "కోలన్", అనునది ద్వితీయావిభక్తి. తృతీయావిభక్తికివచ్చెను. కాఁబట్టి కోలతోనని యర్థమును జెప్పుకోవలెను. సప్తమికి—"లంకంగలకలంబుపుట్టె", ఇచ్చట లంకన్, అనుచో ద్వితీయ సప్తమీవిభక్తికి నాదేశంబాయెను. కాన నీద్వితీయకు లంకయందనుపర్థంబు జెప్పుకోవలెను. (సూ) బాహుళకంబుచే నికార్య

బుదంతంబునకు బహుత్వమందేయగు. వ్యా— బహుగ్రహణంబుచేనీద్వితీయావిభక్తియు దంతశబ్దంబులకు బహువచనంబునందేయగును. ఉ. అర్జునుండు శత్రుసేనలను బాణంబులనురూపుమాపె, బాణంబులన బాణంబులచే ననియర్థము. ఇచ్చట 'బాణంబు' అనునది యుకారాంతంబు. దీనిపై బహువచనద్వితీయావిభక్తియే తృతీయాదివిభక్త్యర్థంబును, జెప్పనుగాని యేకవచనంబు తాదృశార్థంబును బోధింపలేదు. సప్తమికి— వీనంబుజలంబులనుండు, ఇచ్చోట 'జలంబులన్' అనుబహువచనద్వితీయావిభక్తి 'జలంబులందున్' అను సప్తమ్యర్థంబునందు వచ్చెను. 'జలంబున్' అను నేకవచనద్వితీయావిభక్తి 'జలమునందున్' అనెడి సప్తమ్యర్థమందు రాదు. అజడంబు తృతీయాసప్తములకును గొన్నింట బహుత్వంబున ద్వితీయ గానంబడియెడి. తృతీయకు— తే॥ గీ॥ అతని దోర్దండ్యసరసినో లాడుచున్న । ఘనతరస్తనచక్రవాకములనలరు। నంబనసురేంద్రుకాంతు ఱింపారఁగనియె, హరి- ఉ- ౯అ. (చక్రవాకములచేత) సీ। తే గీ బళిమిఁ గొనినఘనము పదివేల యొంటెలఁ। చెఱకిరాఁగ వైరిభీకరుండు వచ్చెనపుడుఁ సమితవాహినీపప హితిఁ దల్లడిల్లుమంచు సరణితెలము, భార-సభా- 1ఆ. (ఒంటెలయందు) తే గీ। అనిననలుగాఁ వాన గ వును న శష। శబ్దములమంత్రమును లోహజాతిఁ గాంచ నము నుమనుజల విప్రుండు సమధికత్వ । భాజనములంద్రు వేదప్రపంచవిదులు, భార- శాంతి- 1ఆ. (మనుజాలయందు) మొ.

23 సూ— ఉదంతజడంబుతృతీయకు నవర్ణకంబగు.

రాముఁడొక్కబాణంబున వాలింగూలనేసె - బాణముచేనని యర్థము.

వ్యా— హ్రస్వోకారంబు కడపటఁగలజడవాచకశబ్దంబుయొక్క తృతీయావిభక్తికి 'న' ప్రత్యయంబువచ్చును ఉ రాముఁడొక్కబాణంబున వాలింగూలనేసె. ఇచ్చట 'బాణంబు' అనునది జడవాచకశబ్దంబు. దీని తృతీయకు నాదేశంబుగ నవర్ణకం బయ్యెను. బాణంబుననఁగా బాణంబుచేత నని యర్థంబు. కొండొకచో నుదంతంబు గునజడవాచకశబ్దంబునోఁది తృతీయకు 'న' వర్ణకంబు మాపట్టెడిని. ఉ. ఏపునఁ

గిట్టి యేనుఁగన చేతఁ గట్టైనదు [illegible] రూపముఁ గంగవోఁడును, యు. కాం.

24 సూ.—జడంబు ద్వితీయకుం బ్రథమబహుళంబుగా నగు.

వాఁడు పూవులు దెచ్చె - వాఁడు పూవులను దెచ్చె। ఆకె సొమ్ములు దాల్చె ఆకె సొమ్ములను దాల్చె। వాఁడిల్లు వెడలె - వాఁడింటిని వెడలె॥ బాహుళకము చేఁ దృతీయాసప్తములకు విహించిన ద్వితీయకుం బ్రథమ రాదు.

వ్యా—జడవాచకశబ్దంబుయొక్క ద్వితీయావిభక్తికిఁ బ్రథమావిభక్తి బహుళంబుగాఁ గల్గును. ఉ. వాఁడు పూవులు దెచ్చె; (పూవులను దెచ్చెననియర్థము.) ఇచట పూవులు అనునది జడవా[illegible] ద్వితీయార్థంబునందుఁ బ్రథమ వచ్చెను వాఁడు పూవులను దెచ్చె, ఆకె సొమ్ములు దాల్చె; ఆకె సొమ్ములను దాల్చెను. వాఁడిల్లు వెడలె; వాఁడింటిని వెడలె. (ఇంటినుండి యని యర్థంబు. చూ-21 సూ.) ఇత్యాద్యుదాహరణమ్ములయందు ద్వితీయార్థంబునందుఁ బ్రథమయని గ్రహింపవలెను. (మూలము) బాహుళకము చేఁ దృతీయాసప్తములకు విహించిన ద్వితీయకుం బ్రథమ రాదు. వ్యా—బహుళగ్రహణంబుచేఁ దృతీయాసప్తమ్యర్థంబులయందు నిరువదిరెండవసూత్రంబుచేత విధింపఁబడిన ద్వితీయకుఁ బ్రథమ రాదు. అనఁగాఁ గర్మార్థక ద్వితీయావిభక్తికే ప్రథమావిభక్తి వచ్చునుగాని కరణాద్యర్థకమైన ద్వితీయకుఁ బ్రథమ రాదనినిష్కృష్టార్థము. (సిద్ధాంతము) వానిఁ గొక్క కోలం గూలనేసె, అనునుదాహరణంబులో కోలన్, అనెడి ద్వితీయావిభక్తి కోలతోన్, అని కరణార్థంబును జెప్పుచున్నది. లంకం గలకలంబు పుట్టె అనువాక్యంబులో లంకన్, అనిన ద్వితీయావిభక్తి లంకయందున్, అని యధికరణార్థంబును (ఆధారార్థము) జెప్పుచున్నది, కాఁబట్టి యీయర్థద్వయంబును దెలుపునట్టి ద్వితీయావిభక్తికిఁ బ్రకృతసూత్రంబునఁ బ్రథమ రాదు. ఈపరిచ్ఛేదంబులో రెండవ సూత్రంబుచే సామాన్యంబుగాఁ గర్మార్థంబునందే ద్వితీయ విధింపఁబడినందున నట్టి ద్వితీయకే ప్రకృతసూత్రంబునఁ బ్రథమయని యెఱుంగవలెను. కొన్నియెడలన జడంబు ద్వితీ

యగును బ్రథమ కానంబడియెడి. చ॥ అనిలజుఁ డుంబునం బడమనమ్మున నాఁగ మెదిర్చి క్రమ్మఱం। బినపరికాఁడువోలెఁ గురుసింహవరూథము నీల్లక్రమ్మఱం జిం।చు శా, భార-ఆది 4ఆ. చ॥ కరినికరంబులోఁ గడఁగి గర్వితుఁడై తనవారణేంద్రము। కుఱుఁడుమలవీరుమీఁద నెసకొల్పినఁ దద్రథఘోటకంబులన్, భార-అర-6ఆ. (తనవారణేంద్రముం । గురుకుల వీరుమీఁద, అని పాఠాంతరము) చ॥ ఉపహతసేయఁ దద్రథతురాయోత్తమ మొక్కఁడు గట్టి బంపుమన్, జైమి-6ఆ. (తద్రథతురాయోష్ఠము నొక్కఁడ, అని పాఠాంతరము.)

25 సూ—కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమయగు.

వాఁడు నిన్నవచ్చె - వీఁడు నేఁడువోయె - మాపునిలువుము-
రేపుపొమ్ము - వారు క్రోశమునడచిరి - వీరామడవోయిరి.

వ్యా—కాలవాచకపదంబునకును, మార్గవాచకపదంబునకును, తఱుచుగాఁ బ్రథమావిభక్తియగును. కాలవాచకపదంబులకు—ఉదా. వాఁడునిన్నవచ్చె. నిన్నటిదినమందని యర్థము. ఇచ్చట 'నిన్న' అనునది కాలంబును దెలియఁజేయుచున్నది కావున సప్తమ్యర్థంబునఁ బ్రథమవచ్చెను. వీఁడు నేఁడువోయె. నేఁటిదినమందని యర్థంబు. ఇచ్చట 'నేఁడు' అనుదానికి సప్తమ్యర్థంబునఁ బ్రథమకలిగె. 'మాపునిలువుము' సాయంకాలమందని యర్థము, ఈవాక్యంబునందు 'మాపు' అనుదానికి సప్తమ్యర్థంబునఁ బ్రథమ. 'రేపు పొమ్ము' ప్రాంతఃకాలమందని యర్థము. ఇందు 'రేపు' అనుదానికి సప్తమ్యర్థంబునఁ బ్రథమావిభక్తి. మార్గవాచకపదంబులకు-'వారుక్రోశము నడచిరి' క్రోశమాత్రమార్గమున నడచిరని యర్థము ఇచ్చట 'క్రోశ' శబ్దంబు మార్గవాచకంబుగావున సప్తమ్యర్థంబునఁ బ్రథమవచ్చెను. 'వీరామడవోయిరి' యోజనమాత్రమార్గంబున నడచిరని యర్థము. ఇచ్చట పథ్యవాచకంబైన 'ఆమడ' శబ్దంబధికరణార్థకప్రథమాంతము ఇందులకుఁ గవిచింతామణి. సీ॥ కాలవాచకముల కడమన్న సప్తమి। ప్రథమ

యును రాత్రి ప్రవర్తించె । దానంగాల మెంతవానికిఁ బోరాదు। రేయిపో యి పగలు చేరవచ్చె.

26 సూ—సర్వనామసంఖ్యాభిధానతద్విశేష్యంబుల యందెవ్వది ముందు ప్రయోగింపఁబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు.

అన్ని గుఱ్ఱములకు-అన్నింటికి గుఱ్ఱములకు-గుఱ్ఱములన్నింటికి-గుఱ్ఱముల కన్నింటికి - సాహిణులు ముప్పురు ॥ రెండు గుఱ్ఱములకు రెండింటికి గుఱ్ఱములకు - గుఱ్ఱములు రెండింటికి - గుఱ్ఱములకు రెండింటికి - సాహిణులు నలుగురు ॥ లక్ష గుఱ్ఱములకు - లక్షకు గుఱ్ఱములకు - గుఱ్ఱములు లక్షకు - గుఱ్ఱములకు లక్షకు రౌతులు లక్ష॥ ఇత్యాదు లెఱుఁగునది.

వ్యా—సర్వనామంబును, దాని విశేష్యంబును, ఈ రెండింటియందు నెయ్యది ముందు ప్రయోగింపఁబడునో దాని ద్వితీయాదివిభక్తులకుఁ బ్రథమబహుళంబుగా నగును. అట్లే సంఖ్యావాచకశబ్దంబును, దాని విశేష్యంబును, వీనిలో ముందు ప్రయోగింపఁబడు దాని ద్వితీయాదులకుఁ బ్రథమావిభక్తి బహుళంబుగా నగునని భావము, సర్వనామ విశేష్యములకు—అన్ని గుఱ్ఱములకు; అన్నింటికి గుఱ్ఱములకు, గుఱ్ఱములన్నింటికి; గుఱ్ఱములకన్నింటికి సాహిణులు ముప్పురు ఇచ్చట 'అన్ని' శబ్దము సర్వనామము. 'గుఱ్ఱములకు' అనునది విశేష్యము. వీనిలోఁ బ్రథమోదాహరణంబునందు సర్వనామంబైన 'అన్ని' శబ్దంబు మొదటఁ బ్రయోగింపఁబడినది కావున 'అన్ని గుఱ్ఱములకు' అని ప్రథమావిభక్తి యొకసారియును, వేఱొకసారి 'అన్నింటికి గుఱ్ఱములకు' అని విశేష్యంబులైన గుఱ్ఱములసంబంధి 'అన్ని' శబ్దంబునకు షష్ఠీవిభక్తియును గలిగెను. రెండవయుదాహరణమందు విశేష్యంబులైన గుఱ్ఱములు సర్వనామంబునకు ముందు ప్రయోగింపఁబడి నందునఁ బ్రథమావిభక్తి యొకపర్యాయంబును, 'అన్నింటికి' శబ్దంబునకుం బోలె 'గుఱ్ఱములకు' అనుషష్ఠి వేఱొకపర్యాయంబును వచ్చెను. సంఖ్యావాచకతద్విశేష్యంబులకు-

రెండు స్త్రీయులకు: రెండింటికి స్త్రీలకు — స్త్రీలు రెండింటికి స్త్రీలకు రెండింటికి సాహిణులు నలుగురు. ఇచ్చట ప్రథమోదాహరణంబునందు సంఖ్యావాచకమైన 'రెండు' శబ్దంబు ముందు ప్రయోగింపఁబడినందున 'రెండు' అను ప్రథమావిభక్తి యొకపర్యాయంబును, విశేష్యంబులైన స్త్రీలకుఁబోలె 'రెండింటికి' అని షష్ఠీవిభక్తి వేఱొకపర్యాయంబును, గలి రెండవయుదాహరణంబున సంఖ్యావాచకమైన 'రెండు' శబ్దంబునకు విశేష్యంబులైన స్త్రీయులు మొదటఁ బ్రయోగింపంబడినందున 'స్త్రీలు' అని ప్రథమావిభక్తి యొకసారియును, 'రెండింటికి' అనిన సంఖ్యావాచకంబునకుంబోలె 'స్త్రీలకు' అను షష్ఠీ వేఱొకసారియును. గలిగె. లక్ష స్త్రీలకు — లక్షకు స్త్రీలకు స్త్రీలు లక్షకు; స్త్రీలకు లక్షకు రవుతులు లక్ష ఇచ్చట పైనిఁజెప్పిన సంఖ్యావాచకవిశేష్యంబుల యుదాహరణంబులవలె లక్షణంబు సమన్వయింపఁ బడినదికావున నిచ్చటను నట్లే సమన్వయించుకోవలెను. పైని రవుతులులక్ష, [redacted] మహద్విశేషణసంఖ్యావాచకంబునకు నమహార్థ్యంబు గానంబడినందులకు లక్ష్యంబులు ఆచ్ఛిక సూ- 24- వ్యాఖ్యయందు నుదాహరింపఁ బడియె. కావుననచ్చటఁ జూచుకొనునది. (రవుతులులక్షసంఖ్యవారని భావింపకొనునది.)

27 సూ — ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాషను.

సుగుణాభిరాముఁడు రామునకు జోహారువొనర్చెను - సుగుణాభిరామునకు జోహారువొనర్చెను.

వ్యా — కొన్నిచోటుల షష్ఠ్యంతవిశేషణంబులకుఁ బ్రథమావిభక్తి వైకల్పికంబు గానగును. ఉ. సుగుణాభిరాముఁడు రామునకు జోహారు వొనర్చెను; సుగుణాభిరామునకు రామునకుజోహారు వొనర్చెను. ఇచ్చట 'రామునకు' అనునది షష్ఠ్యంతవిశేష్యంబు

సమన్వయించున్. శ్రీ మీపనువున రాజ్యము లీపాండుతనూభవులకు నీకున్నభు
జా లోపభయంకరుఁడర్జును కోపానలమునఁబడి మిట్టిగొనదే నారీ, భా-ఉద్యో-
1ఆ. ఉ॥ మీకు మాఱాడెడ్ | విగ్రహవేళ నయ్యముని విస్ఫుఁడు కోపనంబుఁజా
ఙ్ఘ్రిని | ప్రాగ్రిపురుండు ధర్మసుతు పన్నిదనీకు సమస్యమిత్తునీ, భాగ-ఆ-6 ఉ
పద్యంబులలో భుజాలోపభయంకరుఁడు, అనుపద్యాంశము (అర్జునకోపానల
ము, అను షష్ఠీతత్పురుషంబులోకనే దేశ్యంబునులు షష్ఠీకంబును నైనయర్జునశబ్దంబునకు
విశేషణంబుగా నన్వయించుమన్నదిద్వితీయపద్యంబులో (పార్థివపాగ్రిపురుండు, అను
పదాంతంబు ధర్మసుతపన్ను అనషష్ఠీతత్పురుషంబులోనేకదేశంబునును, షష్ఠీకంబు
ను, నైనధర్మశబ్దంబునకు విశేషణంబుగానన్వయించుమన్నది. ఇట్టివి పెక్కులుప్రయో
గంబులుగలవు ఇట్టిప్రయోగంబులుశాస్త్రదృష్టిచేనాలోచింపఁగాధారాళమైనవి కావని
చెప్పవలయును, సమాసపరిచ్ఛేదంబులోఁ బ్రథమసూత్రంబుచే సామర్థ్యంబుగలపదంబు
లకు సమాసంబు విధింపఁబడినది సామర్థ్యంబనఁగా వ్యస్తగృహీతంబులగునర్థంబుల కేకార్థీ
భావంబనియుఁ, బ్రకృతిసిద్ధార్థంబులగు పదంబుల కేకార్థంబునందు వృత్తిసామర్థ్యంబ
నియు, వివరింపంబడియె. కనుక (అర్జునకోపానలంబు, అన్నసమాసంబులో నర్జునుం
డును, కోపాగ్నియు నిట్లు వేర్వేఱుగా రెండుపదార్థంబులు స్ఫురింపమన్నను నర్జు
నుండు కోపాగ్నికి విశేషణంబై కోపాగ్ని విశేష్యంబై విశేషణ విశేష్యభావంబున
నర్జునసంబంధి కోపాగ్నియనెడి యఖండార్థంబు స్ఫురించుచున్నయది. లోకం
బులో వేఱువేఱుగా నున్నతంతువు (దారములు) లనెడి బహుపదార్థంబుల
వశ్యైక్యము మేళగించినపిమ్మట వస్త్రమనెడి యేకపదార్థంబగుచున్నది. బహు
సంఖ్యగానున్న యిష్టకలను (ఇటుకలను) నొండొంటిపైదృఢంబుగాఁ జేర్చినపిద
పఁ గుడ్య (గోడ) మనెడి యేకపదార్థంబు కలుగుచున్నయది. చిందఱవందఱలై
భిన్నంబులుగానున్న శిరోజంబు లల్లిబిల్లికతో నల్లఁబడినపుడు జడయనెడి యేక
పదార్థంబు జనించుచున్నయది తంతువులకుఁ బటంబ (వస్త్రము) నెడివ్యా
జంబున, నేకార్థవ్యక్తి కలిగినపిమ్మట వేఱుగానున్న యింకొకతంతువునకుఁ బ
టాంతర్గతమైన తంతువుతోఁ గలియుట దుర్లభంబు. పరస్పరమిళితంబులైన యిష్టక
లు కుడ్యంబనెడి వ్యవహారంబును బొందినపిమ్మట నట్టికుడ్యంబులో నేకదేశవర్తియైన
యిష్టకతో వేఱొక యిష్టకకు సంబంధంబు దుర్లభంబు. శిరోరుహంబులు పరస్పరమే

వ్యా— అగు. అవు డౌ, (సోఁ ఖాతుగ్రార్థ విశేషణంబులు) అయిన (ఐన. (భూతార్థకవిశేషణంబులు) కాని, (వ్యతిరేకార్థకవిశేషణ) ఇత్యాది భవత్యర్థకంబులచే (విశేష్యంబులకు) వెడపబడిన విశేషణంబులపైఁ బ్రయోగింపఁబడును. ఉ. విద్యాశాలియగుపురుషుని సకలజనులు సన్మానింతురు. ఇట విద్యాశాలి అను విశేషణంబు 'పురుషుని' అను ద్వితీయాంతవిశేష్యంబునకు సంబంధించియున్నందున ద్వితీయాంతంబు కావలసియున్నను అగు, అయిన భవత్యర్థకశబ్దవిశేషణంబుచే వ్యవహితంబగుటంజేసి ప్రథమావిభక్త్యంతంబైయుండె. అగు అను భవత్యర్థకంబులేనియెడల విద్యాశాలిని పురుషుని సకలజనులు సన్మానింతురు అని ద్వితీయాంతంబుగ నుండవలయు. ఇట్లే 'భూతదయాపరులు మహాత్ములు శ్రేయంబు గలుగును' అభిమానపమత్త్వదుర్మతమతిగమ్యమయిన కేశవార్జునకృతి ఇత్యాదిస్థలంబులయందు నీసూత్రముచేఁ బ్రథమావిభక్తి విశేషణంబులకు గలిగెనని తెలియునది.

29 సూ.—భవత్యర్థకంబు సన్నిహితవిశేషణంబునకును దానిముందువిశేషణంబులకయిపదంబును బహుళంబుగానుప్రయుక్తంబగు.

అతులుఁడయియప్రమేయుఁడౌ హరినిగొలుతు

వ్యా—భవత్యర్థకంబులైన 'అగు' 'డౌ' శబ్దంబులు విశేష్యంబునకు నవ్యవధానంబుగఁ బూర్వమందున్న విశేషణంబులపైనగను వేఱుగానున్న విశేషణంబుపై 'అయి' 'ఐ' అనుక్త్వార్థకావ్యయంబులుపయోగింపఁబడును ఉ. అతులుఁడయియప్రమేయుఁడౌ హరినిగొలుతు ఇందు (హరి), అను విశేష్యంబునకు (అప్రమేయుఁడు, అనునది సమీపవిశేషణంబుగావున దానిపైని భవత్యర్థకమైన 'డౌ' అనునది ప్రయోగింపఁబడె అతులుఁడు అను విశేషణంబు హరికి దూరవర్తియగుటంజేసి దానిపై అయి అనునది చేర్పంబడియె

30 సూ.—అయిపదానుప్రయోగంబులేనిచోఁ దుదివిశేషణంబునకేనివిశేషణంబులన్నింటికేని మీఁదసముచ్చయార్థంబువిభాషంబ్రయోగింపంబడు.

ఆద్యుఁడప్రమేయుఁడునగు హరినిఁగొలుతు ఆద్యుఁడు నమేయ గుణుఁడునౌ హరినిఁగొలుతు ఆద్యుఁడప్రమేయుండగు హరినిఁగొలుతు

వ్యా— అయి. అనుపదము దూరస్థవిశేషణంబుపైఁ జేర్పనియప్పుడు తుది విశేషణంబునకుఁగాని, విశేషణంబులన్నింటికిఁగానిఁ సముచ్చయార్థకశబ్దంబు విభాషగా జోడింపఁబడును ఈ ఆద్యుఁడప్రమేయుండునగు హరినిఁగొలుతు ఇయ్యెడ ఆద్యుఁడు, అనువిశేషణంబుకంటె ,అయి, పదంబు మానంబడినందునఁ దుదివిశేషణంబైన అప్రమేయుఁడు, అనుదానికి సముచ్చయార్థకంబైన ,ను శబ్దంబు చేర్పంబడినది ఆద్యుఁడునమేయగుణుఁడునౌ హరినిఁగొలుతు ఇచ్చోట నన్నివిశేషణంబులకును సముచ్చయార్థక ,ను, శబ్దంబు చేర్పఁబడియె ,ఆద్యుఁడప్రమేయుండగు హరినిఁగొలుతు ఈవిధి వైభాషికంబు గావున నీయుదాహరణంబునందు విశేషణంబులలో దేనికిని సముచ్చయార్థక ,ను, శబ్దంబు చేర్పంబడలేదు

31 సూ. ధాతుజవిశేషణవ్యవధానంబునవిశేషణంబులన్నింటి కయిపదంబను ప్రయుక్తంబగు.

ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడైయెసంగెడు దేవుని నభినుతింతు ఇచట మఱియుం బ్రయోగవైచిత్ర్యంబుగలదది ప్రయోగంబుల నెఱుంగునది.

వ్యా—విశేష్యంబునకుఁ ధర్మస్త్రమర్థకవిశేషణం బవ్యవధానంబుగాఁ బూర్వంబందుండినచోఁ దక్కినవిశేషణంబు లన్నింటిపైని ,అయి, పదంబు చేర్పంబడు ఈ ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడై యెసంగెడు దేవుని నభినుతింతు ఇచ్చట ,ఎసంగెడు, అను క్రియాజన్యవిశేషణంబులో విశేషణవిశేష్యంబులెడఁజొచ్చియున్నవి కావున ,ఆద్యుఁడు అప్రమేయుఁడు, అఖిలసేవ్యుఁడు' అను విశేషణంబులన్నింటికిని అయి అనుపదంబు చేర్పంబడియె (మూలము) ఇచ్చట

మఱియుం బ్రయోగవైచిత్ర్యంబుగలవని ప్రయోగంబుల నెఱుంగునది (వ్యా) ప్రయోగవైచిత్ర్యంబునా సూత్రంబునం జెప్పినరీతిగా నాయా పదంబు లెల్లవిశేషణంబులకును ననుప్రయుక్తంబు గాక కొన్నివిశేషణంబులకును గతిపయవిశేషణంబులకును, ననుప్రయుక్తంబు గాఁగఁ దత్ప్రయోగంబులు గ్రంథంబులయందుఁ గలవు కావున అయ్యెడఁ దత్ప్రయోగములకు నఖిలసేవ్యుఁడై యొప్పెడు దేవుని నుతింతు ఇత్యాది ప్రయోగవైచిత్ర్యంబు లుండవచ్చునని భావంబు

32 సూ —భావార్థకాదియోగంబునం గర్తకుఁ బ్రథమయగు.

రాముఁడువచ్చుట - రాముఁడు రాఁగా లక్ష్మణుఁడుగాంచె - రాముఁడువిల్లందినం ద్రిలోకంబులాకులంబులగు - రాముఁడు పట్టినవ్రతిన వారింపంపరంబుగాదు.

వ్యా—భావంబనఁగా ధాత్వర్థము భావార్థమందుఁ గ్రియాపరిచ్ఛేదంబులోని ముప్పదియైదవసూత్రంబుచే ట, వర్ణకంబును ముప్పదియాఱవసూత్రంబున కజె వర్ణకంబును, ముప్పదియేడవసూత్రమ్ముచే వ్యతిరేకభావంబున మిజ్ప్రత్యయంబును, విధింపబడినవి కావునన్ జెప్పినటువంటి కాదులు భావార్థకంబులు ఆదిశబ్దంబుచే నలుపదవసూత్రంబుచే నయిన భావలక్షణార్థంబునందలి నజ్ [illegible] దయొకండవసూత్రంబుచేనయిన ద్రుతాంతనవర్ణకంబును, నలుపదిరెండవసూత్రంబులోని డు, వర్ణకంబును, నలుపదియాఱవసూత్రంబులోని ధాత్వర్థకనవర్ణకంబును, ఇత్యాదిప్రత్యయంబులూహించుకొనునది ఈప్రత్యయాంతశబ్దంబులతో నన్వయించిన కర్తకుఁ బ్రథమావిభక్తిగలుగును ఈ రాముఁడువచ్చుట ఇచ్చట ట వర్ణకాంతవచ్చునాతువుతో రామునకు నన్వయంబుకానఁ బ్రథమవచ్చెను సంస్కృతభాషలో నిట్టిభావార్థకతింతస్థలంబులోఁ గర్తకుఁ దృతీయయగును రాముఁడువచ్చుట = రామేణాగమ్యతే ఇట్లు సంస్కృతాంధ్రభాషల శైలిం జేసికొన్నిచోటులఁ బ్రయోగింపఁబడు చూపట్టెడి. ఈ రాముఁడు రాఁగా లక్ష్మణుండు గాంచె, ఇచ్చట రాక, అనునది మఱివర్ణకాంతము ఈశబ్దంబునకుఁ గ్రియాపరిచ్ఛేదంబందలి నూటపదునేనవసూత్రంబుచే

ఁనుఁడి, వర్ణకాంతంబైన యగుధాతు వనుపయుక్తంబుగాఁగా రాఁగా అనురూపం బునిష్పన్నంబాయె ధాత్వర్థంబైన వచ్చుక్రియకు రాముఁడు కర్తగావున రామశబ్దంబు కంటెఁ బ్రథమావిభక్తి కలిగెను ఁఉ రాముఁడు విల్లందినప్డు త్రిలోకంబు లాకులంబగు, ఇచ్చట ఁఅందినన్, అనెడి నవర్ణకాంతంబునకు రాముఁడు కర్త కాఁబట్టి ప్రథమవచ్చెను ఁఉ రాముఁడు పట్టినప్రతిన వారింపదరంబుగాదు, ఇచ్చట ఁపట్టిన, అనెడిక్తవదర్థక నవర్ణకాంతశబ్దంబుయొక్క యర్థంబునకు రాముఁడు కర్తగావున వెనుకటిరీతిగ రామ శబ్దంబుకంటెఁ బ్రథమవచ్చెను జాబిలితోఁ తెంచ డుం కువలయంబులు వికసిల్లె ఇచ డువర్ణకాంతంబైనతోఁతెంచుధాతువుయొక్క యర్థంబునకు జంద్రుఁడు కర్త గావున జాబిలిశబ్దంబుకంటెఁ గర్త్రర్థద్యోతకంబై ప్రథమావిభక్తి కలిగెను. ఇట్లు —ఁరాముఁడు వందకమునువు ఁరాముఁడువంపెమి ఇత్యాదులం బ్రథమ యూహ్యంబు.

33 సూ —ప్రథమాంతంబులగు యుష్మదస్మద్విశేషణంబులకే కత్వంబున వు ~~[illegible]~~ రు ములునంతాగమంబులు ప్రాయికంబుగనగు

వ్యా— యుష్మదస్మచ్ఛబ్దంబులైన నీ నా శబ్దవిశేషణంబులు ప్రథమావిభక్త్యంతంబులైనప్పుడే ఏకవచనంబునఁ గ్రమంబుగా నీశబ్దవిశేషణంబుపై వువర్ణాగమంబును, నాశబ్ద విశేషణంబుపై నువర్ణాగమంబును బహువచనంబున నీశబ్దవిశేషణంబుపై రువర్ణాగమంబును, నాశబ్దవిశేషణంబుపై ము వర్ణాగమంబును దఱచుగాఁ గలుగును.

34 సూ —ఈయాగమంబులు పరంబులగునపుడుత్వంబున కత్వంబగు.

నీవుధన్యుఁడవు - నేనుధన్యుఁడను - మీరుధన్యులరు - మేము ధన్యులము ॥ ఇకారంబుమీఁది కునుప్రక్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగునను సూత్రముచేత వుకారకిత్వంబగు - నీవుసుకృతివి - నేను

వాఁడును మీఁరును ధన్యులరు । మీఁరును మేమును ధన్యులము.

వ్యా—ప్రథమ మధ్యమోత్తమ పురుషంబులకార్యంబులకు నొక్కచో సమావేశంబు గలిగినప్పుడు క్రమంబుగాఁ బరకార్యంబు ప్రబలంబు. అనఁగా నొకవాక్యంబులోఁ బ్రథమ మధ్యమ పురుషంబులకు సమావేశంబు గలిగినప్పుడు క్రియావిభక్తి మధ్యమ పురుషంబులోఁ జేరవలయును. మధ్యమోత్తమ పురుషంబులకు నేకవాక్యంబులో సమావేశంబు గలిగినప్పుడు క్రియ యుత్తమపురుషమై యుండునని తాత్పర్యము. ఉ. 'వాఁడును మీఁరును ధన్యులరు', ఈవాక్యంబునందు 'వాఁడును' అను తచ్ఛబ్దంబునుబట్టి ప్రథమపురుషంబును, 'మీఁరును', అను యుష్మచ్ఛబ్దంబునుబట్టి మధ్యమపురుషంబును, ప్రాప్తించుచుండఁ బరత్వకసూత్రంబుచేఁ గ్రియావిభక్తి మధ్యమపురుషంబుతో నన్వయించినది కావున సుప్తిఙ్యోగంబు సుప్తిఙ్నాల్గు సూత్రంబులచే 'రు', శబ్దాగమత్వంబును గల్గి 'ధన్యులరు', అనురూపంబాయెను. 'మీఁరును మేమును ధన్యులము', ఈ వాక్యంబునందు మధ్యమపురుషోత్తమ పురుషంబులున్నందునఁ గ్రియావిభక్తులవిధికి సంశయంబురాఁగాఁ బరత్వసూత్రంబున నుత్తమపురుషకార్యంబు ప్రబలంబై సుప్తిఙ్మాఁదిహ్యసూత్రంబుచే ముశబ్దాగమంబును, సుప్తిఙ్నాల్గవసూత్రంబున నత్వంబును, గల్గినది. వాస్తవంబున నాలోచింపఁగా 'వాఁడునుమీఁరును ధన్యులరు', అనువాక్యంబునందు 'మీఁరును', అనిన యుష్మచ్ఛబ్దార్థంబునకే 'వాఁడును', అనినతచ్ఛబ్దార్థంబును బ్రధానాంశంబగుటవలనను, ప్రధానాంశంబు శాస్త్రంబునందేపి కర్తగానుండుటవిధేయాంశవలనను, కర్తకుఁ గ్రియాన్వయము ముఖ్యముగనుండుటవలనను, 'వాఁడును' అనినతచ్ఛబ్దార్థంబు నగుణభూతంబై క్రియతో నన్వయంబు తప్పక యుండెడిదియున్నది. కావుననే ధన్యత్వము యుష్మదర్థంబునందు సంబంధించినట్టులే తచ్ఛబ్దార్థంబునందుంగూడ నన్వయించును, 'మీఁరును ధన్యులరు, వాఁడును ధన్యుఁడు', అని స్ఫురించుచున్నది, అందున 1 వాఁడును 2 మీఁరును 1 ధన్యుఁడు, 2 ధన్యులరు, ఇట్లుండ 'రాములు', అనిన బహువచనాంతమైన యువాక్యార్థంబునందుఁ బక్కన రెండు రామశబ్దంబులును లోపించియొక్క రామశబ్దంబె శేషించినట్టులు 'ధన్యుఁడు' అనిన ప్రథమపురుషంబు లోపించి 'ధన్యులరు' అనినమధ్యమపురుషంబు శేషించినదనియు, భాషాపరిపాటింజేసి తెలియవలెఁ బ్రథమపురుష మధ్యమపురుషంబులకు సముచ్చయంబున మధ్యమపురుషంబునకు నేక శేషంబు గలుగు ననియు, మధ్యమోత్తమ పురుషంబులకు సముచ్చయంబున నుత్తమపురుషంబునకు

సముచ్చయంబు గలుగవచ్చియు, నూహింపవలయును. మ॥ అవమాన్యుల్ సభలోన మాన్యు
డని సాహార్దంబునం గౌరవ స్థవిర పేర్కొన నిన్నుఁ బాండుతనయుల్ దప్పంగఁబూజిం
చిర య్యవివేకాస్పదులైన పాండవులు గాంగేయుండు భీష్ముండు నే శివనీవుంగడఁగుండు
వాసుదేవుండు సంగ్రామరంగంబునన్' భార-సభా. 2 ఆ. అనుపద్యంబునందు 'నవివేకా
స్పదులైన పాండవులు కడంగునది. భీష్ముండు కడంగునది నీవుకడంగుము అని పాండవ
భీష్మకృష్ణులు ముగ్గురును గ్రియాకర్తలైనట్టులు స్ఫురించుచున్నది. ఇటుఁ బ్రథమపురు
షంబు లోపించి మధ్యమపురుషంబున క్రియ శేషంబు గలిగినది. తక్కినపురుషంబులు
లోపించినట్లు గానంబడదు, అనినబహువచనంబే తెలుపుచున్నది. ఇట్టిపురుషంబుల
సమావేశంబున సంస్కృత భాషయందును, ఆంధ్రభాషయందును, గొంచెము సాదృశ్యంబున్నం
దున బాలవ్యాకరణంబులో నుదాహరింపఁబడిన తెలుఁగువాక్యంబులు సంస్కృతంబు
లోనికి మార్చి చూపఁబడుచున్నయవి. 'వారును మీరును గన్యలకు' దీనికి సంస్కృ
తము 'యూయంకన్యాః' అని యగును. త్యదాదీనామ్మిథస్సహోక్తౌ యత్పరం త
చ్ఛిష్యతే, అను సాంస్కృతిక వ్యాకరణంబునఁ బైవాక్యంబులోని 'యూయం, అను
రూపంబు, తేచ(వారును) యూయంచ(మీరును)=యూయం (వారును,మీరును), అను
నర్థంబుంగల రూపంబగును. త్యద్ శబ్దంబు మొదలైన శబ్దంబులకు నన్యోన్యము సహ
వాసంబు గలిగినప్పుడు త్యదాదిగణంబులోఁ బాఠక్రమంబున నేదిశబ్దంబు పరంబోయది
శేషించి తక్కినయదిలోపించునని యర్థము. త్యదాదులు—త్యద్, తద్, (వాఁడు,అది)
యద్ (ఎవఁడు,ఏది) ఏతద్, ఇదం, అదస్ (వీఁడు,ఇది) ఏక, ద్వి, (ఒకటి,రెండు).
యుష్మద్ (నీవు)అస్మద్ (నేను) భవత్ (నీవు),అనునీయవి ద్విశబ్దంబువఱకేకాక భవచ్ఛ
బ్దమువఱకు నీవార్తికంబులోఁ ద్యదాదులని వ్యవహరింపఁబడుచున్నవి ఈశబ్దార్థంబులకు
సముచ్చయంబుసంభవించినప్పుడు పైగణపాఠంబులోఁ జూపినక్రమంబున నేశబ్దంబుపరమో
యది శేషించితక్కినశబ్దంబులోపించు. 'యూయం'అనునపుడు 'తేచ,యూయంచ(వారు
ను, మీరును)అన్నవృత్తి పైనిం జూపఁబడియె. ఈవృత్తిలోఁ దచ్ఛబ్దార్థంబును,యుష్మచ్ఛ
బ్దార్థంబును, మిళితంబులై యున్నయవి. పైగణపాఠంబులోఁ దచ్ఛబ్దంబుతరువాత
యుష్మచ్ఛబ్దంబు పఠింపబడినందునఁ బూర్వోక్తసూత్రంబుచేఁ దచ్ఛబ్దంబు లోపించి
యుష్మచ్ఛబ్దంబు శేషించినది. ఇట్లు 'యూయం' అనినయుష్మచ్ఛబ్దంబు శేషించినప్ప
టికి నాభాషయందు 'వారును మీరును, అనునర్థంబు చెప్పికొనవలయును, అనఁగా

దచ్ఛబ్దంబు లోపించినను దాని యర్థంబుమాత్రంబు లోపింపక యేకశేషవృత్తిలోనిమిడి యున్నయది. ఇట్లు సంస్కృతంబులో 'తేచ యూయంచ' అనుసుబంతంబులకు నేకశేషము గలిగినప్పుడు పరమైనయుష్మచ్ఛబ్దంబే మిగిలినప్పటికిఁ దచ్ఛబ్దార్థము పోనియట్లులు తెలుంగుభాషయందేని 'వారును మీరును ధన్యులరు' అను వాక్యంబులోఁ ద్యదాని పర్యాయంబులైన 'వారును మీరును' అనువానికి నేకశేషంబు గలుగక వాని విధేయవిశేషణంబులకును, వాని క్రియలకును నేకశేషంబు సంభవించి తదర్థముపోదని గ్రహింపవలయును. పై తెలుంగువాక్యంబులో ధన్యులరు, అన్నది విధేయవిశేషణంబు. పైసంస్కృతవాక్యంబులో 'యూయం' అనునప్పుడు 'తేచ(వారును)' అన్నయర్థంబిమిడియున్నట్లే 'ధన్యులరు' అన్నప్పుడు 'ధన్యులు' అనిన ప్రథమపురుషంబిమిడి యున్నయది. యానియు, సాంస్కృతభాషయందేని ప్రథమపురుష మధ్యమపురుష సమావేశంబున మధ్యమపురుషంబు శేషించుననియు, మధ్యమపురుషోత్తమపురుష సమావేశంబున నుత్తమపురుషంబునకు నేకశేషంబు గలిగి మధ్యమపురుషంబు లోపించుననియు, లోపించిన పురుషంబుల యర్థంబు శేషించిన పురుషంబులలోనే యిమిడి యుండుననియు గ్రహించునది. కావుననే పైచిన్నయసూరికృతసూత్రంబులో 'ఉత్తమోత్తరకార్యంబులు బలవంతి' చెప్పంబడినందునఁ బ్రథమాదిపురుషంబుల యర్థంబులు, నిర్బాధంబుగ స్ఫురించుననితోఁచుచున్నది. ఇఁకను మీరును మేమును ధన్యులము, అను తెలుంగువాక్యంబునకు 'వయంధన్యాః' అన్న సంస్కృతవాక్యంబు పర్యాయంబగు (పైవాక్యంబులోని) 'వయం=యూయంచ, వయంచ (మీరును మేమును)' అనిన యస్మచ్ఛబ్దంబుచేతనే యుష్మచ్ఛబ్దార్థ మేకశేషవృత్తిచే గ్రహింపబడుచున్నయది. 'ధన్యాః' అనునట్టి ధన్యశబ్దార్థంబుకూడ లోపించిన యుష్మచ్ఛబ్దంబుయొక్క యర్థంబుతో సమన్వయించుచున్నది. (పైవాక్యంబులోని) 'ధన్యాః'= ధన్యాశ్చ ధన్యాశ్చ (ధన్యులరు, ధన్యులము), అని యేకశేషవృత్తిచే నుభయశబ్దార్థంబులకును సమన్వయించును. 'వయం ధన్యాః, యూయం ధన్యాః' అనువాక్యంబులలో లోపించిన యుష్మచ్ఛబ్దార్థతచ్ఛబ్దార్థంబులకు సమన్వయించుటకై 'ధన్యాః' అను చోటునం గూడ నేకశేషంబైనయట్లులు 'వారును మీరును ధన్యులరు, మీరును మేమును ధన్యలము' అనిన ధన్యశబ్దంబునొద్ద నేకశేషవృత్తి యున్నదనియు, వాక్యంబులో స్థితంబులైన పైరేఖానిర్దిష్టతచ్ఛబ్ద యుష్మచ్ఛబ్దార్థంబులలో సమన్వయించుననియు గ్ర

చెప్పుమని యడిగినఁ జెప్పనివాఁడును సత్యము చెప్పనివాఁడును ఘోరనరకపంకమునఁ బడుద్రు, భార-ఆది- 2ఆ ఇత్యాద్యుదాహరణములయందు కర్తలు బహువుగానుండి క్రియ బహువచనంబునందున్నదో నిర్బంధము. (కా. బలవంతుఁడుపయినెత్తిన బలహీనుఁడును గోలుపడినయతఁడు ముచ్చిలి చేనున్నతఁడుఁ గాముకులచిత్తుఁడు నిద్రలేక యుండుదురధిపా!, భార- ఉద్యో- 2ఆ. గీర్వాణభాషయందును కర్తృబహుత్వంబున్నను క్రియ యేకవచనములో నుండుట తెలియఁగలదు. శ్లో. జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః, రామాయణము సుందరకాండ. 42 సర్గ (అతిబలుండైన రాముఁడును లక్ష్మణుండును జయించెను) శ్లో. పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః, పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః, మహాభారతభీష్మపర్వఘటిత భగవద్గీత-ప్రథమాధ్యాయము (కృష్ణుండు పాంచజన్యంబును అర్జునుండు దేవదత్తంబును, భీముండు పౌండ్రంబనుశంఖంబును, బూరించెను) శ్లో. సఖా గరీయాన్ శత్రుశ్చ కృత్రిమః, మాఘము 2 సర్గ-36 శ్లో (కృత్రిమశత్రువును, కృత్రిమస్నేహితుండును, బలీయుండు) శ్లో. మదేన భాతి కలభః ప్రతాపేన మహీపతిః, కువలయానందము దీపకాలంకారము. (మదముచేత ఏనుఁగుగున్నయుఁ బ్రతాపము చేత రాజును బ్రకాశించును.)

37 సూ—ఏకవాక్యంబునందొకానొక్కొండుతక్క సర్వపదంబులు క్రమనిరపేక్షంబుగఁ బ్రయోగింపఁజను.

పూర్వమిది పరమిదియను నియమమునుపేక్షింపక వాక్యమందెల్ల పదంబులు వలచినట్లు ప్రయోగింపఁదగును - ఏనిప్రభృతిశబ్దములు కొన్నినియమసాపేక్షంబులయియుండు - గాలిచల్లగావీచెను - వీచెనుజల్లగాగాలి - చల్లగాగాలివీచెను - వీచెనుగాలిచల్లగా - గాలివీచెనుజల్లగా - చల్లగావీచెనుగాలి.

వ్యా—వాక్యంబునందు నొకానొకపదంబుతప్ప నన్నిపదంబులు నాపదముతరు

వాత నీపదమే ప్రయోగింపవలయునని వరుసలో నియమ మవసరంబులేకుండ వాక్యంబునందుఁ పదంబులు వాక్యార్థంబు చెడకుండునట్లుగ యథేచ్ఛం బ్రయోగింపవచ్చును. (మూలము) పూర్వమిది పరమిదియను నియమ మపేక్షింపక వాక్యమందెల్లపదంబులు వలచినట్లు ప్రయోగింపందగును. (స్పష్టము) (యు॰) ఏనిప్రభృతిశబ్దంబులుకొన్ని నియమసాపేక్షంబులయియుండు; 1. గాలి చల్లగా వీచెను 2. వీచెను చల్లగా గాలి 3. చల్లగాగాలి వీచెను, 4. వీచెనుగాలి చల్లగా 5. గాలివీచెను చల్లగా 6. చల్లగావీచెనుగాలి.

వ్యా—ప్రభృతిశబ్దంబుచేత 'పోలెన్, వలెన్, అట్లు, అయ్యును, పొంటెన్,' ఇత్యాది పదంబులు నియమం బపేక్షించి ప్రయోగింపంబడు. అనఁగా ఏని, శబ్దాదులు తమయర్థంబేపదంబులయర్థంబులతో నన్వయింపునో యాపదంబులయొద్దనే వచనకావ్యమందు గాని పద్యకావ్యమందుఁ గాని ప్రయోగింపందగునుకాని తమయన్వయించు నాకాంక్షింపు పదార్థంబులకు దూరంబునఁ బ్రయోగింపఁబడఁ గూడదు ప్రథమోదాహరణంబునందు 'వీచెను' అనుశబ్దంబునందలి క్రియావిభక్తిచే నాకాంక్షితంబై 'గాలి' అనుకర్త 'వీచు' క్రియతో నన్వయించుచున్నయది. కానఁ గర్తయును, క్రియయును సాన్నిధ్యనియమంబు ప్రాప్తించుచుండెఁగాఁ బదార్థంబులకు వ్యవధానంబున్నను దోషంబు లేదనుటంజేసి 'చల్లగా' అను క్రియావిశేషణంబు 'గాలి' 'వీచెను' అనుశబ్దంబులకు మధ్యగానున్నను దోషంబులేదు. ద్వితీయోదాహరణంబునందుఁ గ్రియ మొదటనుండినను 'చల్లగా' అను క్రియావిశేషణంబు క్రియాకర్తల మధ్యనుండి యెడముకలిగించుచున్నను దోషంబు లేదు. తృతీయోదాహరణంబునందు 'చల్లగా' అనునది క్రియావిశేషణంబుగావున 'వీచెను' అనుక్రియయొద్ద నుండుట యత్యావశ్యకంబైనను దూరస్థితివలన వాక్యంబనర్థకంబుగాదు. చతుర్థోదాహరణంబునందుంగూడఁ గర్తకు మున్నే క్రియయున్నను 'చల్లగా' అనుక్రియావిశేషణంబు దూరస్థంబైనను నశాస్త్రీయంబుగాదు. పంచమోదాహరణంబునందు విశేషణంబు విశేష్యంబునకు ముందుండుట యవసరంబుగావున 'చల్లగా' అనక్రియావిశేషణంబు 'వీచెను' అనుదానికి ముందుండుట యుక్తంబు. ఇటం గ్రియ తరువాత నున్నను గుణంబె. షష్ఠోదాహరణంబునఁ గర్తకుఁ బూర్వంబునఁ గ్రియయున్నను సరసంబు. సంస్కృతభాషయందుంబలె నాంధ్రభాషయందును వాక్యంబున నన్వయక్రమంబు నపేక్షించి పదంబులు ప్రయోగింప నత్యావశ్యకత లేదుగనుక నే 'స్వాహితాశ్చసర్వేష్యుః' అనివన్నయభట్టారకపండితాగ్రేసరుండు సూత్రంబు రచియించెను

ను మాతృశబ్దంబు కడపటిపదంబునకు ముందు రాలేదు. కావున రేఫాదేశయుక్తంబు గాని యానఙాదేశయుక్తంబుగాని కాలేదు. ఉ॥ క్షత్రియవంశ్యులై ధరణిఁగావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ। క్షత్రియవైశ్యశూద్రులనఁగాఁ గలనాలుగు జాతులన్ స్వచా। రిత్రము దప్పకుండఁగఁ బరీక్షితుఁగాచిన యట్లు రామమాం। ధాతృరఘుక్షితీశులు మునంబునఁ గాచిరి యేయుగంబునన్, భార-ఆది. 2 ఆ. ఈపద్యంబునందు మాంధాతృరఘుక్షితీశులు., అనిన ద్వంద్వంబునందు మాంధాతృశబ్దంబు రేఫాదేశయుక్తంబై భారతంబునందున్నట్లెంచియుడినము సూరకవి. గీ॥ ధర ఋకారాంతశబ్దంబు ద్వంద్వమైన। రేఫమగుచుఁ బ్రవర్తిల్లుదృష్టముగాను। పత్రివరహయవాగ్వసూనేత్రముఖను। రాభివందితపాదాబ్జుయున్నయట్లు, కవిసం-ప్రథమ-28 ల. అనుపద్యలక్షణంబునకు లక్ష్యంబుగాఁ జూపెను. అప్పకవి పైపద్యచతుర్థపాదంబునందు మాంధాతృశబ్దంబు భారతరచనాసమయంబున ఋకారాంతంబుగానే రచింపఁబడినదనియెంచి రేఫశ్లిష్టమైన యక్షరంబులకు రేఫశ్లిష్టంబుగాని యక్షరంబు ప్రాసంబుగానుండవచ్చు నన్నదానికిఁ బైపద్యం బుదాహరణంబుగా నిరూపించెను. కొన్ని ప్రాచీన భారత పుస్తకంబుల రేఫయుక్తంబుగాను, మఱికొన్నిటియందు రేఫవిరహితంబుగాను మాంధాతృశబ్దం బుండవచ్చును కావునఁ బూర్వోక్తకవు లిద్దఱును ఉభయవిధంబుగా నభిప్రాయపడిరి శాస్త్రంబున మాంధాతృరఘుక్షితీశుల అన్న ద్వంద్వంబులో రఘుక్షితీశబ్దంబు సమాసచరమపదంబు (కడపటిపదంబు) కానదానికిఁ బూర్వంబునందున్న మాంధాతృశబ్దంబునకు రేఫాదేశంబు రావచ్చును. ఆయాదేశంబు విభాష గావున మాంధాతృశబ్దంబు ద్వంద్వంబందు ఋకారాంతంబుగానుండవచ్చును. మాతాపితలు, అన్న ద్వంద్వంబునందు రేఫాదేశాభావంబునందు నానఙాదేశంబువలె మాంధాతృరఘుక్షితీశులు, అన్న చోటున రేఫాదేశంబు రానియపుడు నానఙాదేశంబు రాదు. ఆనఙ్బుతో ద్వంద్వే, అను సూత్రంబుచే విహితంబైన యానఙాదేశంబు విద్యాసంబంధ వాచకంబులును, యోనిసంబంధ వాచకశబ్దంబులును నైన ఋకారాంతపూర్వపదంబులకే వచ్చును. మాతాపితలు, అనుచో మాతృశబ్దంబు యోనిసంబంధవాచకంబు. హోతాపోతలు, అను ద్వంద్వంబునందు హోతృశబ్దంబు విద్యాసంబంధవాచకశబ్దంబు. కావున నానఙాదేశంబు సాధీయంబు మాంధాతృశబ్దంబు విద్యాయోనిసంబంధవాచకంబులలో నేదియుంగానియందున రేఫాదేశాభావపక్షంబున

ఋకారాంతయుక్తంబే సాధిష్ఠంబగు. కావున నప్పకవి ఋకారాంతంబనియెంచి రేఫ శిష్ట ప్రాసంబునను సుదాహరణంబుగాఁ జూపుట సర్వవిధంబుల రమణీయంబని యెంచవలయు. శ్లో॥ పితుర్దశగుణం మాతా గౌరవేణాతిరిచ్యతే, అనుశాస్త్రంబున మాతజనకునికంటెఁ బూజ్యరాలుగాన 'మాతాపితలు' ఇత్యాదిద్వంద్వంబులందు జననీవాచకశబ్దంబు ముందుండుట శాస్త్రీయంబు.

25 సూ.—సమాసవిభక్తికి లోపంబగు లట్టునకుఁ గాదు.

రామునిబాణములు సరసపువచనములు । వేవెలుఁగు । గుణములప్రోక.

వ్యా.—సమాసంబులయొక్క విభక్తికి లోపంబగలుగును. తత్సమపరిచ్ఛేదంబు నందలి ముప్పదియొకండవ సూత్రంబుచే విభక్తులకు విహితంబైన లడాగమంబునకు లోపంబుగలుగదు లడాగమంబు టిత్తుకావున విభక్తికి నాద్యవయవమై సమీపంబునఁ జేరును. వృషభాదులను జన్మకాలంబున లేకుండి మధ్యకాలంబున శృంగంబులుద్భూతంబులైనను శృంగావయవవిశిష్టంబునందే వృషభశబ్దవ్యవహారంబు శాస్త్రలోకసమంజసము నట్టులు లడాగమవిశిష్టంబైనవిభక్తియందే విభక్తిత్వసత్వంబు పర్యాప్తంబగునుగాని లడాగమంబు విడిచిన కేవలవిభక్తియందుఁ దాదృశవ్యవహారంబు రానేరదు. కాఁబట్టి సమాసవిభక్తికి లోపంబు విధించుచో లడాగమయుక్తస్థలంబులో లడాగమవిశిష్ట విభక్తికి లోపంబు ప్రాప్తించుచున్నది. 'ప్రాప్తిపూర్వకో హి నిషేధః' అను శాస్త్రంబునఁ బ్రాప్తించుచున్న లడాగమలోపంబు రాదనియుఁ, గేవలవిభక్తికే వచ్చు ననియు నపూర్వంబుగా నిషేధంబు సూత్రితంబయ్యె. తత్సమపరిచ్ఛేదంబులోని యిరువదిమూఁడవ సూత్రంబుచే విహితంబైన నిగాగమంబునకు లోపనిషేధంబు చెప్పంబడలేదు. నిగాగమంబు దుమంతంబునకు విధింపంబడెను. కాన నాగాగమంబు ప్రకృతికి నవయవంబుగాని విభక్తికి నవయవంబుగాదు. కనుక లోపంబునకుఁ బ్రసక్తియేలేదు. 'ఈ రామునిబాణములు' ఇచ్చట రామునియొక్క బాణంబులని విగ్రహంబుండఁగాఁ బూర్వోత్తరపదంబుల సంబంధంబైన యొక్కప్రథమావిభక్తులకు లోపంబుగలిగె. అనంతరము 'రామునిబాణ' అనువిశిష్టంబుకంటెఁ జరిగి ప్రథమావిభక్తి యుదయించె ఇట్లు

తక్కినయుదాహరణంబులయందును బూర్వోత్తరపదవిభక్తులు లోపించుననియు విశిష్ట సమాసంబు కంటెఁ దిరిగి యాయా విభక్తి యుత్పత్తిల్లుననియు నూహింప వలయును. 'సరసపువచనములు' ఇచ్చట, 'సరసములు + వచనములు' ఇట్లు కర్మధారయవిగ్రహం బుండఁ బ్రకృతసూత్రంబునఁ బూర్వపదబహువచనంబునకు లోపంబుగలిగె. తత్సమపరిచ్ఛేదంబునందలి నలువదియవ సూత్రంబుచే మువాగమంబు ప్రకృతికి విధింపఁబడినది కావునఁ బ్రకృతసూత్రంబున దానికి లోపంబు ప్రసక్తింపలేదయ్యె. తత్సమపరిచ్ఛేదంబునందలి నలువదియొకండవ సూత్రంబుచే మువర్ణకకార్యంబు మువాగమంబునకును నగును గాన సంధిపరిచ్ఛేదంబునందలి ముప్పదిరెండవ సూత్రంబుచే మువాగమంబునకుఁ బువర్ణంబయ్యె. పూర్ణంబైనచో 'సరసపువచనములు' అను విశిష్టరూపంబగును 'వేవెలుఁగు' ఇచ్చటఁ బూర్వపదంబైన 'వే' శబ్దంబునకు సహస్రమర్థంబు. దీనికంటెఁ బ్రహ్మాదికి యుత్పత్తిల్లి సమాసంబు కానఁ (బహువ్రీహి) బ్రకృతసూత్రంబున లోపంబు కలిగె. 'గుణములప్రోక' 'గుణములయొక్క ప్రోక' ఇట్లు విగ్రహవాక్యంబునందు యొక్కాదివిభక్తులు లోపించె. లట్టునకు లోపంబు నిషేధింపఁబడినది కావున సమాసఘటితలకారంబునకు లోపంబు రాలేదు. ఇచ్చట సమాసశబ్దంబు వృత్తికి నుపలక్షణంబు. కనుక 'జాలరి' ఇత్యాదితద్ధిత వృత్తియందు విభక్తి లోపంబుగలిగె.

26 సూ.—కర్మాదులకుఁ బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేషణంబులు కర్తతోడం బోలె వానితోడ సమసించు.

రాముఁడురక్షించిన భృత్యుఁడు - రాముఁడువాలినేసిన బాణము - రాముఁడుగోవునిచ్చిన విప్రుఁడు - రాముఁడు వెడలిన వనంబు - రాముఁడు వసించిన పర్ణగృహము - రాముఁడు వసించినచోటు.

వ్యా—కర్తృముఖ్యముగా నెఱవేఱుచునట్టి వ్యాపారంబు కర్మాదికారకంబులపై నారోపింపంబడినచో ధాతుజ విశేషణంబులు కర్తృకుంబలెఁ గర్మాదికారకంబులకును విశేషణంబులగునని యర్థము. ఉ 1 రాముఁడు రక్షించినభృత్యుఁడు, 2 రాముఁడు వాలినేసిన బాణము, 3 రాముఁడు గోవునిచ్చిన విప్రుఁడు, 4 రాముఁడు వెడలిన వనంబు, 5 రాముఁడు వసించిన పర్ణగృహము, 6 రాముఁడు వసించిన చోటు (1) ఇటఁ గార్య

ర్థంబైన రక్షించుట, రామునిచే ముఖ్యంబుగా నెఱవేర్పఁబడఁగదే. అయిన నట్టి రామనిష్ఠమైన రక్షణ భృత్యునిపై నారోపింపంబడినది కావున, భృత్యుని రక్షించిన రాముఁడు, అన్నవాక్యంబున 'రక్షించిన' అనునది రామునకుంబలె 'రాముఁడు రక్షించిన భృత్యుఁడు, అను ప్రకృతవాక్యంబులోఁ గూడ, 'రక్షించి' అనునది భృత్యునకు విశేషణంబయ్యెను. ఈవాక్యంబున రాముఁడు కర్తయును భృత్యుఁడు కర్మంబునుగాన నియ్యది కర్తృవ్యాపారంబుపై నారోపించినందులకు నుదాహరణంబు (2) ఈవాక్యంబునందు 'వేయుట, (కొట్టుట) అను ధాత్వర్థంబును నెఱవేర్పఁగా రాముండు ప్రధానుండు. అయినను నట్టిక్రియను నెఱవేర్చుటకుఁ బ్రధానంబుగా బాణమే వివక్షింపంబడినది కావున 'బాణముతో వాలి నేసిన రాముఁడు, అన్నవాక్యంబున 'ఏసిన, అను విశేషణంబు రామునికింబలె 'రాముఁడు వాలి నేసిన బాణము' అను, ప్రకృత వాక్యంబునం గూడ 'ఏసిన, అనువిశేషణంబు బాణంబునకు సంబంధించె. కొట్టుటలో రాముఁడు కర్తయును బాణంబు కరణంబును నైనందున నియ్యది కర్తృవ్యాపారము కరణంబుపై నారోపింపంబడినందుకు నుదాహరణము (3) ఇచ్చుట 'ఇచ్చు' క్రియ రామునిచేఁ బ్రధానంబుగా నెఱవేర్పఁబడఁగినది. అయినను నట్టిక్రియ విప్రుఁడు నెఱవేర్చినట్టులు వివక్షింపంబడినది కావున 'విప్రునకు గోవు నిచ్చిన రాముఁడు, అన్నవాక్యంబున 'ఇచ్చిన, అనునది రామునికింబలె 'రాముఁడు గోవు నిచ్చిన విప్రుఁడు, అన్న ప్రకృతవాక్యంబునం గూడ 'ఇచ్చిన, అన్నయది విప్రునికి సంబంధించె. ఇచ్చుటయను త్యాగంబు త్యాగక్రియకుఁ గర్త రాముఁడును త్యాగంబునకు నుద్దేశ్యభూతుఁడు విప్రుఁడును గాన వాక్యంబు సంప్రదానంబుపైఁ గర్తృధాత్వర్థ మారోపింపఁబడినందులకు నుదాహరణము (4) ఇచ్చోటు వెడలుట, (నిర్గమించుట) అను క్రియ చేతనంబుచే నెఱవేర్పఁ దగినది కాన రామునకుఁ బ్రధానంబై సమన్వయించును. అయినప్పటికిఁ బ్రకృతసూత్రంబున నట్టిచేతన వ్యాపారంబు అచేతనంబైన వనముపై మోపఁబడినందున 'వనమునుండి వెడలిన రాముఁడు, అన్నవాక్యంబున 'వెడలిన, అను శబ్దంబు రామునకుంబలె 'రాముఁడు వెడలిన వనంబు, నీప్రకృత వాక్యంబునం గూడ 'వెడలిన, అన్నదియు వేతంబైన వనంబునకు విశేషణంబుగా సమన్వయించినది. ఇచ్చోట రాముఁడు వనంబునుండి విడిపోయినందున 'వనమునపాదానకారకంబయ్యె. కర్తృక్రియ యపాదానకారకంబుపై సంక్రమింపఁజేసినందుల

కు నియ్యది యుదాహరణంబు. (5) ఇచ్చోట వసించుటను ముఖ్యంబుగా రాముఁడు కర్త. అట్టి వాసక్రియ పర్ణగృహంబుపై నారోపింపఁబడినది కాన 'పర్ణగృహమందు వసించిన రాముఁడు,' అన్న వాక్యంబున 'వసించిన' అనునది రామునికింబలె 'రాముఁడు వసించిన పర్ణగృహము,' అన్న ప్రకృతవాక్యంబున నైనను 'వసించిన,' అన్న విశేషణంబు పర్ణగృహంబునకు సమన్వయించినది. ఇచ్చట రామునకుఁ బర్ణగృహమాపన్నము కాధారంబుగావున, కర్తృక్రియ యధికరణకారకంబుపై సంబంధింపఁ జేసినందులకు నియ్యది యుదాహరణము. (6) ఈయుదాహరణంబునఁ గూడఁ బైదానియందుంబలెఁ గర్తృక్రియ యధికరణంబుపై నారోపింపంబడినది సంస్కృతవ్యాకరణంబునందుం గూడఁ గర్తృవ్యాపారంబు కర్మాదికారకంబుపై నారోపించుటగలదు గాని తెనుఁగుభాష 'రాముఁడు రక్షించిన భృత్యుఁడు,' ఇత్యాదివాక్యంబులలో 'రక్షించిన' అనుదానికి రాముఁడును, భృత్యుఁడును, కర్తలైనట్టుల (In construction) సంస్కృతభాషయందు నేక క్రియలోఁ గర్తకును, కర్మాదికారకంబునకును నన్వయంబులేదు. మఱియు సంస్కృతభాషయందుఁ గర్తృవ్యాపారంబు కర్మాదికారకంబులపై సంక్రమింపఁ జేసినప్పుడు కర్మాదికారకపదార్థంబులకు సౌకర్యాధిక్యము భాసిల్లుచున్నట్టులు స్ఫురించుచుండును. తెలుఁగుభాషయందుఁ గర్తృక్రియారోపణవలన నట్టిఫలంబు స్ఫురించుటలేదు స్పష్టార్థము కొన్ని సంస్కృతభాషయందలి వాక్యంబు లుదాహరింపండును. 'ఉ॥ అసిశ్ఛినత్తి.' (కత్తి నఱకుచున్నది) వాస్తవంబున వాక్యంబిట్లుండవలెను. 'శూరః సాధ్వసినాఛినత్తి (శూరుండు లెస్సగాఁ గత్తితో నఱకుచున్నాఁడు) ఇట్లు నఱకుటకు దేవదత్తుఁడు కర్తయును, కత్తి కరణంబునైనను మొదటనిచ్చిన యుదాహరణంబునందుఁ గత్తియే నఱకుటకుఁ గర్తగాఁ జేయంబడినది. అందున శూరునిప్రయాసమవసరంబు లేకుండనే కత్తి స్వయంబుగ నఱకునంతటి సౌకర్యాతిశయంబు గలదని స్ఫురించుచున్నది. 'కాష్ఠానిపచంతి' (ఇంధనంబులు వండుచున్నవి) ఇచ్చట వండుట మనుష్యుని వ్యాపారంబైనను వహ్న్యాదికరణంబులైన యింధనంబులపై సంక్రమింపఁజేయుటవలన వానియందు శుష్కత్వమార్దవాదిసౌకర్యాతిశయంబున్నట్టులు తెలియును. (స్థాలీ వండుచున్నది) ఇటవండుట యొకానొక దేవదత్తుని వ్యాపారంబైనను నయ్యది యధికరణకారకంబైన స్థాలిపై మోపంబడినందున దానియందు (స్థాలియందు) వేగమే వెచ్చనై యన్నంబుడుకునంతటి పలుచనితనము మొదలైన సౌక

రీత్యతిశయంబు కలవని విశదపడుచున్నది. పైకార్యంబులఁ గర్తృవ్యాపారంబు కర్మాదికారకంబులపై నారోపింపంబడినను 'రాముఁడు రక్షించిన భృత్యుఁడు' ఇత్యాది వాక్యంబులందు గర్త యైన రాముఁడును, కర్మకారకం బైన భృత్యుఁడును వాక్యాంతర్గతులైనట్లులు 'సాధ్వసిశ్ఛినత్తి' ఇత్యాదివ్యాకరణంబులయందు ఖడ్గాదికార కారకంబులతోఁ బాటు శూరాదికర్తలు వాక్యాంతర్గతులు కాలేరు. ఇట్లు భాషాద్వయంబునఁ గొన్ని భేదంబులు కలవు.

ఇదిసమాసపరిచ్ఛేదము.

---

# తద్ధితపరిచ్ఛేదము



విభక్త్యంతంబులైనశబ్దంబులమీఁది భావార్థమత్వర్థాదులయందుఁ బ్రయోగించుప్రత్యయంబులు తద్ధితంబులనంబడు. ఇట్టిప్రత్యయంబులను విధించుభాగంబు తద్ధితపరిచ్ఛేదంబు.

1 తనవర్ణకంబు త్వార్థంబునందగు.

త్వార్థంబనఁగా భావంబు - ప్రకృతిజన్యబోధంబునందుఁ బ్రకారంబు భావంబు । రామునితనము - రాముతనము - మనుమనితనము - సీతతనము - గొప్పతనము - కొంటెతనము - నల్లఁదనము - పుల్లదనము.

వ్యా—'తన' ప్రత్యయంబు త్వార్థంబునందుఁ గలుగు. సంస్కృతంబులో 'రామత్వం, పాత్రిత్వము' ఇత్యాదులయందు 'త్వ' ప్రత్యయంబు తెలియఁజేయునట్టి భావార్థంబునందుఁ దెలుఁగుభాషలో 'తన' వర్ణకంబు. (మూలము) త్వార్థంబనఁగా భావంబు, ప్రకృతిజన్యబోధంబునందుఁ బ్రకారంబు భావంబు. వ్యా—ప్రకృతివలన

బుట్టినయర్థజ్ఞానంబులో విశేషణంబుగాఁదోఁచునది భావంబనంబడు ప్రత్యయంబునకు ముందున్న శబ్దంబు ప్రకృతియనంబడును, ఉ. రామునితనము, రాముతనము తత్సమపరిచ్ఛేదంబులోని యిరువదిమూఁడవసూత్రంబుచే నిగాగమంబు వైభాషికంబు. రామునియొక్క ధర్మంబని యర్థమ్ము ఇట 'యొక్క' అను షష్ఠీవిభక్తికిముందు రామ శబ్దంబున్నయది. కానదిప్రకృతి. రామశబ్దంబునకు రాముఁడర్థము. రాముఁడనఁగా రామత్వము (రాముతనము) గలపురుషుఁడని విస్పష్టార్థము. రామునియందు రామత్వము (రామునితనము) విశేషణంబుగా భాసించుచున్నది గావున నట్టియర్థంబు భావంబనాఁబడు. కానిక్రియాపరిచ్ఛేదంబులోని ముప్పదియేడవసూత్రంబునందలి భావశబ్దార్థంబును, ప్రకృతసూత్రంబునందలి భావశబ్దార్థంబును నొక్కటియే యని భ్రమింపవలదు. 'మనుమనితనము' తత్సమపరిచ్ఛేదంబులోని యిరువదినాల్గవసూత్రంబుచేఁ దెనుఁగుడుమంతంబు గావున నిగాగమంబు నిత్యంబు. కావున 'రాముతనము' అన్నయట్లు 'మనుమతనము' అని పక్షంబున నడఁగూడదు. మనుమునియొక్క ధర్మము ఇట 'యొక్క' ప్రత్యయంబునకుముందు 'మనుమ' శబ్దంబున్నయది. కనుక నయ్యది ప్రకృతి. మనుమఁడనఁగా మనుమనితనంబుగల పురుషుఁడు ఇట్లే 'సీతతనము' (సీతాత్వము) గొప్పతనము (మహత్త్వము) కొంచెతనము (న్యూనత్వము) నల్లఁదనము (నీలత్వము) పుల్లఁదనము (ఆమ్లత్వము) ఇత్యాదులు. నల్లపుల్లశబ్దంబులంత గుణవాచకంబులు గావున 'తన' వర్ణకంబు పరంబగునప్పుడు సంధిపరిచ్ఛేదంబులోని ముప్పదియేనవ సూత్రంబున నుగాగమ ప్రాప్తిచే వర్ణానుస్వారాది కార్యంబులు గలవయ్యెను.

2 సూ—ఇటవిశేషంబుత్సర్గంబునకు విభాషనుభాధకంబగు.

స్పష్టము.

వ్యా—ఈతద్ధిత ప్రకరణంబునందుఁ గ్రిందవచ్చునట్టి విశేషసూత్రంబులు (అపవాదసూత్రంబులు) 'తన' వర్ణకవిధాయకంబైన పూర్వోక్తసామాన్య సూత్రంబునకు వికల్పంబుగా బాధకంబులగు. అనఁగా జిన్నాదులు మున్నగువానికి నీక్రింద 'టిక' వర్ణకాదులు విశేషించి విధింపఁబడినను పక్షంబున 'తన' వర్ణకంబు తప్పక కలుగునని భావంబు.

3 సూ—చిన్నాదులకు ఱికవర్ణకంబగు.

చిన్నఱికము-కన్నెఱికము । చిన్న - కన్నె - చుట్టము - దొంగ-
పేద - మిండ - లంజె - ఇత్యాదులు చిన్నాదులు.

వ్యా—చిన్నమున్నగు శబ్దంబులకు 'ఱిక' ప్రత్యయంబువచ్చును. ఉ. చిన్నఱికము (చిన్న + ఱికము) కన్నెఱికము; చుట్టము, దొంగ, పేద, మిండ, లంజె, మొదలగునవి చిన్నాదులు గావునఁ [illegible] ఱిక ప్రత్యయంబుగ్రహింపఁబడినది. పక్షంబునఁ బ్రకృతసూత్రంబుచే 'తన' వర్ణకంబగు. ఉ. 'చిన్నతనము, కన్నెతనము' ఇత్యాదులు. 'చుట్టము' శబ్దంబునకు 'తన' వర్ణకంబుపరంబైనపుడు తద్ధితవృత్తి కాన మువర్ణకంబు లోపించెడిని. ఉ. చుట్టతనము సంధిపరిచ్ఛేదంబునందలి ముప్పదిరెండవసూత్రంబుచే 'పరసపుఁదనము, పరసపుందనము, పరసపుద్దనము' అన్నయట్లు 'చుట్టపుదనము, చుట్టపుందనము, చుట్టపుద్దనము' అనియుఁ దద్ధితవృత్తియందు మువర్ణకలోపంబు రానిరూపంబులుతనవర్ణకంబు పరంబగునపుడీశబ్దంబునకుఁ బక్షంబునను. తద్ధితవృత్తియైనను 'తన' వర్ణకంబుపరంబగుచో దక్కిన ప్రత్యయంబులందుంబలెఁ బ్రథమావిభక్తి మువర్ణకంబునకు లోపంబు సామాన్యంబుగా రాదు ఈయుద్ధము, సంధిపరిచ్ఛేదంబునందలి ముప్పదియేనవ సూత్రంబుచే 'తన' వర్ణకంబు పరంబగునపుడు పుంపులకు (సంధి—పరి—32 సూ॥ చే మువర్ణకస్థానీయములు) నుగాగమంబు విధించుటం జేసి, యను మేయింపఁబడూచున్నయది. తన వర్ణకంబు సయుక్తము పరంబగుచో మువర్ణకంబునకు లోపంబుగలిగెనేని సంధిపరిచ్ఛేదంబునందలి ముప్పదియేనవ సూత్రంబులో 'తన' వర్ణకంబు పరంబగు నపుడు మువర్ణకస్థానీయంబులైన పుంపులెట్లు లభింపును? కాన నిదియే తనవర్ణకంబునకుముందు మువర్ణకలోపాభావంబునకు జ్ఞాపకముగుమన్నదని యెఱుంగవలెను. భావార్థవిహితమైన యీఱికప్రత్యయంబు శకటరేఫఘటితంబని లాక్షణికులమతంబు. అప్పకవి—ద్వితీయాశ్వాసము-అకారసీసమాలిక .'ఇద్దఱుపదఱుమఁ [illegible] సంబున గద్దఱియుద్దఱి కట్టెదుఱి' ను' శకటరేఫనిర్ణయము శ్లో॥ ఉభావియంతస్సర్వే నకిణాంతః కతిచాగ్రతః । జ్యేష్ఠత్వేనాల్పత్వాద్యాశ్చ పూర్వాశ్శకటాస్స్మృతాః॥' ఇద్దఱు' ఇందఱు, అందఱు, ఎందఱు కొందఱు, ముందఱు, ఇదెద్దుఱులును, 'పెద్దఱికము, కన్నెఱికము' ఇత్యాది ఱికప్రత్య

యాంతంబులును, శకటరేఫయుక్తంబులని శ్లోకతాత్పర్యము. ద్విరేఫ వర్ణదర్పణము తే॥ గీ॥ సర్వకరి చిద్వికియదియచ్ఛబ్దవాచ్య ముల ఱికప్రత్యయంబులఁ బూర్వకథిత పరశబ్ద పరంబునఁగరువ కారి । లఘువు లేపర్గవంద్రి కలాపవినుతః కనుక ‹చిన్నఱికము, కన్నెఱికము, ముట్టఱికము, రావఱికము మాలఱికము, పేవఱికము› ఇత్యాదులందుశకటరేఫంబు బహుకవిసమ్మతంబైనను ఱికప్రత్యయంబు లఘురేఫఘటితంబును గవిప్రయోగంబులఁ గానంబడియెడి చ॥ అరయఁగఁ దక్షిణక్క సెసియండ్రియు దక్కఁగఁగట్టి మ । టరికమువారి కిన్నెరయుతాఁదు రహస్యములీవిజాంతర । స్మరవికృతి ప్రవర్తనలమాటలు వీనివినంగ నాప్రులై పరఁగెడు నెచ్చెలుల్ చెలికిఁ బ్రాణములిచ్చిన నప్పుడీయునే› ప్రభా- ౩ఆ. అలసుకాముదియందు బ॥ సితారామాచార్యులవారు ఱికప్రత్యయంబు భయరేఫఘటితంబులలోఁ బరిగణించిరి.

4 సూ—ఉత్వంబునకత్వంబు ఱికము పరంబగునపుడగు.

తొత్తఱికము - వెడ్డఱికము - వెజ్జఱికము.

వ్యా—‹ఱిక› ప్రత్యయంబు పరంబగునపు డుకారాంతశబ్దంబు లకారాంతంబులగు. ఉ. తొత్తఱికము, ‹తొత్తు+ఱికము› ఇచ్చటఁ దొత్తుశబ్దంబునందలి యుకారంబున కత్వంబుగలిగె. ఇట్లే వెడ్డఱికము (వెడ్డుశబ్దము; వంచన) వెజ్జఱికము (వెజ్జుశబ్దము) ఇత్యాదులూహింపునది.

5 సూ—పేర్యాదులకిమివర్ణకంబగు.

పేరిమి - కడిమి ॥ పేరు - కడు - ముచ్చు - మేలు - చెలి - పోఁడి - వాఁడి - వేఁడి - ఇత్యాదులు పేర్యాదులు.

వ్యా—‹పేరు› మొదలగుశబ్దంబులకు ‹ఇమి› ప్రత్యయంబగుగును. ఉ, పేరిమి (పేరు+ఇమి ఇట్లే కడిమి (కడు) ముచ్చమి (ముచ్చు) మేలిమి (మేలు) చెలిమి (చెలి) పోఁడిమి (పోఁడి) వాఁడిమి (వాఁడి) వేఁడిమి (వేఁడి) ‹ఇత్యాదు లూహింపవలెను. చెలి› మొదలైన యికారాంతశబ్దంబులకు ‹ఇమి› ప్రత్యయంబు రాఁగా సంధిపరిచ్ఛేదం

బులోని పదునొకండవసూత్రంబుచే నపదాదిస్వరంబు పరంబగునప్పుడు సంధి నిత్యంబై 'చేరిమి' (చెరి + ఇమి) పోఁడిమి (పోఁడి + ఇమి) 'ఇత్యాది రూపంబు లయ్యెడి.

6 సూ—నవర్ణకంబు గుణవచనంబులగు నల్లాదులకగు.

నల్లన - తెల్లన । నల్ల - తెల్ల - పచ్చ - ఎఱ్ఱ చామ - తియ్య - కమ్మ - పుల్ల - చప్ప - విన్న - తిన్న - అల్ల - ఒయ్య - తిమ్మ- చక్క - వేఁక - ఇత్యాదులునల్లాదులు.

వ్యా—గుణంబును జెప్పునట్టి 'నల్ల' మొదలగు శబ్దంబులకు 'న' ప్రత్యయంబు వచ్చును. ఉ। నల్లన(నల్ల + న) ఇట్లే 'తెల్ల, పచ్చ ఎఱ్ఱ, చామ, తియ్య,కమ్మ, పుల్ల చప్ప, విన్న, తిన్న, అల్ల, ఒయ్య, తిమ్మ, చక్క, వేఁక' ఇత్యాదులు గ్రహింప లెను. పక్షంబున నీపరిచ్ఛేదంబులోని రెండవసూత్రంబుచే విశేషసూత్రంబు సామాన్యసూత్రంబును వికల్పంబుగా బాధించును గానఁ బక్షంబున 'తన' వర్ణ కంబగు. సంధిపరిచ్ఛేదంబులోని ముప్పదియైదవసూత్రంబుచే నుగాగమంబు మొదలగు కార్యంబులు కలిగి 'నల్లఁదనము, తెల్లఁదనము' మొదలగురూపంబులు ప్రాయికం బులై యుండు.

7 సూ—ఇకవర్ణకంబగ్గలాదులకగు.

అగ్గలిక-ఒమ్మిక। అగ్గలము-ఒమ్మి.

వ్యా—'అగ్గలము' మొదలైన శబ్దంబులకు ఇకప్రత్యయంబువచ్చును ఉ. అగ్గ లిక. 'అగ్గలము + ఇక ఇట్లుండఁ దద్ధిత (తద్ధిత) గాన విభక్తిలోపంబురాఁగా సంధి పరిచ్ఛేదంబులోని పదునొకండవసూత్రంబుచే నపదాదిస్వరనిత్యసంధికలిగి 'అగ్గలిక' అనురూపంబయ్యె 'ఒమ్మిక, ఒమ్మి + ఇక' ఇచ్చటి మువర్ణము నామవాచకంబులో నిది. విభక్తి మువర్ణకంబుగాను కావున లోపంబురాదు.

8 సూ—మగఁటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

మగఁటిమి - మగతనము - పేదఱికము - ఒజ్జనము-కోటరము-కోడంట్రము - కోడంట్రికము - కోడఱికము - కోమలికము - చెలికారము - తెలుపు - ఎఱుపు - పసుపు - నలుపు ఇత్యాదులు రానిపక్షమందుఁ దనప్రత్యయంబన్నింటికగు - చిన్నతనము - ముచ్చుఁదనము - నల్లదనము - అగ్గలంపుఁదనము - ఒజ్జతనము.

వ్యా—'మగఁటిమి' మొదలైనశబ్దంబులు ప్రయోగంబులననుసరించి గ్రహింపఁదగ్గవి ఉ. మగఁటిమి ఇచ్చట 'మగ' శబ్దంబుపై 'టిమిక్' ప్రత్యయంబు, తత్సమపరిచ్ఛేదంబులోని పంచమిస్వరసూత్రంబుచే నీప్రత్యయంబు బిందుపూర్వకంబగు. 'మగతనము' పక్షంబున 'తన' వర్ణకంబు 'పేదఱిమి' భావార్థంబునందు ఱిమిప్రత్యయంబు ఉదా॥ గీ॥ తగునెయర్జున యీపందతనము నీకు । దండివైతెమ్ము మనసు పేదఱిమి విడిచి (భార-భీష్మ- 1 ఆ. 'ఒజ్జనము' ఒజ్జశబ్దంబుపై 'న' ప్రత్యయంబు 'కోటరము' 'కోడలు' శబ్దంబుపై 'టర' ప్రత్యయంబు రాఁగా వృత్తియందు నాద్యక్షరశేషంబై కోటరము 'కోడంట్రము' 'కోడలు' శబ్దంబుపై బిందుపూర్వకట్ర ప్రత్యయంబు రాఁగా వృత్తియందు నంత్యవర్ణలోపంబు 'కోడంట్రికము' 'కోడలు' శబ్దంబుపై బిందుపూర్వక ట్రికప్రత్యయంబు రా వృత్తియందు నంత్యవర్ణలోపంబు 'కోడఱికము' 'కోడలు' శబ్దంబుపై ఱికప్రత్యయంబు రాఁగా వృత్తియందు నంత్యవర్ణలోపంబు రూపాంతరంబు కోటఱికము. చ 'పలుకు వెలంది నీవు ముసిపజ్జలఁ గోటఱికంబు సేయునే కలికి నుంకటూడి గపుగత్తియపింకు' రామా- 1ఆ. కోటరము శబ్దంబువోలె నిది కటుకారఘటితంబునుగలదు. 'కోమలికము' (కోమలితనము) కోమలిశబ్దంబుపై కప్రత్యయంబు. అపదాదిస్వరసంధి. (చూ-సంధి-11 సూ) 'చెలికారము' చెలిశబ్దంబుపై భావార్థంబునందు 'కార' ప్రత్యయంబు. 'నయగారము' (మృదుత్వము) నుడికారము, (మాటచమత్కృతి) 'వాలగారము' ఇత్యాదులు పైవానివలె గ్రహింపవలె. 'తెలుపు, ఎఱుపు, పసుపు, నలుపు' అనునవి 'తెల్ల, ఎఱ్ఱ, పచ్చ, నల్ల' శబ్దంబులపై నైనరూపంబులు.

ఈశబ్దంబులయందు ద్విత్వలకారాదులకు లోపంబున, ప్రత్యయంబు పరంబగు నో ప్రకృతికి నుకారంబును, ఇత్యాదికంబు బుద్ధిసూక్ష్మతచే నూహించునది. (నూలను) టికాదులు రానిపక్షమందుఁ తనప్రత్యయంబన్నింటికగు వ్యా—టికాదు లున్నను ప్రత్యయంబులు రానియప్పుడు తనప్రత్యయంబన్నింటికగు. ఇయ్యది యీపరిచ్ఛేదంబు లోని రెండవసూత్రంబుచే లబ్ధంబైనయది. ఉ. చిన్నతనము, ముద్దుఁదనము, నల్లఁదనము, అగ్గలంపుఁదనము, ఒజ్జతనము. అగ్గలంపుఁ దనముఁ 'ఇచ్చట' అగ్గ శబ్దంబునందుఁబలె మున్నగు లోపంబు తనప్రత్యయంబు పరంబగునపుడు ం దని యెఱుంగునది.

9 సూ—అరమరాదులకు స్వార్థంబునందికవర్ణకంబగు.

అరమరిక - ఆమిక అరమర - ఆము - అల్లిబిల్లి - గంజి - నడవడి - నాడు - నివ్వాళి - పొత్తి - మాన - మెలి - వాలు - ఇత్యాదులరమరాదులు.

వ్యా—అరమర, మొదలైనశబ్దంబులకుఁ బ్రాతిపదికార్థంబునందు ఇక, వర్ణకంబుగలుగును. ఉ. అరమరిక (అరమర + ఇక) ఆమిక (ఆము + ఇక) అల్లిబిల్లిక (అల్లిబిల్లి + ఇక) ఇట్లే గంజి, నడవడి, నాడు, నివ్వాళి, పొత్తి, మాన, మెలి, వాలు మున్నగునవి గ్రహించునది అరమరశబ్దంబునకు 'అరమర' యనురూపాంతరంబును గలదు. ఉ. తామది నమ్మకున్నది విదర్భనరేంద్ర తనూజనిన్ను సు| త్రాముఁడవంచు నీయరమరంబున బోమననీనునీకు' నై ష- 8 ఆ.

10 సూ—ఉకవర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునందగు.

చిఱుతుక - నాలుక | చిఱుత - నాలి - నెలఁత - మొఁత - పడఁతి - మడఁతి - పోఁతి - వెలఁది - నిప్పు - ఎమ్ము - ఇత్యాదులు చిఱుతాదులు.

(ఓడూరము + కాఁడు) సేస్తకాఁడు (సేస్తము + కాఁడు) వెచ్చకాఁడు=విటుఁడు (వెచ్చము + కాఁడు), వీనికివృత్తియందు మువర్ణకలోపంబు. గీ. సురలయూఁకటికూడు ప్రమ్ములఁగీకు రిక్కలకు తేఁటవెన్నెలల యిక్కజోడు లచ్చికైకోడు రేకోతి వెచ్చకాఁడు చంద్రుఁడలరారె పత్కారసాంద్రుఁడగుచు' కవి- ౩౩, జూదకాఁడు (జూదము + కాఁడు) వృత్తియందు మువర్ణకలోపంబు. రూపాంతరంబు—జూజకాఁడు. ఇట్లే జూజకత్తియ. క- కలసెనఁబతిఁ నతఁడిచ్చట మెలఁగుట మాతఁడ్రి విన్నమేలప నేర్పే వులలోన సుదియద్రిప్పిన కలఁపనవిందైనఁ జెలిమికత్తెలునగరె, ఉ. హరి ౯౪.

12 సూ—కాకత్తియలకకారంబునకుగకారంబు కొండొకచోఁ గానంబడియెడి.

అందగాఁడు - అందగత్తియ - కొండెగాఁడు - కొండెగత్తియ- బేరగాఁడు- బేరగత్తియ ఇత్యాదులు.

వ్యా—కా-కత్తియప్రత్యయంబులయందలి కకారంబునకుఁ గొన్నిచోటుల గకారంబుగానఁబడుచున్నయది. ఉ. అందగాఁడు, అందగత్తియ. (అందము + గాఁడు గత్తియ) వృత్తియందు మువర్ణకలోపంబును బ్రకృతసూత్రంబునఁ బ్రత్యయకకారంబునకు గకారంబునుగలిగె. ఇట్లే కొండెగాఁడు, కొండెగత్తియ. బేరగాఁడు బేరగత్తియ, మొదలైనవి యూహించునది.

13 సూ—కాకత్తియలు కొండొకవానికిస్వార్థంబునంజూపట్టెడు.

చెలికాఁడు - చెలికత్తియ - హెగ్గడికాఁడు - హెగ్గడికత్తియ.

వ్యా— కా-కత్తియ, ప్రత్యయంబులు కొన్నింటికిఁ బ్రాతిపదికార్థంబునందుఁ గనఁబడుచున్నవి ఉ. చెలికాఁడు (నేయానియర్థము) హెగ్గడికాఁడు, హెగ్గడికత్తియ' ఈప్రత్యయంబులు ప్రాతిపదికార్థమందే యగుచు; కానఁ బక్షంబున హెగ్గడి,

వేంగపండు కిలి సామనపాటుకాఁగాను లకికాటిగాఁడు, ఉహూకటి కువ్వేకుటాక కర్ముకరడు సీల్లచ్చిగోఁడును జల్లప్పి ఆంధ్రభా-సింహావర్గ

15 సూ — అటమటాదులకు మతుబర్థంబున నీవర్ణకంబు ప్రత్యయంబునగు.

ఈప్రత్యయాంతంబు మగాదిగణంబు. అటమటీఁడు - కమ్మతీఁడు

అటమటము - కమ్మతము - కన్నడము - కొండెము - బానసము - బూటకము - మందడి - మన్నెము - సుంకము ఉక్కివంబునకు వలోపంబునగు ఉక్కీఁడు - ఇత్యాదులు.

వ్యా— 'అటమట,' మొదలైనశబ్దంబులకుఁ బుంలింగంబునందు 'కలవాఁడు' అనునర్థంబున 'ఈ' ప్రత్యయంబువచ్చును (మూలము) ఈప్రత్యయాంతంబు మగాదిగణంబు వ్యా—ఈ. ప్రత్యయాంతంబు మగాదిగణంబులోనిది. ఉ. అటమటీఁడు 'అటమటము + ఈ' ఇట్లుండ వృత్తి (తద్ధిత) గావున ముపర్ణంబునకు లోపంబుగలిగి 'అటమట + ఈ' అయియుండె సంధిపరిచ్ఛేదంబులోని పదునొకొండవసూత్రంబున సపదాదేశ్వరనిత్యసంధిచే 'అటమటీ' అయ్యె తద్ధితాంతంబు గావునఁ బ్రాతిపదికసంజ్ఞ గలదయ్యె. ఈప్రత్యయాంతంబు మగాదిగణంబులోనిది గావున వాచ్యకపరిచ్ఛేదంబులోని వాగ్గసూత్రంబుచే డుక్ వర్ణకంబుగలిగి 'అటమటీఁడు (మోసకాఁడు)' అయ్యెను. 'అటమటము' శబ్దంబునకు 'అటమట' అనియు రూపంబుగలదు చ| 'అటమటఁ జెండె జేల' రసి-5 ఆ. 'కమ్మతీఁడు = కృషీవలుఁడు (కమ్మతము + ఈ + డు) ఇట్లే. కన్నడము, కొండెము, బానసము, బూటకము, మందడి, మన్నెము, సుంకము, ఇత్యాదులందుఁ జెప్పిన ప్రక్రియ యూహింపనగు. (మూలము) ఉక్కివంబునకు వలోపంబునగు వ్యా—'ఉక్కివము' అను శబ్దంబునకు వకారలోపంబు అనఁగా నీప్రత్యయంబులో సముచ్చయంబుగా వకారలోపంబగును ఉ. ఉక్కీఁడు. 'ఉక్కివము + ఈ' వృత్తి గావున ముపర్ణలోపంబును బహుళవాక్యంబుచే వకారలోపం

బును గాఁగాఁ; ఉక్కి + ఈ' అయి యపదాదిస్వర నిత్యసంధిచే 'ఉక్కీ' అయెను ఈప్రత్యయాంతంబు మగాదిగణంబుగావున డుక్ వర్ణకంబుగ్గి 'ఉక్కీఁడు' అయ్యెను. రూపాంతరంబు 'ఉక్కివుఁడు' అనియుఁ గలదు. ప్రత్యయభేదంబులచేఁ బైరూపంబులలోఁ గొంచెమర్థభేదంబునుగలదు. ఉక్కివుఁడు = కపటముగలవాఁడు. ఉక్కీఁడు = మూర్ఖుఁడు ఉ ఉ క్కీలయి నేర్పులేక తమకించి పయింబడినొచ్చు వారు' నిర్వ-౩ఆ. ఉ॥ ఉక్కివుఁడై నీకొడుకు మల్లమునిన్నిటు లాడఁగూడునే 'భార- ఉద్యో-2 ఆ ఉ॥ ఉక్కివులెందునుం గలరె యొప్పరువోఁగ్రుతరాష్ట్రనంద నుల్' భార- ఉద్యో-4ఆ.

16 సూ—ఈప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబునందగు.

మొక్కలీఁడు - కల్లరీఁడు

వ్యా—'ఈ, ప్రత్యయంబు కొన్నిశబ్దంబులకుఁ బ్రాతిపదికార్థంబునందువచ్చు ను. ఉ. మొక్కలీఁడు. 'మొక్క~~లి! అను~~ ప్రాతిపదికార్థంబుకంటె స్వార్థంబునందు 'ఈ, ప్రత్యయంబుగ్గి యపదాదిస్వరనిత్యసంధియు, డుక్ వర్ణకంబును, గలిగి మొక్కలీఁడు, అయ్యె. 'మొక్కలి (శూరుఁడు), అనియే యర్థము. ఇట్లే కల్లరీఁడు. (అసత్యవచనుఁడు) కల్లరికాఁడనియు రూపంబుగలదు.

17 సూ—అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదులకగు.

జాలరి - ఒఱపరి జాల - ఒఱపు - కల్ల - చదువు-జూదము- టక్కు - తెగవు - తీరుపు - తెంపు - తెరువు - నేరుపు - మతకము- వెరపు - వేఁట - సిగ్గు - సుంకము - ఇత్యాదులు.

వ్యా—'అరి, ప్రత్యయంబు 'కలవాఁడు, కలది, అనునర్థంబున 'జాల, మొదలగుశబ్దంబులకుఁ గలుగును. ఉ. జాలరి, వలగలవాఁడని యర్థము. అనఁగాఁ బల్లెవాఁడని భావము. జాలకాఁడనియు రూపంబుగలదు. 'ఒఱపరి (ఒఱవు + అరి) సౌందర్యవం

కుఁడు. ఇట్లే కల్ల, చగువు, జూదము, టక్కు, తగవు, తీరుపు, తెంపు, తెరువు, నేరుపు, మతకము, వెరవు, వేఁట, సిగ్గు, సుంకము ఇత్యాదులం గ్రహింపవలెను. జూదము, మతకము, సుంకము, ఈశబ్దంబులపై నరివర్ణకంబు ప్రయోగించినప్పుడు వృత్తి మూలకమైన ము వర్ణకలోపంబు గలిగి యపదాదిస్వరనిత్యసంధిచే 'జూదరి, మతకరి, (మాయావి) సుంకరి (సుంకముతీయువతఁడు), ఇట్లు రూపంబులేర్పడును. "అద్వైత నీ॥ ఇద్దఱు పడఁతుచుఁ దెద్దటికంబున గద్దఱి యద్దిబక ట్టెగుజును, అని అకారసీసమాలికలో గద్దఱి, శబ్దంబు శకటరేఫయుక్తంబని చెప్పఁబడెను. 'గద్దె (ఉన్నతపీఠము + అరి,) ఇట్లుండ నప దాదిస్వరనిత్యసంధిచే 'గద్దరి, అయినదనియు, ఉన్నతపీఠము గలవాఁడని వాచ్యార్థం బైనను దిట్టతనముగలవాఁడని లాక్షణికార్థంబునందు నియ్యది ప్రసిద్ధంబుగాఁ బ్రయోగింపఁబడుచున్నదనియు, కొందఱు లాక్షణికులమతంబు 'గద్దరికాఁడు, అనియు రూపంబు గలదు. 'కా, ప్రత్యయంబు పాల్పడంబునందయ్యెడిని.

18 సూ—ఇవర్ణకంబోయూరాదులకు మత్వర్థంబునందగు.

ఓయూరి - అక్కసి। ఓయూరము - అక్కసము - కడలు చాగము - జోగము - తమకము - తుటారము - బండారము - బిత్తరము - బిటారము - బేహారము - మచ్చరము - మిటారము - విన్నాణము - వెక్కసము — ఇత్యాదులు.

వ్యా—'ఓయూరము, మొదలైనవానికి 'కలవాఁడు కలఁడు, అనునర్థంబునందు 'ఇ, ప్రత్యయంబువచ్చును. ఉ. ఓయూరి. (ఓయూరము + ఇ) వృత్తిగావున ము వర్ణకలోపంబు. 'అక్కసి (అక్కసము + ఇ)' మువర్ణకలోపంబు. ఇట్లే, 'కడలు (కదలి) చాగము, జోగము, తమకము, తుటారము, బండారము, బిత్తరము, బిటారము, బేహారము, మచ్చరము, మిటారము, విన్నాణముఁ వెక్కసము, ఇత్యాదులం దూహింపునది.

19 సూ—తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీవాచ్యం బగు

నపుడు మతుబర్థంబునందగు.

కొఱవత - చాకిత ॥ కొఱవ - చాకి - బోయ - వాన - వే్రి-సాలె - ఇత్యాదులు కులవాచకంబులు.

వ్యా—(త, ప్రత్యయంబులవి శేషణంబును జెప్పశబ్దంబువకు స్త్రీవాచ్యంబగునప్పుడు (కలది, అనువర్థంబునందు వచ్చును. ఉ. కొఱవత. (కొఱవ, అనఁగానొకానొకహీనజాతి. అట్టిజాతిగలది యన్నయర్థంబునందు (కొఱవత (కొఱవది), అగును. 'చాకిత = రజకస్త్రీ (చాకి + త) ఇట్లే (బోయ, వానె, (వే, సాలె, కుమ్మరి, గొల్ల, మాల, ఇత్యాదికులవాచకంబులందు (గ్రహించునది.

20 సూ—శేషవర్ణకంబుపరంబగుచో నొకానొకచో నెత్వంబు చూపట్టెడి.

చెంచెత - మాలెత

వ్యా—(త, ప్రత్యయంబు పరంబగునపుడు కొన్నిచోటులఁ బ్రాతిపదికంబు తుద (ఎ, కారంబు గానంబడు. ఉ. చెంచెత (చెంచు + ఎ + త) చెంచుజాతిస్త్రీ ఇట్లే మాలెత. (చండాలస్త్రీ) చెంచితయను రూపంబును గొందఱుమతంబునఁగలదు. క॥ చెంచితలం బింఛపత్రచేలాంచితలన్ (భాగ-స్క-౦-10-పూ. సీ॥ చెంచువింటి॥ బోయి చెంచెతపైఁ బ్రియంబు, కాశీ-5 ఆ. క। తోరియక విప్రుఁడు మాలెతఁ| గా యజ కుభకేళిఁ గలిసి కష్టాత్ముండగున్ । బ్రాయశ్చిత్తము సేయక । పోయినఁ జండాలజాతిఁ బొందు నిజముగన్ (జ్ఞా-పా్రి-కాం.

21 సూ—యువతి విటీరజస్వలలు గుబ్బెతమిండత ముట్టుతలు నాబడుదురు. స్పష్టము

వ్యా— తెలుగునందు (యు ౩, శబ్దంబులకు కెప్పె (యౌవనవతి), అనియు

విటి, శబ్దంబునకు 'బిండత (విటురాలు)' అనియు. 'రజస్వల' శబ్దంబునకు 'ముట్టుత (రజస్వలాస్త్రీ)' అనియుఁ బ్రయోగంబులు.

22 సూ—వగాదులకుబహువచనాంతంబులకుస్త్రీవాచ్యంబగునపుడుమత్వర్థంబునందాఁడివర్ణకంబగు.

వగలాఁడి వగ-చిన్నె-కులుకు వన్నె-దొమ్మి-ఎమ్మె ఇత్యాదులువగాదులు.

వ్యా—బహువచనాంతంబులగు 'వగ' మొదలైనశబ్దంబులకు స్త్రీయర్థమైనపుడు 'కలది' అనువర్థంబున 'ఆఁడి' వర్ణకంబువచ్చును. ఉ. వగలాఁడి (వగలు + ఆఁడి) వగలుగలదాఁడుది యనియర్థము. ఇట్లే, చిన్నె, కులుకు, వన్నె, గొమ్మె, ఎమ్మె, ఇత్యాదులనూహింపునది.

23 సూ—వగాదులకు బహువచనాంతంబులకుఁ బుంస్త్వంబున మత్వర్థంబాకారంబగు.

ఆప్రత్యయాంతంబు మగాదిగణంబు । వగలాఁడు-చిన్నెలాఁడు.

వ్యా—బహువచనాంతంబులగు 'వగ' మొదలైనశబ్దంబులకుఁ బుంలింగంబునందు 'కలవాఁడు' అను నర్థంబున 'ఆ' కారప్రత్యయంబువచ్చును. (సూ) ఆప్రత్యయాంతంబు మగాదిగణంబు. వ్యా—'ఆ' ప్రత్యయాంతంబు మగాదిగణంబులోనిది కావున డుఙ్వర్ణకంబు. ఉ. వగలాఁడు(వగలు + ఆ + డు)వగలుగలవాఁడని యర్థము. ఇట్లే 'చిన్నెలాఁడు' శబ్దంబూహింపునది.

24 సూ—ముక్కులోనగువానికిం దద్భావద్యోతకంబయ్యు మత్వర్థంబునందిఁడివర్ణకంబగు.



ముక్కిఁడి-ముక్కు లేనివాఁడని యర్థము ముక్కు-వాలు-వెరవు-సిగ్గు-ఇత్యాదులు ప్రయోగంబులనెఱుంగునది.

వ్యా—'ముక్కు మొదలైనశబ్దంబులకు ముక్కు మొదలైనవానిలేమిని సూచించు నదియయి 'లేమికలవాఁడు, లేమికలది' అనునర్థంబున 'ఇఁడి' ప్రత్యయంబువచ్చును. ఉ—ముక్కిఁడి (ముక్కు + ఇఁడి) ముక్కులేమికలవాఁడని యర్థము ఇట్లే వాలు, వెరవు, సిగ్గు ఇత్యాదులు కవిప్రయోగంబులవలన గ్రహింపవలెను.

25 సూ—మానార్థంబగు కేకత్వంబునం దేఁడువర్ణకంబగు.

తూమెఁడు - ముంతెఁడు - ఎత్తెఁడు - వీసెఁడు - జేనెఁడు - మూరెఁడు - కుండెఁడు - గంపెఁడు.

వ్యా—పరిమాణార్థకశబ్దంబునకు నేకవచనంబున 'ఎఁడు' ప్రత్యయంబు వచ్చును. ఉ. తూమెఁడు(తూము + ఎఁడు) ఒకతూము పరిమాణంబుగలదని యర్థము. ఇట్లే ముంతెఁడు ఏత్తెఁడు వీసెడు, జేనెఁడు, మూరెఁడు, కుండెఁడు, గంపెఁడు, అడుగెఁడు' ఇత్యాదులందు నేకపదార్థపరిమాణంబని గ్రహించునది. క॥ నీనుదువులకే నడుగెం డైనను దాఁటనని సత్యమాడెను, రుక్మాం-శ౯ఆ.

26 సూ—ఎఁడువర్ణకంబు పరంబగునపుడు లివర్ణంబులోపించు.

కమికెఁడు - కొడిదెఁడు - దోసెఁడు - పిడికెఁడు - పుడిసెఁడు - సందెఁడు.

వ్యా—'ఎఁడు' ప్రత్యయంబు పరంబగునపుడు 'లి' వర్ణంబులోపించును. ఉ. కమికెఁడు [కమికిలి (వంపఁబడిన వ్రేళ్లుగలపుడిసిలి) + ఎఁడు] ఇచ్చటఁ బ్రకృతము త్రింబున లివర్ణలోపంబును, అపదాదిస్వరనిత్యసంధియుఁ గలుగ 'కమికెఁడు' అయ్యె ఇట్లే 'కొడిదెఁడు, (కొడిదిలి + ఎఁడు దోసెఁడు (దోసిలి) పిడికెఁడు (పిడికిలి) పుడి

పీఁడు (పుడిసిలి) సందేఁడు (సందిలి) ఇత్యాదులూహింపునది 'దాలి, శబ్దంబునకు. 'ఏఁడు, వర్ణకంబు పరంబగునపుడు లివర్ణలోపంబు లేదు ఉ. దాలేఁడు. (దాలి + ఏఁడు)

27 సూ—షష్ఠ్యర్థంబున బంటికొలఁదులగు

మోఁకాలిబంటి - మోఁకాలికొలఁది ఆమ్ముబంటి ఆమ్ము కొలఁది,

వ్యా—షష్ఠ్యర్థము=షష్ఠీప్రత్యయార్థంబు సంస్కృతవ్యాకరణంబున "ప్రమాణేద్వయసచ్ దఘ్నఞ్ మాత్రచః" అను సూత్రంబునఁ బ్రమాణార్థంబునందు దఘ్నప్రత్యయము విధింపంబడియె. కనుకఁ బ్రమాణార్థంబునందు 'బంటి, కొలఁది, అనునవియగును. ఉ. మోకాలిబంటి, మోకాలికొలఁది. (మోకాలినంతమఁ బ్రమాణంబు గలయది) వృత్తియందు షష్ఠీవిభక్తికమైన 'ఇ'కారంబుగల్గి 'మోకాలి' అయ్యెను. (జాను దఘ్నము) ఇట్లే 'అమ్ముబంటి, అమ్ముకొలఁది. ఇత్యాదులంపూహింపునది షష్ఠ్యర్థమందుఁ దత్సమపదంబులమీఁద సైతము 'బంటి, ప్రత్యయంబు గానంబడియె దీని సీ॥ కటిబంటి నెత్తురు కాలువల్ వలలవలు దడియు నేద్పుమఁ జొచ్చి దాఁటిదాఁటి, రామా-8-ఆ. మఱియు మయట్ప్రత్యయంబు తత్సమపదంబులమీఁదఁ గాక తెలుఁగుపదంబులమీఁదను బ్రాచుర్యార్థంబునఁ (అధిక్యంబున) గానంబడుచున్నది. ఆ-గీ॥ సముదవృత్తిఁ గేరిసలిపెఁ జకోరచయంబుచదలు దమముమయంబు గాఁగ, నిర్వ-6 ఆ. తే ప్రథనభూమి మెదడుప్రోవులమయమయ్యె మిక్కుటముగ, హరి-ఉ. 10 ఆ

28 సూ—అర్థవిశేషంబులవర్ణకాంతరంబులును మహాత్ప్రయోగంబుల నెఱుంగునది.

మంటమారి - తిండిపోతు - తొచ్ఛిల్యంబున మారిపోతువర్ణకంబులు॥ అడప-తాంబూలకరండవాహి-మతుబర్థంబునందు ప్రత్యయంబు

పెండ్లము ఊఢ పెండ్లిక్త్రికు మతుబర్థంబునందమ్ప్రత్యయంబు ఇత్యాదులూహ్యంబులు,

వ్యా—అర్థవిశేషంబులయందు (శిష్టార్థంబులయందు) నితరమైన ప్రత్యయంబులును, మహాకవి ప్రయోగంబులయందుఁ దగిసికొనునది. ఉదా ~~మంటమారి~~, గింజిపోతు (మూ) తాచ్ఛీల్యంబున మారిపోతు వర్ణకంబులు వ్యా—స్వభావంబున 'మారి, పోతు, ప్రత్యయంబులుగలుగును. సీ॥ మంటమారులుగాని మహనీయబాడబుల ప్రదాతలుగానియట్టి ఘనులు' పట్టా-1 ఆ తే గీ అనుమనవింటి పెనుపంట సాడరాని గంటపములాడిమఱియు నమ్మంటమారి, వసు-4 ఆ. ఇచ్చట 'మారి, వర్ణకంబు స్వభావంబును దెలుపుచున్నయది. (మూ) 'అడప-తాంబూలకరండవాహి, మతుబర్థంబునంద ప్రత్యయంబు. వ్యా—'అడప (అడపము + అ) తాంబూలపుబరణిగలది అనఁగాఁ దాంబూలపుబరణిని వహించునది 'అడప, అనుశబ్దంబునకు 'తాంబూలకరండవాహి అనియర్థంబు వ్రాయుట యయుక్తమనియు, 'అడప, శబ్దంబు అడపముంగొనియుండు పడఁతి, యనునర్థంబుగాన 'తాంబూలకరండవాహిని, అని సూరిగారు స్త్రీలింగంబుగాఁ బ్రయోగింపవలయును గాని వాహి యనుట యుక్తంబు గాదనియుఁ గొందఱందురు 'తాంబూలకరండవాహి, అనునది స్త్రీలింగంబునగును సంస్కృతవ్యాకరణంబులో 'కర్మణ్యణ్, అనుసూత్రంబుచే ద్వితీయాంతం బుపపదంబగుచుండ ధాతువుకంటె 'అణ్, ప్రత్యయంబు విధింపంబడి 'కుంభకారః (కుంభంకరోతీతి కుంభకారః) అయినట్లులె 'తాంబూలకరండంవహతీతి తాంబూలకరండవాహః, అని యణ్ప్రత్యయాంతంబు పుల్లింగరూపంబగును. 'టిడ్ఢాణఞ్, అనుసూత్రంబున ఙీప్ప్రత్యయంబువచ్చి 'కుంభకార శబ్దస్త్రీలింగంబు 'కుంభకారీ, అయినట్టులు, తాంబూలకరండవాహ, శబ్దస్త్రీలింగంబు 'తాంబూలకరండవాహీ, అగును. కాఁబట్టి 'అడప, శబ్దంబు స్త్రీలింగంబనియే యూహింపనది. పుల్లింగము 'అడపకాఁడు, అడపశబ్దంబు పుల్లింగంబులోఁగూడ నున్నటులు ప్రయోగంబు కానిపింపదు స్త్రీలింగంబుగాను

ఉన్నందులను లక్ష్యంబు గలదు చ॥ కలికివరాట - రాజహస్తకపరిపీడము నెట్టిన చనఁ వలనవపంబు వానికి ఘణాకరవల్లి దళాంతరంబునఁ బొతవుఁ దేయుమైనమువఁబ్లై నైష - 7 ఆ (నూ) పెండ్లము - ఊఢ ; పెండ్లిశబ్దంబునకు మతుబర్థంబునం దమూ ప్రత్యయంబు ఇత్యాదులూహ్యంబులు. వ్యా — పెండ్లము = యోష (వివాహముచేసి కొన్నభార్య) 'పెండ్లికలది' అనువర్థంబునందు 'పెండ్లి + అ' ఇల్లుంత వహదాటిప్వార నిత్యసంధిగలిగి లోకవ్యవహారంబునఁ గ్లిబత్వరూపక మనర్థకంబుచే 'పెండ్లము' అయ్యెను. సంస్కృతభాషలో 'కళత్ర' శబ్దంబువలెనే తెలుగులో నీశబ్దంబు భాషా శైలంజేసి నపుంసకలింగంబయ్యె. గ్రంథకర్త మూలంబునందు 'అము' ప్రత్యయమని మున్నర్థకంబు గూడఁ దద్ధితప్రత్యయంబు లోనిదియనుట యవిచారితరమణీయంబు. ఒకానొకచో మతుబర్థంబున నవ్వర్థకంబు మాపట్టెడి' ప్రాసవ్యా. క॥ అనిలజపీకిట్ల నిప ల్కను జనునే తలఁప లేదికదుపునఁ బులి పుట్టునె యిట్టిదివ్య తేజం । బున వాఁడగమాన్వయమునఁ బుట్టునె చెపుమా' భార-ఆది-6 ఆ. (తేజంబున వాఁడు = తేజముగలవాఁడు.)

ఇదితద్ధితపరిచ్ఛేదము.

---

# క్రియాపరిచ్ఛేదము.



క్రియలనుజెప్పునట్టిభాగము క్రియాపరిచ్ఛేదంబు.

1 సూ—ధాతువునకు.

ఇదియధికారసూత్రంబు - ఇంక నెయ్యది యుపక్రమింపంబడునయ్య ది ధాతువునకగునని యెఱుంగునది.

వ్యా—ఈసూత్రంబునకు నిచ్చటఁ బ్రత్యేకంబుగ వ్యాఖ్యానంబు లేదు. తరువాతి సూత్రంబులలోనికి నేని ప్రత్యయాదివిధిసూత్రంబుల వ్యాఖ్యానంబులలో వినియోగింపు సూత్రంబుగావున నిదే యధికారసూత్రంబని మూలంబున సూచింపబడియె. తరువాతివిధేయంబగు లడాదిప్రత్యయంబులు ధాతువునకని యెఱుంగునది

2 సూ—వర్తమానంబునలట్టగు.

వర్తమాన క్రియావృత్తియగు ధాతువునకు లడ్వర్ణకంబగు వర్తమానంబునాఁ బ్రారబ్ధాపరిసమాప్తంబు - అప్పటికి ముగియకుండునది.

వర్తమానక్రియావృత్తియగు ధాతువునకు లడ్వర్ణకంబగు. వర్తమానంబునాఁ బ్రారబ్ధాపరిసమాప్తంబు. అప్పటికి ముగియకుండునది.

వ్యా—ఈసూత్రంబులోనికి 'ధాతువునకు' అనిన మొదటియధికారసూత్రం బనువర్తించును, 'వర్తమానంబున' అనునది యనువర్తించిన 'ధాతువునకు' అనుదానితో నన్వయంబు కాని 'వర్తమానకాలమందు లట్టగును' అనియర్థము చెప్పఁగూడదు 'వర్తమానంబున ధాతువునకు' అనఁగా వర్తమానకాలికపదార్థంబునందలి క్రియయం దుండునట్టిధాతువునకు లట్టగునని వివరణార్థంబు ఈయర్థంబే 'ప్రవర్తమానక్రియావృత్తియగు ధాతువునకు లడ్వర్ణకంబగు' అనినవాక్యంబులో మూలంబున నర్థంబు స్పష్టపఱుపంబడినయది. కారకపరిచ్ఛేదంబున జాతివ్యక్తిలింగసంఖ్యాకారకంబులనెడి పంచకము ప్రాతిపదికంబునకే యర్థంబనియు, ప్రసమావిభక్తులు, అగ్నికి సహాయంబులైన పవనప్రకాశకత్వలను బ్రకటింపఁజేయుటలో సహాయంబు సాధనంబైనట్టులు పైనిఁజెప్పిన నామవాచకార్థంబులను స్వీకరింపుమనియు, జెప్పంబడియె అట్లే 1 క్రియాత్వ 2 క్రియా 3 సంఖ్యా 4 కాల 5 కారకాత్మకంబగు పంచకంబు ధాతువునకే యర్థంబులు లకారంబులుమాత్రము ద్యోతకంబులు, (అర్థంబుల దేవాద్యంబైనయర్థంబును స్వీకరింపుటలో సాధనమైనవి) అనఁగా.—1 క్రియాత్వరూపంబైనజాతియు (వ్యాపారత్వాదిజాతివంటిది) 2 క్రియయు (వచ్చుటు భుజించుటమొద

లైనవి) 3 సంఖ్యయు (ఏకవచనము, బహువచనము) 4 కాలము (వర్తమానము, భూతము, భవిష్యత్తు, తద్ధర్మము) 5 కారకము (కర్తృకారకము మొదలైనవి) స్వక్రియాయోగ వాత్మనే పదనిమిత్తే యనుసూత్రస్థంబగు భాష్యంబునఁ గర్తృకర్మాదులు ధాత్వర్థములని వివరింపఁబడినవి, ఇయ్యవి ధాతువునకే యర్థంబులు. ఈయర్థంబులను ధాతువులయందలి లకారాదిప్రత్యయంబులు సహాయంబులై ప్రకాశింపఁజేయునవి (ద్యోతకములు) వైయాకరణుల సిద్ధాంతము నేత్రేంద్రియంబునకు గోచరింపనివస్తువులరూపంబు ప్రకటింపఁజేయుటలో 'సూక్ష్మదర్శిని' యనెడి దర్పణవిశేషము (మైక్రాస్కోప్) సాధనమైనయట్టులు పైనిం జెప్పినార్థపంచకంబును స్వీకరించుటలో లకారాదిప్రత్యయంబులు సాధనంబులు కానఁ బ్రకృతంబున వర్తమానకాలంబు ధాత్వర్థంబులోనే యంతర్భూతమైనది. దానం జేసియే వర్తమానకాలికపదార్థంబునందలి క్రియను దెలియఁజేయు ధాతువునకు లట్ప్రత్యయంబగునని తెలిసికొనవలయును కాని లట్ప్రత్యయంబునకు వర్తమానకాలంబు వాచ్యార్థముకాదు వర్తమానంబనఁగాఁ బ్రారంభింపంబడి పరిసమాప్తి నొందనిదియని యర్థంబు. ఉ. ఘటంబున్నది. ఇచట వాక్యంబుప్రయోగించుకాలంబున ఘటంబుండుటట్లు తెలియుచున్నది కావున వర్తమానకాలంబు.

3 సూ—భూతంబునలిట్టగు.

భూతక్రియావృత్తియగు ధాతువునకు లిడ్వర్ణకంబగు ॥ భూతంబనా విద్యమానధ్వంస ప్రతియోగి - ముందుండి యిప్పటికి లేకుండునది.

భూతక్రియావృత్తియగు ధాతువునకు లిడ్వర్ణకంబగు. భూతంబనా విద్యమానధ్వంసప్రతియోగి —ముందుండి యిప్పటికి లేకుండునది.

వ్యా—భూతకాలంబునందు లిడ్వర్ణకంబగునని, అనఁగా భూతకాలికంబైన వస్తువుయొక్క క్రియను దెలియఁజేయుధాతువునకు 'లిట్' ప్రత్యయంబగునని. భూతకాలంబనఁగా వాక్యంబు ప్రయోగించుకాలంబునకంటెను వెనుకటికాలంబునకు వినష్టమైనది. ఉ. ఘటంబుండెను ఇచ్చట వాక్యంబు ప్రయోగించుకాలంబునకుఁ బూర్వకాలంబందు ఘటంబుండినట్లు తెలియుచున్నది. కాన వర్తమానకాలంబునం

దానిధ్వంసంబు (నాశనము) ఉండుచున్నట్లు తెలియుచున్నది. అట్టిధ్వంసంబునకు విరోధి యీవఱలో గతించిన ఘటంబగును. అనఁగా ఘటంబుండిన భూతకాలంబులో దాని నాశనంబుండలేదు, కావున నాశనంబునకు ఘటంబు విరోధియయ్యెను. 'రావణుండు గతించెను' అనువాక్యంబులోఁ బ్రకృతకాలంబున రావణుని నాశనము స్ఫురించుచున్నది రావణుండుండిన గతకాలంబులో వానిలోఁ గూడ వానియభావంబుండుట యసంభవంబు కావున వర్తమానకాలంబునందలి వాని యభావంబునకు రావణుండు విరోధియయ్యెను. కావ నిట్టిది భూతకాలంబనంబడును

4 సూ—భావిని లృట్టగు

భావిక్రియావృత్తియగు ధాతువునకు లృడ్వర్ణకంబగు భావినా విద్యమానప్రాగ భావప్రతియోగి - అప్పటికిఁ బుట్టకుండునది

భావిక్రియావృత్తియగు ధాతువునకు లృడ్వర్ణకంబగు. భావినావిద్యమానప్రాగ భావప్రతియోగి—అప్పటికిఁ బుట్టకుండునది.

వ్యా—కాఁబోవునట్టి వస్తువుయొక్క క్రియయందుండునట్టి (క్రియనుబోధించు) ధాతువునకు లృట్ప్రత్యయంబు గలుగును. వస్తూత్పత్తికి ముందుండుచున్న యభావంబు ప్రాగభావమనంబడు. అట్టిప్రాగభావంబునకుఁ బ్రతియోగి (విరోధి)యు. ఘటము కాఁగలదు. ఇచ్చట ముందుజరింపఁగలిగిన ఘటంబుయొక్క యభావంబిప్పటి వాక్యప్రయోగకాలంబునందుండుచున్నట్లు స్ఫురించుచున్నది. ఘటముపుట్టుటతోడనే ఘటోత్పత్తికి ముంగున్న యభావము (ప్రాగభావము) నశించును. ప్రాగభావనాశనంబునకు భావిఘటంబు విరోధి. అట్టి విరోధియే ప్రతియోగియనంబడు.

5 సూ—తద్ధర్మాదులందు లాట్టగు.

తద్ధర్మాదిక్రియావృత్తియగు ధాతువునకు లాడ్వర్ణకంబగు తచ్ఛీలసంభావనా సంప్రశ్న సాతత్యవర్తమాన భావ్యాశీరాదు లాదిపదగ్రాహ్యంబులు.

తద్ధర్మాది క్రియావృత్తియగు ధాతువునకు లాడ్వర్ణకంబగు. తచ్ఛీల సంభావనా సంప్రశ్నసాతత్య వర్తమాన భావ్యాశీరాదులాది పదగ్రాహ్యంబులు.

వ్యా—సః ధర్మః యస్య సః తద్ధర్మః=అది (ఒకానొకటి) ధర్మంబే వస్తువునకో యట్టివస్తువు మొదలైనవానియందలి క్రియను దెలియఁజేయునట్టి ధాతువునకు లాట్ప్రత్యయంబగు, ఉ. పుష్పము పరిమళించును. పుష్పంబునకుఁ బరిమళంబు ధర్మంబు. ఇట 'పరిమళించును' అను క్రియ పుష్పమునకు స్వాభావికధర్మంబైనయట్లు దోఁచుచున్నదిగావునఁ దద్ధర్మక్రియయని గ్రహింపనగును. తచ్ఛీల (ఒకానొక ధర్మము స్వభావముగాఁ గలిగినవస్తువు) సంభావన (ఊహ) సంప్రశ్నము (పృచ్ఛచేయుట=అడుగుట) సాతత్యము (ఎల్లయప్పుడుండుట) వర్తమానము (వాక్యప్రయోగకాలమందుండునట్టిది) భావి (వాక్యప్రయోగకాలంబునకుఁ దరువాత రాఁబోవునది) ఆశీస్సు (దీవన) మొదలైనవి సూత్రంబులోని 'తద్ధర్మాది' శబ్దంబునందలి 'ఆది' శబ్దంబుచే సంగ్రహింపఁబడినవి.

6 సూ—ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూట్టగు.

ఆశీరాదులందుధాతువునకులూడ్వర్ణకంబగు.

ఆశీరాదులందు ధాతువునకు లూడ్వర్ణకంబగు.

వ్యా—ఆశీరర్థము (దీవన) శాపము (తిట్టు) సంప్రార్థన (వేఁడుట) విధి (ప్రేరణము=భృత్యుఁడు మొదలైనవానిని బ్రవర్తింపఁజేయుట) ఈయర్థంబులయందు లూట్ప్రత్యయంబు గలుగును.

7 సూ—వ్యతిరేకంబునలజియగు.

వ్యతిరేక విశిష్టక్రియావృత్తియగు ధాతువునకు లజివర్ణకంబగు.

వ్యతిరేకవిశిష్టక్రియావృత్తి యగుధాతువునకు లజివర్ణకంబగు.

వ్యా.—వ్యతిరేకంబుతోఁ గూడినపదార్థంబులయొక్క క్రియను దెలియఁజేయు ధాతువునకు 'లట్' ప్రత్యయంబు వచ్చును. ఉ. దేవదత్తుఁడు పఠింపఁడు. ఇచట తిఙంతమునన్న వ్యతిరేకము పఠింపమి. దానితోఁ గూడినవాఁడు దేవదత్తుఁడు. వానిక్రియ ప్రకృతవాక్యంబునందుఁ బఠింపమియే. దానిని దెలుపుచున్న ధాతువు పఠింపఁడు అనునది. కాన లక్షణసమన్వయంబు.

### 8 సూ.—లకారంబునకు డుఙ్ప్రభృతులు ముఝ్ఞగు.

లటాదిలకారంబులకొక్కొక్కటికి మఙాదులాదేశంబులగు ॥ఇందు ఝకారంబు ప్రత్యాహారార్థంబు.

లటాదిలకారంబులకొక్కొక్కటికి మఙాదులాదేశంబులగు ఇందు ఝకారంబు ప్రత్యాహారార్థంబు.

వ్యా.—లకారంబనఁగ లడ్వర్ణకంబు మొదలుకొని లూడ్వర్ణకంబు వఱకునుండు ప్రత్యయంబులని యర్థము. 'లట్', 'లిట్', 'లృట్', 'లోట్', 'లూట్', వీనియన్నింటి యందును లకారంబు సామాన్యంబు గాన లకారంబనుటచే లటాదిప్రత్యయంబుల గ్రహణ మర్థంబగును. అట్టిప్రత్యయంబులకు 'డుఙ్' మొదలైనవి యాదేశంబులగును. లట్ప్రత్యయ ప్రథమపురుషంబునందు నేకవచనార్థమునందు 'డుఙ్' బహువచనమందు 'రు' అగును. లట్ప్రత్యయంబుయొక్క మధ్యమపురుషంబున నేకవచనార్థంబునందు 'వు' బహువచనమందు 'రు' అగును. లడ్వర్ణకంబుయొక్క యుత్తమపురుషంబున నేకవచనార్థంబునందు 'ను' బహువచనంబునందు 'ము' అగును. 'ముఝ్' అని యుచ్చరించుట ఝకారంబు ప్రత్యాహారార్థంబని గ్రహింపవలెను. ప్రత్యాహారార్థంబనఁగా 'డుఙ్' మొదలైనప్రత్యయంబులలో దేనికైన ఝకారంబుతోఁ జేర్చి పలుకగానైన రూపంబు. 'డుఙ్' ప్రత్యయంబులోని డువర్ణంబును 'ముఝ్' లోని ఝకారంబుతోఁ జేర్చిపలుకఁగా 'డుఝ్' అగును. దీనికే ప్రత్యాహారంబని పేరు. ఇట్లు చేర్చినందువలన లాభం బేమన డుఙ్ మొదలుకొని ముఝ్ వఱకును నుండు ప్రత్యయంబులు, అనఁగా 'డుఙ్, రు, వు, రు, ను, ము' అనిన పురుషత్రయప్రత్యయంబు లన్నియు సంగ్రహింపంబడును.

అంపపించుగలను. అంపపించులుగలవు. ఉన్నానుబంధంబునకుదాహరణంబు. మేఘము వర్షించుచున్నది. మేఘములువర్షించుచున్నవి.

13 సూ—ఉదంతంబులకు లట్టుపరంబగునపుడున్నానుబంధంబగు.

ఉదంతంబులగు ధాతువులకు లట్టుపరంబగునపుడు - ఉన్న - అనుశబ్దంబనుప్రయుక్తంబగు.

ఉదంతంబైన ధాతువునకు లట్టుపరంబగునపుడు 'ఉన్న' అనుశబ్దంబనుప్రయుక్తంబగు.

వ్యా—ఉకారంబంతంబునందుఁ గల ధాతువునకు లట్టుపరంబగునపుడు 'ఉన్న' అనునది. ముఖ్యధాతువు ననుసరించి కూర్చంబడు.

14 సూ—ఉన్నశబ్దంబుపరంబగునపుడు చువర్ణకంబగు.

వ్యా—'ఉన్న' శబ్దంబు పరంబగునపుడు 'చు' ప్రత్యయంబు వచ్చును.

15 సూ—దవీతరంబగుమ్నా పరంబగునపు డున్నానుబంధంబు నకుదీర్ఘంబగు.

ప్రథమము - వాఁడువండుచున్నాఁడు - వారువండుచున్నారు- అదివండుచున్నది - అవివండుచున్నవి ॥ మధ్యమము - నీవువండుచున్నావు - మీరువండుచున్నారు ॥ ఉత్తమము - నేనువండుచున్నాను- మేమువండుచున్నాము.

వ్యా—'ది-వి' అను ప్రత్యయంబులుగాక 'డు-రు-వు-రు-ను-ము' అనునవిపరంబగునపుడు 'ఉన్న' అను సహాయక్రియకు దీర్ఘంబు గలుగును. ('డుప్టు' అనఁగా డుంగరంబును ముడుముక్కు ఉకారంబుతోఁ జేర్చి పలుకగానైన రూపంబు. ఇట్టి

(ప్రత్యాహారమనంబడును) వర్తమానకాలిక క్రియావృత్తియైన, వండు, ధాతువునకంటెం బ్రత్యయంబు. దీనికిఁ జెనిమిదవసూత్రంబుచేఁ బ్రథమపురుషైకవచనంబు విధింపంబడి నప్పుడు, వండు, వచ్చును. (వండు + డు) వండుధాతువుదంతంబుగావునఁ బదు మూఁడవసూత్రంబుచే నున్నానుబంధంబగు. (వండు + ఉన్న + డు) పదునాల్గవ సూత్రంబున మకారాగమంబగు. (వండు + మ + ఉన్న + డు) పదునేనవసూత్రంబుచే ఉన్న, అనుదానికి దీర్ఘంబగు (వండు + మ + ఉన్నా + డు) డుజ్జుదిత్తుగావున బిందు పూర్ణకంబగు. వాఁడు వండుచున్నాఁడు. బహు - వారు వండుచున్నారు. దీనికి ప్రక్రియ యేకవచనంబున కిచ్చినయుదాహరణంబునందుంబలెనూహింపునది. అది వండుచున్నది. అవివండుచున్నవి, ఇచ్చట ఁడివి, వర్ణకంబులుపరంబైనంగున నీపదునేనవ సూత్రంబున నున్నానుబంధంబునకు దీర్ఘంబు నిషేధింపంబడినది. నీవువండుచున్నావు మీరువండుచున్నారు, యుష్మచ్ఛబ్దార్థంబునందు నేకవచనబహువచన సమావేశంబులో మధ్యమపురుషమైనందుల కుదాహరణంబులు. నేనువండుచున్నాను. మేము వండుచున్నాము, అస్మచ్ఛబ్దార్థంబునందు నేకవచనబహువచనంబులు కర్తలు గాన నుత్తమపురుషంబు.

16 సూ—లిడ్లోట్టుల డుజ్జునకెము నువర్ణంబులగు.

లిడాదేశంబగు డుజ్జునకు - ఎము - అనునది లడాదేశంబగు డుజ్జునకు - ను - అనునది నాదేశంబులగు.

లిడాదేశంబగు డుట్టునకు 'ఎను' అనునదియు, లడాదేశంబగు డుజ్జునకు 'ను' అనునదియు నాదేశంబులగు.

వ్యా—స్పష్టము. భూతంబున 'ఎము' వర్ణకంబు నిత్యంబున కత్వంబు గొంకో కచోఁ గానంబడియెడి. శా॥ అయ్యో నీసుతుఁగ్రొద్దకమ్ముకొని పోయెన్ ఖేచరాహారుఁ గన్' పంచ - 1 ఆ (వేంకటనాయకవి) మ॥ అని శాహాదిఁజెప్పె ముగ్గుడు పోయెన్ బోవ నాలోన' పంచ- 4 ఆ. శా॥ అయ్యన్నాలవజాము చొచ్చెఁ గడవాయున్ వది విచ్చేయుము' పంచ-4 ఆ ఇత్యాది ప్రామాణికంబులు.

17 సూ — భూతంబునందు గాగమంబగు.

భూతార్థవృత్తియగు ధాతువున కిగాగమంబగు.

భూతార్థవృత్తియగు ధాతువున కిగాగమంబగు.

వ్యా — భూతార్థంబును దెలియఁజేయునట్టి ధాతువునకు, ఇగాగమంబగు. వర్తమానాదికాలంబులను ధాతువే బోధించుననియు [illegible]సూత్రంబునఁ జెప్పంబడియె.

18 సూ — లిట్టొన్యుష్మపరం బగునపుడు తివర్ణకంబగు.

ఇకారంబుమీఁది కునుపు క్రియావిభక్తులయను సూత్రముచే దిఙ్మకిత్వంబగు ॥ ప్ర - వండెను - వండిరి॥ మ - వండితివి - వండితిరి। ఉ - వండితిని - వండితిమి.

ఇకారంబుమీఁది కునుపు క్రియావిభక్తులయను సూత్రంబుచే దిఙ్మకిత్వం బగు.

వ్యా — భూతార్థంబు వివక్షింపంబడినప్పుడు 'వండు + లిట్' ఇట్లుండును. ఏని మిదనసూత్రంబున డప్పును. పదునాలుగవసూత్రంబున డప్పునకు 'ఏను' వర్ణకంబగును. 'వండు + ఏను' ఇట్లుండ అపవాదనిత్యసంధిచేఁగాగ 'వండెను' అను ప్రథమపురుషంబయ్యెను. 'వండు + రు' ఇట్లుండ బహువచనసూత్రంబున ధాతువునకు ఇగాగమంబగు. ఇది కిత్తుగావున ధాతువునకు నంతాగమంబుకాఁగా 'వండు + ఇ + రు' అని యుండఁగను అపవాదనిత్యసంధిచే 'వండి + రు' అయ్యెను. 'ఇకారంబుమీఁది కునుపు క్రియావిభక్తుల' అను తత్సమపరిచ్ఛేదంబునందలి [illegible]సూత్రంబుచే 'రు' వర్ణకంబు. క్రియావిభక్తిగావున నిత్యంబు రాఁగా 'వండిరి' అను ప్రథమపురుష బహువచనరూపంబయ్యె. మధ్యమము — వండితివి. 'వండు + లిట్' ఇట్లుండ [illegible]సూత్రంబుచే మధ్యమపురుషైకవచనంబున వు వర్ణకంబు రాఁగా 'వండు + వు' అయ్యె

21 సూ — కలజీడజులు పరంబులగునపుడు నుగాగమంబగు.

ద్రుతకార్యంబు ॥ ప్ర- వండఁగలఁడు - వండఁగలరు - వండఁగలదు - వండఁగలవు ॥ మ - వండఁగలవు - వండగలరు ॥ ఉ-వండఁగలను - వండగలము.

ద్రుతకార్యంబు ప్ర॥ వండఁగలఁడు - వండగలరు. వండఁగలదు-వండఁగలవు॥ మ॥ వండఁగలవు - వండఁగలరు ఉ॥ వండఁగలను - వండఁగలము.

వ్యా— కలడి-వకడి, అనునవి పరంబగునపుడు ధాతువునకు నుగాగమంబు వచ్చును. ద్రుతకార్యంబనఁగా ద్రుతప్రకృతికంబునుబట్టివచ్చు పరుషాదికార్యంబులు మూలంబునందలి యుదాహరణంబులయందుఁ బైసూత్రంబులోని వండఁగలఁడు, అను రూపంబునొద్దఁ గనఁబఱచిన సూత్రప్రక్రియయే తక్కిన పురుషంబులయందును నూహించుకొనునది.

22 సూ — లాట్టురుఇష్షు పరంబగునపుడు దుగాగమంబగు.

ప్ర - వండును - వండుదురు। మ - వండుదువు వండుదురు ఉ - వండుదును - వండుదుము ॥ లాడర్థంబులయందొలి నుదాహరణంబులు వక్కాణించెద ॥ తద్ధర్మంబు - కులాలుఁడుకుండలువానును ॥ తచ్ఛీలంబు - జ్వాలనజ్వాలంబు లుప్పరంబెగయును॥ సంభావన- ఇప్పుడు వాఁడింటనుండును ॥ సంప్రశ్నము - ఉండునాపోదునా ॥ సాతత్యము - సర్వంబునం దీశ్వరుఁడుండును - సర్వంబీశ్వరునియందుండును ॥ వర్తమానంబు - మేననిప్పుడుంబులకలు వొడమెడును - వక్ష్యమాణవిధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబునందెడు గాద్యాగమంబులగు ॥ భావి- వాఁడుతేపువచ్చును ॥ ఆశీస్సు - శుభంబగును ॥ వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానంబడియెడు.

ప్ర-వండును - వండుదురు. మ- వండుదువు - వండుదురు. ఉ—వండుదును-వండుదుము. లాక్షణికులయం దోలి నుదాహరణంబులు వక్కాణించెద. తద్ధర్మ్యంబు కులాలుఁడు కుండలు వానును. తచ్ఛీలంబు - జ్వలనజ్వాలంబులుప్పరం బెగయును. సంభావన - ఇప్పుడు వాఁడింటనుండును. సంప్రశ్నము — ఉండునా పోవునా. సాతత్యము- సర్వంబునందీశ్వరుఁడుండును ; సర్వంబీశ్వరునియందుండును. వర్తమానంబు - మేన నిప్పుడుంబులకలపొడమెడును. వక్ష్యమాణవిధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబునం దుగాద్యాగమంబులు. భావి - వాఁడు రేపువచ్చును. ఆశీస్సు - శుభంబగును, వన్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానంబడియెను.

వ్యా—ప్రథమపురుషైకవచనద్వ్యర్థకంబులకుఁ బరంబులైనవి (రు, వు, రు, ను, ము,) పరంబులగునపుడు ధాతువునకు దుగాగమంబు గలుగును. వండు + లాట్ ఇట్లుండఁ బ్రథమపురుషైకవచనంబుగావున ఎనిమిదవసూత్రంబుచే డుజ్వర్ణకంబు రాఁగా వండు + డు, అనియుండ పదునాలవసూత్రంబుచే డుజునకు నువర్ణంబాదేశంబై వండును, అయ్యెను. దుగాగమంబు విధించు ప్రకృతసూత్రంబులో డుజు పరిహరింపఁబడినందున దుగాగమంబు రాలేదు. వండుదురు, ఇట వండు + లాట్ ఇట్లుండఁ బ్రథమపురుషబహువచనంబు గావున రువర్ణకంబు లకారంబునకు నాదేశంబై ప్రకృతసూత్రంబున ధాతువునకు దుగాగమంబు గలిగి పైరూపంబు సిద్ధించె. ఇట్లే మధ్యమోత్తమపురుషంబులయందు సూత్రప్రక్రియ యూహించునది. లాట్ప్రత్యయంబున కర్థంబులైన తద్ధర్మ్యతచ్ఛీలాదులకు నుదాహరణంబుల కర్థవివరణంబు వరుసగా సేయఁబడును. తద్ధర్మ్యంబు - కులాలునకుఁ గుండలు వానుట కులధర్మ్యంబు. తచ్ఛీలంబు - అగ్నిజ్వాలలూర్ధ్వముఖంబులగుట సహజము. సంభావన ఊహ. వాఁడు గృహమందుండుట నిశ్చయింప శక్యంబుకానిది. సంప్రశ్నము - అడుగుట. సాతత్యము - సతతంబుండుట. ఈశ్వరుండెల్లప్పుడును సర్వజగంబును విడనాడకయుండునని యర్థంబు తోఁచున్నది. వర్తమానంబు - ఒడలు గగురుపొడుచుచున్నదని యర్థము. క్రిందను జెప్పఁబోయెడి యిరువదిమూఁడవసూత్రంబుచే ఎదు, గాగమంబును, ఎడిగాగమంబును, తఱచు వర్తమానకాలంబునందగును. భావి- భవిష్యత్కాలము. వచ్చును- రాఁగలఁడని యర్థము ఆశీస్సు - దీవన. ఆశీస్సునందు అయ్యెడును, అగుత, అనియు నిరువది[illegible]

మాత్రించుచే నుండదగును. సీ॥ తే॥ అపరజనకాశ్ధిసీమారామాభిధాన । హరికి హీన గుణప్రాత్రితహరశరాశి । గిరిమగనయత్నమున దోఁచు సిరియు తేప ! రాజ్యము లొసఁగఁ దిరువల రాయమణికి' వసు - 1 ఆ వ॥ స । ర్వకళాకాంతుఁడు ప్రోవు ధీరత్వలసహో రాయత్రమావల్లభుఁడు, వసు - 1 - ఆ. సీ॥ తే॥ ప్రోవజయమిచ్చుఁ దిరు వలరాయమణికి, వసు 1 ఆ. శా॥ పా। ఖ్యాతరూఢిన్ విలసిల్లు వేంకటనగాఖ్య క్షోణిరక్షించు గొ। బ్బూరి తిమ్మనృపాలసింహు నరసింహోర్వీశ చూడామణిన్, రామా-1ఆ. ఉ॥ పా। పెదఁగాదు పుబ్బరాయఁడు జనమోన్నతుఁడిచ్చు నృసింహశౌరికిన్ రామా-1ఆ. వ॥ ఏలమిన్నిద్వయముఁ బోవ్రమోఁగ్రుష్టవసుధాధిపున్ నృసింహోత్తమున్' కళా-1ఆ. ఈ ధాతువునకు సర్థంబులైన 'అను, పలుకు, వాక్రుచ్చు, చెప్పు, ఇత్యాదు లకు భూతకాలమున నొకానొకచో ఁ ద్రైత్యయంబు ప్రయోగంబులఁ గానఁబడి యుండి. తే॥ గీ॥ సర్వతీర్థాభిగమనంబు సర్వవేద । సమధిగమును సత్యంబుతో సమము గావు । నెలుఁగ నెల్లధర్మములకు నెందుఁ బెద్ద । యఁట్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు' భార- ఆది. 4ఆ. క॥ మౌనమున పృథగ్జ్ఞానము । దానంబున నభ్యుదయము ధర్మనిరత తా । శాంతిప్రమాణంబున నర । కానీకాహరణ సౌఖ్యమగునండ్రు బుధుల్' భార-శాంతి- 6, తే॥ సత్యభోగకం బైఁ బ్రశస్తమైన । కృత్యమరయంగ లేదండ్రు నిత్యసుస్తు । సత్యగతి గమసిద్ధికి సంయమ ప్రసిద్ధులాగమ ప్రతిప్రసిద్ధులు' భార- అశ్వ. 2ఆ. తే॥ వినుము నేకవిధంబుల విస్తరిల్లు । ధర్మములయం దొకండును దలఁప నిష్ఫలంబు లేదాత్మమోక్ష పలంబైన । ధర్మముత్తమమండ్రు తత్త్వజ్ఞుఁడధిప' భార- శాంతి - 4ఆ. క॥ బుతు వఱియై పుత్రార్థము । పతిఁగోరిన భార్యయందుఁ బ్రతిపాలుండై । బుతువిఫలత్వము సేసిన । నతనికి మఱి భ్రూణహత్య యగునండ్రు బుధుల్' భార-ఆది-3ఆ. తే॥ గీ॥ పారు మంబు మానె ఫలమంత్రికొండక । ట్లనక దైవమిచ్చునందు కార్య । ఫలము' భార. పై నుదాహరింపఁబడిన 'అండ్రు' ఇత్యాదిప్రత్యయాంతములకు 'అనిరి' అని భూతకాలమర్థము.

23 సూ—లోట్టు పరస్మైపదంబగునపుడేద గాగమంబును ప్రథమ మధ్యమంబు పరంబగునపుడేను గెడాగమంబును బహుళంబుగానగు,

పురుషవివక్షయందు మువర్ణకరువర్ణకరణాలుగల్గి యిరువదితొమ్మిదవసూత్రంబుచే మువర్ణకంబునకును, రువర్ణకంబునకును గ్రమంబుగా ముఙ్ఙులాదేశంబులయి 'కొను + ము' 'కొను + డు' ఇట్లుండె. అఱువదియవసూత్రంబుచే 'కో' శబ్దాదేశంబుగల్గి కో + ము, కో + డు అయ్యె. ప్రకృతసూత్రంబుచే ముఙ్ఙులు పరంబగునపుడు హ్రస్వంబుగలిగి కొ + ము 'కొ + డు' అయ్యె. ప్రథమోదాహరణంబున మువర్ణకంబునకు మాముడియు (ద్విత్వము) ప్రకృతసూత్రంబుచేఁ గలిగెను. ద్వితీయోదాహరణంబున (కొ + డు) డుజ్ఞువిత్తుగావునఁ దత్సమపరిచ్ఛేదంబునందలి పందొమ్మిదవసూత్రంబుచే డువర్ణకంబునకుముందు పూర్ణబిందువేకల్గి 'కొండు' అనిరూపంబు సిద్ధించె. అర్ధబిందువేలరాదనఁగా 'అఁట, ఇఁక, చుఁడు' అనుశబ్దంబులదక్క, అనెడిసంధిపరిచ్ఛేదంబునందలి యిరువదిరెండవసూత్రంబుచేఁ బరిగణితంబైన 'అఁటా' ది శబ్దత్రయంబునందప్ప నుడితొలి హ్రస్వంబుమీఁద ఖండబిందువుండదుగావున కొండు అనినమాటలలోఁ బ్రథమహ్రస్వంబుమీఁద నెఱసున్నయెకాని యఱసున్న యుండదు.

62 సూ—రువర్ణకంబుపరంబగునపుడు సున్నమీఁదితదడలయుత్వంబునకులోపంబువిభాషనగు.

పోషింత్రు - పోషింతురు - కొంద్రు - కొందురు - కొండ్రు - కొండురు.

వ్యా—రువర్ణకంబు పరంబగునపుడు సున్నమీఁది 'త, ద, డ, ల యుత్వంబునకు వైకల్పికలోపంబు. 'పోషింత్రు' ఇట 'పుష్' ధాతువు సాంస్కృతికంబు. అఱువదిమూఁడవసూత్రంబుచే నింముక్కు రాఁగా "పుష్ + ఇంచు" అనియుండె పదునాఱవసూత్రంబుచే లఘూపధంబైన "పుష్" ధాతువుయొక్క యుకారంబునకు గుణంబు (ఓ) రాఁగా "పోషించు" అయ్యె. దీనికంటెఁ తద్ధర్మ్యాది వివక్షయందు నెనిమిదవసూత్రంబుచే రువర్ణకంబుగలిగి "పోషించు + రు" అనియుండె. ఇరువదిరెండవసూత్రంబుచే దుగాగమంబుగలిగి 'పోషించు + దు + రు' ఇట్లుండె. నూటయెనిమిదవసూత్రంబునఁజావిశిష్టదుకారంబునకు ఏకారాదేశంబయి "పోషింతురు" అయ్యె. ప్రకృతసూత్రంబున సున్న

మీఁది తుశబ్దోకారంబునకు లోపంబుగల్గి (పోషింత్రు), అనురూపంబయ్యె. ప్రకృతసూత్రవిధి వైభాషికంబుగావున నుత్వలోపాభావంబున "పోషింతురు" అనియుండె. (కొను, ధాతువునకులాట్టు. ఎనిమిదవసూత్రంబుచేఁ బ్రథమపురుష బహువచనవివక్షయందు రువర్ణకంబు. (కొను + రు) ఇరువదిరెండవసూత్రంబుచే దుగాగమంబు (కొను + దు + రు) ఏఁబదియెనిమిదవసూత్రంబుచే నుస్థానంబు వైభాషికబిందువు (కొం + దు + రు) ప్రకృతసూత్రంబున నున్నమీఁది దుగాగమోకారంబునకు వైభాషికలోపంబు. (కొంద్రు) ఉత్వలోపంబు వైభాషికంబుగావునఁ బక్షంబున 'కొందురు' అనియుండె. ఏఁబదితొమ్మిదవసూత్రంబుచేత నున్నమీఁది దకారంబునకు వైకల్పికడకారంబును, (కొండురు) ప్రకృతసూత్రంబుచేత డకారంబుమీఁది యుకారంబునకు వైభాషికలోపంబును గలుగఁగ 'కొండ్రు' అయ్యె. ఉత్వలోపంబు పాక్షికంబుగావున రూపాంతరంబు 'కొండురు' తే॥ గీ॥ ఉండురండురు కందురుకొందురనఁగ । నుంతురెంతురు తగభుజియింతురనఁగ। దగుఁగ్రియలమీఁది రేఫంబుదాపలిదెస। యక్కరముతోడశ్లిష్టమై యలరునభవ. సర్వ-సంధి-40 ల. తే॥ మమ్మురక్షించితని యేలమాటిమాటి । కభినుతింపంగదక్షవాటాధినాథ । తల్లిదండ్రులు రక్షింపఁదలఁపకుండ్రె । ప్రబలభీమేశబహువిధోపద్రవముల, భీమఖండము. సీ॥ నటమంద్రుకొందఱు వటమేరియూడలువారిమండలమెల్లఁ ప్రబలఁజె, కవికర్ణరసాయనము. అ. వె॥ తగిలిరుజయుజరయు దైవవశంబున। నయ్యెనేని దానినమభవింత్రు' భార-ఆదిప. ఆ. వె॥ బలముగలవానిఁ బలఁవురు బలహీను । లొక్కటైకూడినిర్జింప నుత్సహింత్రు' భార- అర.

### 63 సూ—సంస్కృతంబునకంగలాదుల కించుక్కగు.

సంస్కృతధాతువులకంగలాదులకించుగాగమంబగు ॥ పచించు - వచించు - త్యజించు - భజించు । అంగలించు॥అంగల-అడక - అరగ - అవుల - ఉంక - ఉగ్గడ - ఓసర - కార - గాల-జాడ - తిలక - తులక - పంక - పరిక - పలవ - అప్ప - ఒప్ప - అల - ఇత్యాదులంగలాదుల్లు,

వ్యా—సంస్కృతధాతువులకును, 'అంగల' మొదలగు తెలుఁగుధాతువులకును, ఇంచుగాగమంబగు. ఉ. 'పచించు' ఇట 'పచ్' ధాతువు. దీనిమీఁద నించుగాగమంబు రాఁగా 'పచించు'. ఇట్లే 'వచించు, త్యజించు, భుజించు' ఇత్యాది సంస్కృతధాతువు లూహ్యంబులు. 'అంగలించు' 'అంగల + ఇంచు' ఇటనపదాదిస్వరనిత్యసంధి. ఇట్లే అడక, ఆరక, ఆవుల, ఉంక, ఉగ్గడ, ఓసర, కార, గాల, జాడ, తిలక, తులక, పంక, పరిక, పలవ, అప్ప, ఒప్ప, ఆల' ఇత్యాది తెలుఁగుధాతువు లూహ్యంబులు. 'అప్ప + ఇంచు' ఈసూత్రంబున నిట్లుండ డెబ్బదితొమ్మిదవసూత్రంబుచే వైభాషిక గుగాగమంబుగలిగి 'అప్పగించు, అప్పంగు, ఒప్పగించు, ఒప్పించు' 'ఆగించు' దీనికి 'ఆలకించు' అనురూపాంతరంబుగలదు. ఈధాతువు 'ఆలషమ్' అను సంస్కృతశబ్దంబు వలనఁగలిగినది. ఈయించుగాగమయుక్తంబైన 'హరించు' ఇత్యాదిధాతువులందు నించు గాగమసంబంధి యికారంబుగాని, యట్టి యికారయుక్తహల్లుగాని యతిగానుండ వచ్చును. ఇంచుగాగమసంబంధి యికారయుక్తహల్లు యతిగానుండుట నిర్వివాదాంశం బుగావున నించుగాగ మేకారంబు యతిగానున్నదులకు పహాకవిప్రయోగంబు ప్రదర్శింపఁబడియెడి. ఉ॥ వీరలుదైవశక్తి ప్రభవించినవారను క్షేమిసందియం । బీరమ ణీయకాంతినుకమింపఁగవేల్పులెకాక భార-ఆది-. ర౫ సీ ఏనదియ్యాముని నటించిన హరుఁడైన మరునికన్నుల సన్నఁదిరుగువనిన' నృసింహ-1ఆ (ఫెట్టిపెగడ) ఉ। నాకవి భుండులేఖితతి యచ్చెరుపాటుననన్నె చూడనే । నేకమలాప్తనందనువధించెదఁ గార్య మునిర్వహించెదన్' భారతము. 'క। తెంపరియై మదియింత చ । లింపకయనిలోనఁ దిరియనెవ్వఁడలేఁడు' హరికథాసారము. (అల్లసాని పెద్దన్న)

క॥ ఇంచియనునచ్చుహల్లును । నంచితముగ సంధికూడునప్పుడునిన్నం । దెంచఁ గబాలుఁడుహరిఁబలి । కించెననన్ రెండుఁజెల్లు నెలమింగృతులన్ లక్షణచూడామణి. క॥ కొంచకపోషించె న్వీను । తించె ననఁగ భిన్నవిరతి యిటులుచెలంగున్' లక్షణ చూడామణి. క॥ కాకుస్వరయతిజగు నితఁ డే కదలకజలధిఁ బవ్వళించెననఁగఁబ్ర శ్నాకలితదీర్ఘమున నితఁ। డేకవ్వడిరథముగడిపె నిమ్ములవనఁగన్' అనంతునిఛందస్సు. క॥ మించి మదించినరిపుల హ రించక సత్కీర్తి యీమహీతలమెల్లన్ ।నించకదీనుల దయఁ బో । షించక ప్రఖ్యాతిగలుగునే నరనాథా' దశకుమారచరిత్ర. క॥ పంచ

శరుం డపుడని చా లించె మహాప్రవనభూమి నీక్షించినదో । వంచితుండై శంభుమ పూ ! రించెం గలగిరులు దిక్కరిప్రజముడరఁగ' ప్రమ్యమ్నోపాఖ్యానము ఉ అంచితమైనహార్తి నమరాధిపుండెల్లు సమీరుచేతఁ బుత్తెంచిన రత్నహారము ధృతిఁ ఘనశిలుఁడు రాఘవుండు పా । టించి గరించి పొందుగుటియుందినముజ్జ్వల తారకాళిచే మించిన యభ్రమండలము మీకెమనోహరదివ్యమూర్తియై, భాస్కర-యు-కాం, తే గీ కమసుపైఁ గ్రియసతమును కమసువచ్చి భిన్నయతియగురానిచోఁ బెం యతియగు నెసమలచ్చిని గారి రియుంపె నసగ రిపులనెల్లను బోనమారించెననఁగ అప్ప-లెఅ. అనియప్పకవి యిట్టు గాగమాపుటితస్థలంబులో రింపు గాగమేకారంబు యతిగానుండెవవ్చునరియుఁ గారిచో నిందు రికారయుక్తమైనహల్లు యతిగా నుండవగునరియు విశరించి దీనికి భిన్నయతియని నామాంతరంబిడుదు ననంతునిఛందంబునందలి పూర్వోక్తంబైన "క కాకుస్వరయతియగు నితఁ । డే కదలకజలధిఁ బన్వళించెననఁగఁ బ్ర । శ్నాకళితనీర్ణమున నితఁ । డే కన్వడిరథము గడిపె నిమ్ములననఁగఁ" అనిన యీపద్యంబును నభేదవిరతిప్రకరణంబులో శకారడకారంబులకు సెల్లునన్నందులకు నుదాహరణంబుగాఁ జూపెను. ఇయ్యది యెంతయు వింతగానున్నయది. ఆపద్యంబులో "పన్వళించెఁ" అనుదానిలోని యించుగాగమేకారంబునకు "శతఁడే" అనుపదంబు తుదియేకారము కాకుస్వర యతిగానుండినందులకు గ్రంథకర్తయే నుడువుచుండఁగా శకారడకారంబులకు భేదయతి చెల్లునని పద్యార్థంబునకు విరుద్ధంబైనయంశంబునకు నిదర్శనంబుగాఁ జూపంబడియె. గ్రంథకర్త కాకుస్వరయతికి నుదాహరణంబని మొఱపెట్టుచుండఁగాఁ బద్యార్థంబునైనను బరికింపక యనంతుని వాక్యంబు శకారడకారంబుల యభేదవిరతికి నుదాహరణంబని దృష్టాంతీకరించుట బధిరశ్రవణంబునొద్దఁ బెట్టినశంఖధ్మానంబును స్మరింపఁజేయుచున్నది. కాన నప్పకవి వచనఁబొప్పఁజగినది గాదు ఇంచుగాగమేకారంబు సర్వవిగంబుల లాక్షణికాదృతంబగుటంజేసి నిరతంబును విరతిగానుండదగు.

64 సూ—ఇడుబులకించుకున్కపరంబగు నపుడయుగవృగరుకున్కలగు.

జి - జయించు ॥ నీ - నయించు । ద్రు-ద్రవించు । లూ - లవించు । ధృ — ధరించు ॥ తౄ - తరించు.

వ్యా— ఇ-ఉ-ఋ, వీనికి ఇంచుగాగమంబు పరంబగునపుడు క్రమంబుగా నికారంబునకు నయుక్కును, ఉకారంబునకు నవుక్కును, ఋకారంబునకు నరుక్కును గలుగును. "జయించు" జిధాతువికారాంతంబు. దీనికి ఇంచుక్కు పరంబుకాఁగా నయుగాగమంబుగలిగి "జి + అయ్ + ఇంచు" అనియుండె. ధాతుసంబంధంబైన యికారంబునకు నయుగాగస్వరంబు పరంబుకాఁగా నపదాదిస్వరనిత్యసంధి (సంధిబ. 11సూ) చే "జయించు" అనురూపంబయ్యె. ఇట్లు నయించు (నీ + అయ్ + ఇంచు) ద్రవించు (ద్రు + అవ్ + ఇంచు) లవించు (లూ + అవ్ + ఇంచు) తరించు (తౄ + అర్ + ఇంచు) మున్నగు శబ్దంబులందుఁ గిత్తులైన యయుగాగమాదులు ధాతువునకు నంతావయవములుగా రాఁగాఁ బైనిం జెప్పిన యపదాదిస్వర నిత్యసంధి గల్గును.

65 సూ—నిర్జినామంబుల కయుగాగమంబుగలుగదు.

నిర్జికి నామధాతువులు కయుగాగమంబుగలుగదు । నిర్జించు స్తుతించు । ఈజ్ఞాపకంబుచేతనే నామంబులకు ధాత్వవివక్షయందించు గాగమంబగునని యెఱుంగునది। శయనించు - పయనించు.

వ్యా—"నిర్జి" అనునుపసర్గయుక్తధాతువునకును, నామధాతువులకును, ఇంచుగాగమంబు పరంబగునపు డయుగాగమంబు గలుగదు. ఉ. నిర్జించు (నిర్జి + ఇంచు) నుతించు (నుతి + ఇంచు) స్తుతించు (స్తుతి + ఇంచు) నుతిస్తుతిశబ్దంబులు నామంబులైనను ధాతుత్వవివక్షచే నించుక్కు గలిగె. (సూ) ఈజ్ఞాపకంబుచేతనే నామంబులకు ధాతుత్వవివక్షయందించుగాగమంబగునని యెఱుంగునది. వ్యా — ఈసూత్రంబునందు నామవాచకంబుల కయుగాగమంబు నిషేధింపంబడుచున్నది. "ధాతువునకు" అనుక్రియాపరిచ్ఛేదప్రథమసూత్రింబుపై యెనుబదినాల్గవసూత్రంబులోఁ గూడ ననువర్తించుచుగాన ధాతుసంబంధంబైన యికారాదులకే యించుక్కు పరంబగునపుడయుగాగమంబు

విమ్చును. ధాతువులసంపర్క నామవాచకంబులకంటె నిముగాగమంబుకాదు. కావున నిముగాగమ పరత్వావస్థలో విధింపబడిన యయుగాగమంబును స్వతస్సిద్ధంబుగానే నామంబులకు బ్రాప్తింపదు. ఇట్లుండఁ బ్రాప్తింపని యయుగాగమంబును నామవాచకంబులకంటె రావని నిషేధింపకుండఁజేసి నామవాచకంబులకు ధాతుత్వారోపణయం దు నిముగాగమంబువచ్చునని యను మీయింపంబకుమున్నది యని తాత్పర్యంబు. ఉ. శయనిము. శయనశబ్దంబు. సంస్కృతభాషలోనిది శీఙ్ ధాతువువలననైన యకారాంతనామవాచకంబు. దీనికి ధాతుత్వారోపంబువలన నఱునదిమూఁడవసూత్రంబుచే నిముక్కు గలిగెనని యెఱుంగునది. రూపాంతరంబు "శయిుంచు" చ॥ అమలనివాతసౌధములయందు మనోజ్ఞమరాళతూలతల్పముల శయింపి" భార-అర-౯౨. "పయినిము" పయనశబ్దంబు ప్రయాణశబ్దవైకృతంబు దీనికి ధాతుత్వారోపంబునందు నిముక్కయ్యె.

66 సూ—సంస్కృతంబునకు లఘూపధంబునకు నిముక్కు పరం బగునపుడు గుణంబగు.

అ-ఏ-ఓ- ఈమూఁడును గుణంబులునాఁబడు - ఋస్థానికంబగు గుణంబు పరంబయియుండు సంస్కృతధాతూపధలకు - ఇ - ఉ - ఋ - అనువానికి సారిదిని - ఏ - ఓ - అర్ - అనునవియించు క్కు పరంబగునపు డగునని యెఱుంగునది ఛిద్ - ఛేదించు - భిద్ - భేదించు ఘుష్ - ఘోషించు - పుష్ - పోషించు - వృష్ -వర్షించు హృష్ - హర్షించు.

వ్యా—హ్రస్వమ్ము, ఉపధ (శబ్దముతుదనుండి రెండవయక్షరము) గాఁగలిగిన సంస్కృతధాతువునకు నిముక్కు పరంబగునపుడు గుణంబు (అర్, ఏ, ఓ, ఇవిగుణ సంజ్ఞగలవి) గలుగును. మూలంబునఁజెప్పిన (అ, వర్ణముగుణసంజ్ఞగలది. అనఁగా "అర్" అనునది గుణంబని భావము ఋకారస్థానంబునందు వచ్చినగుణాక్షరం చెప్పు డును రేఫపరమంచుఁ గగ్గిన అకారంబే (అర్) యగును. ఉదా. ఛిద్, భిద్, ఈధా

తువులందుఁ గడపటినుండి రెండవయక్షరం బికారంబుగావున నేకారంబనెడి గుణాక్షరంబువచ్చి 'ఛేదించు' అయ్యెను. ఘుష్, పుష ఈధాతువులకు నుపధాక్షరం బుకారంబుకావునఁ బైనిం జెప్పిన క్రమప్రకారంబున నోకారంబువచ్చి ఘోషించు, పోషించు, అయ్యె. వృష్, హృష్, ఈధాతువులకు నుపధాక్షరంబు ఋకారంబుగావున 'అర్', అనుగుణంబుగల్గి వర్షించు, హర్షించు, అయ్యె.

67 సూ—స్పృశికి గుణంబు విభాషనగు.

స్పర్శించు - స్పృశించు.

వ్యా—స్పృశ్‌ధాతువునకు గుణంబు వైకల్పికంబునగు. ఉ. స్పృశించు, స్పర్శించు ఇచ్చటఁ బక్షంబున ఋకారంబున 'అర్', అనెడిగుణంబు కలిగెను.

68 సూ—లిఖ, భుజ, రుచ, కృశంబులకు గుణంబులేదు.

లిఖించు - భుజించు - రుచించు-కృశించు - కుచధాతువునకు గుణంబులేదని యొకండు వక్కాణించెనది గ్రాహ్యంబుగాదు.

వ్యా—లిఖ, భుజ, రుచ, కృశ, అనుధాతువులకు గుణంబులేదు. ఉ. లిఖించు, ము. "సంకుచించు" అనిగుణరహిత రూపంబుండును. ప్రయోగము గీ. సుందరత్వము నకుఁ జోటిచ్చి తాసంకు । చించెననఁగఁ గనుఁ గృశించెనడుము, కవిక. 1 ఆ. 'సంకోచించు, అనియుసంయుక్తరూపంబు ఘంటాపథంబుగా వ్యవహరింపంబడు చున్నయది.

69 సూ—సృజికి నిర్మితిని గుణంబులేదు.

చతుర్ముఖుండు ప్రజలను సృజించె ॥ అతండు విషయంబుల విసర్జించె.

వ్యా—సృజ్ ధాతువునకు ‹పుట్టించుట›, అనునర్థంబున గుణంబులేదు ఉ చతుర్ముఖుండు ప్రజలనుసృజించె ఇచ్చట నిర్మాణార్థంబు కావున గుణంబులేదయ్యె. అతండు విషయంబులవిసర్జించె, భోగంబులను విడిచెననియర్థంబు ఇచ్చటనిర్మాణార్థంబు కాదు కాన ధాతుఋకారంబునకు ‹అర్ అను గుణంబుగలిగె

70 సూ—సర్వంబునకుం బ్రేరణంబునందించుక్కగు.

పచింపించు - వచింపించు - ఆవులింపించు ఖండించు - పండించు.

వ్యా—సర్వధాతువులకు (సంస్కృతధాతువులకును, తెలుఁగుధాతువులకును) ప్రేరణంబునందు (చేయుటకును నర్థంబునందు) ఇంచుక్కగలుగును ఉ. పచింపించు (పచించునట్లుచేయుట) వచింపించు (మాట్లాడునట్లుచేయుట) ఆవులింపించు (ఆవులించునట్లుచేయుట) ఖండించు(ఖండునట్లుచేయుట) పండించు(పండునట్లుచేయుట) "పచింపించు' ఇచ్చటఁ బచించుధాతువుకంటెఁ బ్రేరణార్థకంబైన యించుక్కరాఁగా ‹పచించు + ఇంచు, అనియుండెడి ఎనుబదియేడవసూత్రంబుచే మొదటి ‹ఇంచు, లోని చకారంబునకుఁ బకారంబుగలిగి పైరూపంబేర్పడె ఇట్టిత్తుక్కంగల వానియం దూహ్యము ప్రేరణార్థంబునే ణ్యర్థంబనియు, ణిజర్థంబనియుఁ జెప్పుదురు. తెలుంగులోఁ బ్రేరణార్థంబునందు నించుక్కగలుగునట్లు సంస్కృతవ్యాకరణంబునఁ బ్రేరణార్థంబునందు ణిచ్ప్రత్యయంబు గలుగును కానఁబ్రేరణంబునకు ణిజర్థంబనివ్యవహారంబు గలిగె.

71 సూ—రంజాదుల యించుక్కుకారంబునకు సబిందుకంబునకు ప్రేరణంబున ద్విరుక్తలకారంబగు.

రంజిల్లు - భాసిల్లు - వర్థిల్లు విలసిల్లు - రాజిల్లు ॥ ఈసూదేశయోగంబునభిధానము లక్ష్యకంబగు - ఛేదిల్లు కంపిల్లు - సంధిల్లు

వ్యా—ప్రేరణార్థంబులేని రంజిధాతువు మొదలైనవానియొక్క యించుగాగమచకారంబునకు దాపటిసున్నతో సైతంబు లకారద్విత్వంబాదేశంబగును. ఉ. రంజిల్లు, భాసిల్లు, వర్ధిల్లు విలసిల్లు, రాజిల్లు, 'రంజిల్లు' ప్రథమంబున 'రంజి' ధాతువునకు నఱువదిమూఁడవసూత్రంబుచే నించుక్కుగలిగి 'రంజించు' అనియుండ ననుస్వారంబుతోఁ గూడ నించుక్చకారంబునకు లకారద్వయంబుగలిగి పైరూపంబయ్యె ఇట్లే భాసిల్లు మున్నగునవి యూహించునది (సూ) ఈయాదేశయోగంబున భిదాదు లకర్మకంబులగు. వ్యా—ఈద్విలకారాదేశంబు గలిగినప్పుడు 'భిదిర్' ధాతువు మొదలైనవియకర్మకంబులగు. ఉ. భేదిల్లు, కంపిల్లు సంధిల్లు, సంస్కృతంబున భిదిర్ ధాతువువిదారణార్థంబుగావున సకర్మకంబు. తెలుఁగున నించుగాగమంబునకు లద్వయంబు చేర్పుటంజేసి యకర్మకంబయ్యె. భేదిల్లువ్రయ్యుట, బ్రద్దలగుట. 'కంపిల్లు కంపధాతువు సంస్కృతంబునందును నకర్మకంబే. దీనియించుక్కునకు లద్వయంబుచేర్చి నందునఁబైధాతువునందుంబలె విశేషంబులేదు. 'కంపించు, అనియు నకర్మకార్థకంబుగలదు 'సంధిల్లు' సంధిశబ్దంబు నామవాచకంబు. దీనికిధాతుత్వవివక్షయందు నఱువదియేడవసూత్రంబుచే నించుక్కురాఁగా 'సంధించు' అయ్యె. ఇచ్చట ననుస్వారంబుతో సయితము చకారంబునకు లద్వయంబు చేర్చినందున నకర్మకంబగు.

72 సూ—ఇంచుక్కు పరంబగునపుడు రంజాదుల యించుక్కునకు లోపంబగు.

లాదేశంబున కపవాదంబు ॥ రంజించు - భేదించు-సంధించు.

వ్యా—అఱువదిమూఁడవ సూత్రంబుచేత 'రంజ్' మొదలగుసంస్కృతధాతువులకు స్వార్థమందించుక్కురాఁగాఁ బ్రేరణార్థంబునందు రెండవయించుక్కు డెబ్బదియవసూత్రంబుచేతఁ జేసినయపుడు మొదటియించుక్కుయొక్క చకారస్థానమందు డెబ్బదియొకండవసూత్రంబుచేత విధింపంబడిన ద్విత్వలకారంబును బాధించిప్రకృతసూత్రంబుచే సర్వేంచుగ్లోపంబగునని భావము. ఉ. రంజించు, (రంజిల్లఁజేయుట) భేదించు (భేదిల్లఁజేయుట) సంధించు (సంధిల్లఁజేయుట) 'రంజ్ + ఇంచు (స్వార్థమందు) + ఇంచు (ప్రేరణార్థమందు)' ఇట్లుండ ద్విలకారాదేశంబును బాధించి మొదటిస్వార్థకించు

క్కునకు లోపంబు రాఁగాఁ ద్విరూపంబయ్యె. 'సంధిల్లు' అనునది యకర్మకంబు. ఉ. ఉల్లమునందు నక్కటికమూనుట మీకులమందుఁ గంటిమం। చల్లనమేలమాడున చలాత్మజమాటకు లేతనవ్వసం। ధిల్లఁగిరీటి, మను- 1ఆ. ఇట్లు 'ఘటిల్లు' అనునది యకర్మకము సకర్మంబుగా ఘటించు. ఉ. వానిపాపము వానినే ఘటించును. ఇట్లు సకర్మకాకర్మక భేదంబు జాగ్రత్తతో నూహించునది.

73 సూ—చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్తనలడరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగానగు.

పూను - పూనుచు - పూనించు ॥ తేలు - తేలుచు - తేలించు॥ మగుడు - మగుడుచు - మగిడించు ॥ కుదురు - కుదురుచు-కుదిరించు ॥ విను - వినుచు-వక్ష్యమాణంబుపుగాగమంబు - వినిపించు ॥ బాహుళకంబుచేఁ గొన్నింటికి జుగాగమంబులేదు - అను - అనిపించు। తిను - తినుపించు । కను - కనిపించు - దీనియత్వంబునకు దీర్ఘంబగు - కానిపించు.

వ్యా—నకారలకారడకారరేఫలద్విత్వంబు తుదిలేనియట్టి యచ్చతెనుంగు శబ్దంబునకుఁ బ్రేరణార్థంబునఁ జుగాగమంబు బహుళంబుగానగును. ఉ. పూను - పూనుచు - పూనించు - తేలు - తేలుచు - తేలించు. మగుడు - మగుడుచు - మగిడించు - కుదురు - కుదురుచు - కుదిరించు. 'పూను' ఇత్యాది ప్రేరణార్థంబు లేని రూపంబు. ఈధాతువు నకారద్విత్వంబు తుదిలేనిది కావునఁ బ్రేరణార్థమందుఁ జుగాగమంబుగల్గి 'పూనుచు' అయ్యెను. చుక్కు వైకల్పికంబుగావునఁ బ్రేరణంబునఁ బాక్షికంబుగా 'పూనించు' అయ్యె. ఇట్లే తక్కుంగలవియూహ్యంబులు. 'మగిడించు' 'మగుడు + ఇంచు' ఇట్లుండ నపదాదిస్వరనిత్యసంధియు, నెనుబదియేనవసూత్రంబుచేఁ గకారంబుమీఁది యుత్వంబున కిత్వంబునుగల్గి పైరూపంబేర్పడియె. ఇట్లే 'కుదిరించు-వినిపించు - అనిపించు - కనిపించు' ఇత్యాదులందు నెనుబదియేనవసూత్రంబుచే నిత్వం బూహించునది (మూ) విను - వినుచు వక్ష్యమాణంబు పుగాగమంబు వినిపించు.

వ్యా—వక్ష్యమాణంబనఁ జెప్పంబోవునది అనఁగా డెబ్బదినాల్గవసూత్రంబుచే విధింపఁబడి పుగాగమంబు (మూ) బాహుళకంబుచేఁ గొన్నింటికిఁ జుగాగమంబులేదు అను-అనిపించు తిను-తినిపించుకను-కనిపించుదీనియత్వంబునకుదీర్ఘంబునగు-కానిపించు వ్యా-బహుళశబ్దంబు 'ద్వన్ద్వమనోజ్ఞాదిభ్యశ్చ'(5అ-1పా-133సూ) అనినసూత్రంబందలి వనోజ్ఞాదిగణంబులోఁ బఠితంబైనది కావున భావార్థంబునందు వుఙ్ ప్రత్యయంబు నొంది బాహుళకంబాయె బహుళత్వంబుచేతనని యర్థంబు డెబ్బదినాల్గవసూత్రంబుచేఁ బుగాగమంబేకాని ప్రకృతసూత్రంబునఁ జుగాగమంబు రాదనుట 'కానిపించు అనుదానియందలి దీర్ఘమున్నష్టము

74 సూ—అట్లుపుగాగమంబును మాన్యాదులకగు

మాను - మానుపు-మానుచు మను-మనుపు-మనుచు- బాహుళకంబున దీనికించుక్కు_లేదు.

వ్యా—చుగాగమంబువోలెఁ బ్రేరణంబున మాన్యాదులకుఁ బుగాగమంబు బహుళఁబుగానగను మానపు - మానుచు (మానఁజేయుట - విడిపించుట) మనపు-మనుచు (బ్రదికించుట) బహుళమని చెప్పుటచేత మనుధాతువునకుఁ బ్రేరణంబున నించుక్కాగమ 'మనించు' అనిగాదు మానుధాతువునకు 'మానించు' అగను [చూ-77సూ)

75 సూ—చుక్స్వవర్ణంబులు పరంబగునపు డిత్వంబున కుత్వంబగు.

వ్యా—చుగాగమ పుగాగమంబులు పరంబులగునపు డికారంబున కకారంబగును ఉ. బిగియు - బిగుచు - వడియు - వడుచు - మెరియు - మెలుచు - బిరియు - బిగుపు - తెరియు - తెంపు - కలియు - కలుపు (క పవపడిచేతులు బిగిచిన, వి-పు-6ఆ వలవలకన్నీరువడ వకమ్మ, అని- 2ఆ చ. కేఁగేల్ కాలిచినబెట్కు- బేడిసలమిన్నలచిన్నల వెన్నుఁ దన్నుబల్ సొలపులమాపు' రస- 3ప

76 సూ—అట్లు చుక్పుగాగమంబుల డంగ్వాదిమాయ్యాదులకు గునగుచో వానికడ వ్రాలు లోపించు.

అడఁగు - అడఁచు - అడఁగించు మాయు - మాపు - మాయించు అడఁగు - కరఁగు - కలఁగు - నలఁగు - ఇత్యాదులడంగ్వాదులు మాయు - ఉడుగు - కడఁచు - కుడుచు - బిగియు - ఇత్యాదులుమాయ్యాదులు ఆఁగుప్రభృతు లుభయగణంబులు - బాహుళకంబునంజేసి కొన్నింటి కించుక్కుక్పుగాగమంలులు మూఁడును గొన్నింటికందు యథాసంభవముగా రెండును గొన్నింటికొక్కటియు నగు నని యెఱుంగునది ఆఁగు - ఆఁచు ఆఁపు - ఆగించు రేఁగు రేఁచు - రేఁపు - రేఁగించు పాయు - పాచు - పాపు ॥ విఱుగు - విఱుచు ॥ చూఁచు- చూపు నేరుచు- నేరుపు మేయు- మేపు లేచు లేపు ॥ కలియు - కలుపు ॥ తడియు - తడుపు - తెలియు - తెలుపు ॥ ఇత్యాదు లెఱుంగునది.

వ్యా—పేర్రిగణంబునందు బాహుళకంబున 'అడఁగు' ప్రభృతులకుఁ జుగాగమంబును, మాయుప్రభృతులకుఁ బుగాగమంబునగును అప్పుడు ధాతువుల తుదియక్కరంబులకులోపంబుగల్గును ఉ అడఁగు అడఁచు - అడగించు ఇచ్చటఁ జుక్కు పరంబగునపుడు గువర్ణంబులోపించె ఇట్లే 'కరఁగు - కలఁగు- నలఁగు' ఇత్యాదులూహ్యము 'మాయు - మాపు - మాయించు' ఇటఁ బుగాగమంబు పరంబగునపుడుయువర్ణంబులోపించె ఇట్లే 'ఉడుగు- కడచు- కుడుచు - బిగియు' ఇత్యాదుల నంత్యవర్ణలోపంబు (యూ) ఆఁగుప్రభృతు లుభయగణంబులు బాహుళకంబునంజేసి కొన్నింటికించుక్కుప్పాగామంబులు మూఁడును గొన్నింటికందు యథాసంభవముగా రెండును గొన్నింటి కొక్కొక్కటియునగునని యెఱుంగునది

వ్యా—ఆఁగు మున్నగుధాతువులకుఁ జుగాగమపుగాగమంబులుభయంబు ను వచ్చును. ఈప్రకరణంబులోని సూత్రంబులందు డెబ్బదిమూఁడవసూత్రంబులోని బహుళగ్రహణ మనువర్తించినందునింముగాగమ పుగాగమంబులలో లక్ష్యానుసారం బుగా (యథాసంభవముగా) నొక్కొకచోమూఁడును, వేఱొకచోరెండును, ఇంకొక చో నొక్కొక్కటియునగు ఉ ఆఁగు- ఆఁచు- ఆఁపు- ఆఁగించు- ఆఁగు మొదటి రూపము. (ఆంచు' ఇచ్చోజుగాగమంబు, (ఆఁపు, ఇచ్చటఁ బుగాగమంబు (ఆఁగిం చు, ఇట నింముగాగమమ్ము ఆఁగుధాతువు (ఆఁగించు, శబ్దపర్యాయంబై సకర్మకంబు నంగలగు (క ద్రోఁగుమఁదూపులుతూపుల నాఁగుచుదుస్తర శరతతులారుణవారిం దోఁగుచు, రామా- శిఅ (రేఁగు - రేఁచు - రేఁపు - రేఁగించు, ఇచ్చట యథాపూ ర్వంబుగా మూఁడునుగల్గెను (పాయు - పాచు — పాపు, ఇచ్చటఁ జుగాగమపుగా గమంబులు రెండేపుటిల్లె. (విఱుగు - విఱుచు, ఇచోటఁ జుగాగమంబు మాత్రంబయ్యె (చూచు - చూపు నేరుచు - నేరుపు మేయు - మేపు లేచు - లేపు కలియు - కలుపు. తడియు - తడుపు తెలియు - తెలుపు, ఇచ్చోఁ బుగాగమం బొక్క టియే యయ్యె

77 సూ—ఇంచుక్చుక్పు గాగమంబులు పరంబులగునపుడాగ మాదేశలోపంబులు పెక్కు దెఱంగులం గానంబడియెడి.

అగు - కావించు వచ్చు - రావించు - రప్పించు ॥ విన్నప ము - విన్నవించు ॥ మోఁకాలు - మోఁకారించు ॥ కేక - కేకరించు॥ పలవ - పలవరించు - పలవించు ॥ ఆల-అలకించు - ఆలించు ॥ వ్రక్క వ్రక్కలించు నొచ్చు - నొంచు - నొప్పించు ఉండు - ఉనుచు - ఉంచు డిగు - డించు - డిగించు ॥ పెరుగు - పెనుచు - పెంచు ॥ తునుగు - త్రుంచు మునుఁగు - ముంచు - మునుచు ॥ మొగుడు - మొగుడుచు-మొగుచు - మోడుచు - మొగిడించు ॥ చొచ్చు - చొ నుపు - చొప్పించు ॥ చినుఁగు - చించు - చింపు ॥ త్రెగు - త్రెంచు-

తెంపు తిరుగు - త్రిప్పు ॥ చచ్చు - చంపు ॥ నిలుచు - నిలువరించు - నిలుపు కొను - కొలుపు ॥ పోవు - పుచ్చు - పనుచు - పంచు - పనుపు - పంపు - అనుచు - అంచు - అనుపు - అంపు- అనుప్రయుక్తంబగు పోవునకుంబుచ్చు మాత్రంబగు - మోసపోవు - మోసపుచ్చు ఇత్యాదులెఱుంగునది.

వ్యా—ఇంచుగాగమంబును, చుగాగమపుగాగమంబులును పరంబగుచుండు ధాతువులకుఁ బరిపఠితంబుల నాగమంబులును, ఆదేశంబులును, వర్ణలోపంబులును లోకంబునఁ గానిపించెడిని ఉ. (అగు - కావించు, నించుక్క పరంబగునపు డగుధాతువునకుఁ గావాదేశంబు (వచ్చు — రావించు - రప్పించు, ఇచట వచ్చునకు రావురప్పలు వైకల్పికంబుగా నాదేశంబులయ్యె ఇట్లే (విన్నపము - విన్నవించు మోఁకాలు - మోఁకాలించు - కేక - కేకరించు, పలవ - పలవరించు - పలవించు, ఆల - ఆలికించు, ఆలించు వ్రక్క - వ్రక్కలించు నొచ్చు-నొంచు-నొప్పించు ఉండు- ఉనుచు ఉంచు డిగు-డించు-డిగించు పెరుగు-పెనుచు-పెంచు తునుగు-తుంచు మునుఁగు-ముంచు-మునుచు-మొగుడు-మొగుడుచు-మొగుచు- మోడుచు - మొగిడించు. చొచ్చు చొనుపు - చొప్పించు చినుఁగు—చించు—చింపు' త్రెగు—త్రెంచు త్రెంపు తిరుగు—త్రిప్పు చచ్చు—చంపు నిలుచు—నిలువరించు—నిలుపు కొను—కొలుపు ఇత్యాదులందు మూలధాతువులను, ప్రేరణార్థకరూపంబులను, బరికించి వానియందలి వర్ణవికారంబుల సూక్ష్మబుద్ధిచే నూహించునది. (సూ) పోవు- పుచ్చు-పనుచు-పంచు-పనుపు పంపు. అనుచు,అంచుఅనుపు-,అంపు అనుప్రయుక్తంబగుపోవునకుంబుచ్చుమాత్రంబగు ఉ మోసపోవు—మోసపుచ్చు, ఇత్యాదులెఱుంగునది. వ్యా—(పుచ్చు—పనుపు ఇత్యాదులయందలి చుగాగమపుగాగమవిశిష్టరూపంబులు ప్రేరణార్థంబునందగు వెండియు నీరూపంబుల యాద్యక్షరలోపంబు వైకల్పికంబుగానగు. ఉ. (అనుచు) ఇత్యాదులు, వేఱొకశబ్దంబుతో నేకీభవించిన పోవుధాతువునకు (పుచ్చు, అనురూపంబేగాగావేశంబగునుగాని తక్కినపూర్వోక్తపనుచు ప్రభృతులాదేశంబులు కావేరవు ఉ మోసపోవు ప్రేరణార్థకంబు మోసపుచ్చు (మోసపనుచు-మోసపంచు' ఇత్యాదులసంభవంబులు

78 సూ—అనాద్యములకించుక్కు పరంబగునపుడు పుగాగమంబగు మానునకు విభాషనగు.

అనిపించు అను - కను - తిను - విను మానిపించు మానించు.

వ్యా—'అను- కను- తిను- విను' మున్నగుధాతువులకు నించుక్కు పరంబగునపుడు పుగాగమంబు నిత్యంబుగను, మానునకు వైభాషికంబుగను గల్గును ఉ అనిపించు 'అను + ఇంచు ఇట్లుండఁ బ్రకృతిసూత్రంబునఁ బుగాగమంబును, ఎనుబదియేనవసూత్రంబున నువర్ణకంబుమీఁది యుకారంబునకికారంబును రాఁగాఁ బైరూపంబుసిద్ధించె ఇట్లే కనిపించు-తినిపించు- వినిపించు' ఇత్యాదులు. 'మానిపించు-మానించు' ఇచ్చఁబుగాగమంబు వైభాషికంబుగావున రూపద్వయంబు.

79 సూ—అడ్డాదులకించుక్కు పరంబగునపుడు గుగాగమంబగు నప్పాదులకు విభాషగు.

అడ్డము - అడ్డగించు ॥ అడ్డము - ఓర-చిత్తము - పంతము - పెల్ల - బోర - మట్టము - మేళము - ఇత్యాదులడ్డాదులు ॥ అప్ప- అప్పగించు - అప్పించు ॥ అప్ప - ఒప్ప - పల్లము - కోపము ॥ ఇవి యప్పాదులు.

వ్యా—,అడ్డము- ఓర- చిత్తము- పంతము- పెల్ల- బోర- మట్టము- మేళము మొదలైనవానికినించుక్కు పరంబగునపుడు గుగాగమంబునిత్యంబుగను, 'అప్ప- ఒప్ప- పల్లము,కోపము' మొదలయినవానికి నించుక్కు పరంబగుతఱి గుగాగమంబు వైభాషికంబుగను గలుగును. ఉ అడ్డగించు—మువిభక్తిపుట్టని యగ్గళశబ్దంబుకంటె నఱువదిగూఁడ వసూత్రంబుచే నించుక్కు పుట్టి ,అగ్గలించు, అయినట్టులిచ్చటఁ గేవలంబైన ( మువర్ణకంబులేని ) యడ్డశబ్దంబంగలాదగాపఠితంబని యెంచఁబడినందున నఱువదిమూఁడవసూత్రంబుచే నించుక్కు వేయఁగాఁ బ్రకృత్యాతంబున గుగాగమంబు

హైరూపంబయ్యె ఇట్లే చిత్తగించు- పంతగించు-వట్టగించు- మేళగించు' ఇత్యాదులందు మువర్ణోత్పత్తికిఁ బూర్వమందే కేవల ప్రాతిపదికంబుకంటెనిరువదిమూఁడవసూత్రంబుచే నిుముగాగమంబుగల్గిన దనిగ్రహింపవలయు. 'అప్పగించు- అప్పించు' ఇటఁగుగాగమంబు వైభాషికంబువుగానయీపదద్వయంబు ఇట్లే 'ఒప్పు- మున్నగువానికి గ్రహించునది

80 సూ.—ఆడోఁడుకూడులడకారంబునకుం జుక్కుపరంబగునపుడు రేఫంబగు.

ఆడు - ఆరుచు - ఆడించు ॥ ఓడు - ఓరుచు - ఓడించు కూడు-కూరుచు-కూడించు

వ్యా—'ఆడు- ఓడు- కూడు' ఈధాతులయందలి డకారంబునకు నిుముక్కుపరంబగునపుడు రేఫంబుగల్గు ఉ ఆడు- ఆరుచు- ఆడించు- 'ఆరుచు' ఇచ్చోఁనాడు ధాతువునకంటె డెబ్బదిమూఁడవసూత్రంబుచేఁ జుగాగమంబురాఁగాఁ బ్రకృతసూత్రంబున ధాతుడకారంబునకు రేఫంబుకలిగె 'ఆడించు' డెబ్బదిమూఁడవసూత్రంబుచేఁ జుగాగమంబు బహుళంబుగావునఁ బక్షంబుననిుముగాగమంబు. ఇట్లే ఓడు- ఓరుచు- ఓడించు కూడు- కూరుచు- కూడించు

81 సూ.—చెడునకుం జుక్పుగాగమంబులును డాకలఘు రేఫంబునగు.

చెఱుచు - చెఱుపు.

వ్యా—'చెడు' ధాతువునకుఁ బ్రేరణంబునఁ జుగాగమపుగాగమంబులు వైకల్పికంబుగనగుటయేకాక ధాతుడకారంబునకు రేఫంబుగలుగు. ఉ. చెఱుచు- చెఱుపు- ఇందు క్రమముగా. జుగాగమపుగాగమంబులు పరంబగుటవలన లఘురేఫంబు గలిగె.

82 సూ—పడునకుంజుక్కు—ను డాకలఘు రేఫంబునగు.

పఱుచు

వ్యా—పడుధాతువునకుఁ జుగాగమంబును, డకారంబునకు శకటరేఫంబును, గల్గు ఉ. పఱుచు- ఇట ‹పడు' ధాతువునకుఁ జుక్కు-పరంబగునపుడు శకటరేఫంబు గలిగెను. ఇందలిశకటరేఫం బుకారాంతంబు క, ‹భంగించియితరకాంతఁడొ' అంగుట తప్పారడంబఱచిపురుషులకు, కళా- 7ఆ ' అనినకళాపూర్ణోదయ పద్యంబునద్వితీయపాదస్థంబైన ‹పఱచి, శబ్దంబుశాస్త్రంబున నుకారాంత ఘటితంబయ్యె నేనియతియ శాస్త్రీయంబగునుగావున నిందలి శకటరేఫంబకారాంతంబుగను నుండవచ్చును

83 సూ—శబ్దపల్లవంబగు పడునకించుక్కు- వి భాషనగునగు చో డాకులఘు రేఫంబగు.

వెలువడు - వెలువరించు - వెలువఱుచు ॥ చొప్పడు - చొప్పరించు - చొప్పఱుచు.

వ్యా—రెండుశబ్దంబులు చేరి యపూర్వార్థబోధకంబై వేఱొక యఖండశబ్దంబగుట శబ్దపల్లవంబు(రెండుశబ్దంబులసంయోగంబునఁ జిగిర్చిననూతనశబ్దంబు) నాఁబడు ‹శబ్దపల్లవంబగుపడునకు, అనఁగా 'శబ్దపల్లవంబులో నంతర్భూతంబగు పడునకు, అని యర్థమ్ము, అట్టిపడుధాతువునకు నించుక్కు-విభాషగానగును దానికిఁదోడుగా డాకు లఘురేఫంబుగలుగును. ఉ. వెలువడు-వెలువరించు-వెలువఱుచు ‹వెలువడు, (వెలి + పడు) ఇటనించుక్కు-పరంబగునపుడు ప్రకృతసూత్రంబున లఘురేఫంబయి ,వెలువరించు' అను రూపంబయ్యె. పక్షంబునఁబూర్వసూత్రంబుచే జుగాగమశకటరేఫంబులు గలిగి ‹వెలువఱుచు' అయ్యె. ఇట్లే చొప్పడు- చొప్పరించు- చొప్పఱుచు

84 సూ—ప్రేరణంబునం దించుక్కు- మీఁద నించుక్కు-లేదు.

ఇటనుటంజేసి ప్రేరణార్థంబయిన యిత రాగమంబు మీఁదఁప్రేర

ణార్థంచు గాగమంబగునని యెఱుంగునది ॥ నొచ్చు - నొంచు - నొం పించు ॥ చచ్చు - చంపు - చంపించు.

వ్యా—ప్రేరణార్థకంబైన యించుగాగమంబు పైనిఁదిరిగి ప్రేరణార్థకంబగు నించుగాగమంబు రాదు గాని ప్రేరణార్థకంబులైన చుగాగమపుగామంబుల పైనిదిరిగి ప్రేరణార్థకంబయిన యించుగాగమంబు రావచ్చునని భావము ఉ. నొచ్చు- నొంచు-నొంపించు 'నొంచు, డెబ్బదియేడవసూత్రంబుచే నొచ్చునకుఁ జుగాగమంబుగల్గి 'నొంచు,అయ్యె దీనిపైనిందిరిగి ప్రేరణార్థకంబైన యించుకు్ౘరాఁగా నెనుబదియేడవసూత్రంబున నొంచుచకారంబునకుఁ బకారంబుగల్గి 'నొంపించు, అయ్యె 'చచ్చు, దినికి డెబ్బదియేడవసూత్రంబునఁ బుగాగమఘటితరూపంబు 'చంపు , అయ్యె దీనిపైనించుకు్ౘగలిగి 'చంపించు, అయ్యెను

85 సూ—ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో ననాద్యంబయిన యుత్వంబున కిత్వంబగు.

నిగుడు - నిగిడి - నిగిడె ॥ మగుడు - మగిడి - మగిడె ॥ ఉడుగు - ఉడిగి - ఉడిగె - మునుఁగు - మునిఁగి - మునిఁగె.

వ్యా—ధాతువు మొదటలేని యుకారంబున ఇకారంబొండె ఎకారంబొండె, దర్వాతఁబ్రాప్తించినచో నయ్యుదియికారంబగు ఉ. నిగుడు నిగిడి- నిగిడె 'నిగుడు, దీనికి మున్నుదియెనిమిదవసూత్రంబుచే ధాతువుపైనివర్ణకంబుగల్గి యపదాదిస్వరసంధిచే 'నిగుడి, అనికాఁగాఁ బ్రకృతసూత్రంబున గకారంబుమీఁది యుకారంబున కిత్వంబు గల్గి 'నిగిడి, అయ్యె ,నిగుడె' నిగుడుధాతువుపైని బదునాఱవసూత్రంబుచే భూతార్థక (ఈవక్ష్యమాణగ్రంథము రంగయాఖ్యశిష్యసాహాయ్యశూన్యంబుగా రచింపఁబడినది) లిడాదేశపుజ్ఞునకు ఎనువర్ణంబు, ఆదేశముకాఁగా "నిగుడు+ఎను" అయి యపదాది స్వరసంధిచే "నిగుడెను" అనురూపంబు సంభవించినపిదపఁ బ్రకృతసూత్రమున 'గ' కారమున కిత్వముగలిగి 'నిగిడెను' అయ్యెను ఇట్లు 'మగిడి' 'మగిడెను' 'మునిఁగిఁ

మగిడెను' ఇత్యాదులూహ్యంబులు ధాతువుతుదయందు ఇకారముగాని యెకారము

గాని యాదేశముగాఁ జేరినచో మొదటియుకారమునకుఁగాక తక్కినయుకారమునకు నిత్యమువచ్చునని యర్థము చెప్పుటచే ‹ఉదరిమునిఁగి ఇత్యాదుల తొలియుకారము నకు నిత్యఁబురాలేదు ఉ ‹పొత్యకి డిభకుపైసాయకదళకంబు నిగిడింప' ఉ హరిర ఆ ఉ॥ ఉత్పలగంధినన్నుడిగియొడ్లనుబంధము' భార విరా ౨ ఆ.

86 సూ—ముజ్జీత్తులు ముత్తునాఁబడు.

వ్యా— ఆశీ, శ్యాప సంప్రార్థనవిధులయందలిముదుజ్జులును, లజే, కలజి, నజే రుజే, పుజే, ఇత్యాదిజీత్తులును, ఈ తెలుఁగువ్యాకరణంబున ‹ముత్తు' అనుసంజ్ఞతో వాడఁ బడునని యర్థము

87 సూ—ప్రేరణేంచుక్కు పరంబగునపుడు పకారంబు చకారంబునకగు.

పచించు - పచింపించు ॥ వచించు - వచింపించు ॥ పిలుచు - పిలిపించు - వలచు - వలపించు పత్వంబు హెచ్చునకుం గలుగదు మెచ్చునకు విభాషనగు ॥ హెచ్చించు - మెప్పించు - మెచ్చించు.

వ్యా—ప్రేరణేంచుక్కు అనఁగా, చేయుట యనునర్థమందుఁ గర్గినయించుగాగమంబు. (70 సూత్రంబున) అదిపరంబగునపుడు ధాతుచకారంబుపకారంబగు ఉదా. పచించు, పచింపించు॥ వచించు వచింపించు॥ పిలుచు పిలిపించు॥ వలచు వలపించు పత్వంబు హెచ్చునకుంగలుగదు- మెచ్చునకు విభాషనగు హెచ్చించు, మెప్పించు. మెచ్చించు ఇట "పచించు + ఇంచు॥ అనియుండఁగా, ఇంచుగాగమంబునకుఁ పూర్వమందున్న ‹పచించు, శబ్దంబుతుదిచకారంబుపకారంబయి ఉకారసంధిగలిగి "పచింపించు" అయ్యె పచించునట్లుచేయుటయని యర్థము—ఇట్లన్యంబులు నూహ్యంబులు

88 సూ—ఆగమాన్య చకారంబుల కద్వియుక్తంబులకు ముత్తుపరంబగునపుడు పవలగు,

ఆగమంబు - పచింపఁడు - పచింపుము అడఁపఁడు-అడఁ
ము ॥ అన్యము - పిలువఁడు - పిలువుము.

వ్యా—ఇంమగాగమ చుగాగమ చకారంబులకునుభయంబులకును, ద్విత్వంబులేని ధాతుసిద్ధచకారంబునకున ముడుజ్జులును, జీత్తును, బరంబగుచో, నకారవకారంబులగు, ఆగమచకారంబునకు పకారంబును అన్యచకారంబునకు (సిద్ధచకారంబునకు) వకారంబును వచ్చునని క్రియాన్వయము సాధ్యసిద్ధచకారంబులకు క్రమంబుగాఁ బకారవకారంబులగు నని ఫలితార్థము ఉదా ఆగమంబు పచింపఁడు పచింపుము అడఁపఁగు అడఁపుము అన్యము పిలువఁడు పిలువుము

"పచింపఁగు' ఇట పచించులోని చకారంబు డెబ్బదవసూత్రంబున విధింపఁబడిన యించుగాగమంబుదిగావున నట్టిచకారంబునకు పకారంబుగలిగెను

"అడఁపఁడు" ఇచట అడఁగుధాతువునకు డెబ్బదియావసూత్రంబునఁ జుక్కాగా నాగమచకారంబైనందునఁ బైరూపంబు సిద్ధించె ఇట్లు శాస్త్రసాధ్యంబులైన చకారంబులుపకారంబులగుటకు నుదాహరణంబు. 'పిలుగఁడు,— 'పిలుము, చకారము మాత్రసాధ్యము కాక సిద్ధంబైనందున వకారంబయ్యె.

89 సూ—ఖండబిందువు మీఁది సిద్ధ చకారంబునకు ముత్తుపరంబగునపుడు పకారంబు ప్రాయికంబుగనగు.

తలఁపక - త్రేఁపక - తోఁపక ఏఁచునకు వైభాషికంబు - ఏఁపక - ఏఁచక నోఁచునకుం గలుగదు - నోఁచక.

వ్యా—ముడుజ్జులును, జీత్తులును బరంబగుచో నర్ధానుస్వారముమీఁది సిద్ధచకారంబునకు (88) సూత్రాంశమునవకారము రాక యీసూత్రమునఁ బకారంబే వచ్చునని పూర్వవిధికి నపవాదము అర్ధానుస్వారము, అనునాసిక్యమునకు గుఱుతు. అనగా నాసికతో నుచ్చరింపవలసియున్న యచ్చునకుఁ దర్వాత నర్ధానుస్వారము చిహ్నముగా నుంపఁబడును ఉచ్చరించుటలోనిట్టి యచ్చు కేవలము ముఖమునకే కాక "సూ॥ ముఖనాసికా

వచనోఽనునాసికః" అనుసంస్కృతవ్యాకృతిసంప్రదాయంబున నాసికకునుపయితమర్ధభాగ ముగాఁ జెందియుండునన్న యర్థంబు సూచింపనర్ధబిందువు వ్రాయఁబడుమన్నది అర్ధ బిందులేఖనంబున నట్టి స్వర మనునాసికమనినబహుశాస్త్రప్రసిద్ధార్థ మే ప్రకటింప బడుంగాని దానంజేసి క్రొత్తవింతలేమియు లేనందుల దీనినవాద్యవర్ణంబులైనయలఘుశే షాదులగ ణంబులోఁ బరిగణించుట యవిచారితమూలకంబని గ్రహించునది విశేషంబుగా నేతద్విషయంబ స్వప్రచితంబయినచతుర స్యశోకకంబులోనిమద్దళకా నీవ్యాసంబునఁజర్చిం పఁబడెంగాన నయ్యది చూడందగు "ప్రతిజ్ఞానునాసిక్యాఃపాణినీయాః" అను సంప్రదాయంబనుసరించి సాంస్కృతికవ్యాకరణవ్యాఖ్యాతలు భాష్యకారాదులయుప దేశవశంబునఁ దెలిసికొనినట్టులే యీయాంధ్రభాషయందును బొత్తంబులలో గురుపరం పరానుసారంబునఁ బ్రవహించుచున్న యర్ధానుస్వారచిహ్నంబులంజేసి యానునాసిక్య మను గ్రహింతురుగాక

ఉదా—తలఁపక. త్రేఁపక తోఁపక ఏఁచునకునై భాషికంబు ఏఁపక ఏఁచక। నోఁచునకుంగలుగదు నోఁచక॥ "తలఁచు" ధాతువుచకారమర్ధానుస్వారముత ర్వాతిది యయినంగున జీత్తైనకజేవర్ణకంబుపరంబగుచో, పకారంబుగస్థి (20) సూత్రంబునఁ బకా రోపరియుకారంబున కత్వంబుగస్థి తలఁపక అయ్యె ఇట్లుతలఁపని, తలఁపను తలఁ పరే, తలఁపకురే ఇత్యాదులూహ్యంబులు

నోచునకుమాత్రము పకారంబురాక నోఁచ, నోఁచని ఇత్యాదిరీతినిమందును "ఉ చొక్కపుఁబ్రాయమున్ని గులసోయగముంగల ప్రాణనాయకుం డెక్కువవశ్య తకా రఘల నేకటఁ దీర్చి సమేలమొప్పఁగా నక్కనగారవించి ప్రియమందగనోఁచని యింతి దైనకా చక్కదనం బదేమిటికి జవ్వనమేటికి నేర్పులేటికిన్ మను. 3 ఆ

20 సూ—ఆగమ చకారంబునకు నెఱసున్న మీఁది దాని దుక్కు పరంబగునపుడు పకారంబు విభాషనగు.

ఆకర్ణింపుదురు - దంపుదురు - చింపుదురు పత్వంబు రానిప క్షంబున వక్ష్యమాణతాదేశంబు ఆకర్ణింతురు ॥ దంతురు చింతురు

వ్యా— నిండుసున్నతర్వాతి సాధ్యచకారంబునకు దుగాగమంబు పరంబగునప్పుడు పత్వంబు వికల్పంబుగా నగును

"ఆకర్ణింపుదురు" ఇట, 'ఆకర్ణించు' అనుదానికంటె (6) సూ—నఁ దద్ధర్మార్థంబులందు లాట్టు రాఁగా బిమ్మటఁ బ్రథమపురుషమందొండె మధ్యమపురుషమందొండె బహుత్వము వివక్షితమయినప్పుడు (8) సూ—న రువర్ణకంబు గల్గుచో, "ఆకర్ణించురు" ఇట్లుండును (22) సూ—న దుగాగమంబు రాఁగా, "ఆకర్ణించు + రు" అనియుండు దుగాగమంబు పరంబుకాఁగా నిండుసున్నమీఁది చకారంబునకుఁ బ్రకృతసూ—న పకారంబుగల్గి "ఆకర్ణింపుదురు" అయ్యె పత్వవిధి వైభాషికంబు గావున నియ్యది ప్రాప్తింపనితఱిని "ఆకర్ణించుదురు" శబ్దంబులోని 'చుద్' అనువర్ణంబు లుభయంబులకును తకారహల్మాత్రమొక్కటియే యాదేశంబై 'ఆకర్ణింతురు' అను రూపంబు సిద్ధంబగు పక్షంబున (62) సూ—న 'ఆకర్ణింతుర్' అగు ఆకర్ణించెదరు దంచెదరు ఇత్యాదులునుండవచ్చుంగాని ఆకర్ణించుదురు, దంచుదురు ఇత్యాదిప్రయోగంబులు ప్రామాదికములని రెఱుంగునది

91 సూ—అగు వచ్చు చొచ్చుచూచులకు ముత్తుపరంబగునప్పుడు కా, రా, చొరు, చూడు, లగు.

అగు - కాఁడు ॥ వచ్చు - రాఁడు - రమ్ము ॥ చొచ్చు - చొరఁడు - చొరుము ॥ చూచు - చూడఁడు - చూడుము

వ్యా—అగు ప్రభృతులకు ముద్బుగును, జీత్తుడు బరంబగుచో, కాదులు యథాసంఖ్యముగా నాదేశంబులగునని యర్థము "తద్వ్యంతౌటకితౌ" అను సూత్రంబున భావ్యర్థక్రియటశేఖరాదులయందు ద్వంద్వసమాసములోని పదార్థంబులకును, సముచ్చయార్థకశబ్దసహితంబులైనవాక్యంబులలోని పదార్థంబులకును లోకమర్యాదననుసరించి

యథాసంఖ్యాన్వయము రానేరదని శంకించుకొని 'యథాసంఖ్యమనుదేశస్సమానామ్' అనిపాణిని ప్రత్యేకముగా సూత్రము నొనరించినందున నీవ్యాకరణశాస్త్రంబున మాత్రము క్రమాన్వయము చెల్లదన్నునని వ్రాయఁబడినది ప్రకృతంబున బాలవ్యాకరణంబులో సూరిగారు పాణినివలె ద్వంద్వాములయందు సాహిత్యమును నిరసించి ప్రత్యేకముగా నన్వయము చెల్లునన్న యర్థంబును సమర్థించునట్టి పారిభాషికసూత్రమును రచింపనున్న ను, యన్, రుక్, ఇత్యాదులయందు 'అద్యంతౌటకితౌ' అనుసూత్రార్థమును స్మరించుకొని కార్యంబులు నిర్వహించుకొన్నట్లే యట్టిస్థలంబులయందుఁగూడ శాస్త్రాంతర సిద్ధంబగు యథాసంఖ్యసూత్రమునర్థమ్ము జ్ఞప్తినుంచుకొని యీవ్యాకరణమందును క్రమాన్వయము చేసికొనవలయునని గ్రంథకర్త తాత్పర్యము లోకమందుమాత్రము శాస్త్రజ్ఞుల మతంబున సాహిత్యార్థమును దిరస్కరించునట్టి ప్రత్యేకాన్వయము సమన్వయింప నేరదని తలంచునది

ఉదా—అరు - కాఁడు - వచ్చు - రాఁడు రమ్ము॥ చొచ్చు-చొరఁడు చొరుము॥ చూచు మాడ్డఁడు - చూడుము

"రమ్ము" ఇం, వచ్చునకు లోట్ మధ్యమపురుషైకవచనము వివక్షితమయినపుడు 'వచ్చు + ము' ఇట్లుండఁ బ్రకృతసూత్రమున రాదేశము రాఁగా, 'రా + ము' అని యయ్యె తర్వాత (61) సూత్రమున దీర్ఘంబునకు హ్రస్వంబును ముపర్ణకంబునకు ద్విత్వంబు సంభవించి పూర్వోక్తరూపం బేర్పడె

92 సూ—ఇచ్చునకు సర్వంబున కీయగు.

ఇచ్చు - ఈఁడు ఇమ్ము ॥ ఈయయను నదేశంబు నొకానొక చోఁ గానంబడియెడి - బలిమినీ యనిభూమివలయ పతుల.

వ్యా—ము డుకు ను, జేక్తు ను బరంబగునపుడు ఇచ్చుధాతువునకు ఈ అనునది సర్వాదేశంబగు.

ఉదా—ఈఁడుఇమ్ము ఈయుమను నాదేశంబు నొకానొకచోఁ గానంబడియె డి. బలిమిని యనిభూమివలయుపతుల.

వ్యా—సుజేయు క్వాచిత్కంబుగానీయుశబ్దంబుతోలియుకారంబునకు హ్రస్వం బుగలిగి యుకారంబునకు ద్విత్వంబును జూపట్టెడి ఉ పత్యుచ్చబాపి గుబ్బలను బా హులఁబట్టఁగనిచ్చి మోవిపైఁ దియ్యని మోవియుంచనుదీరఁగఁ గోర్లఁగనిచ్చి యిప్పు డో తొయ్యలినిమ్ముట్టినను ద్రోచవవేనుఁగునిచ్చి యుంకువం బియ్యక యుయ్యెడఁద గునే యమునికి నేఁ-బాడియే॥ శశిబింగుచరిత్రము.

93 సూ—తేతేరలు తెమ్మనకగు.

తెమ్ము—తేఁ( )— తేరఁడు - తెమ్ము - తేరుము.

వ్యా—ము, కుజ్జులను, జేత్తులనుబరంబగుచోఁ దెమ్ముధాతువునకు దే, కాని తే రు కాని పర్యాదేశంబగు. ఉదా-తెమ్ము-తేఁడు తేరఁడు తెమ్ము తేరుము కం॥ ప్రనొకరుండనవచ్చెనఁ గాని బలము తేను నీవ గలిపినశస్త్రాస్త్రనేకవిధవిలాసము దా నవలయు సేన గాదెశక్యంబగుయట॥ భార, ఉద్యో. ౪ అ.

94 సూ—చావు నోవులు చచ్చు నొచ్చులకగు.

చచ్చు - చావఁడు - చావుము నొచ్చు - నోవఁడు - నోవు ము॥ వక్ష్యమాణంబు ద్విత్వంబు - నొవ్వఁడు.

వ్యా—ము, డుజ్జులును, జత్తులును, బరంబగుచో, 'చచ్చు' నకుఁ జావును నొ చ్చునకు నోవును నా దేశంబగు.

ఉదా—చచ్చు-చావఁడు చావుము॥ నొచ్చు-నోవఁడు—నోవుము వక్ష్యమాణ ద్విత్వంబు నొవ్వఁడు. (వ్యా) ప్రకీర్ణకపరిచ్ఛేదములోని యీ-అనసూత్రమున నోవులకు ద్విత్వంబును సమాసపరిచ్ఛేదములోని 13 సూ—న నాదిస్వరంబునకు హ్రస్వంబును గలుగునని తాత్పర్యము.

క॥ ఎవ్వరులేనడ నోకట్టఁడు నోవ్వంగా నడిచివేని నొప్పికొలఁదియుఁ గాఁ, జివ్వక తమునరయుందగు నోవ్వినవాఁ డెగ్గులాడు నుత్తముఁడైనన్. విజ్ఞా. పా౨. కాం (కేతన)

చ. అనఘుని ధర్మనందనుని నాసభ నమ్మెయి దీవు నోవ్వఁబల్కిన ఫలమందఁజేసెదఁ జలింపక యింతక సేపు నిల్వుమీ నినులఘుచిత్తుఁ గూరు నవినీతు మదాంధునిఁ ద్రుంచి నన్నుఁ బెంచిన గరువంపుఁ దండ్రులకుఁ జిత్తము మెలర్పఁ బుణంబుదీర్చెదన్॥ భార ద్రో. ౫ ఆ

౭౦ ఉత్తరపదంబగునపుడు వానిపువర్ణంబు విభాషను లోపించు.

చాక - చావక - చాకుము - చావకుము । నోక - నోవక - నోకుము - నోవకుము.

వ్యా— క, చ, ఇత్యాదులు పరంబగునపుడు చావునోవుల వుకారంబునకు లోపంబు విభాషగానగు ఉదా- చాక-చావక-చాకుము-చావకుము॥ నోక-నోవక-నోకుము-నోవకుము.

"చాక" ఇట, కచవర్ణకంబు పరమగుచో 'చచ్చు'నకు, జావుకుమాదేశము కాఁగా (94 సూత్రమున) ప్రకృతిసూత్రమున వువర్ణంబులోపించిన పూర్వోక్తరూపం బయ్యె ఇట్లే నోక, నోక్, చాక్ ఇత్యాదులూహ్యంబులు.

స్రగ్ధర— గాండీవజ్యారవంబుద్భటమయి పెలుచం గప్పినన్ భీమ బాహా దండం బెదొప్పంగుంభద్గద జడియుచు రౌద్రంబుగాఁదోఁచినన్నే దండద్వంద్వంబు మాడ్కిన్ దళిమి కవలు మార్కొంగఁ దాఁకినన్ జాకుండఁబోకుండఁ గౌరవ్యులకు వశమె బిట్టోర్చి మూర్ఛిల్లకుండన్॥ భార. ఉద్యో ౧ ఆ

శా చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు నశ్వత్థామయుం గర్ణుఁడున్ భూపశ్రేష్ఠుఁడుఁ దారు మున్నెఱుగరే పోరెట్లు కయ్యంబులా శాపాతంబులు మట్టలా వెఱుఁగమిం జావేఁడి మార్కొందురిం తే పోతమ్ముఁ గపిధ్వజ ప్రభలయం దీధూతులం జేయవే॥ భార ఉద్యో. ౧ ఆ.

శా. ఆకేశగ్రజుఁడంత నా నృపుని రాజ్యంబెల్లఁ జేరన్ ఫలం
బాకాంక్షింపఁగఁ గల్గు మృత్యువు నవిద్యం బుట్టకుండం దుదం
జాకుండన్ బ్రతెనంచు యోగనిరతిన్ జ్ఞానాశ్రయుండై మహా
నీకంబున్ రచియించు సంచోకటికిన్ దీక్షించితామన్నచోన్॥ ఆము. ౪ ఆ

క. చాకున్న నీదు మూర్తులు శ్రీకాశీక్షేత్రమెవ్వరికి నిదినిక్కం
బీకు నిరమిచ్చె శిఖరా లోకనమాత్రమున ముక్తులు కురంగాక్షీ. కాశీఖండము

క. బలమున నీతో దొరయఁగ నిలనెవ్వఁడు గలఁడు నా ~~[illegible]~~
తలఁపఁగ బ్రహ్మాంతకుదంష్ట్రిలు నీ నిందగీపశమె చాకుండంగన్॥
భార స్త్రీప. ౧ ఆ

క. మూఁకలు మొత్తులు కొడుకులుఁ జాకుండు తెఱంగుఁగను ము సరగనటంచున్
డాకొని యొడ్డిగిఁ బురుషుల్ గాకయుండిన దురమొనర్చఁగా రమ్మనుమీ॥
అ. తె. రా యు. కాం.

క. నాలుగుదిశలను దాన జ్వాలావళిగవిసెనండి చానోపఁగృపా
లోలాననో నక్కసరి తూపాలముఁ జేరంగ నెత్తికొని పొమ్మ దయన్॥
భార. అరణ్య. ౨ ఆ

క. నోనేపినూరుహాయసంతానముఁ జంపుటయు శల్యతనయుఁడవిరథుం
డై రిరుపమానమగుతన మానము వాహనము గాఁగ మదమెలరారన్॥
భార ఉద్యో. ౧ ఆ.

సీ. అర్జునిపైఁగూర్కి నతనినోనేయఁడు

సచరాచరంబయిన జగములెల్ల తే. నొక్కడు నగ్గమై కండంగినఁ జిక్కువడుచు దివ్య
బాణజాలంబుల దీటుకాలిపి ప్రాణములు డాపఁడతనిపాటిదొరల గాన మే రాజ్యముల
ఘుండుఁ గౌరవేంద్ర॥ భా. ఉద్యోగపర్వ ౭ ఆ

గీ. బలములచ్చెరువందు నట్లలవు మెరయ నీసుతుండనిలజుఁ దాకినిశితసాయ
కములనొప్పించిరథకురంగములనొంచి సూతునొనేయఁగ్రోధనిస్ఫూర్తి నతఁడు.

భార. ద్రో. ౪ ఆ

96 సూ—అగున కనుకనులకు ముజ్జిత్తులు పరంబులగునపుడుకా నాకానలు విభాషనగు.

అపవాద్య సూత్రముచే గాకువకారంబు - వక్ష్యమాణంబౌత్వంబు - కమ్మా - అగుము - అవుము ఔము కందు - అగుఁడు - అవుఁడు - ఔఁడు ॥ నాఁడు - అనఁడు కానఁడు - కనఁడు.

వ్యా—ముజ్జు (ముడుజ్జులు) పరంబగునపుడు అగునకు "కా" ఆదేశంబును జిత్తుపరంబగునపుడు అనునకు 'నా' యును కనునకు 'కాన' యును నాదేశంబులు సూత్రోక్తక్రమంబునగు (మూలము) అపదాద్యసూత్రముచే గాకు వకారంబు వక్ష్యమాణంబౌత్వంబు

వ్యా—అచ్చికపరిచ్ఛేదములోని 27 సూ-మున, అగుధాతుగకారంబునకు వికల్పంబుగా వకారంబును, ప్రకృతిపరిచ్ఛేదములోని 108 సూత్రమున. అవునకు బహుళంబుగా, ఔకారంబును నాదేశంబులగునని భావము.

ఉదా—కమ్ము-అగుము. అవుము ఔము॥ కందు-అగుఁడు-అవుఁడు-ఔఁడు నాఁడు-అనఁడు-కానఁడు-కనఁడు॥

వ్యా—'కమ్ము' ఇటఁబ్రకృతసూత్రంబున మధ్యమపురుషైకవచనము పరంబగుచో నగునకు వికల్పంబుగా, 'కా' కారమువచ్చి 'కా + ము' అనియయ్యె 61 సూత్రమున హ్రస్వంబుగఁగి ముత్వంబునకు ద్విత్వంబురాఁగాఁ ద్విరూపంబేర్పడె కాదేశము వైభాషికంబగుటం జేసి యభావపక్షంబున 'అగుము' అనురూపంబు. 'అవుము' అచ్చికపరిచ్ఛేదములోని 27 సూత్రమున వత్వంబు. 'ఔము' ప్రకృతిపరి-ములోని 108

సూ-న, జొత్వంబు (కండు' ప్రకృతసూత్రమున దుబ్బుపరంబగుచో, కాదేశము రాఁగా కా + డు అనియుండు.

61 సూత్రమున హ్రస్వంబు రా .క + డు' అనియుండు. ఇట దువర్ణకంబు జిత్తు గాన జిత్తు బిందుపూర్వంబగు నను సూత్రమునఁ బూర్ణబిందువు రాఁగ, (కండు' అని యుండు సంధిపరిచ్ఛేదములోని 21 సూత్రమునఁ దొలి హ్రస్వంబగు కకారముమీఁద, కిరసున్న యుండదని స్మరించునది

"నాఁడు" అనుధాతునకు వ్యతిరేకంబునె లడరాగా ~~[illegible]~~ సూత్రంబున నా దేశంబు వికల్పంబుగానయ్యె ఇటే (కానఁడు' అనుచోటఁ గానా దేశంబునయ్యె.

ఈ కావున లోకసంశయము గన్గొని యొల్లెడ నిర్మలుండవై నీవును శాంతి యుత సమతనిష్ఠయుఁ మీని గహప్రవేశసం భావనాత్మదర్శనవిభాసివికమ్మని నందదీయ వి ద్యావచనంబులం జనుఁడట్టిఁడయి వెలిఁగెంగృతార్థత భార శాంతి ౫౮

97 సూ—నేరుచునకు లిడ్లాట్టులు ముత్తుం బరంబులగునపుడు రుచులకు లోపంబు బహుళంబుగానగు.

నేచెను - నేరిచెను - నేచును - నెరుచును నేరఁడు - నేరువఁడు.

వ్యా—లిడ్లాట్టులు పరంబగునపుడు నేరుమనకురువర్ణలోపంబును, ముత్తుపరంబగునపుడు (ముడుబ్బులను జేత్తులను) చువర్ణలోపంబును బహుళంబుగానగునని క్రియాన్వయము

ఉ గా—నేచెను నేరిచెను-నేమను-నేరుమను-నేరఁడు-నేరువఁడు.

వ్యా—నేచెను. లిట్టు (భూత ప్రథమపురుషైకవచనంబు) గాన రేఫలోపంబు. నేరిచెను 85 సూ-న రేఫోపరియుకారంబునకు నికారంబు నేరఁడు ఈసూత్రంబున

(వ్యతిరేకార్థకలజజేత్తుగావున) చువర్ణలోపంబురాఁగా 20 సూ-నఁ రేఫోపరియుకారంబున కత్వంబు నేరవఁడు 88 సూ-న, సిద్ధచకారంబు గావున వకారంబు.

కం ॥ద్యూతక్రీడకుఁగొండొక నేతుంగపటమున నొప్పనిజనంబులు వా చేతికన మిల్లఁగొని పరి భూతియొనర్చిన విరక్తిపాడమి వెఱచితిఁ, భార. విరా ౧ ఆ లొట్టు గావునఁ బ్రకృతసూత్రమున రేఫలోపంబుగఁగి "నేముదుకు" అనియుం 108 సూ.న చుగులకు, వకారంబాదేశంబయి "నేగుక" అయ్యె.

స్వాగ— నీతలలందంగ నేలపైఁగూల్ప నేతునే వీక్షింపనిర్ణర వైరి. రంగనాథుని రామాయణము.

కం కాచికొనివచ్చితగవా నేచినయట్లచటనచట నిలిపితిమునినా।
ధాచేటును భంగంబును నైచిత్తము శోకమునకు నగ్గంబయ్యెఁ॥
భార మౌసలప. ౧ ఆ

"నేచినయట్లు"—ఇటఁ బ్రకృతసూత్రంబులోని నిర్గ్రహణంబు భూతకాలంబునకు నుపలక్షణంబు గావున భూతార్థకంబైనక్త్వవర్థంబున విధింపఁబడిన వప్రత్యయము పరముగాఁగ రేఫలోపంబయ్యె.

98 సూ—పోవునకు దుజ్ముత్తులు ముజ్ఞుంబరంబులగునపుడు వు లోపంబుంబొద పదలును విభాషనగు.

పోదురు - పోవుదురు - పోఁడు - పోవఁడు - పోవుము ॥ పొదము - పదము - పొమ్ము.

వ్యా—దుజ్ముత్తులు పరంబగునపుడు పోవునకు వులోపంబును, ముజ్ఞుపరంబగునపుడు పొదపదలును నూత్రిస్థపదక్రమంబున నాదేశంబులగు.

ఉదా—పోదురు-పోవుదురు-పోఁడు పోవఁడు పోవుము పొదము-పదము పొమ్ము.

"పోదురు" ఇటఁబోవుధాతువుమీఁదిలాట్టునకుఁ బ్రథమమధ్యమపురుష ంబులలో సైద్ధానిలోనంగాని బహుత్వము వివక్షితముకాఁగా "పోవు + రు' అయ్యె పిమ్మట (22) సూత్రమున దుగాగమంబును బ్రకృతసూత్రమున వులోపంబును గలిగి పైనినిరూపింపఁబడిన రూపంబయ్యె.

'పోఁడు' పోవునకు వ్యతిరేకార్థమందు (7) సూ-న లజేరూప్పతిల్లి లకియుత్తు గావునఁ బ్రకృతసూత్రమున వులోపంబుగలిగిన రూపంబు

"పాదము" పోవునకు ముజుపరంబగునపుడు పాదాదేశము. కం యదుకుల విద్వేషణుఁడై మదమునవర్తించు కంసుమర్దించి భవత్సదనంబుఁ జూడవచ్చెనఁ బోద మీస్యందనముఁ గొనుచు బురమున కనఘా భాగ ౧౦ స్క-ం. పూర్వభా.

కం॥ ఇదె! మాటికిఁ దెనఁగొనియెదుఁ గొదమాలినవలపు తేఁటికోదమా చెలిపై నెదమానినయెరపూనుమఁ బోదమా! పరికింత మలయఁ బోదమాటునకుఁ

అచ్చ తె. ర. అరణ్యకాం

సీ అనిబల్కి- కేవునవార్చి యొక్కు-మ్మడిఁ గదలి యొండొరుమీఁటి పొదఁడు పొదఁడు బళిమిపై బోదువుఁడు పట్టుఁడుకొట్టుఁడం చేడైఁదొడరియయ్యెఁబదివింగ్లు॥

అ తెఁ రా. యు. కాం

"పనము"—చం॥ ఉడుపతిదారికి న్వెఱచి యూఱటయానని చేరుటామనిఁ!
ముడివడుకంతుసేనలకు మయ్యెలగుట్టయినట్టి యిందురో
నడఁగళ తాపవహ్ని ఘనమై హరిణేక్షణముల్లుపుచ్చికో
ట్టడఁచినచందమాయెఁ బనమా! యెలదోఁటఁ జరింపకింటికిఁ॥

మను ३ ఆ.

99 సూ—అగుపోవులకడ బ్రాలకిద్విక్రంబులు పరంబు లగున పుడు యకారంబగు.

వక్ష్యమాణంబైత్వాంబు - అయి - ఐ - అయిరి - ఐరి పోయి పోయిరి - పోయెను - పోయెదు

వ్యా—ఇటఁ జక్కిన సూత్రంబులయందుంబలె సాంస్కృతిక వ్యాకరణంబునఁ యథాసంఖ్యసూత్రమ్ము స్మరించి తత్సామర్థ్యంబునఁ గ్రమాన్వయమును జెప్పికొనిన యట్టులుగాక లోకమర్యాద ననుసరించియే ద్వంద్వనిర్దిష్టార్థముతో ద్వంద్వనిర్దిష్టార్థమును సమన్వయింపఁజేసికొనవలయును "దేవదత్తయజ్ఞదత్తులు చరస్థిరాస్తులు భాగింపుకొనిరి" యన్నపుడు క్రమాన్వయము లేక లోకమర్యాద ననుసరించి దేవదత్తయజ్ఞదత్తులుభయులును జరస్థిరాస్తులుభయములును బంచుకొనిరి యన్న యర్థము చెప్పికొనినయట్లే యిటఁగూడ నగుపోవు లుభయంబులతోడను నిష్వక్రమంబు లుభయంబులు సంబంధించి యగు పోవుధాతువుల యుభయంబుల తుదివర్ణంబులకును నికారవకారంబు లుభయంబులును పరంబగునపుడు యకారాదేశంబగు. ఇట నికారసాహచర్యంబునఁ దాలుస్థానికమైన వకారంబే (ఎ) గ్రహింపంబడును.

(మూలము) వక్ష్యమాణంబైత్వంబు (వ్యా) 103 సూత్రమున బహుళంబుగా, ఐకారంబు. ఉదా—ఐ-అయి-అయిరి-ఐరి॥పోయి-పోయిరి-పోయె-పోయెదు "అయి" (38) సూత్రంబునఁ బూర్వకాలమం దివర్ణకంబురాఁగా 'అగి, అయి ప్రకృతసూత్రమున నికారము పరమయినందున వంత్యంబగుగకారంబునకు యకారంబు గలిగె. అగు ధాతుగకారంబునకునపదాద్యసూత్రమునవచ్చిన వకారంబును గ్రహింపఁబడియకారంబు గలుగు. 'అయిరి' ఇట అగుధాతువునకు లిట్ప్రథమపురుషబహువచనంబు వివక్షితము గాఁగ 'అగు + రు' అయ్యె. పిదప 17 సూత్రమున నిగాగమంబుగలిగి తత్సమపరిచ్ఛేదములోని 26 సూత్రమున రువర్ణకంబున కిత్వంబు వచ్చినందున 'అగిరి' అయి ప్రకృతసూత్రమున యత్వంబురాఁగా 'అయిరి' అనినరూపనిష్పత్తిసిద్ధించె. 103 సూత్రమున బహుళంబుగా నైకారంబు ప్రాప్తించి 'ఐరి' అయ్యెను.

ఇట్లే 'పోయిరి' అనురూపంబు పోయితివి పోయితిరి ఇత్యాదిరూపంబులు 17 సూత్రంబున నిగాగమంబును, 18 సూత్రమునఁ దివర్ణకంబును గలిగి ప్రకృతసూత్రమున యత్వంబురాఁగా నైనరూపంబులు. కొందఱాధునికకవులు 'పోతివి' 'పోరి' యిత్యాదిరూపంబులు వర్ణహీనంబుగా తమకబ్బంబులఁ బ్రయోగించెదరు అయ్యది యతిసాహసంబు.

ఉ. అక్కట మందభాగ్యుఁడనునట్టి తనూభవరత్నమెవ్వఁడో
దక్కు విధాతనిర్దయుఁ డొడంబడునే? కడుమేలివస్తువుల్
పెక్కుదినంబులుండ్క యరిబృందముపిల్చినఁ బోటుబంటనై
యక్కడ కేలపోయితి మహారణభూమునఁ గోలుపోయితే.

భార. ద్రోణప 2 ఆ

చ. పలుకునెయిట్లు కొంతి విని బమ్మెరపోయితిమింత బెట్టిదం
బులుకనె మాటలయ్యమయుఁ బుణ్యుఁడు కృష్ణుఁడు కార్యవాదముల్
వ్రేకడునట్టివారు తెగఁబారిరి ధర్మజవారిరాశికిన్
జెలితురిగట్టినాఁపె మనచేనగుకర్జము వందమెట్టిదో భార- ఉద్యో-౮ ఆ

100 సూ— అగునకువక్రంబుగూడుచో దీర్ఘంబగు,

వక్ష్యమాణంబు ద్విత్వంబు - ఆయెను - అయ్యెను - ఆయెడు-
అయ్యెడు.

వ్యా—అగుధాతువు తుదియచ్చునకు సంధివశంబున నేత్వంబు గూడఁగా దక్కిన యచ్చునకు, అనఁగా నాదియగునకారమునకు దీర్ఘంబగునని భావము.

(మూలము) వక్ష్యమాణంబుద్విత్వంబు (వ్యా) ప్రకీర్ణకపరిచ్ఛేదములోని 6 సూత్రమున, నూయేలాదులలోనిది గాన మీఁదిహల్లునకు ద్విర్వచనంబు.

ఉదా—ఆయెను అయ్యెను-ఆయెడు-అయ్యెడు (ఆయెను, అగుధాతువునిట్టుడునకు 16 సూత్రమున సెనువర్ణకంబుకలిగి యణ్వసంధిచే (అగెను, అయ్యె. ఇపుడు 99 సూ-న యత్వంబును ప్రకృతసూ-న నాద్యచ్చునకు దీర్ఘంబును రాఁగా నిర్దిష్టరూపంబయ్యె. (అయ్యెను, ప్రకీర్ణకపరిచ్ఛేదములోని 6 సూత్రమున యద్విత్వంబును సమాసపరిచ్ఛేదములోని 13 సూత్రమున నాద్యచ్చునకు హ్రస్వంబును గాఁగాఁ బూర్వోక్తరూపంబు

101 పిలుచు మొదలగు ఎ సకిముత్తు పరంబగునపుడు కడవ్రా యి బహుళంబుగ లోపించు.

పిలఁడు - పిలువఁడు - పిలుము - పిలువుము - లేచునకుముజ్ఞు పరంబగునపుడు చులోపంబగు - లెమ్ము - లెండు పిలుచు - నిలుచు తలఁచు - ఇత్యాదులు.

వ్యా—పిలుచుధాతువులోనుగాఁగల ధాతువుల తుదివర్ణము, ముజ్ఞులును జిత్తులును బరంబగునపుడు లోపించు ఉదా—పిలఁడు. పిలువఁడు పిలుము-పిలువుము (వ్యా) 'పిలఁడు' ఇందుఁ బిలుచునకు వ్యతిరేకంబున 7 సూ-న డుజ్ప్రత్యయము రాఁగాఁ బ్రకృతసూత్రమునఁ జువర్ణంబులోపించి (20) సూ—న లకారోపరియుకారమునకు నత్వంబుగలిగె. (సూ) లేచునకు ముజ్ఞుపరంబగునపుడు చులోపంబగు. లెమ్ము. లెండు పిలుచు-నిలుచు తలఁగ ఇత్యాదులు (వ్యా) 'లెమ్ము' ఇట లేచునకు మధ్యమపురుషైకవచనంబు వివక్షితమయినపుడు, ఉవర్ణకంబునకు (29) సూ-న ముఙ్వర్ణకంబాదిష్టంబయి ప్రకృతసూత్రంబునఁ జువర్ణలోపంబుకలిగి (61) సూ—న హ్రస్వంబును ముద్విత్వంబు నుబ్రాప్తింపగానైనరూపంబు. 'లెండు' లేచునకు (29) సూ—న లూట్టురువర్ణకంబునకు బహుత్వంబున డుజ్ఞుగలిగి ప్రకృతసూ-నఁ జులోపంబును (61)సూ-న హ్రస్వంబు రాఁగా డుజ్ఞు జిత్తుగాన 'జిత్తుబిందుపూర్వంబగు' నన్న సూత్రమున డువర్ణకంబునకు ముందుఁ బూర్వబిందు వుప్పతిల్లె. సంధిపరిచ్ఛేదములోని (21) సూత్రమున నడిలోఁ హ్రస్వంబు మీఁద ఖండబిందువు నిషేధింపఁబడినందువనిటనర్ధానుస్వారము 'వండుఁడు' ఇత్యాదులందుంబలె రాదని యెఱుంగునది

పిలుము, పిలువుము ఇత్యాదులందుంబలెఁ బిలుఁడు- పిలువుఁడు మొదలగువాని యందును జువర్ణలోపంబు బహుళంబుగాఁ బ్రకృతసూత్రంబున నయ్యెడును.

కం॥ పిలుఁడీ ఉడయకర్ణుని! బలవిక్రమశాలి యతఁడు పదిదివసంబుల్
గలనికిరాఁడు నడీగుతు పలుకులకుంగవలి సచివబంధుయుతముగాన్॥

భార. ద్రో ౧౮

కం. నిలుఁడు నిలుఁడనుచు నారలఁ బొలుపుగఁ బెనకుఁడక గుగుడఁబూరికొల్పుచున
గ్గలుగ నొకవేల్పుఁ బైకొని బాతపుఁ బ్రమానొకటి మీఁదఁ బడవైచుటయున్॥
అ. తె రా. యు. కాం

కం. చులుకఁ జనంబున విప్రుని కలుకం గాఁదగదు గురుఁడవై యుండుదునం
చలయక తెఁపితిఁగాకిటు నిలుమీ నీరఁడము వేఁత నిజముగ నేనిన్॥

భార ఉద్యో. ౪ ఆ

చ. నిలునిలు మెంగుఁబోఁగలవు నీ విటువాఱినఁ జావు దప్పునే
యలవుఁ జలంబుఁ బోవిడిచి యాసభ నించుకశంకలేక నీ
పలికినయన్నియున్ మఱచి భంగపుఁ జచ్చుట దెచ్చికొంటి పె
ద్దలు నగఁ బొందఁ నన్నకును దమ్ములకుం దలవంపు గానిసీ! భా ద్రో. 3 ఆ.

కవిసంశయవిచ్ఛేదము — ప 9 — తరం ౩॥ నిలువుము కొలువుము పిలువుము గెలువుము నిరుపమానఁగాఁ జెన బహుశబ్దం బులకుం గృతి యుపగ్గము తొలఁగిన రూపంబులేను తుహి నాంశుకరా

ఉ. బుద్ధులు చెప్పనెల్ల నటు పొవిడు మెమ్మెయినైన సౌఖ్యసం
సిద్ధియొనర్ప నాకు వెడచేసినఁ దాపము రూపుమాపు నా
వృద్ధియుకోరుదే రియవివేకివు నీవని నన్ను నిట్లసం
బద్ధములైనవాక్యములు పల్కుట వేపికిపింపుకోమలిన్॥ భార విరా. ౫ఆ.

వెఱుమనకుంగూడ నంత్యవర్ణలోపంబు కవిప్రయోగంబులఁ గానఁబడు.

తే గీ. చెంచువంటికిఁబోయి చెంచెతకుఁ బ్రియము
చెప్పి నమ్మించి తలమీఁదఁ జేయి వెట్టి॥
వెఱుకుమని తన్ముఖంబున నెఱుకు సేని
గాంచి యాతనితోడ సఖ్యంబుఁ జేసి॥ కాశీఖండము

కవిసంశయవిచ్ఛేదాది గ్రంథకర్తల యభిప్రాయమాతం జేసి యీపిలుమ ప్రత్యయాం తంబులో నన్నిధాతువులును మధ్యమాంతములే గ్రహింపఁదగినట్లు ఖచ్చితమైనవని కొందఱు

అందురు. కాని బాలవ్యాకరణపుస్తకంబులు కొన్నిటిలోఁ 'దలఁగు'నుమఱికొన్నిటిలోఁ 'దలఁచు'ను ముద్రింపంబడియె.

'తలఁదు తలండ'నిన కతిపయకవుల గద్యంబులయందలి ప్రయోగంబులఁ మాత్రమర్థ సందర్భమునుబట్టి తలఁగునకు సాధకంబగునుగాని తలఁచునకు సాధకంబుగాఁ గనఁబడు చుండలేదు కాన సుధీమణులు శోధింతురుగాక! ఇట్లు సూత్రస్థబహుళగ్రహణంబున "స్థితస్యగతిశ్చింతనీయా" యనున్యాయంబు ననుసరించి సత్కవిప్రయోగంబులు సమర్థించుకొనునది. సంధిపరిచ్ఛేదములోని (౧3) సూత్రమునొద్ద "మీరు తలఁదు" అను నుదాహరణవ్యాఖ్యచూడందగు

102 సూ—లాఁతివో సహితము కాదేశాదులు కానం బడియెడి.

కావుతను - కాతను ॥ అగుట, కావుట ॥ అగుదును - కావుదును ॥ కానను - కావునను ॥ అనుదును - అనవుదును - నావుదును- ఇత్యాదులెఱుంగునది.

వ్యా—ముదుజ్ఞులున, జేత్తులును బరంబగునపుడు, అగనకుఁగాదేశంబును, అనునకు నాదేశంబును, (96)సూ—న విధింపంబడియె అట్లు ముత్తుపరంబగునప్పుడేకాక 'తను' వర్ణకంబును (26సూ) టవర్ణకంబును (35 సూ) భావలక్షణార్థంబందలి ననువర్ణకంబును (41 సూ) బరంబగునపుడు అగునకుగాదేశంబును, దునువర్ణకంబు పరంబగునపుడు అనునకు నాదేశంబును బహుళంబుగానగు. వానికి వుగాగమంబు బహుళంబు. ఉదా. కావుతను కాతను॥ అగుట కావుట॥ అగుదును-కావుదును॥ కానను-కావునను॥ అనుదును-అనవుదును-నావుదును ఇత్యాదులెఱుంగునది.

"కావుతను" అగుధాతువుమీఁదిఁగాట్టుదుజ్ఞనకు (26) సూత్రమున ద్రుతాంతంబయినతవర్ణంబు రాఁగాఁ బ్రకృతసూత్రంబునఁగాదేశంబగుచో వుగాగమంబు బాహుళకంబుగాఁ గలుగఁ బైనిర్దిష్టరూపంబయ్యె 'కాతను' వుగాగమాభావమందు రూపంబు.

ఉ. ఉల్లమునందు నక్కటికమూనుట మాకులమందుఁ గంటి వం
చల్లన మేలమాడునచలాత్మజమామను లేకనవ్వు సం
ధిల్లఁ గిరీటిఁ బాశుపతదివ్యశరాఢ్యునిఁ జేయు శాంబరీ
ధిల్లుఁడు కృష్ణరాయల కభీష్టశుభప్రతిపాది గావుతన్

మను. ౧ ఆ.

శా॥ శ్రీతోఁ బుట్టి సుధావిధుద్విపముతోఁ జెన్నొందుపుష్పంబు తో
భాతారుణ్యమెలర్పఁగా ముదముపంపాహేమకూటాశ్రయ
ఖ్యాతశ్రీహస్తము ప్రేమఁ గావుత. విరూపాక్షాహ్వయంబౌ మహీ
టీతన్మత్ప్రభు వేంకటాద్రివిభ్వాదగ్రాటీకంబు లోకంబులన్॥ రాఘ ౧ ఆ.

తే. గీ. ఉపనిషత్తులు బోటులై యోలగింపఁ బుండరీకాసనమునఁ గూర్చుండి మదికి నింపువేడుక వీణ వాయించుచెలువ నలువరాణి మదాత్మలో వెలయుఁ గాత॥ మను ౧ ఆ. గీ. "అఖిలభూతములకు నానందమగు గాత"—మార్కం ౧ ఆ.

ఇయ్యవి యాశీరర్థమందుఁ దద్ధర్మార్థక్రియలకు నముప్రయుక్తంబగునందురు. 'కావుతన్' అనునది ముఖ్యక్రియగాఁగూడఁ బ్రయోగింపఁబడందగు. కావుననే మొదటనుదాహరింపఁబడిన మనుచరిత్రపద్యంబులో "శుభప్రతిపాదిగావుతన్" అని కేవలస్వతంత్రక్రియగానే యాంధ్రకవితాపితామహులు ప్రయోగించియున్నారు. క్రియాపరిచ్ఛేదములోని (26) సూత్రములో 'దుక్కు' నిప్రత్యాహారంబు గ్రహించిన సామర్థ్యంబునంజేసి సమస్తపురుషవచనంబులందును నెడుతవర్ణంబులు ఘంటాపథంబుగా నుండనొప్పు కాన (1) అతండు శుభప్రతిపాది గావుతన్ (2) వారు శుభప్రతిపాదులు గావుతన్ (3) నీవు శుభప్రతిపాదివి గావుతన్ (4) మీరలు శుభప్రతిపాదులరు గావుతన్ (5) నేను శుభప్రతిపాదిని గావుతన్ (6) మేము శుభప్రతిపాదులము గావుతన్॥ అనినపురుషవచనంబులన్నిటికిని భేదంబులేక యప్రతిహతంబుగా, 'కావుతన్' అనుతవంతక్రియ సమన్వయించును. ఇట్లే (1) యతఁడేలుతన్ (2) వారలేలుతన్ (3) నీవేలుతన్ (4) మీరేలుతన్ (5) నేనేలుతన్ (6) మేమేలుతన్॥ ఇత్యాదిస్థలంబులందు ఏలుతన్! ఇత్యాదితవాక్యంతాదిక్రియలు పూర్వోక్తస్థలంబులందు, 'గావుతన్' అను

తవంత క్రియవోలె సర్వపురుషవచనంబులతో సామానాధికరణ్యంబు సమకూరఁగా విజృంభించుచుండుటను పురుషవచనంబుల భేదంబును దెలియంజేయునట్టి వేర్వేఱుప్రత్యయంబుల నొందక యన్నిటియందును సమానాకారంబైన "ఏలుతన్" ఇత్యాదిశబ్దంబుల యర్థంబునకు యుష్మదస్మదాదిశబ్దార్థంబులతోడి సంబంధము లోకవిరుద్ధంబని శంకింతురేని సావధానచిత్తంబునఁ జిత్తగింపుఁడు సంస్కృతభాషలో గూడ సమానప్రత్యయాంతమయిన శబ్దంబులయర్థంబులకు యుష్మదస్మదాది శబ్దార్థంబులతోడి సంబంధము గానంబడుచుండు. అయ్యది నిదర్శనంబుగా నిచ్చటఁ బ్రదర్శింపఁబడును

తేన విద్వతా భూయతామ్ = సః ద్వాన్ భవతు.

త్వయా ,, ,, = త్వంవిద్వాన్ భవ.

మయా ,, ,, = అహంవిద్వాన్ భవాని.

తైర్విద్వద్భిర్భూయతామ్ = తే విద్వాంసో భవంతు.

యుష్మాభిః ,, ,, = యూయంవిద్వాంసోభవత

అస్మాభిః ,, ,, = వయంవిద్వాంసోభవామ

ఇత్యాదుల "భూయతామ్" ఇత్యాద్యనేకశబ్దంబులయర్థంబులకే పైనింజూపిన విగ్రహంబున యుష్మదస్మదాది శబ్దార్థంబులు కర్తలుగా సంబంధించుట కరతలామలకంబై కానంబడుచున్నది ఇంకను విశేషంబేమనఁగా భాషాపరిపాటిం జేసి సంస్కృతభాషలో నకర్మకధాతువులయందే యిట్టిరూపంబులు కనంబడును. మఱియుఁ దిఙ్ప్రత్యయంబు కర్త్రర్థమందు రాక భావార్థమందు వచ్చినందునఁ దాదృశతిఙంతము, స్వార్థంబును జెప్పునట్టి యవసరంబునఁ బ్రథమాంతపదంబునకు నర్థంబైనకర్తను నాకాంక్షింపనందున భాషాశైలిం జేసి "కర్తృకరణయోస్తృతీయా" అనుసూత్రంబునఁ గర్తతృతీయాంతమై యుండును. ప్రకృతంబుననో, యాంధ్ర భాషామర్యాద ననుసరించి సకర్మకంబులును నకర్మకంబులునైన యుభయవిధధాతువులను నాశీరాద్యర్థంబులు విషయంబులుగాఁ గర్త్రర్థమందు దుఙ్ఙు విధింపఁబడినందున నట్టి దుఙ్ఙున కాదేశంబైన తనాదివర్ణకంబు ప్రథమాంతపదంబునబోధింపఁదగు కర్త్రాదికము నాకాంక్షించుచుండుటం జేసి యిట్టిస్థలంబులందుఁ గర్త ప్రథమాంతమై యుండును ఇట్టులు సంస్కృతాంధ్రభాషలలోఁ గర్తృవాచకంబులైన యుష్మదస్మదాదిశబ్దంబులు భిన్నభిన్నవిభక్తులలోనున్నను దదర్థంబులు మాత్రమేకవిధంబులై తిఙంతములతోఁ

కర్తలుగా నన్వయించుచున్నందున సాదృశ్యము స్పష్టమగుచున్నది. సంస్కృతభాషలో గూడ ఫలితార్థములో యుష్మదాదిపదంబులు ప్రథమాంతములుగా నే యన్వయించుచుంట చూపఁబడ్డది కావునఁ బూర్వోక్తదృష్టాంతానుసారంబున, 'చేయునది' మొదలగు విధ్యర్థక్రియలును దనాద్యంబులై యాశీరాద్యర్థకక్రియలును సంస్కృతభాషామర్యాదం జేసి యఖిలపురుషవచనంబులతోడ నన్వయించుట యబ్బురంబుగాదనియెఱుంగునది లోట్టు డుజ్జున కడుతవర్ణంబులు విధించిన (26) సూత్రము సామాన్యసూత్రమనియు, లోట్టు మధ్యమపురుషంబునకు ముడుజ్జులు విధించిన (29) సూత్రము విశేషసూత్రమనియు నెంచి మధ్యమపురుషములో మాత్ర మేకత్వబహుత్వములందుఁ గ్రమంబుగా ముడుజ్జులు గలుగును గాని (26) సూత్రమునఁ దనాదివర్ణకములు గలుగనేరవని కొందఱు శంకింతురు అయ్యది ప్రమాదమూలకంబు అట్లయ్యెనేని డుజ్జున కడుతవర్ణంబులని ప్రత్యాహారంబు గ్రహించి తత్సామర్థ్యమును సూచించునట్టి గ్రంథకర్తతాత్పర్యంబునకు విరోధంబు సంభవించు ఇదియునుంగాక యింకొకవిశేషంబు గలదు. (27) సూత్రము లోట్టునవిధ్యర్థంబు విషయంబగువో సర్వపురుషవచనంబులయందును నదిశబ్దంబును విధించుచున్నదిగదా కావనయ్యది వ్యాపకంబుగాన సామాన్యసూత్రము గావలయును (29) సూత్రమన్ననో, లోట్టులో నేకదేశంబగు మధ్యమపురుషంబులకు ముడుజ్జులను విధించుచు వ్యాప్యంబయినందున విశేషసూత్రము కాకతీరదు ఇట్లు పరస్పరంబును సామాన్యవిశేషభావంబు స్పష్టపడఁగా సమీపవర్తియైన (27) సూత్రంబును ననంతరన్యాయంబున (29) సూత్రమున బాధించునుగాని (27) సూత్రమును దాఁటి దూరవర్తియైన (26) సూత్రార్థము నెట్లు బాధింపఁజాలును?

కాఁబట్టి (26) (29) సూత్రంబులకుఁ బరస్పరంబును బాధ్యబాధకభావకల్పనంబు సమంజసముగాఁ గనఁబడదు వాస్తవంబును బరిశీలింపఁగా సమీపవర్తియైన (27) సూత్రమును సయితము (29) సూత్రము బాధింపదనియే గ్రంథకర్తతాత్పర్యమయినట్లులు ధ్వనించుచున్నది ఏలయనఁగా (27) సూత్రమునొద్ద "వానికి నీవు బాసటయయియుండునది" యని మధ్యమపురుషైకవచనస్థలంబున నదిశబ్దంబు సంభవించుననుటకు నుదాహరణమీఁబడెనిది పైనిం జూపినవిధంబున నిట్టిస్థలంబునందు విశేషవిధియైన (29) సూత్రమున మధ్యమపురుషంబునందు ముఙ్వర్ణకంబు రాఁగా "నీవు బాసటయయియుఁడు" మని యుండందగునుగాని యిచ్చట నదిశబ్దంబు విధ్యర్థమందు సంభవించి

పూర్వోక్తంబయిన యీయుదాహరణవాక్యములు సాధువులు కాఁజాలును? కాన (27) (28) సూత్రములకు సయితము బాధ్యబాధకభావంబు లేకుంట గ్రంథకర్తృభావంబయినట్లు స్పష్టపడుచున్నది ఇట్లు (29) సూత్రంబున (27) సూత్రకార్యంబునకే భంగంబు సంప్రాప్తింపనిస్థితిలో దూరవర్తియైన (26) సూత్రకార్యంబునకు భంగమ్ము సంభవించునన్న పూర్వపక్షోక్తి పృథక్తాడనంబున దంతభంగంబు సంభవించునన్నలోకోక్తి వంటిదియై మిగుల హాస్యాస్పదంబగును గాని వేఱొండు కాదు. శంకాకారులమతంబునసైతము "నీవు శుభప్రతిపాదివి గావుతక" "మీరు శుభప్రతిపాదులరు గావుతక" అనిన యిట్టి మధ్యమపురుషస్థలంబులందుఁ దనంతమయిన యీయురు ధాతువు సాధువనక తీరదు కాఁబట్టి సర్వపురుషవచనంబులయందును నాశీరాద్యర్థవిషయంబున ద్రుతాంతమయిన యొతుమున్నగంబులును, విధ్యర్థమునందున నదిశబ్దంబును నిరాతంకముగాఁ బ్రవర్తిల్లుచున్నను ఈయర్థమే చిన్నయసూరివిరచితమైన శబ్దలక్షణసంగ్రహమందలి క్రియాపరిచ్ఛేదములో—

(53) సూ—తేవర్ణకం బాశీస్సులందు సర్వవచనంబుల కగు.

(54) ఎడువర్ణకంబొండెనగు.

అనునీసూత్రంబులందు స్పష్టముగా వివరింపఁబడినది. ఒకవేళను శంకాకారులు పూర్వకవిప్రయోగంబులోఁ బ్రథమపురుషక్రియలయందుంబలె మధ్యమపురుషక్రియలయందు నెడుతువర్ణంబులు గానంబడవందురేని యట్టి గట్టిప్రశ్నంబుత్తమపురుషంబునకును సదా సాధారణంబై సంబంధించుంగావున నప్పుడు (26) సూత్రమందలిడుబు ప్రత్యాహారగ్రహణంబు మీఁదుమిక్కిలి వ్యర్థంబై మఱింతసామర్థ్యంబుగలదయ్యెడిని కాన నిఁక విస్తరంబులోఁ జాలును. కవిప్రయోగంబులు గనుంగొనఁజాలని స్వదౌర్బల్యదోషంబును శాస్త్రంబునం దారోపించుట యుక్తంబుగాదు గావున విబుధులారా, శ్రోత్రమయప్రపంచంబునఁ బండితపుంగవులు పరమశ్రద్ధాపూర్వకంబుగాఁ గవిప్రయోగంబులు గవేషింతురుగాక! ఇట్లు పైఁజూపిన యీశాస్త్రంబు లప్రతిహతంబైన యీశాస్త్రంబులై పరిఢవిల్లుచుండఁగా నయ్యవి గ్రహించిన యుత్తమపురుషుండు నానార్థదాయకంబై హృద్యంబగుపద్యంబును కేవల మధ్యమపురుషార్థంబునుమాత్రమే యీఁజాలి యాకారాంతంబగునట్టి క్రియతో విక్రియనొందింపక, సమస్తపురుషార్థదానంబున బద్ధకంకణంబయి నాంతంబగునట్టి సత్త్రక్రియక్రియతో సత్క్రియనొనరింపసాహసింపఁడగునని యెన్నుకొని మద్విరచితంబైన జార్జిముక్తావళియందలి పద్యంబు

నట్టు లనవద్యంబుగావించితి పండితులు దీనిం బరికింపఁగాఁ బ్రార్థితులు. శా. శ్రీజార్జి ధ్రువసార్వభౌమ! కరుణాసింధూ! వినింబాయక వ్యాజప్రేమఁ బితామహీమణియొనర్పం బాలె రాజ్యంబు ము న్నోజస్ఫూర్తిమెయిం దంద్రిమిత్రతకు నుద్యోగించి భాసిల్లె నా యాజాడన్ ద్విజరాజసంస్ఫురణ దీర్ఘాయుండవై యేలుతన్

చ॥ బహువనపాదపాబ్ధికులపర్వతపూర్ణ సరస్సరస్వతీ
సహిత మహామహీభరమజస్ర సహస్రఫణాళిఁదాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁడనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్॥

భార. ఆది. ౧ ఆ.

ఉ॥ దేవమనుష్యలోకములఁ ద్రిమ్మరుచు న్విపులప్రతాపసం
భావితశక్తిశౌర్యులు నవార్యవిషోత్కటకోపవిస్ఫుర
త్పావకతాపితాఖిలవిపక్షులునైన మహానుభావులై
రావతకోటిఘోరఫణిరాజులు మాకుఁ బ్రసన్నులయ్యెడున్

భార. ఆది. ౧ ఆశ్వా

పైపద్యంబులలోఁ గ్రమంబుగా నేకవచన బహువచనంబుల భేదంబులేక యాశీ రాద్యర్థంబున నెడువర్ణకంబు ప్రయోగింపఁబడుట కానంబడియెని. 'ఇను' శేషవర్ణకంబును నిరాతంబుగాఁ బురుషవచనభేదంబు నెంచక యుపయోగింపఁబడు.

'అగుట, కావుట'—ఇవి (35) సూ—న భావార్థంబున నగు ధాతువునకు టవర్ణకము రాఁగాఁ బ్రకృత సూ—న బహుళంబుగాఁ గా దేశవు గాగమమ్ములు సిద్ధించి వైరూప్యంబులయ్యె. 'అగుదును' కావుదును'—(42) సూత్రమున నానంతర్యార్థమున 'నగు' నకు దునువర్ణకంబునందుఁ బ్రకృతసూత్రమునఁ గా దేశవు గాగమంబులు బహుళంబులు. 'కానను, కావనను'—ఆ ధాతువునకు (41) సూ—న భావలక్షణంబున నైన 'న' వర్ణకంబు పరమగునపుడుఁ బ్రస్తుతవిధిని కా దేశము నిభావమగా వుగాగమంబును నయ్యె. 'వాఁడు రమ్మనినఁ బోయితిని'—ఇత్యాది భావలక్షణార్థకనవర్ణకస్థలంబులందు 'వాఁడు రమ్మనెను. కావఁ బోయితిని.' అని పర్యవసన్నార్థము చెప్పఁదగియుండుంజేసి

'కానక్, కావునక్' అనుపాఠంబులు భావిలక్షణార్థకనవ్యర్ణకాంతమ్ములని యెఱుంగునది 'ఇయ్యవి ప్రయోగించినప్రదేశంబులందుఁ పూర్వోక్తార్థంబులకుఁ గార్యకారణ భావంబు ఫలితార్థంబుగాఁ దోఁచుచుండు. (1) 'అనుడును(2) అనవుడును (3) నావుడును'—అనుధాతువునకు (12) సూ—న డుడునర్ణకంబు (2)న రూపమందు బాహుళకంబునంజేసి వుగాగమంబును, ధాతునకారోపరియకారంబున కత్వంబునయ్యె (3) వ రూపమందు నాగళవుగాగమంబులు

103 సూ—అచ్ఛికంబు లందయియవులకు వక్రతమంబులు బహుళంబుగానగు.

అయిదు - ఐదు అయిరేని ॥ ఐరేని అవుడు - ఔడు ॥ గవుసెన - గౌసెను.

వ్యా—అచ్చతెలుఁగుమాటలయందున్న 'అయి' అనుశబ్దస్వరూపమ్మునకు ఐకారంబును 'అవు' అనుదానికి ఔకారంబును బహుళంబుగానాదేశంబులగునని యర్థము

ఉదా—అయిదు-ఐదు అయిరేని-ఐరేని అవుడు-ఔడు॥ గవుసెన గౌసెన॥ (వ్యా) అవుడు-ఔడు (పెదవిక్రిందిచోటు) గౌసెన—(వీణెమొదలగువానిమీఁది యొఱ) ఉ॥ కట్టిననీలిదిండ్లు సెలకట్టియవిండ్లును విండ్లగౌసెనల్ చుట్టినొసళ్ళపైనిడిన జాంజులుపల్లసిగల్ గటీతటిం బెట్టినమోటకత్తులును మేనులఁగార్కొనుకప్పుతేర్చిచేఁ బట్టినవేఁటయమ్ములును బాగగువాగరికల్ వహోన్నసల్ మను 3 ఆశ్వా

104 సూ—కలుగున కస్త్యర్థంబునందు లట్టుపరంబగునపుడు కలయగు.

ప్ర - కలఁడు - కలరు - కలదు -కలవు ॥ మ - కలవు - కలరు ఉ - కలను - కలము,

వ్యా — అస్త్యర్థంబునంగు అనఁగా లుఙ్వికరణాంతంబైన "అసభువి" అనిన ధాతు పాఠములోని యసధాతువునకు. అగుట, ఉండుట, అనువివర్థములగు లోకములో "అస్తి" అను సంస్కృతశబ్దంబునకు కలదు (లేక) ఉన్నది అనియు "నాస్తి" అను దానికి "లేదు" అనియు నర్థము లాబాలగోపాలము ప్రసిద్ధములుగదా! ఈయర్థములందు కలుగుధాతువు సదా యకర్మకంబగును. పైనిం జెప్పిన యకర్మకార్థములందలి కలుగు ధాతువునకు వర్తమానార్థకలకారము పరమయ్యేనేని "కల" అనెడి యాదేశంబగును ఉదా — 'కలఁడు' ఇచ్చట వర్తమానకాలము వివక్షింపఁబడినపుడు మొదట 'కలుగు + ల' ఇట్లుండెడి ఏకత్వము భావింపఁబడినపుడు, ౮ సూ — ముచేత "కలుగు + డు" అని కాఁగాఁ బ్రకృతసూత్రమున (అస్త్యర్థమైనందున) కలాదేశము కాఁగ "కలఁడు" అనిన రూపంబు సిద్ధించె ఇట్లు కలరు (ప్ర-బ) కలదు (అమహద-ఏ) కలవు (అమహద-బ); కలవు (మ-ఏ) కలరు (మ-బ) కలను (ఉత్త-ఏ) కలము (ఉత్త-బ) ఇత్యాదులం దూహ్యంబు. ఇందులకుఁ గవిప్రయోగంబులు, తే. గీ మారినాథ! కుటుంబజంబాలపటల మగ్నమానృశ గృహమేధిమండలంబు నుద్ధరింపంగ నౌషధ మొండుగలదే యుష్మదంఘ్రిసరోజాతేజమొకటి యెక్క మను ఆ. ౧ (కలదె = ఉన్నదా?) ఉ॥ ఓ సరసీరుహాక్షి! వినవో రతిఁ గౌగిట నీవు చేర్చునిం పాసురభర్తకైనఁ గలదా? వలదంచుఁ బెనంగనేమి సన్యాసిని యొక్కతె చేత హాతహామసమార్గగు కేళిపైవనా శ్వాసితదుఃఖితే మనసిపర్వమసహ్యమనస్నెఱుంగవే॥ మను ఆ ౩ గీ ఇట్టివిక్రమంబు నిట్టిసామర్థ్యంబుఁగలదె? యొరులకిజ్జగంబునందు భార ఆని. ౬ ఆ కలుగునకు ఓపుట అనువర్థముగలదు; అది యస్త్యర్థముగాకున్నను కలాదేశంబు గానంబడియెడి తే గీ. సింహకవచంబుదొడిగినఁ జెనఁటికిక్క గంధగజ గంఠమునకును గలదె? నిలువ హరి ఉ. ౬ ఆ (నిలువఁగలదె? నిలువనోపునా?) పొందుట యర్థమిచ్చునపుడు అస్తిశబ్దార్థముకానందునఁ గలుగునకుఁ గలాదేశంబుగాదయ్యె ఆ గీ. జనులనతిథిజనుల సతతంబుఁ బూజింపు మన్నదానమున ధరాధరేంద్ర వరులఁ దనుపు మఖిలవసుమతి ప్రజకెల్ల గరుణఁ గలుగుమమ్మ కమలనేత్ర? భార. ఆది ౮ ఆ (పొందు)

105 సూ — త్ర్యర్థంబు నంగలాదేశంబు విభాషనగు.

ఎడియెడులకు లోపంబిటునిత్యంబు - కలవాఁడు - కలుగువాఁడు

వ్యా—"ణ్వుల్ తృచౌ" [అ 3 పా ౧ సూ ౧33] అనుసూత్రంబునఁ గర్త్రర్థమందుఁ దృచ్ప్రత్యయంబు ధాతువుకంటె సంస్కృతవ్యాకరణంబున విధింపఁబడియె కాన, (తదర్థంబునందు తృజన్తకార్థనందు అనఁగాఁ గర్త్రర్థమందుఁ గలుగుధాతువునకుఁ గలాదేశంబు వికల్పము గానగును తృజన్తకార్థకములైన యెడియెడువర్ణకంబులు [౪౪ సూ] లద్వర్ణకంబుకంటె నన్యంబులైనందునఁ బూర్వసూత్రమునఁ గలాదేశము ప్రాప్తింపకపోఁగా నీసూత్రముచేత వైభాషికంబుగా విధింపఁబడియె. కాన నిది యప్రాప్తవిభాషయని యెఱుంగునది.

ఉదా—కలవాఁడు. ఇటఁ గలుగుధాతువుకంటెఁ గర్త్రర్థమందుఁ బ్రకృతమాత్రమునఁ గలాదేశమ్మును, సమాసపరిచ్ఛేదములోని తొమ్మిదవసూత్రమున నప్రయుక్తమైన తచ్ఛబ్దంబును, ౪౫ వ సూత్రమున నెడియెడువర్ణకంబునకు లోపంబు బాహుళకంబుగాన నిట నట్టిప్రత్యయంబులకు నిత్యలోపంబును [వాఁడు] రాఁగాఁ బైరూపంబు సిద్ధించె. వైభాషికంబు గావునఁ గలాదేశంబుపక్షంబున రాక 'కలుగువాఁడు' అని రూపాంతరంబు. 'కలవాఁడు" ఇత్యాదులందలి కలశబ్దంబు కలడె వర్ణకంబు రానందున దీనిమీఁది తచ్ఛబ్దవకారంబునకు వండఁగలాఁడు, ఇకాఁగలాఁడు, ఇత్యాదులందుంబలె (క్రియాపరి) 117 సూత్రంబున వైభాషికలోపంబు రాదని తెలియునది మఱియు కలవాఁడు, కలవారు ఇట్టివారు, ఈశబ్దంబులందు దీర్ఘాంత మైన తచ్ఛబ్దవకారంబునకు పర్వంబునకును లుక్కు (సర్వలోపము) కవిప్రయోగంబులఁ గానంబడియెడి.

క. అలఘుకయోఁడులుగడుఁ దె క్కులుజీవించుట నరగలుగుటయుంగడువృద్ధుల లక్షణమేజ్ఞానము గలఁడేనియుఁ బాలుడైనఁ గడువృద్ధుమహీశ॥ అరణ్య. భార 3 ఆ. (కలఁడేని-కలవాఁడేని)

క. సమరఘుఁడు బిరుదులక్ష్మణ కుమారుఁడుంగదిసి మొనలుగోల్తలఁజేయక మమునెల్లను భుజగ స్వామునకుము గలఁడు గొనఁడరాజులనక్షిపా॥ భార ద్రో 4 ఆ (కలఁడు-కలవాఁడు) అ చను నీకునిట్టి సాసాప్రక్రియఁజేయ నెల్లవారికంటె

వెలుకగలవు కరుభుజుండనాఁడు గాత్రేనికేయను మయ్యాయిట్టి వెయ్యాలసనుయింక॥ భార ఆర 3 ఆ (కలవు-కలవాఁడవు, ఇటు వాకారడకారంబులు రెంతునులోపించె)

ఆ॥ జంటపన్నిదంబు చఱచితిమెల్లుగా నలినబాము లెల్ల వనయమిదియుఁ దక్కి వంచె వేనధర్మంబు సేయంగఁ దగునె యెఱుకకలరె మనువలెందు భార. ఆది ౨ ఆ.

క॥ అమితంబగునీతపము వా హిమగొఱుఁగక యిట్లు చేశె గది దీనిపహిం పుము మత్సైన్యంబునిరో సముని పృథు యెఱుకకలరెతెరుణులుగరణిఁ॥ భార ఆర. 3 ఆ

శా॥ వ్యాతవ్యాము జనునన్ సభాంగణములో గుర్వోగ్రనుంతల్లు గు క్కిలిం కూడి యెనర్చినట్టి యఘముల్ నిష్క్రంపధైర్యోన్నమ ద్వైతస్వాంతుఁడవైన నీకొకనికిం కెల్లన్ సహింపంగవి ఖ్యాతక్షాంతులు లేరె ధార్మికులు నిష్క్రంబిట్టిరే యెవ్వరున్. భార అరణ్య ౪ ఆశ్వా [ఇట్టిరే-ఇట్టివారే]

106 సూ—అస్త్యర్థంబునకు లజిమికనివడి వర్ణకంబులు పరంబు లగునపుడు లేయగు,

ప్ర - లేఁడు - లేరు - లేదు - లేవు ॥ మ - లేవు లేరు ॥ ఉ- లేను - లేము లేమి - లేక - లేని - లేవడి.

వ్యా—లజి [వ్యతిరేకార్థకము 2 సూ] మి [వ్యతిరేకభావము 32 సూ] క [వ్యతిరేకక్త్వార్థకము] ని [వ్యతిరేకతృవర్ణకార్థకము 42 సూ] వడి [కృదంత ౨౨ సూ] ప్రత్యయంబులు పరమైనచో నస్తిధాతువనక నాంధ్రభాషలో సమానమయిన కలుగు ధాతువునకు 'లే, శబ్దము సర్వాదేశమగును. ఉ ప్ర. లేఁడు లేరు లేదు లేవు॥ మ. లేవు లేరు ఉత్త లేను. లేము లేమి లేక లేని-లేవడి. కలుగుధాతువునకు వ్యతిరేకార్థమునల జివర్ణకము పరమగుచో 'లే, ఆదేశంబును అలకారమునకు ఉత్తమ పురుషబహుత్వవివక్షయందు మువర్ణకంబును రాఁగా "లేము" అయ్యె. ఇట [క్రియాప] ౯౧ సూత్రముచేత "లే" హ్రస్వమును మువర్ణకమునకు మాముశియుఁ గాదు. అసూత్ర

ము లోనగు శబ్దములచేతఁ దత్సాహచర్యమునం జేసి మధ్యమపురుష మువర్ణకమే గ్రహింపఁ బడును. పైయుదాహరణమందలి మువర్ణక ముత్తమపురుషసంబంధి గాన ౬౧ సూత్రము ప్రవర్తింపదు. తక్కిన యుదాహరణములు కరతలామలకసులభంబులుగాన లేమిలేవడిశబ్దంబులు మాత్రమే కవిప్రయోగంబులఁ బ్రదర్శింపఁబడును. “క॥ గురులకుభక్తుఁడు దారుఁడు కరుణగలఁడు శౌర్యధైర్యగాంభీర్యధురంధరుఁడు మొగమోడునాసుర పరిపాత్తుని లేమికోర్వవచ్చునె చెప్పుఁడా” భార. ద్రో. ౨ఆ (లేమి=కలుగమి) వ॥ “తొలంగం ద్రోయరానిలేమికి మదినొండుపాయంబులేమికిం జింతవింతించి” విక్ర. ౨ఆ (లేమి=దారిద్ర్యము) “సీ. నిదురలేవడిఁ గెంపు నెరయు కన్గవతోడఁ బొడిపొడియైన మైపూతతోడ” రసి. ౫ఆ “వ॥ లేవడిం బడియుండనగనంచు సత్వగరిమన్ మగ్యంబుగన్పట్టఁ గా” చంద్రా ౧ఆ “లేవడియెంతేని జీవనంబు” వై ౧ఆ “ఉ॥ లేవడియైనభుక్తిఁ గొని లేవడి గంబడదాఁక కొంతయుఁ” పాండు. ౪ఆ.

## 107 సూ—వ్యతిరేకంబునందు వలచునకొల్ల విభాషనగు.

ప్ర-ఒల్లఁడు-ఒల్లరు-ఒల్లదు-ఒల్లవు॥మ-ఒల్లవు-ఒల్లరు ఉ-ఒల్లను ఒల్లము ఒల్లమి - ఒల్లక - ఒల్లని పక్షంబున వలవఁడిత్యాది॥ ఒల్లమికొల్లఁబాటని ప్రయోగంబులం గానంబడియెడి.

వ్యా—వలచుధాతువకర్మకమైనపుడు పరిమళించుట, సకర్మకమైనపుడు కోరుట కామించుట అని యర్థభేదంబులుగలది. ఈసూత్రమున సకర్మకార్థకమైన “వలచున”కు వ్యతిరేకార్థమందు వికల్పముగా, ఒల్లాదేశము విధింపఁబడియె. పైయుదాహరణములన్నియు ‘వలచు’ నను వ్యతిరేకార్థమందు, అనఁగాఁ గోరకుండుట కామింపకుండుట అను నర్థములందు నైనవని తెలిసికొనునది ఒల్లఁడు (కామింపఁడు) ఈరీతిగా నర్థమూహింపునది. పక్షంబున వలవఁడు (కామింపఁడు) ప్ర బ. వలవరు అ. మ. ప్ర వలవదు అను ప్ర బ వలవవు. ఇత్యాది ఒల్లమి. పక్షంబున వలవమి. మేలిమి + కూడుగూరలు ఇత్యాదులందు “మి” వర్ణమును, సుఖము + పాటు ఇత్యాదులందు మువర్ణమును వృత్తియందు లోపించి “మేలికూడుగూరలు” “సుఖపాటు” ఇత్యాదులైనట్లు

ఒల్లమి + పాటు అనుదానిలో సంత్యవర్ణము లోపించి "ఒల్లఁబాటు" అగును. ఇట లుప్తశేషంబునకు నుగాగమంబువచ్చుట విశేషంబు. ఇది తెలఁబాప్ర్యాదులలోఁ బఠింపఁబడ్డది (మా సంధిప. సూ. ౨౬) ఉ ఒల్లరు రాజదేవులును నొడ్డులు రాచినచంద వంబుమే నెల్లఁ జెమర్పఁగా వకట యేను ప్రమంపడి నిల్చినిల్చి యి ల్లల్ల సమాగ్ధసం బొవరునట్లుగ నెట్టలకేనిరాచిమీ తల్లికి భక్తిఁ బెట్టెడువిధంబునఁ బెట్టుదు; ఇప్పుడ్గఁ దిట్టుదుర్ || భార విరా ౨౪ ఉ భాగ్యము గాదె నీచరణపద్మము లెప్పుడుఁ జేరి కొల్వఁగా యోగ్యతగల్లెనేని ననునొక్కని నొల్లవొకామసాఖ్యపై రాగ్యము నీమ నంబునఁ దిరంబొ నిజంబెఱుగంగఁజెప్ప సౌభాగ్యము సందునే మగలపై నొకయింతుక దృష్టినిల్పినర్ విరా. ౨౪ ఉ|| ఒక్కొకవేళఁ బన్నము ఖులొల్ల మిసేయుదురొక్కవేళ లె వ్వక్కువనాదరింతురు క్షణక్షణముల్ జనరాంద్రచిత్తముల్ పక్కనవేసరంజ వదుపాయములందగు నిచ్చకంబులం జక్కఁగఁజేసి డాసిసతిచిత్తముపట్టి సుఖింపఁగాఁ దగు|| మను ౪ ౩ గీ|ఎవ్వరికిఁగాఁగనగశిఖ్ము నెల్లసుఖము గోరెదవు వారలందఱుపీ రెవచ్చి ప్రాణములునర్థములునొల్లఁబాటుచేసి కయ్యమునఁ జావనబుమటగంటిగాదె వ్మ ఆ ౧ (ఇట నొల్లమియొక్కయర్థముకంటె విశేషంబుగలదు ఒల్లమి=అపేక్ష లేమి, ఒల్లఁబాటు = అపేక్షింపఁబడనిది అని కర్మార్థము)

108 సూ—చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారంబగు.

నిలుతురు - పెలుతురు - అడఁగుదురు - కసతురు - చింతురు పెంతురు - పచింతురు - వచింతురు చేతురు - కోతురిత్యాదుల సాధువులని యెఱుంగునది.

వ్యా—నిలుమధాతువుకంటెఁ దద్ధర్మాదికాలపరిసమపురుష బహువచనంబులు వివక్షింపఁబడి లాట్టునకు దుబగ్ణకంబు గలుగంగ నిలుమ + దు ఇట్లుండె (క్రి. ప. ౨౨ సూత్రంబున ననువర్తమానధాతువునకును నంతావయవమయి దుక్కారాఁగా నిలుమను + దు అని యుండె. ఇట్టి యవస్థయందు మవర్ణమును దానిపైహల్యాత్రపకారంబును షష్ఠయంబును నపహారించి తకారంబుగి గి "నిలుతురు" (నిలుమద్ ఉరు = నిల్చుత్ )

డురు - నిలుతురు) అయ్యెఁ 'చినుఁగు' నకు 'చింపు'ను 'పెరుఁగు' నకు 'పెంపు'ను ప్రేరణరూపంబులు, చింపుదురు, పెంపుదురు అనువానిలోని పవర్ణహల్మిశ్రదకారంబునకు (దన్) తకారము రాఁగా 'చింతురు' 'పెంతురు' అయ్యె. క్రి. ప. ౬౨ సూత్రంబునఁ దకారంబుమీఁది యుకారంబునకు వైభాషికలోపంబునం జేసి 'చింత్రు' 'పెంత్రు' అని రూపాంతరములగు ఇట్లు పచింత్రు, వచింత్రు ఇత్యాదులూహ్యంబులు. చేయునకును, కోయునకును దుక్కు రాఁగా, చేయుదురు కోయుదురు అనురూపంబులలోఁ జువర్ణంబు లేమింజేసి యీసూత్రమునఁ దకారము రాదు 'చేతురు' ఇత్యాది తకారఘటితరూపంబులు కవిత్రయేతరకృతులందుఁ గొన్నిటం గానిపించెడిం గాని యవి యార్యస్వీకార్యంబులు గానందున ననాహార్యంబులు గావయ్యె కవిబ్రహ్మకవితయందు నిదియె కంటంబడినది మ॥ బలియుం డాసాబగుండు భావభవదర్పభ్రాంతుఁడై వచ్చి నిశ్చలసర్వాంగతనున్న నన్నరసి నీచంవంబుగానున్న నా కులతం బొందెడునప్డు మంటపము సంక్షోభింపఁగాఁ జేతుఁ గట్టలుకం బెబ్బులిఁగోల వ్రేసినటులు ప్రాకార మేపారఁగా విరా. ౨ ఆ

109 సూ—బడుజీకొను లోకానోకచో స్వార్థంబునందనుప్రయుక్తంబులగు.

చొచ్చు - చొరఁబడు నిలుచు - నిలువఁబడు కూడు - కూడఁబడు। పండు - పండుకొను.

వ్యా—కర్మార్థముతోఁ జనపుడు ౪౯ సూత్రమునఁ "బడుజీ" యుఁ, క్రియాఫలము కర్తనుజెందినపుడు ౫౭ సూత్రమునఁ "గొను" ధాతువును ముఖ్యధాతువుయొక్క వెనుకను జేర్పంబడు అటెనను గొన్నిధాతువులపైనట్టి యర్థభేదంబు తెలుపకయే య జాగళస్తనసామ్యంబుగాఁబడుజీకొనులు ముఖ్యధాతువుల ననుసరించియుండు. క॥ ఇత్తెఱఁగున సభలోపలఁ దత్తఱమునఁ గూడఁబడిన దర్పితసామం। తోత్తములలోన నిప దుఁడు। మత్తద్విపలీలమనసుమండనిటులనుఁ॥ ఉ. వా. ౫ ఆ.

గీ॥ "జామిపండుకానియెడి జాఁగయేది" విజ అర్థాంతరమందు తెయునింపటర్థము. అపుడుపండుధాతువకర్మకంబుగానఁ గ్రియాపరిచ్ఛేదాంతమునఁ జెప్పినచొప్పున

బాత్మ నేపదార్థములేనందున స్వార్థమందుఁ గొనుధాతువనుప్రయుక్తంబనుట యుక్తంబు.

110 సూ—తెంచుధాతువగ్వాదుల కనుప్రయుక్తంబగునగుచో నుత్వంబుపయిని దానితకారంబు దకారంబగు.

అగుదెంచు - నెగయుదెంచు - పోవుదెంచు అగు - నెగయు-పోవు-చొచ్చు - పుచ్చు - తోఁచు - నడచు - పఱచు - మొలచు-వీచు - ఇత్యాదులు

వ్యా—"తెంచు" అనుక్రియ, పైనిజెప్పిన అగు, నెగయు, పోవు, మొదలైన గణపఠితధాతువులకు ననుప్రయుక్తంబగు. అగు మొదలైనధాతువులతోఁ దెంచుధాతువు ఘటింపఁజేయంబడు. అపుడుఅగు మొదలైన ధాతువులయుకారంబుమీఁది తెంచుధాతు తకారంబు దకారంబగు. ఈతెంచుధాతువు స్వార్థమందే వచ్చును గాని తన (తెంచు) యర్థమైన ఛేదనంబును తెలియంజేయదు ౧౦౯వ సూత్రమునుండి "స్వార్థమున" నను పదంబిట ననువర్తించునని యెఱుంగవది. "అగుదెంచు" ఇటగకారముమీఁది యుకార మునకంటెఁ దెంచుధాతుతకారంబు పరమైనది గాన దకారంబయ్యె ఉ॥ అంత సరోరుహాప్తుఁ డుదయంబగుదెంచె నిర్వ ౬ ఆ గీ॥ బంధనంబులెల్లఁ బాయఁదుభీముఁడు నీరిలోననుండి నెగయుదెంచె॥ భార. ఆది ౫ ఉ॥ సూరెలనున్న మంత్రులను గొట్టుములం గనుఁగూర్చు మిత్రులఁ బారబులందు సూచి మునికాపదినంబులువోవుదెంచెనం భోరుహమిత్రుఁడస్తగిరిఁబొందెడునం తొగిఁదత్ఫలావళుల్ వానలకెల్లఁ బెట్టియునవ్వుఁడు దానొకపండుఁదెచ్చెరెఁ॥ భార ఆది ౨ఆ

111 సూ—అభ్యాగతి నరుగ్వాదుల కయ్యాదియనుప్రయుక్తంబగు నగుచో గువర్ణంబు విభాషను లోపించు.

అరుదెంచు - అరుగుదెంచు ॥ ఏతెంచు - ఏగుదెంచు - చనుదెంచు.

వ్యా—ఆగమనార్థమిచ్చుచో నరుగు మొదలైన ధాతువులయంతంబునఁ దెంచు సంధింపఁబడును అపుడు ధాతుగకారము వికల్పముగా లోపించు.

"అరుగు + తెంచు" ఇట్లుండ గువర్ణంబునకు వికల్పములోపంబుగాఁగ (అరు + తెంచు), ౧౧౦ సూత్రమున నుకారంబుమీఁది తకారంబుదకారంబుకాఁగా "అరుదెంచు" అరుగుదెంచు" ఇత్యాదులయ్యె "ఏతెంచు" ఇట ఏగుధాతుగువర్ణములోపింపఁగా, తెంచుధాతుతకారఁబు, ఏకారముకంటెఁ బరమైనది (ఉకారముమీఁది తకారమునకె దకారమువచ్చును) కాన దకారము రాలేదు క॥ కృష్ణన్నృగాజినధరునరు దోర్నగ్యుతి తేజఃబంకజోద్భవవదృశుం గృష్ణద్వైపాయనుగత తృష్ణామయుఁ గాంచిరరుగుదెంచు మహాత్ముల్॥ భార ఆది ౭ ఆ వ॥ చంపకాపురంబున కరుదెంచునారు జై ౪ ఆ "అరుగుదెంచు" అను దానికి స్వార్థమందును బ్రయోగవైరళ్యము కానిపించెడిని. గీ॥ హంసకేతనుపాలికి నరుగుదేర" జై ఆ ౪ ఆ (అరుగుదేర - పోవఁగా) "పరాశర నందనుండేగుదెంచె" (వచ్చె) ఏగుధాతువుకంటెం గూడ స్వార్థమునఁదెంచు కానంబడియెడి చ॥ ఈ యహితుల వెల్లడించి సవనాశ్వముతోఁ బురికేగుదెంచి య మ్మహిప తిఁగాంచి యీతనిక్రమం బపుడేమని విన్నవించెదర్॥ (పోయి) మ అరదంబెక్కి ప్రమోదమేర్పడఁగనయ్యక్రూరుడే తెంచుచుర్॥ వి పు ౭ ఆ "చనుదెంచు" నపుపోవు అనునర్థంబునఁబ్రయోగంబుగలదు॥ వ॥ ధర్మజవాసుదేవులచేత ననుజ్ఞాతుండై హస్తిపురంబును నిర్గమించి నిరర్గళప్రయాణంబులసపుత్రపౌత్రుండై చనుదెంచి కతిపయవాసరంబుకు, పావనికాంచె॥ జై. ౨ఆ.

## 112 సూ— అయ్యాదిపరంబగునపుడు చువర్ణంబులోపించు.

చొచ్చు - - చొత్తెంచు॥ పుచ్చు - పుత్తెంచు ॥త్రోఁచు త్రోఁతెంచు.

వ్యా—స్వార్థమును, ఆగమనార్థమును స్ఫురించుచుండ విధింపఁబడి యుభయ విధంబుగానున్న పూర్వోక్త తెంచుధాతువు పరమయినపుడు ముఖ్యధాతువుయొక్క తుది చువర్ణంబు లోపించును "చొత్తెంచు" ఇట "చొచ్చు + తెంచు" ఇట్లుండఁ బ్రకృతి

సూత్రంబున సకారాంతచకారద్వయంబునకు లోపము రాఁగా నాద్యక్షరశేషంబైన చోకారంబుమీఁది తకారంబునకు "నెత్తటి" (నెఱ + తటి) ఇత్యాదిశబ్దంబులయందుం బలె ద్విత్వంబై "చోత్తెంచు" అనురూపంబగును. ఇట్లే "పుత్తెంచు" ఊహించునది. సంధి. పరి. 3౯ వ సూత్రముచేతనే "చొత్తెంచు" "పుత్తెంచు" ఇత్యాదులందుఁ దకారద్విత్వంబువోలె నాద్యక్షరశేషంబై యద్విత్వంబునకు లోపంబగునం గానఁ బ్రకృతము వర్ణలోపవిధాయకసూత్రంబు క్రియాపరిచ్ఛేదమందు ననవసరమని యందురేని యట్లనవలదు నడతెంచు (నడచు + తెంచు) పఱతెంచు (పఱచు + తెంచు) ఇత్యాదులందు నాద్యక్షరశేషత్వంబు గాకుండ ముఖ్యధాతువుల తుదివర్ణమే లోపించుటకై సూత్రారంభం బవశ్యకర్తవ్యంబు. ఈసూత్రంబు లేనిచో "చొత్తెంచు" వోలె (నడచు + తెంచు) "నత్తెంచు" ఇత్యాద్యనిష్టరూపంబులు సంధి పరి. 39 సూత్రమునఁ గావలసి వచ్చును తద్దోషనివారణార్థమై దీనికిఁ జారితార్థ్యంబు గలదని తెలిసికొనందగు.

### 113 సూ—అద్దానికి ముత్తుపరంబగునపుడు తే తేరులగు.

అగుదేఁడు - అగుదేరఁడు - అగుదెమ్ము - అగుదేరుము.

వ్యా—పైనిం జెప్పిన యుభయవిధార్థక తెంచుధాతువునకును, ముజ్ఞును, జేత్తును, పరంబగునపుడు 'తే' అనునదియు, 'తేరు' అన్నదియు పర్యాయంబుగా సర్వాదేశంబు లగును. వ్యతిరేకార్థమునఁ బ్రథమపురుషైకవచనవివక్షయందు లజీవర్ణకంబునకు నెనిమిదవసూత్ర [క్రి గా-ప3] మున డుజ్వర్ణకము రాఁగా "అగుదెంచు + డు" అనియుండు జీత్తైనలజీవర్ణకము ముత్తుశబ్దార్థములో నంతర్భూతము గావున నియ్యది పరమగుచుండఁ గాఁ దెంచునకుఁ దేశబ్దము సర్వాదేశమయి "అగుదేఁడు" అనురూపంబు సిద్ధించు. ఈడుజ్జుజీత్తు కావున బిందుపూర్వకంబగు. 'తే' అను దీర్ఘంబుకంటెఁ బరమైనందున నరసున్న యేకాని నిండుసున్న యుండదు క్రి పరి ౬౧ సూత్రములోని ముజ్జుశబ్దముచేతను మధ్యమపురుష బహువచనము జ్జే గ్రహింపఁబడినందున వ్యతిరేకార్థకలజీవర్ణస్థానీయమైన యీప్రథమపురుషైకవచన డుజ్జుపరంబగుచోఁ బూర్వోక్తసూత్రముచేతను హ్రస్వంబు రాదు శ॥ పదియేనేఁడులబాలుని పదములగుణుఁ గాకపక్షసంయుతునేని ట్లనయతఁబుత్తేఁజాలను పదయోఁడవాగు రాముపలన సంయమివర్యా॥ భాస్క. రా.

'అగుదేరఁడు' ఇటఁ బక్షంబునఁ దీర్ఘాదేశము 'అగుదెమ్ము' ఇటలోణ్మధ్యమపురుషైకవచనము ముఙ్వర్ణకంబు పరంబగునపుడు తెంమునకు, తేశబ్దాదేశమయి 'అగుదే + ము' అనియుండఁగా క్రి. పరి. ౬౧ వ సూత్రమున ధాతువునకు హ్రస్వంబును, ముఙ్వర్ణకంబునకు ద్విత్వమ్మును గలిగి 'అగుదెమ్ము' అనియయ్యె. పక్షంబునఁ దీర్ఘాదేశవయి "అగుదేరము" అగను "అగుదెమ్ము" నకు బహువచనరూపంబు 'అగుదెండు' అనియుండు. మధ్యమడుఙ్పరమగుచో 'దే' శబ్దంబునకు హ్రస్వము గలిగి డుఙ్డికి తైనందున [అగు] దెండు అని పూర్ణబిందు వేయఁగును. ఇఁక, అఁట, మఁడు అనుశబ్దములందక్కనుండి తొలి హ్రస్వముమీఁద నరసున్నయుండదన్న నియమంబున నిట నర్ధబిందువు రాదు. శా॥ అన్నా లక్ష్మణ నిన్నుఁ బుణ్యనిధినే నజ్ఞాననైపథ్యమొ న్నన్నా పాపమువచ్చి ముట్టుకొనియె న్నాపాలిదైవంబవై యిట్టిమం బరిమార్ప వేగఁబఱతేవే నన్ను రక్షింపుమీ యన్నంగ్రక్కునఁజేరవేయురుగవేయత్యుగ్రశిఘ్రం బునఁ॥ భాస్క. రా.

**114 సూ—భూతంబున లజికి లిడంతరంబగు నగుధాతువవను ప్రయుక్తంబగు.**

వాఁడురాఁడయ్యెను - వారురారయిరి - అదిరాదయ్యెను - అవిరావయ్యెను ॥ నీవురావయితివి - మీరురారయితిరి నేనురానయితిని - మేమురామయితిమి.

వ్యా—లజికిన్ = వ్యతిరేకార్థకప్రత్యయాంతధాతువునకు, భూతంబునన్ = భూతార్థమందు లిడంతంబగునగుధాతువు = భూతార్థకప్రత్యయాంతమయిన యగధాతువు, అనుప్రయుక్తంబగు = [వ్యతిరేకార్థకక్రియను] అనుసరించి ప్రయోగింపఁబడును. ఉ. వాఁడు రాఁడయ్యెను ఇట "రాఁడు" అన్నది వ్యతిరేకార్థకమైన లజిప్రత్యయాంతరూపము. "అయ్యెను" అనునది భూతార్థకమయిన యగుధాతువు రూపము. భూతకాలమందు వ్యతిరేకార్థమును బోధించుచో భూతార్థకమైన యగుధాతువు సాహాయ్యము లజిప్రత్యయాంతమునకుండవలయునని నిష్కృష్టార్థము రాఁడయ్యెను = రాలేదు

అని యర్థము. ఇట్లే తక్కినవియు నూహింపవలయును. క. మనలోఁ గయ్యంబేటికి సని ధర్మసుతుండు చెప్పినది మాపతికై కొనఁడయ్యె రోగి పథ్యాశనమునకుం జొరనిభంగి సంజయయోగ్యుఁడ భా. క. ౧ ఆ. తే. గీ. ప్రియుఁడు రాఁడాయె సత్యభామ యొద్దఁ గాక యెన్నిమాయలు పన్నెనో యెఱుఁగరాదు గాయఁగాఁజొచ్చె శశిమింటనాయ వంకఁ జేయఁగాఁజొచ్చె పని యక్రియేఁడికినఁగ అప్ప ౨ ఆశ్వా

శా. రాఁ జైరంగ్యముఁ బూని నీవు కడు నిర్దాక్షిణ్యచిత్తంబునన్ రాఁ జైతేఁ జ విగాని యిఁదులను హోరాహోరిగాఁ బోరియే లావాలాయము సేయఁగా బ్రదుకు నీవా చారవంతుఁడవై కావో యొక్కఁడు నీయెడంగలుగు వాంఛన్ భూసురగ్రామణీ॥ మను. ౩ ఆ. శా. రాఁడెవ్వెఁడ హృదయేశుఁ డీరహభారంబెల్లు నైతున్ త్వరం బేఁడై యున్నది యేటికిందనె నెనో రోగిష్ణుముల్ పుట్టెనో నేఁడే తేరఁబ్రయత్నమున్న వకటా నీచేత జెప్పింపఁడె వాఁడేకిలి నెఱింగనో యపుడన న్యాస్వచ్ఛి యట్లాడఁగన్॥ ప్రభా. ౪ ఆ.

**115 సూ— నుజ్యంతంబగుధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తంబగు నుజీకి విభాషనగు.**

కాను - అనునది నుజ్యంతంబగునగు ధాతువు రూపంబు.

వ్యా—క్రి. పరి. ౪౦ సూత్రముచేతను. ధాతువునకు నుజీవర్ణకంబు విధింపఁబడియె. అట్టిధాతువునకు నుజీవర్ణకంబు రాఁగా క్రి. పరి. ౯౧ సూత్రముచేతను కాదేశము గలిగి 'కాను' అనురూపంబగు. ప్రకృతసూత్రమున 'కాను' అన్నది క్రియావిశేషణంబులకు నిత్యంబుగను, నుజ్యంతమైన ధాతువునకు వికల్పముగాను జేర్పఁబడును

**116 సూ—దానికి హ్రస్వంబు విభాషనగు.**

లెస్సగాను - లెస్సగను - న్యాయ్యముగాను - న్యాయ్యము

గను - ఇట సరళంబునిత్యంబు ॥ చూడఁగాను - చూడఁగను - చూడను - ఇట స్వత్వంబులేదు.

వ్యా—క్రియావిశేషణంబులకుం గాని నుడిప్రత్యయాంత ధాతువులకుం గాని తుదం జేర్పఁబడిన "కాను" అనుశబ్దముయొక్క దీర్ఘమునకు హ్రస్వము విభాషగానగును ఉ "లెస్సగాను జదివె" ఇత్యాదివాక్యంబులందు లెస్సశబ్దము ‹చదివె› ఇత్యాదిక్రియలకు విశేషణము గాన 'కాను' అనునదియనుప్రయుక్తంబగును(అనుసరించిప్రయోగింపఁబడును) సంస్కృతభాషలో మాత్రము ‹తత్ప్రత్యనుపూర్వమీపలోమకూలం› (అ ౪ పా ౪ సూ ౬౭) ఇత్యాదిస్థలంబులలో సకర్మకధాతుక్రియావిశేషణంబులు సయితము ద్వితీయాంతములేయగునని భాషాపరిచ్ఛేదవిశేషము. ఏవిభక్తియు నిరూపింప శక్యముకానిచో సామాన్యముగాఁ బ్రాతిపదికార్థమందు ప్రథమావిభక్తియే న్యాయ్యంబు గాన ‹లెస్స› అను ప్రథమావిభక్తికంటెఁ బరంబైన కానుశబ్ద కకారంబునకు సంధి ప ౧౩ సూత్రమున నిత్యంబుగా సరళగకారంబై పైరూపము సిద్ధించె అసరళాదేశసూత్రములో బహుళగ్రహణఫలంబేమనఁగా నిట్టిక్రియావిశేషణస్థలంబులలో సరళాదేశనిత్యత్వార్థమని యెఱుంగునది.

"న్యాయ్యముగాను" విశేషణమైనపుడు "ధర్మపథ్యర్థన్యాయాదనపేతే" (అ౪ పా ౪ సూ ౯౨) అనుసూత్రముచేత ద్వియకారముతో నుండవలయు. న్యాయము నుండి తొలంగనిదియని యర్థము "న్యాయముగానున్నది" యని యేకయకారముతోఁ బలుకుట యవిచారితరమణీయము. ఇచ్చట నేకయకారముతోనున్న న్యాయశబ్దము విశేష్యమే కాని క్రియావిశేషణము గానేరదు కనుకనే యప్పకవి ౨వ యాశ్వాసమందు సీ॥ క్షయ్యజయ్యన్యాయ్యసాహాయ్యసాన్నాయ్యధాయ్యపాయ్యములనికాయ్యమునను గ్రయ్యశబ్దమునను గియ్యలు గలవని తెలిసి ప్రాసములను నిలుపవలయు" అని నిరూపించెను విశేషణార్థవిశేషములయందే క్షయ్యాదిశబ్దంబులుయద్వయవిశిష్టంబులని యప్పకవిగారి తాత్పర్యముగాని యర్థాంతరమందు క్షయ, జయ, న్యాయ, ఇత్యాదులేకయకారముతోఁ గొన్ని యుండవనికాదు "చూడఁగాను" ఇట చూచుధాతువునకు ౪౦ వ సూత్రమున నుడివర్ణకంబును ౯౧ వ సూత్రమున ‹చూచు› నకు ‹చూడు

ఆదేశమును గలుగంగ ౧౧౫ సూత్రమున 'కాను' అనునది నుబ్ప్రత్యయాంతము చివరఁ జేర్పఁబడి సంధి. ౧౬-౧౭ సూత్రముల పరశాదేశ్యాదికార్యములు రాఁగాఁ బైరూపంబు సిద్ధించు "చూడనుగాను" అని ప్రాచెను గలువలు, అన్నచోటునంబలె నుకారంబునకు బ్రకృతభావంబుండదు "ఇటసత్యములేదు" అనుమూలములోని వాక్యము సంశ్లేషంబు నకు నుపలక్షణంబు 'చూడన్గాను' అనియు ప్రయోగంబులు గానరావు పక్షం బున హ్రస్వంబు 'చూడఁగను' నుబ్యంతంబౌ ధాతువునకు 'కాను' అనునను ప్రయోగము వైభాషికంబు గావున (౧౧౫) 'చూడను' అనియుచుండు 'కాను' అన్నది ధాతువునకే వైభాషికమని చెప్పఁబడ్డదిగాని క్రియావిశేషణస్థలములయందుం గూడ దీనితోడు లేకుంట గానవచ్చుచున్నది గీ గ్రహాసంక్రమణాదుల రాచనగరఁ గాసువీసంబు వెడలమి గ్రాసమునకు నాధివెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని లెస్సయుండునె? గృహకర్త లేని బ్రదుకు॥ మను ౩౮

క॥ తలచక్కముడుచుకొని ద్రిం డలవడబంధించి పోతికమరనిలువునీ! వలసిన వన్నియునిచ్చెద నలఘుశిరస్త్రాకంటకాదులనిపుణుఁ॥ భా శల్య ౨౮ గీ ఉమయునగ్నియుగంగయునుండనన్ను గారవంబున నధికునిఁగాఁ దలంచి చక్కనాపాలి కేతెంచెనో కొక్కవీఁడు సంభృతస్నేహభక్తి విస్రంభుఁడగుచు॥ శల్య ౨౮ క కలకల నవ్వుచుఁ దొలుచం పలుకుచుఁ దమకొలకులందుఁ బాంచాలకుమా రులుసను దేరఁగఁ బొందు సుతులువచ్చిరి సంతసంబుతో మదువునకుఁ॥ శల్య ౨౮

117 సూ—ఉన్నకలనవర్ణకంబులమీఁది తచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాషనగు.

బాహుళకంబుచే నిట సంధినిత్యంబు ॥ వందుచున్నవాఁడు - వందుచున్నాఁడు - వందుచున్నవారు - వందుచున్నారు - వందుచున్నవాఁడవు - వందుచున్నాఁడవు - వందుచున్నవారరు - వందుచున్నారరు వందుచున్నవాఁడను - వందుచున్నాఁడను - వందుచున్నవారము - వందుచున్నారము - అట్లువండఁగలవాఁడు - వండఁగలాఁడు - వండినవాఁడు - వండినాఁ డిత్యాదులెఱుంగునది.

వ్యా—క్రి. పరి. ౭౬ సూత్రముచేత విధింపఁబడిన ఉన్న, కల, న, వన్నీకంబులకంటెఁ బరమైన తచ్ఛబ్దనకారంబునకు లోపమువికల్పముగానగును. (ధాతుజవిశేషణంబునకు విభక్తివిధానవివక్షయందు సమా. పరి. ౯ సూత్రముచేతను తచ్ఛబ్దంబను ప్రయుక్తంబగునని స్మరింపనగును.) "వండుచున్నవాఁడు" ఇవటవండుధాతువుకంటె ౭౬ సూ న, వర్తమానార్థకశత్రర్థమందు ఉన్న, వన్నకంబును క్రి. పరి. ౧౪ సూ॥న ధాతువునకు చువర్ణకమును సమా పరి. ౯ సూ న, తచ్ఛబ్దానుప్రయోగంబును గలిగి పైరూపం బేర్పడెడి పక్షంబునఁ బ్రకృతసూత్రమున తచ్ఛబ్దనకారమునకు లోపంబు రాఁగా "వండుచున్న + ఆఁడు" అనియుండి, అకారసంధిసూత్రస్థబహుళగ్రహణంబున నిట సంధి నిత్యంబైవచ్చి "వండుచున్నాఁడు" అనియేరూపంబగును. కాని, వండుచున్నయాఁడు' అని వైకల్పికాకారసంధిచే ననిష్టమైన రూపాంతరము చెప్పఁగూడదు. కొందఱు ప్రకృతసూత్రమునఁ దచ్ఛబ్దనకారంబునకు లోపంబుగలిగి "వండుచున్న + ఆఁడు" అనియుండ నిది యపదాదిస్వరసంధిస్థలంబుగావున (అకారసంధిసూత్రమును బాధించి సంధి. పరి. ౧౧ సూ న, అపదాదినిత్యసంధి రాఁగా "వండుచున్నాఁడు" అన్నరూపంబు సర్వవిషయంబులకు సులభంబనియు "బాహుళకంబుచే నిటసంధినిత్యంబు" అనిన మూలకారువివచనం బతిపేశలంబనియు శంకింతురు కాని యట్లనవలదు. "వచ్చుచున్న + వాఁడు" అన్నదిపదద్వయఘటితంబు "వచ్చుచున్న" అన్నది యొకపదంబును "వాఁడు" అన్నది వేఱొకపదంబునని తెలిసికొనవలయు. "వచ్చుచున్న" ఇత్యాది ధాతుజవిశేషణంబులకంటె విభక్తి యుత్పత్తిలో తచ్ఛబ్దంబుతో సమాసంబైనందున లోపించినది. కనుకనే సమాసపరిచ్ఛేదంబులోని ౯ వ సూత్రమున విభక్తివివక్షగలిగి అయ్యది లోపించినను "సాధనము" ఇత్యాదులువోలెఁ బదచ్ఛేదకాలమందు నేకపదంబుగానే చెప్పుకొనవలయు "వచ్చుచున్న + ఆఁడు" అనుచోటు పదద్వయసంధిస్థలంబుగాన నపదాదిస్వరనిత్యసంధి చెప్పఁగూడదు. అట్లు కానిచో "వచ్చిన + అది" అన్నచోటునం గూడ నపదాదిస్వరనిత్యసంధి గలిగి "వచ్చినది అన్న యేకరూపంబేయగునంగాని "వచ్చినయది" అన్నరూపాంతరము లేకుండవలసివచ్చు. కాన. నకారసంధిసూత్రములోని బహుళగ్రహణంబుననే వచ్చుచున్నాఁడు. వండినాఁడు, వండఁగలాఁడు ఇత్యాదులందు నిత్యాకారసంధి యని యెఱుంగవలయు. "వండుచున్నారు" ఇత్యాదులయందుఁ బక్కిన యుదాహరణములయందుం గూడ నైకరీతిగానే సూత్రప్రక్రియ

మెంచుకొనఁ బలయు గీ తొంటిచపఁ గని యిప్పుడు దోఁచి పాండు సుతులు రాజ్యంబు సేయంగఁ జూచినారు నాకు నీఁదీఱు నేయింక నాఁటిమాట లెక్కడివి ద్రోణభీష్ము లీదిక్కు జూచుచున్నారు॥ ఉద్యో. 3 ఆ॥ గీ॥ చనుసెయిపూన్నటలాడ సజ్జనులకాఁడు॥ పుట్టువులఁ దోడ నీవు పుట్టినాఁడ॥ వట్టిగాక యహీనవంశాభిజాత॥ నైపతిం ద్రిశవదు నన్ను నడుగ దగునె॥ విరా. ౨ ఆ॥ గీ॥ అంకశౌర్యశ్రీయంబైనయట్టిమేటి వీడు నాకాపావన్నుం హాస్వితధామ కాంతిఁ జూచిపోయదనని కదలివచ్చి॥ నాఁడె నటిసూపు మదనుగుణ్రక మము॥ రాఘు. ౨ ఆ॥ (రామాయణార్థమందు 'వచ్చినాఁడను' అని యేకపదము భారతార్థమందు వచ్చి = ఏతెంచి, నాఁడె = నాఁడే అని పదద్వయము.

118 సూ— ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబులయి విలక్షణార్థాభిధాయకంబులగు నీయవి శబ్దపల్లవంబులు నాఁబడు

కూరుచుండు - నిలుచుండు - పరుండు - పన్నుండు - ఆఁకొను ఈకొను - ఈయకొను - ఇయ్యకొను - రక్కొను - తెక్కొను - మేకొను - మయికొను - మేలుకొను - మేలుకను - మేలుకాంచు అలవడు - ఏరుపడు - చోప్పడు - వెలవడు - తలపోయు - వాపోయు - ఆపోవు - కొంపోవు - కొనిపోవు - విజయంచేయు - కయివాలు - తూపాడుచు - ఇత్యాదులు - శబ్దపల్లవంబులు.

వ్యా— ధాత్వాదులకు = క్రియలు మొదలైనవానికి (ఆదిశబ్దము చేతను నామవాచకములు గ్రహింపఁబడును) ధాతువులు = క్రియలు జతపఱుపఁబడినవై శబ్దద్వయ మేళనంబునకుఁ బూర్వమందున్న యర్థముకంటె నితరార్థము బోధించుచున్నవై యియ్యవి వ్యాకరణపరిభాషంజేసి శబ్దపల్లవములనంబడు. అనఁగా నసేకశబ్దంబులనుండి చిగిర్చినవి (అంకురించినవి) యని భావము. ఉదా—(౧) కూరుచుండు (కూరిచి + ఉండు) కేవలకూరుచు ధాతువునకుఁ గ్రిందుపడుట యర్థము. క్రియాంతరమేళనానంతరమందు కూరుచుండు = ఆసీనుండగుట యని యర్థము విలక్షణమయ్యె. "నడుచుచుఁ గూరుచుండుచును" కాశీ ౪ ఆ. (౨) నిలుచుండు (నిలిచి + ఉండు) = నిలఁబడియుండు.

కేవలనిలుచుధాతువునకు (౧) నిలఁబడు ౨ ప్రతిష్ఠితమగు (౩) ఉండు (౪) శేషించు (౫) అడ్డిపడు అనిన యనేకార్థములు గలవు క్రియాంతరము మేళగించినపిమ్మట "నిలుచుండు" శబ్దమునకు నిలఁబడుట యొక్కటియే యర్థమయి తక్కుంగలయర్థములు స్ఫురింపవని తెలియునది. నిలుచుశబ్దార్థమైన నిలఁబడుట "నిలుచుండు" అన్నధాతుమిశ్రంబునకును నర్థమై నిలిచినను తక్కిన "ప్రతిష్ఠితమగు" ఇత్యాద్యర్థము లీశబ్దంబునకు శబ్దపల్లవత్వావస్థయందు స్ఫురింపకుండుటయే విలక్షణార్థాభిధాయకత్వమని తెలియందగినది. ఇట్లే తక్కినధాతువులకును సాకర్యంబున విలక్షణార్థబోధకత్వమూహింపవలయును. (౩) పరుండు; పన్నుండు (పడి + ఉండు) (౪) ఆఁకొను (ఆకలి + కొను) ఉ॥ ఆఁకొని యేడ్చుచేఁజిలుతలన్నము కై తనకొంగులాగఁ బెల్లాఁకటసోలుచుండెడునిజాంగనదుర్దశఁజూడఁడేరియా చ్ఛాకలవావిభంగధరుసంభృతగద్గదశూన్యకంఠుఁడై చేకొనిదేహి యంచడుగఁజేరుననె కాలినపొట్టకెప్పుడున్ ॥ భర్తృహరి వైరా. ౨౧ ప. ఉ॥ ఎండకు వానకోర్చి తనయిల్లుప్రవాసముచోటనాకయాఁ కొండునలంగుచున్నిదురకుందఱి దప్పెను చప్పిడు పట్టెనో క్రుంగుడువడియెట్లోకోయనక కార్యముముట్టినచోటనేలినా తండ్రో కచాయఁజూపినను వత్సరతంబని సేయుటొప్పునే ॥ విరా. ౧ ఆ. (ఇట "ఆఁకొందును" అనుదానిలో దకారంబు సన్న పైనున్నందున క్రి. పరి ౫౯ సూత్రమున డకారంబై "ఆఁకొండు" నగును) (౫) ఈయకొను (ఈయ = అపేక్ష + కొను) అంగీకరించుట (౬) ఈకొను (౭) ఇయ్యకొను ధాతువులు రెండును వెనుకటిదాని రూపాంతరములు (౮) రక్కొను = రెక్కొనరూపాంతరము (రేకు + కొను) విర్ఘిల్లుట. ఉ॥ చక్కరవింటి రాజునగచాపునిగో సెడిరించి పడ్డనాఁ డెక్కడనుండితీవు మధుఁడెక్కడనుండెను మందమారుతం బెక్కడనుండె సిగ్గువడరేమిపుడాతఁడదృష్టరేఖచే రక్కొనిక్రమ్మఱం బ్రతికెరాఁజనవార్లయినారుగా ॥ శశి॥ విజ ౩ ఆ (౯) త్రెక్కొను (త్రెంచు + కొను) చంపు; ఉ॥ అక్కట తండ్రిలేనిమము నమ్మియిఁబెంచిన తాత నిమ్మెయిన్ ద్రెక్కొనఁ గావతంబు సముదీర్ణభుజాబల శౌర్యశాలినై యిక్కడిసేనఁ జక్కడిచెనేనియుఁజాతు నకార్కగమ్యమం దక్కటకోర్వఁజాలుదునె ధర్మజాతముల్ క్రూరకర్ములే॥ భీష్మ ౩ ఆ. (౧౦) మేకొను (మే = శరీరము) + కొను = సమ్మతించు; ఉ॥ అక్కట కౌరవాన్వయ మహామానమింకెడునట్లు పుట్టెనిది దొక్కరుఁడైనఁ గేళవహితోక్తికి మేకొనఁడ

వికృ. ౫ ఆ. ఇట్లు శబ్దపల్లవంబులు విలక్షణార్థములం దెలుపునన్న యంశంబు విశదపఱుపఁ గవిప్రయోగంబు లుదాహరింపంబడియె. సంస్కృతభాషయందు శబ్దపల్లవములన్న వ్యవహారమే లేదుగాని యేతాదృశశబ్దంబులు గలవు ఉ దా. బ్రహ్మీభవతి స్వీకరోతి, సత్యాపయతి. పుత్రీయతి, దుఃఖాకరోతి, ఉపవీణయతి, అనుకూలయతి, ఉపశ్లోకయతి' సంసర్గయతి, విరళీకరోతి ఇత్యాదులు భాషాసాదృశ్యంబు కనంపడ లిఖింపఁబడినవి.

## 119 సూ—చేదర్థయోగంబున లృట్టునకు లిట్టగు.

ఆఋషీశ్వరుండు వచ్చెనా ఫలించుఁ గార్యముల్ । వాఁడు రేపు వచ్చెనేని నీవు కార్యంబు దొరఁకొనుము.

వ్యా—చేదర్థమనఁగా హేతుహేతుమద్భావంబు. అట్టి కార్యకారణసంబంధము దోఁచుచో భవిష్యత్కాలవాచి ధాతువునకు భూతకాలరూపంబగు. ప్రథమోదాహరణమందు మునీశ్వరుఁడువచ్చుట కారణంబు. పనులు నెఱవేఱుట కార్యంబు. కావునఁ గారణమైన మున్యాగమనమును దెలుపునట్టి వచ్చుధాతువునకు భూతకాలరూపంబు గలిగె. వచ్చుధాతువుపైని నాకారంబు చేదర్థప్రతీతిం దెలుపునని యెఱుంగునది. రెండవయుదాహరణయందు (రేపు) వచ్చుటకారణంబు. పని మొదలుపెట్టుట కార్యంబు. వాఁడు వచ్చినంగాని కార్యమారంభింపవలదని భావము వచ్చుధాతువునకు చేదర్థవాచకంబైన యేనిశబ్దముతో సంబంధమున్నంగునఁ గార్యప్రారంభకారణంబైన వచ్చుధాతువునకు భూతరూపంబు గలిగెనని తెలియఁదగినది.

గీ॥ ఎట్టియుపరాగమొనరించెనేని తల్లి। కొడుకు శపియింప దిబ్బంగిఁ గ్రూరబుద్ధి।
నతివసత్యంబుఁ జెప్పుమిప్పట్టు నీవు। నావుడును శాపభీతి నన్నళిననేత్ర॥
కాశీఖండము.

ఉ॥ మాయలు నింద్రజాలములు మాధవుఁ డిందును గొన్ని పన్నినం
బాయవు రజ్జులెప్పుడును వారణ నీవెటులాడితేనియుఁ

వేయును నేల పార్థులను విష్ణుఁడు వేపదివేలువచ్చినం
జేయుదు మేము కయ్యమొకచీఁకయైనను బంచియిత్తుమే। ఉద్యో. ౪ అ.

120 సూ.—ఆత్మార్థంబభిహితంబగుచోఁ దల్లింగ సంఖ్యాభిధాయువచనంబులు ధాతువిశేషణంబులకగు.

రాముఁడు రావణుంబరిమార్చి సీతయుందాను సౌమిత్రిసహితంబుగంబుష్పకారూఢుండయి సాకేతంబున కేతెంచె.

వ్యా—"ఆత్మార్థ" శబ్దముయొక్క యర్థము, తనతో సముచ్చయముగానున్న యన్యపదార్థములతో సమముగా నాఖ్యాతము (క్రియావిభక్తి) చేఁ జెప్పంబడినచో విశేషణంబును, ధాతువును, తత్క్రియకర్తలయొక్క లింగవచనంబుల ననుసరింపక యాత్మార్థశబ్దార్థముయొక్క లింగవచనంబులనే స్వీకరించును అనిభావము. పైయుదాహరణమందు సీతాదేవియును శ్రీరాముండును పుష్పకారూఢులై సాహచర్యంబున (సహవాసంబున) నయోధ్యాపురంబున కేతెంచిరని తెలియుచున్నది ఇట నేతెంచుధాతువుమీఁది యాఖ్యాతము రామునితోడం బలె సీతతోడసహితము సమానముగా నన్వయించుచున్నను ఆత్మశబ్దార్థమైన రామునియొక్క లింగవచనంబులనే అనఁగా పుల్లింగము నేకవచనంబునే పొందినది. కాని సీతానిష్ఠసంఖ్యతో నేకీభవింపలేదు. సీతారాముల యుభయులసంఖ్యలను నాఖ్యాతమంగీకరించినచో 'ఏతెంచిరి' అని వాక్యంబులో నుండవలయు. అట్లె విశేషణమయిన పుష్పకారూఢశబ్దము సీతకుం గూడఁ జెందినను ఆత్మశబ్దార్థమయిన రాముని పుల్లింగమును సంఖ్యనే చెప్పినందున బుష్పకారూఢుండయి యని వాక్యంబున నుడువంబడినది. లేనిచోఁ బుష్పకారూఢులై యని ప్రయోగింపవలయు. ("పుమాన్ స్త్రియా" అను వ్యాకరణసూత్రమునఁ బుల్లింగము శేషించి బహువచనంబుగా నుండవలయు) "ఈసూత్రములో లింగము విశేషణంబునకు మాత్రమే యన్వయించును. అసంభవము గానఁ గ్రియతో సంబంధింపదు అని యనవలదు. రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రిసహితంబుగం బుష్పకారూఢుండయి సాకేతంబున కేతెంచుచున్నాఁడు" ఇట్లు వాక్యమున్నచో వచనమే కాక యాత్మార్థపుంలింగము గూడఁ గ్రియతో సంబంధించునని యెఱుంగవలయు. ఏతత్సూ

త్రోదాహరణముగ నీరీతిగా వాక్యమిచ్చినచో సువచముగా నుండును. క॥ తనయులు దానప్పుడు తజ్జనకుం డరుదెంచి చూచుజనులకు ననుభా। వనిరూఢిమానితానం। తనవోత్సవముగ నొనర్చెం దత్పరిణయముల్॥ రాఘు. ౧౩. దృష్టద్యుమ్నాదిపుత్రులును, ద్రుపదుండు తానును, ఆద్రౌపదీవివాహమొనర్చెనని యన్వయము. ఇటఁ గ్రియయాత్మార్థముతో సంబంధించి యేకవచనాంతముగా నున్నది గాని తనయుల సముచ్చయమునం జేసి బహువచనాంతముగా నుండలేదు. ఇట్లనేకప్రయోగంబులు భారతాదిగ్రంథములయం దున్నవి గాని గ్రంథవిస్తరంబునకు భీతిల్లెద.

121 సూ—అగతికంబులగు భ్వాదులకిందు యోగంబులేదు.

భూ - స్ఫృ - కృ - రేకృ - లోకృ - లోచ - పచి - లప - ఇత్యాదులకు గతివిరహితంబులగు ధాతువులకీభాషం బ్రయోగంబు లేదు॥ ప్ర - పరా - అప - సమ్ - అను - అవ - నిస్ - నిర్ - దుస్ - దుర్ వి - అఙ్ - ని-అధి - అపి - అతి - సు - ఉద్ - అభి - ప్రతి - పరి - ఉప - ఊరీప్రభృతులును సాక్షాత్ప్రభృతులును గతిసంజ్ఞకంబులు. ప్రాదులిరువదిరెండు నుపసర్గంబులునాఁబడు॥ ప్రభవించు - ఆవిర్భవించు - ప్రసరించు - సంస్కరించు - భస్మీకరించు - సాక్షాత్కరించు - అతిరేకించు - ఆలోకించు - ఆలోచించు - ప్రపంచించు - ప్రలపించు - ఇత్యాదు లార్యప్రయోగంబుల నెఱుంగునది.

వ్యా—పైనిం జూపఁబడిన ప్రాదు లిరువదిరెండును క్రియాయోగమందు గతిసంజ్ఞయు నుపసర్గసంజ్ఞయు గలవియగును మూలవాక్యంబువందు నూరీప్రభృతులకును, సాక్షాత్ప్రభృతులకును గతిసంజ్ఞయున్నట్లును ప్రాదులకు నుపసర్గసంజ్ఞమాత్రమే యున్నట్లును విభజింపఁబడినరీతిని దోఁచుచున్నది. ఇచ్చటి యుపసర్గశబ్దంబు గతిసంజ్ఞకుం గూడ నుపలక్షణంబు; లేక యీవాక్యంబునకు నీరీతిగా నన్వయించుకొనవలయు. "ఉపసర్గంబులు నాఁబడు" అనుమూలవాక్యమందు సముచ్చయనకారంబునకుఁ బ్రశ్లేషము సేయవలయును. "ఉపసర్గంబులును నాఁబడు" అనిపదచ్ఛేదము చెప్పికొనందగు

ఉపసర్గంబులును - ఉపసర్గసంజ్ఞ గలవియును సముచ్చయము చేతను నూరీప్రభృతులకును సాక్షాత్ప్రభృతులకును ముందుగాఁ జెప్పఁబడినగతి సంజ్ఞ యిట ననువర్తించి ప్రాదులకు గత్యుపసర్గసంజ్ఞలు రెండునుగలవియని యర్థమగును. అట్టియర్థమే కానిచో నాసూత్రంబున గతిసంజ్ఞాశబ్దంబులచేతఁ బురస్కరింపఁబడని 'భూ' ప్రభృతిధాతువులకే తెలుఁగునందుఁ బ్రయోగంబు లేకున్నందునఁ బ్రాదులకు గతి సంజ్ఞ లేమింజేసి ప్రసవించు ఆలోచించు ఇత్యాదిప్రయోగంబులు తెలుఁగున లేకపోవలసివచ్చును. కాన ధాన్యపలాలన్యాయంబున నిట నుపసర్గసంజ్ఞ వక్కాణింపఁబడ్డది గాని గతిసంజ్ఞయే ముఖ్యంబు "ఆవిర్భవించు" "ఆవిష్" అన్నశబ్దంబూరీప్రభృతులలోనిది గతిసంజ్ఞగలిగి ప్రయోగార్హంబయ్యె. "భస్మీకరించు" ఇట భస్మశబ్దంబూరీ ప్రభృత్యాదులలో లేనందున గతిసంజ్ఞ లేకున్నను చ్విప్రత్యయాంతము గావున "ఊర్యాదిచ్విడాచశ్చ" అనుసూత్రంబున గతిసంజ్ఞ గలిగి ప్రయోగ యోగ్యంబయ్యె. ఇట్లు స్వీకరించు, బ్రహ్మీభవించు. ఏకీభవించు, ఇత్యాదులు తెలియందగు. "సాక్షాత్కరించు" ఇట్లు నమశ్శబ్దము సాక్షాత్ప్రభృతులలోనిది గాన గతిసంజ్ఞ గలిగి "నమస్కరించు" అయ్యె. విసర్గస్థలంబున గతిసంజ్ఞ లేనందున "నమఃకరించు" అని కాదు. సాక్షాత్ప్రభృతులాకృతిగణంబగుటంజేసి ధిక్, హుం, ఫీం ఇత్యాదిశబ్దములతో ధిక్కరించు, హుంకరించు, ఫీంకరించు, ఇత్యాదులు గృహీతంబులయ్యె. మనశ్శబ్దంబు నమశ్శబ్దవ్యుత్క్రమంబే కావున నమస్కరించు అన్నట్లు 'మనస్కరించు' అని ప్రమాదంబున లోకులు ప్రయోగింతురు. కొందఱాధునికులు జంకుకొంకులేని కవులు 'తుమూషించు' ఇత్యాదులు ప్రయోగించుచున్నారు. అయ్యవి సకళంకప్రయోగంబులు. "ఆర్యప్రయోగంబులనెఱుంగవది" యన్నమూలవచనంబునకుఁ దాత్పర్యమేమనఁగా నవధానముతో వినుండు ఈసూత్రస్థమయిన యగతికశబ్దంబునకు నేకశేషము గాని లేక యావృత్తిగాని చేయవలయు. ఇపుడు గతిసంజ్ఞాశబ్దవిరహితములయిన ధాతువులకు నిందుఁ బ్రయోగంబు లేకున్నయొక యర్థమే కాక యగతికంబులు అనఁగా నితరాకంబులు = కవిప్రయోగరహితములు కాని ధాతువులకు నీభాషయందుఁ బ్రయోగంబు లేకున్నయర్థాంతరమును నగును కవిప్రయోగములుండెనేని గతిసంజ్ఞాశబ్దరహితంబులైనను సాధువులనిద్వితీయార్థతాత్పర్యము. కనుక నేజరించు, ఈక్షించు, భ్రమించు, స్మరించు, హరించు, బోధించు, రక్షించు ఇత్యాదులుపలక్షితంబులయ్యె. విజయించు, పరాజయించు, అతీక్షించు, దుర్భ్రమించు, ఇత్యాదులు

సగతికములగును గనిప్రయోగాభావంబునంజేసి దుర్గతికములయ్యెనని, సూత్రకారుని తాత్పర్యము సత్, అలం, పురః, తిరః, ఇత్యాదిశబ్దంబులకు విశేషసూత్రంబుల సంస్కృతవ్యాకరణంబున గతిసంజ్ఞ విధింపఁబడినందున సత్కరించు, అలంకరించు, పురస్కరించు, తిరస్కరించు, ఇత్యాదులాంధ్రసమ్మతములైనవి యని తెలియందగు.

122 సూ— వలయ్వాదిక్రియలకుం గర్త యగు భావంబునందు నుజీయగు.

వలయ్వాది క్రియలకుం గర్తృభూత క్రియావ్యక్తియగు ధాతువునకు నుజీవర్ణకంబగు వాఁడుచూడవలయు - వారలుచూడఁగా వలయు - నీవుచూడవలయు - మీరుచూడవలయు - నేనుజూడవలయు - మేముచూడవయు । మనముచూడవలయు - వలయును - వలదు - కూడును - కూడదు — చెల్లును - చెల్లదు - తగును - తగదు - ఇత్యాదులు వలయ్వాదులు.

వ్యా—వలయు, వలదు మొదలైన యీక్రిందిగణములోని ధాతువులకుఁ క్రియ యేకర్త గానున్నచో నట్టి క్రియావాచకశబ్దంబునకు నుజీవర్ణకంబగును. పూర్వమందుఁ దుమర్థభావలక్షణార్థములయందు ౪౦ సూత్రమునను జీవర్ణకము విధింపఁబడినది ఇపుడో క్రియకుఁ గర్తృత్వార్థమందు నుజీవర్ణకము విధింపఁబడ్డది యని భేదము తెలిసికొనవలయు( (౧) జాతి (౨) వ్యక్తి (౩) సంఖ్యా (౪) కాల (౫) కారకంబులైదును ధాతువునకే యర్థములనియు, దీనిమీఁద ప్రత్యయము తాదృశార్థస్ఫుటీకరణములో సహాయమగునని యు (ద్యోతకము) క్రి పరి. ౨ సూత్రము వివరించుతఱిని చెప్పఁబడియె. కావున ధాతువునకు సహజార్థమైన కర్తృత్వమును నుజీవర్ణకంబు స్ఫుటీకరించునని (ద్యోతకమని) తెలియందగినది.

ఉ—'వాఁడు చూడవలయు' అన్న వాక్యంబునకు వాఁడు చూచుట యావశ్యమని యర్థము. "వాఁడు" అన్న శబ్దము చూచుధాతువునకుఁ గర్తగా నన్వయించును

చూచెన్' అనునది వలయుధాతువునకుఁ గర్తగా సంబంధించునని యొప్పుచున్నది. ఇట్లు 'వారలు చూడఁగావలయు, ఇత్యాదివాక్యములయందు 'వారలు' అన్న బహువచనాంతము చూచుధాతువుతోడను' చూచుధాతువు కర్తగావలయు ధాతువుతోడను నన్వయించును గావున వలయుధాతువు సదా యేకవచనాంతముగానే యుండునని తెలియుండగు— గీ॥ నిన్ను నిత్యసత్యనిరతుఁగా నెఱిఁగి యీ కార్యమునకు వలనుగలుగు నెఱిఁగి పనుపవలసె దూతభావము పేక్షించి। దేవహితము దీని దీర్పవలయు॥ ఆ౫. ౩౪౹ క॥ అనునది యట్టిద దైవము డిగనిచ్చినయవ్వరంబుసప్పనెమనకున్ । విగతభయ వాసయోగ్యం। బుగనొక్కెడఁ జెప్పుమిపుడ పోఁగవలయున్॥ విరా ౧ ఆ॥. గీ। వలదుకుక్కలవిడువంగ వలవదేయ। నడిచి మొలపిడియమ్ముననఁ బోనువవమ్ము। బంకమున గొరిజదిగఁబడి పఱవలేవు। మన్నులివ్వేళ రేగటిమన్నులందు। మను ౪ ఆ. వచ్చుధాతువువలయ్యాదులలోనిదని తెలియందగినది. కనుకనే యీపద్యములోని సాధువశబ్దము 'వచ్చు' నదుఁ గర్తయైనది ఇట్లు చను. అగ ఇత్యాదులు గీ॥ చనునె? యిట్టిపలాడ సజ్జనులకాఁడు॥ పుట్టువులతోడ నీవును బుట్టినాఁడవట్టుగాక యహీనవంశాభిజాతనైన ప్రతివ్రతనసు నన్ను నడుగఁ దగునె॥ విరా ౨ ఆ॥ గీ॥ ధర్మదేవత నీమసత్కర్మమునకు। మెచ్చి యెంతయుఁ బ్రీతిమై నిచ్చినట్టి వరముగలుగంగ మన మేమివర్తనమున నెచటనుండిన నొరులకు నెఱుఁగనగునె? విరా ౧ ఆ॥ (మూలము) సకర్మకంబులనుస్వరూపప్రేరణార్థంబులు రెండును గొనుపద్యమబంధంబులం దొక్కొక్కటితోడ రెంటితోడం గూడుచోనగునవి గాఁబుం గూడ రూపంబు లేమినయ్యే। వాని సొరది నుదాహరించెద.

(పైసూత్రవృత్తియందు)

కర్త్రర్థకము.

మైత్రుఁడు - వంటకమును-వండెను

ఆత్మనేపదకర్త్రర్థకము.

మైత్రుఁడు - వంటకమును - వండుకొనియెను

కర్మార్థకము.

మైత్రునిచేత - వంటకము - వండఁబడియెను

ఆత్మనేపదకర్మార్థకము.

మైత్రునిచేత - వంటకము - వండుకొనఁబడియెను

ప్రేరణకర్త్రర్థకము.

చైత్రుఁడు - మైత్రునిచేత - వంటకమును - వండించెను

ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము.

చైత్రుఁడు - మైత్రునిచేత - వంటకమును - వండించుకొనియెను

ప్రేరణకర్మార్థకము.

చైత్రునిచేత - మైత్రునిచేత - వంటకము - వండింపఁబడియెను

ప్రేరణాత్మనేపదకర్మార్థకము.

చైత్రునిచేత - మైత్రునిచేత - వంటకము-వండించుకొనఁబడియెను

వ్యా॥ సకర్మకమైన వండుధాతువునకు స్వరూపార్థమందు నాలుగురూపంబులు నిరూపింపఁబడును.

స్వరూపార్థకరూపము. వండెను (౧)

అనఁగా ప్రేరణార్థములేనిది

ఆత్మనేపదార్థమందుఁ గొన్వనుబంధ మొక్కటియే

చేర్పఁగా........................వండుకొనియె (౨)

కర్మార్థవివక్షయందుఁ బడ్వనుబంధం బొక్కటియే

చేర్పఁగా........................వండఁబడియెను (౩

రెండును గూడుచో అనఁగా

ఆత్మనే పదకర్మార్థము లుభయంబును వివక్షింపఁబ

డఁగా........................వండుకొన బడియెను (౪)

ఇట్లు స్వరూపార్థకరూపంబునకుఁ గొనుపడుశబ్దంబులలో నేకైకశబ్దసంఘటనచేతను, నుభయశబ్దసంఘటనచేతను మూఁడురూపంబులగు.

ఇంకను సకర్మకమైనవండుధాతువునకు ప్రేరణార్థమందు నాలుగురూపంబులును జూపంబడును.

ప్రేరణార్థకరూపము—వండించెను. (౧)

ఆత్మనేపదార్థమునకుఁ గొనుశబ్దంబగు నొక్కటియే
చేర్పఁగా... .......... .........వండించుకొనియెను.

కర్మార్థవివక్షయందుఁ బడుశబ్దం బొక్కటియే
చేర్పఁగా......... ..............వండింపఁబడియెను.

ఆత్మనేపదకర్మార్థము లుభయంబును వివక్షింపఁబ
డఁగా........................వండించుకొనఁబడియెను.

ఇట్లు స్వరూపార్థకము (వండెను) ప్రేరణార్థరూపము (వండించెను;) అన్నవిగాక తక్కినవి కొనుపడుశబ్దంబులు పర్యాయముగా ఘటనచేతను యౌగపద్యముగా ఘటనచేతను ౬ రూపంబులగు.

స్వరూపప్రేరణార్థకరూపంబులు రెండును గూడఁగా నన్నియు నెనిమిదిరూపంబులు పైనిం జూపినవిధంబునఁ దెలియందగు.

(౫౭ సూ—చే, కొనుధాతువును ౮౬ సూ—చే, పడుజియుఁ జేర్పఁబడును)

123 సూ—గతిబుద్ధిప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మకంబుల కప్రేరణంబునం గర్తయగునది ప్రేరణంబునం గర్మంబగు.

పొందుమొదలయినవి గత్యర్థకంబులు ॥ తెలియుమొదలయినవి బుద్ధ్యర్థకంబులు ॥ తినుమొదలయినవి ప్రత్యవసానార్థకంబులు ॥ విను - చెప్పు - చదువు - మొదలయినవి శబ్దకర్మంబులు ॥ అకర్మకంబులు

ప్రసిద్ధంబులు ॥ మైత్రుండు గ్రామంబుం బొందెను - చైత్రుండు - మైత్రుని గ్రామంబుం బొందించెను । లాంతిపోసహిత మిత్కార్యంబు గానంబడియెడి మైత్రుండు పుడమి నేలెను - చైత్రుండు మైత్రుని పుడమి నేలించెను.

వ్యా—"యేగత్యర్థకాః, తేప్రాప్త్యర్థకాః" (గమనార్థకధాతువులుపొందుట యన్న యర్థమిచ్చును) అని వైయాకరణుల సమ్మతియున్నందునఁ బొందు మొదలైనవి శేఖరాది గ్రంథకర్తలమతంబున "సుఖంప్రాప్తః" ఇత్యాదులందుం గాక తక్కినచోట్ల గమనములేక తమయర్థము సంభవింపనందున గత్యర్థకములు॥ ప్రత్యవసానంబు = భక్షణంబు॥ శబ్దము కర్మకారకంబుగాఁ గల ధాతువులు శబ్దకర్మంబులు నాఁబడు॥ మాటను వినెను. పాఠమును జెప్పెను ఇత్యాదివాక్యములందు కర్మార్థక ద్వితీయాంతములైన మాటయుఁ బాఠమును అక్షరరూపమైన ధ్వనులే కాన, విను-చెప్పు ఇత్యాదులు శబ్దకర్మంబులయ్యె. అకర్మకధాతువులు సంస్కృతవ్యాకరణవ్యాఖ్యాతలు శ్లోకంబున సంగ్రహముగాఁ జెప్పియుండిరి. వాని నిందుం బొందుపఱుచుచున్నాము॥ శ్లో॥ (౧) వృద్ధి (౨) క్షయ (౩) భయ (౪) జీవిత (౫) మరణం। (౬) లజ్జా (౭) సత్తా (౮) స్థితి (౯) జాగరణం (౧౦) శయన (౧౧) క్రీడా (౧౨) రుచి (౧౩) దీప్త్యర్థం ధాతుగణం తమకర్మకమాహుః వర్ధిల్లుట, క్షీణించుట, భీతిల్లుట, జీవించుట, చచ్చుట, లజ్జించుట, ఉండుట, నిలుచుట, మేల్కొనుట, శయనించుట, క్రీడించుట, రుచించుట, ప్రకాశించుటయీయర్థములుఁగలధాతువులకర్మకంబులనని యర్థము. సూత్రార్థము—గత్యర్థకాది పూర్వోక్త ధాతువుల ప్రయోగములలోఁ బ్రేరణార్థము లేనియపుడు కర యైనది ప్రేరణార్థసమావేశమందుఁ గర్మంబగును. "ఉ. మైత్రుండు గ్రామంబుం బొందెను" ఇటఁ బొందుధాతువునకు స్వరూపార్థము ఈదృశయగు మైత్రుండు కర్తయైనట్లు స్పష్టపడుచున్నది. "చైత్రుండు మైత్రునిం గ్రామంబుం బొందించెను" ఇటఁ బొందుధాతువునకు ౭౦వ సూత్రమునఁ బ్రేరణార్థవం దేంచ క్కయ్యె. కానఁ బ్రేరణంబు లేని పూర్వవాక్యంబులోఁ గర్తయైన మైత్రుండు ప్రేరణంబుగల యీవాక్యంబులోఁ బ్రకృతసూత్రంబునఁ గర్మంబైనందునఁ దద్వాచక మైత్రశబ్దము ద్వితీయాంతమాయెనని

ఇట నీసూత్రము లేకుండనే మైత్రాదులుకర్మంబులై ద్వితీయనొందునని యిట్లు శంకింతురు. ఉదా—"చైత్రుండు మైత్రునిం గ్రామంబుం బొందఁగాఁ బ్రేరేచెను" ఈవాక్యంబులోఁ బ్రేరేచుధాతువు సకర్మకంబు గాన నీవాక్యంబునకు మైత్రుఁడు కర్మకంబై కార. పరి ౨౧ సూత్రమున మైత్రశబ్దము ద్వితీయాంతమగుట కరతలామలకంబుగాఁ గానిపించెడిని. కాన "ప్రేరేచు" నను నీవాక్యంబులో మైత్రుండు గర్మంబైనట్టులే, చైత్రుండు మైత్రునిం గ్రామంబుం బొందించెను॥ అన్నవాక్యములో సహితము ప్రేరేచుధాతువునకుఁ బర్యాయశబ్దంబై పొందుధాతువుకంటెఁ బ్రేరణార్థకమైన యింముగాగమంబున్నందునఁ బూర్వవాక్యంబునందుం బలె నిటను మైత్రుండు కర్మం బగుట న్యాయసిద్ధంబగుచుండఁ బిష్టపేషణంబుగా నీసూత్రారంభ మనావశ్యకంబని వక్కాణించుచున్నారు. అదియుక్తంబు; కాని దేవదత్తుఁడు అన్నమును వండుటకై యజ్ఞదత్తునిం బ్రేరేచెను. అన్నవాక్యమందుకూడఁ బూర్వవాక్యమందు మైత్రుండు వోలె నిట యజ్ఞదత్తుండు "ప్రేరేచు" నకుఁ గర్మంబైనందునఁ బ్రేరణేంచుగాగమాంతమైన పొందించుధాతువునకు మైత్రుండు గర్మంబై "చైత్రుండు మైత్రునిం గ్రామంబుంబొందించెను" అన్నట్టులే యిటఁ బ్రేరణేంచుగాగమాంతమగు వండించు ధాతువునకు యజ్ఞదత్తుండు కర్మంబై "దేవదత్తుండు అన్నమును యజ్ఞదత్తునివండించెను (వండఁబ్రేరేచెను") అన్న యనిష్టప్రయోగంబు సంభవించును. కావున నీసూత్రారంభ మావశ్యకంబు. పైనింజూపినవిధంబునఁ బ్రకృతసూత్ర మక్కరలేకయే యీలెడలను బ్రేరణేంచుగాగమాంతస్థలంబులలోఁ గర్తృకర్మంబగుచున్నందున "ప్రాప్తే సత్యారభ్యమాణో విధిర్నియమాయ భవతి" [ప్రాప్తించుచుండఁగాఁ జేయంబడిన సూత్రము నియమముకై యగును] అన్నన్యాయంబున నిపుడీసూత్రము నియమార్థమగును. "గత్యర్థకాదిధాతువులే ప్రేరణేంచుక్కగలవియైనపుడు కర్తృగర్మంబగును గాని తక్కినధాతువులు ప్రేరణేంచుక్కగలవియైనను గర్తృకర్మంబుగాదు" అనిన నియమంబీ సూత్రమున్నచోఁ జేర్పడును. ఇపుడు వండు మొదలయిన తక్కినధాతువులు ప్రేరణేంచుక్కగలవియైనను యజ్ఞదత్తుఁడు కర్మంబుగాక కర్తగానే యుండి యాఖ్యాతముచేతఁ జెప్పఁబడనందున [విధి కృతిఙైన క్రియచేత ప్రథమాంతార్థమై దేవదత్తుండే యాకాంక్షితుండై యజదత్తుండట్లు గానందున] కార. పరి. 3_సూత్రంబున ననభిహితుఁడైన

యజ్ఞదత్తునిం దెలుపువట్టి యజ్ఞదత్తశబ్దంబుకంటెఁ దృతీయావిభక్తి గలిగి "దేవదత్తుఁడు యజ్ఞదత్తునిచే వండించెను" అనిన ప్రయోగమగునని యెఱుంగునది. ఈసూత్రము నిఃమార్థమని సంస్కృతవ్యాకరణ వ్యాఖ్యానములలోను నహోబల పండితీయము లోను వ్రాయంబడినది. సంస్కృతవ్యాకరణంబులో దీనిమాతృకసూత్రమునొద్ద నైదు విధములైన ధాతువులును బ్రేరణార్థకములైనపు డైదుదాహరణంబులును స్పష్టార్థమీ శ్లోకంబునం జూపంబడినవి. శ్లో॥ శత్రూనగమయత్స్వర్గం। వేదార్థం స్వానవేదయత్। ఆశయచ్చామృతం దేవాన్వేదమధ్యాపయద్విధిం। ఆసయత్సలిలేపృథ్వీం యస్సమే శ్రీహరిర్గతిః॥ దీనికిఁ బ్రతిబింబంబుగాఁ బద్యంబొనర్చి యీయుదాహరణపంచకంబు చూపంబడును. క॥ అరులం బొందించెను సుర పురి; స్వీయుల శ్రుతులయర్థమును నెఱుఁగించెన్;। సురలం ద్రావించెసుధన్;। సరసీజాసనుని శ్రుతులఁ జదివించె; వసుంధరనీటనుంచె నేశ్రీ హరి; యాతఁడు నాకు శరణమనలక్ష్యములౌ॥ చ॥ ననుజిగురాకు మేయఁ దతినోరికలంకులఁ దేటికుట్టినన్। నవరుహశాఖలం గువకువధ్వనిఁ బాఱుపికాంగనంబికం। బనవయమొప్పమాన్పగతి నాత్మముఖంబు ముఖంబుఁగూర్చిచుం।బనమొనరించెసందుసుడిమాయలుగా మగవారికృత్యముల్॥ వసు. 3ఆ. ఇటఁ గూడుధాతువు పొందుధాతువునకుఁ బర్యాయము. క్రి. పరి. ౮౦ సూత్రమున కూడించు కూర్చుటలు ప్రేరణారూపంబులు. [పురుషపికంబుతనమోమును (భార్య) మోమునఁగూడునట్లు చేసి అనిర్వ్యాకర్మకము]వ। కపటపునిద్రవోవుతఱిఁ గౌఁగిటనానుచు మోవిమోవిఁజేరుపుచును గొన్నిరాత్రులు వరుందనియించె లతాంగియంతఁ దా। త్కపటముగాంచియుం గననికైవడి నట్లయొనర్చెఁ గొన్నిరే। లపుడతఁడాపలేక నగవల్లనతానును నవ్వె నేడ్కతోన్॥ కళా 2 ఆ॥

(మోవిని మోవిని జేరువట్లు చేయుచును)

మ॥ అవిచారంబని పల్కనోడుదుము ధర్మాభిజ్ఞనీయగ్రసం। భవుఁడష్యున్నతశక్తియుక్తుఁడు మహీభారప్రగల్భుండు భా। గవదౌహిత్రుఁడు పాత్రుఁడీయదుఁడు లోకఖ్యాతుఁడుండంగనీ। భువనేశత్వభరంబుఁ బూన్పదగునే పూరున్ జఘన్యాత్మజున్। భార, ఆది. 3ఆ "జడల్ పూనన్" భార, శా. 2ఆ. ఇత్యాదిస్థలంబులలోఁ బూను

ధాతువునకుఁ బొందుట, ధరించుట, యనునర్థములు సందర్భవశంబున నున్నందునవిచ్చటను 'బూను' నకు పొందుట యర్థము చెప్పనలయు. అందున పొందించుట యర్థమిచ్చునట్టి పరిష్కృతపద్యములోని ప్రేరణార్థకపూన్చు ధాతువు సమావేశంబునఁ బూరుండు గర్మంబగును. వహించుటయర్థము చెప్పుకొన్నచో "నీవహోర్ష"అనువా-చే ప్రేరణార్థకణిజంతవహధాతుసమావేశమందుఁ గర్తకుఁ గర్మత్వనిషేధమున్నందునవిచ్చటనుబూరువు కర్మంబుగాక కర్తయై యనభిహితుఁడైనందున (విభక్త్యంతక్రియచే నాకాంక్షితుఁడు కానందున) కార. పరి. 3 సూత్రముచేతఁ దృతీయావిభక్తి వచ్చి "పూరుచే" అని ప్రయోగింపవలసివచ్చును. పూనునకాదివర్ణలోపము రాఁగా నూనునకు ధరించు ఇత్యాద్యర్థములు శబ్దరత్నాకరమందు॥ ఈప్రయోగంబు ప్రామాదికంబని చెప్పవలసివచ్చును కావనిట సందర్భవశంబునఁ బూన్చునకుఁ బొందించుట యర్థంబని యూహించునది "భీష్ముండు ధర్మజునకు ధర్మంబుల వినిపించెన్; జనని పుత్రునకు నన్నమును దినిపించెన్" ఇత్యాది ప్రయోగంబులు కార. పరి. ౨౧ సూత్రమునను, లేక "అన్యస్యాశ్వచిచ్ఛవేచ్ఛానా" అన్న నన్నయభట్టీయ సూత్రమునను గర్మార్థమందు ధర్మజ, పుత్రశబ్దములకంటె షష్ఠివచ్చి సాధువులయినవని తెలియందగు. అథవా "కన్యాదియోగంబునం బ్రయోజ్యకర్తకు షష్ఠినిత్యంబుగానగు॥ అనినసూత్రంబున నిచ్చట విను, తినుల సమావేశంబునందు "ధర్మజ, పుత్రులకు" షష్ఠియయ్యె.

124 సూ—అనభిహితకర్తకొకానొకచో షష్ఠి బహుళంబుగానగు.

రాముఁడు మిథిలంగనియె ॥ రామునకు మిథిలగనంబడియె - రామునిచే మిథిలగనంబడియెను ॥ మైత్రుండుతత్త్వంబుం దెలిసెను - చైత్రుండు మైత్రునకుం దత్త్వంబుదెలిపెను ॥ కన్యాదియోగంబునం బ్రయోజ్యకర్తకు షష్ఠినిత్యంబుగానగు - విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించెను - కృష్ణుండర్జునునకు విశ్వరూపంబుం జూపెను.

అకర్మకంబున కప్రేరణంబునం దాత్మనేపద కర్మానుబంధంబులు లేమిం జేసి రూపభేదంబు లయిదని యెఱుఁగునది.

కర్త్రర్థకము.

మైత్రుఁడు - మనియెను

ప్రేరణకర్త్రర్థకము.

చైత్రుఁడు - మైత్రుని మనిచెను

ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము

చైత్రుఁడు - మైత్రుని - మనుచుకొనియె

ప్రేరణకర్మార్థకము.

చైత్రునిచేత - మైత్రుఁడు - మనుపఁబడియె

ప్రేరణాత్మనేపదకర్మార్థకము.

చైత్రునిచేత - మైత్రుఁడు - మనుచుకొనఁబడియె

వెండియుఁ బ్రేరణంబునం దించుగాగమంబు గలిగినచో సకర్మకంబునకుఁ బండ్రెండు నకర్మకంబునకుం దొమ్మిదియు భేదంబులని యూహించునది.

వ్యా—ఆఖ్యాతముచేత (ప్రశ్నాంతమైన యెవ్వఁడు, ఏది ఇత్యాదిశబ్దముల ద్వారమున) నాకాంక్షితము కాని యట్టి కర్తకు కార. పరి. 3 సూత్రముచేత చేతవర్ణకంబు ప్రాప్తంబు చుండఁగా నీసూత్రంబు దానికి బాధకంబుగా నారంభింపఁబడియె.

ఉదా—"రామునకు మిథిలగనంబడియె" ఇట సకర్మకమైనకనుధాతువుకంటె క్రి. ప. ౪౯ సూత్రమున కర్మార్థమందుఁ బడుశబ్దవర్ణకంబు విధింపఁబడి "రాముఁడు మిథిలంగనియె" అన్న కర్తృప్రయోగవాక్యములోఁ గర్మంబైన మిథిలానగరము కర్మప్రయోగవాక్యములో నాఖ్యాతముచేత నభిహితమైనందున (ఏదికనఁబడెను అని ప్రశ్నాంతకింశబ్దముచేత నాకాంక్షితమైనందున) కార. ప. ౧సూత్రముచేత నుక్తార్థమందుఁ బ్రథమయును కర్తయైన రాముఁడు ఆఖ్యాతముచేత నభిహితుండు కానందున కార. పరి

కి సూత్రముచేత ణ్యర్థకంబును బ్రాప్తించుచుండఁగా నీసూత్రంబుచే తదర్థకంబునకు మాత్రము బాధకంబై షష్ఠివచ్చి పైవిధంబుగా వాక్యంబయ్యె. ఇది బహుళంబుగాఁ బక్షంబునఁ దృతీయయు వచ్చి "రామునిచే"— అనియు బ్రయోగింపందగు. "చైత్రుండు మైత్రునకుం దవ్యంబు దెలిపెను" తెలుపుధాతువు తెలియుధాతువు ప్రేరణంబుగాన [బుద్ధ్యర్థకము] ౧౨౩ సూత్రముచేత మైత్రుండు కర్మంబగుట ప్రాప్తించుచుండఁగా నీసూత్రంబున బాధింపఁబడి షష్ఠివచ్చినదని యెఱుంగఁదగ్గది. సూత్రములోని బహుళగ్రహణమున నొకానొకచో ద్వితీయయునగు. ఉదా. క॥ కడుఁబ్రదవుని బ్రబోయితి॥ బడఁతీ! నను దెలుపవలదె బరియుఁడొకరుఁడె కృష్ణుఁ జనమునఁబట్టిబలు॥ బెదలఁగ వసుదికి చెనాతఁడెన్వఁడు సెప్పుమా॥ భా. ఆర. ౭ ఆ. "కన్యాదియోగంబునన్" అన్నసూత్రంబునకుఁ దాత్పర్యమేమనఁగా సంస్కృతవ్యాకరణంబున "హృక్రోః" అనువార్తికముచేతఁ బ్రేరణార్థకమాసీజంతహృక్రిధాతువు సమావేశంబునఁ గర్తకుఁగర్మత్వము విధింపఁబడి "దర్శయతి హరింభక్తాన్" (మైత్రుఁడు హరిఁ భక్తులను జూపెను; ఇది ప్రతిపదార్థాంగ్రేకరణము) అని యప్రేరణంబునఁ గర్తలైన భక్తులు (భక్తాహరింపశ్యంతి-భక్తులు హరినిఁ జూచుచున్నారు) ఇపుడు ప్రేరణంబునఁ గర్మంబగుట యుదాహరింపఁబడియె. సంస్కృతవ్యాకరణానుసారంబుగా నాంధ్రభాషయందుం జూడ గత్యర్థకధాతువులకుఁ బ్రేరణంబునన ప్రేరణమునందలి గర్త కర్మంబైనట్టులే దృశ్యర్థకధాతువులకుఁ గూడఁ బ్రేరణంబున నప్రేరణంబందలి కర్త కర్మంబగుట ప్రసక్తమగుచుండ నీసూత్రముచేతను సూరిగారు షష్ఠిని విధించుచుండిరని యెఱుంగనది. ఉ. విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించెను. ఇటనప్రేరణంబునఁ గర్తయైన రామునకు (రాముఁడు మిథిలం గనియె) నీవాక్యంబున షష్ఠి వచ్చెను. కను, విను, తిను ఇత్యాదులు కన్వాదులు కనుధాతువునకుఁ బ్రేరణంబున ౭౦ సూ-చే నింపుక్కును ౭౭ సూ-చేత ఁబుగాగమంబును ౭౩ సూత్రము క్రిందివాక్యముచేత నకారంబునకు దీర్ఘత్వమును ౮౫ సూ-చేత, నుకారముమీఁది యుకారమునకు నిత్యంబును గలుగంగా "కానిపించు" అగును. ఈధాతువునకుఁ బ్రేరణార్థమే కాకుండ "ప్రత్యక్షమగు" అని యకర్మకార్థంబును గలదు. ఉ॥ కానిపించి యేమికావలయును వరం। బడుగుమనిన నేను నాత్మశక్తి। కొలఁది నతులు నుతులు సలిపెదుంబురుగాన। కలవవలన గెలువవలయునంటి॥ కళా. ౨ ఆ. ఇట్లె రెండవయుదాహరణమందును నర్థనశబ్దంబుమీఁద షష్ఠియయ్యె "మా

"పెను" యనుదానికి క్రి. ప. ౭౬ సూ-చే బుగాగమంబు గలిగి యువర్ణంబు లోపింపఁగానైనది.

(సూ) అకర్మకంబున కప్రేరణంబునం దాత్మనేపదకర్మానుబంధంబులు లేమిం జేసి రూపభేదంబు లేదని యెఱుంగునది.

వ్యా—అకర్మకధాతువునకుఁ గర్మసంబంధము లేనందునఁ గర్మార్థమందు ౪౯ సూ-చే విధింపఁబడు "పడుజి" "కొను" ఇత్యాద్యకర్మకధాతువులకుఁ జేర్పఁబడదు. ఆంధ్రభాషాశైలిం జేసి యకర్మకంబులగు మనుప్రభృతిధాతువులకుఁ "గొను" అన్న యాత్మనేపదానుబంధంబును జేర్పఁబడదని తెలియవలయు. ఒకానొకచో నకర్మకధాతువునకు నయితము పడుజికొనులు ౧౦౯ సూత్రమున స్వార్థమందు సూత్రము. రావచ్చును నిలఁబడు పండుకొను ఇత్యాదులు.

## కర్త్రర్థకము,

| | |
|---|---|
| మైత్రుండు మనియెను | ఇది యకర్మకంబు గాన నాత్మనేపదచిహ్నంబగు కొనుశబ్దమును కర్మార్థలాంఛనంబైన పడుజియు లేనందున నొక్కటియే రూపంబు. |
| ప్రేరణ కర్త్రర్థకము చైత్రుండు మైత్రుని మనిచెను | క్రి. ప. ౭౩ సూ-మున ముక్కను ౬౫ సూ-మున నుకారముమీఁది యుకారమున కికారంబును గలిగెను. |
| చైత్రుండు మైత్రుని మనుచుకొనియె. | ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము. ప్రేరణంబున సకర్మకమైనందునఁ "గొను" అను నాత్మనేపద చిహ్నము చేర్పవచ్చును |
| చైత్రునిచేత మైత్రుండు మనుపఁబడియె | ప్రేరణకర్మార్థకము. ప్రేరణంబు సకర్మకమైనందున "పడు" అను కర్మార్థచిహ్నంబు చేర్పవచ్చును. |
| చైత్రునిచేత మైత్రుండు మనుచుకొనఁబడియె | ప్రేరణాత్మనేపదకర్మార్థకము సకర్మకము గనుక నుభయంబును కొనుపడుజులు చేర్పంబడియె. |

ఇట్లెల్ల యకర్మకధాతువులకును, అప్రేరణంబునందు అనఁగా స్వరూపార్థమందు నాత్మనేపదకర్మానుబంధములు లేనందున నేకవిధమైన రూపంబును, ప్రేరణార్థ

మందు ప్రేరణరూపంబును (౧) కొనుపకముబులు వేర్వేఱుగాఁ జేర్చుటంజేసి (౨) రూపంబులును నుభయంబును జేర్చుటంజేసి (౧) రూపంబును మిళితంబై యైదురూపంబు లేర్పడు. (మూలము) రెండిటయుం బ్రేరణంబునందు నిందుగాగమంబు గలిగినచో సకర్మకంబునకుం బండ్రెండును నకర్మకంబునకుం దొమ్మిదియు భేదంబులని యూహించునది.

వ్యా— మొదటి ప్రేరణార్థమందుఁ ఇుగాగమంబును తిరిగి ప్రేరణార్థమందు నిందుగాగమంబును గాగనేని సకర్మకధాతువునకు ద్వాదశరూపంబులు నకర్మకధాతువునకు రూపనవకంబును నగును. క్రి. పరి. ౮౪ సూత్రమ్మునఁ బ్రేరణేంముక్కకంటెఁ దిరిగి ప్రేరణేంముక్క సంభవింపనేరదు గానఁ బ్రేరణముక్కకంటె ప్రేర. ణేంముక్క రావచ్చునని భావము. ఈవఱలోఁ బ్రేరణముగాగమరూపంబులలోఁ గూడ నకర్మకమైన వనుధాతువునకు నైదురూపంబులు చూపంబడియె. తిరిగి ప్రేరణంబునఁ జుగాగమాంతరూపంబుకంటె నిముక్క చేసి నాల్గురూపంబులును నిరూపింపంబడును.

(౧) యజ్ఞదత్తుండు చైత్రునిచేత మైత్రుని మనిపించెను. పునఃప్రేరణకర్త్రర్థకము. ఇట నాఖ్యాతముచేత యజ్ఞదత్తుం డభిహితుండై చైత్రుండనభిహితుం డగుటంజేసి కార. పరి. 3 సూత్రమ్మునఁ జైత్రశబ్దంబుకంటెఁ జేతవర్ణకంబయ్యె.

(౨) యజ్ఞదత్తుఁడు చైత్రునిచేత మైత్రుని మనిపించుకొనియె (పునఃప్రేరణాత్మనేపదకర్త్రర్థకము)

(3) యజ్ఞదత్తునిచేత చైత్రునిచేత మైత్రుండు మనిపింపఁబడియె. (పునఃప్రేరణకర్మార్థకము) ఇటఁ గర్మార్థకమైన యాఖ్యాతంబుచేతను గర్మంబైన మైత్రుండభిహితుఁడై ప్రయోజకప్రయోజ్యులైన యజ్ఞదత్తచైత్రులిరువురును ననభిహితులైనందున కార. పరి. 3 సూత్రమున యజ్ఞదత్తచైత్రశబ్దములకంటెఁ జేతవర్ణకంబులు గలిగె. మైత్రుం డభిహితుండైనందున సుక్తార్థమందుఁ బ్రథమాసూత్రమ్మునఁ బ్రథమావిభక్తియయ్యె.

(౪) యజ్ఞదత్తునిచేతఁ జైత్రునిచేత మైత్రుండు మనిపించుకొనంబడియె. (పునఃప్రేరణాత్మనేపదకర్మార్థకము) వినుకటికిఁగానే తృతీయాప్రథమావిభక్తులు దద్విధాయకసూత్రమ్ములఁ గలుగు నని యూహించునది.

సకర్మకధాతువులనుం గూడఁ బ్రేరణార్థములు రెండింటియందు నుపయోగించి పండ్రెండురూపంబులను స్పష్టార్థముదాహరించెద.

(౧) మైత్రుండు దత్త్వంబుం దెలిసెను (కర్త్రర్థకము) (౨) మైత్రుండు దత్త్వంబుం దెలిసికొనెను (ఆత్మనేపదకర్త్రర్థకము) (౩) మైత్రునిచేతఁ దత్త్వంబు తెలియంబడెను. (కర్మార్థకము) (౪) మైత్రునిచేతఁ దత్త్వంబు తెలిసికొనంబడియెను (ఆత్మనేపదకర్మార్థకము) (౫) చైత్రుండు మైత్రునకుం దత్త్వముం దెలిపెను (ప్రేరణకర్త్రర్థకము) ఇట క్రి. పరి. ౧౨౪ సూత్రమునఁ బ్రయోజ్యకర్తయైన మైత్రునిఁ జెప్పునట్టి మైత్రిశబ్దమునకు షష్ఠి గలిగినది. (౬) చైత్రుండు మైత్రునకుం దత్త్వంబుం దెలుపుకొనెను (ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము) (౭) చైత్రునిచేత మైత్రునకుం దత్త్వంబు తెలుపంబడియెను (ప్రేరణకర్మార్థకము) (౮) చైత్రునిచేత మైత్రునకుం దత్త్వంబు తెలుపుకొనంబడియెను (ప్రేరణాత్మనేపదకర్మార్థకము) (౯) యజ్ఞదత్తుండు చైత్రునిచేత మైత్రునకుం దత్త్వంబుం దెలిపించెను (పునఃప్రేరణకర్త్రర్థకము) (౧౦) యజ్ఞదత్తుండు చైత్రునిచేత మైత్రునకుం దత్త్వంబుం దెలిపించుకొనియెను (పునఃప్రేరణాత్మనేపదకర్త్రర్థకము) (౧౧) యజ్ఞదత్తునిచేత చైత్రునిచేత మైత్రునకుం దత్త్వంబు తెలిపింపంబడియెను. (పునఃప్రేరణకర్మార్థకము) (౧౨) యజ్ఞదత్తునిచేతఁ జైత్రునిచేత మైత్రునకుఁ దత్త్వంబు తెలిపించుకొనఁబడియెను. ఇట్లు తక్కినసకర్మకంబులకు నూహ్యంబులు.

ఇది క్రియాపరిచ్ఛేదము.



# కృదంతపరిచ్ఛేదము.



1 సూ—కృత్తులకర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు.

ధాతువునకు విహితంబగుచున్న ప్రత్యయంబు కృత్తనంబడు కృత్తులకువక్ష్యమాణంబులకు భావకర్తృకర్మాద్యర్థంబులు మహాజనవ్యవహారానుసారిగా నెఱుంగునది. ।ఆఁక - బంధనము మొలక - నవోద్భిదము ॥ ఏలిక - పాలకుఁడు ॥ కోరిక - వాంఛయు వాంఛితంబును మూఁక - సంఘము ఆడిక - నింద ॥ ఓడిక - పోత్రస్సు.

వ్యా—కృత్ప్రత్యయంబులకు భావకర్త్రర్థంబులు పెద్దల వ్యవహారమును ననుసరించి తెలియందగినవి. కాని సూత్రంబులలో నాయాయియర్థములం దేర్పాటుగాని, క, ఇక, ఇత్యాదికృత్ప్రత్యయంబులు విధింపఁబడవని భావము.

ఈతాత్పర్యమే "కృత్తులకు వక్ష్యమాణంబులకు భావకర్తృకర్మార్థంబులు మహాజనవ్యవహారానుసారిగా నెఱుంగునది" అని మూలమందే వివరణము చేయఁబడినది.

(మూలము] ధాతువునకు విహితంబగుచున్న ప్రత్యయంబు కృత్తనంబడు

వ్యా—"ధాతువునకు" అనిన క్రియాపరిచ్ఛేదమందలి ప్రథమసూత్రము క్రియాపరిచ్ఛేదమందే కాకుండఁ గృదంతపరిచ్ఛేదంబునందుం గూడ నధికారసూత్రముగా వర్తిల్లునని భావము. కృత్ప్రత్యయంబునకు లక్షణంచేమనఁగా దుశ్, దు, వు, దు, ను. ముష్ అనునవి దక్క ధాత్వధికారమందలి ప్రత్యయంబులు కృత్తులు నాఁబడునని యర్థము. దుజ్జులోని దువర్ణంబును ముషులోని షకారంబులోఁ గూర్పఁగా "దుష్" అనిన ప్రత్యాహారం బేర్పడినది. [క్రి. ప. ౧ సూ] సూరిగారిచేత "కృదతిజ్" అనిన

పాణినీయసూత్రమే యాంధ్రీకరించి యిట్లు వ్రాయఁబడినది యని తెలియందగు. భావార్థకర్త్రర్థంబుల కుదాహరణము. ఆఁక క॥ బంధనము. ఇట అడ్డగించు అర్థముగలయాఁగు ధాతువుకంటె నీపరిచ్ఛేదములో 3 సూత్రముచేతఁ గవర్ణకము రాఁగా "ఆఁగు + క" ఇట్లుండె. కవర్ణము పరమగుచుండ ధాతుగుకారమునకు ౨ సూత్రముచేతను లోపంబై "ఆఁక" యయ్యె దీనికి నడ్డగించుట యర్థము గాన భావార్థమున కుదాహరణము. ఉదా "మొలక" నవోద్భిదము; దీనికిఁ బర్యాయపదంబుగా నిచ్చిన "ఉద్భిత్" అను శబ్దము "ఉద్భినత్తి భువంబీజంచ" [భూమిని బీజమును భేదించి వెలువడునది] యన్న యర్థమందు "సత్సూద్విష............భిదచ్ఛిదజననీరాజాముపసర్గేపిక్విప్ అ3 పా ౨ సూ ౬౧] అనుపాణినీయసూత్రంబున ననువర్తమానకర్త్రర్థమందుఁగ్విప్పు రాఁగానైన రూపంబుగావున మొలక శబ్దంబును మొలుచుధాతువుకంటెఁగర్త్రర్థమందు గవర్ణము వచ్చినది యని తెలియవలయు. ఉద్భిచ్ఛబ్దము ఋత్విగాదులలోనిది గాన నవోద్భిదము అని యయ్యె. ఆఁగు, మొలుచు, ధాతువులకంటె 3 సూత్రమున నొక్కవర్ణకమే విధింపఁబడినను "ఆఁగు" కంటె భావార్థమందును "మొలుచు" కర్త్రర్థమందును నయ్యది యైనట్లు మహాజనవ్యవహారంబున దెలియందగినదే కాని సూత్రంబున విశేషించి యర్థములు చెప్పఁబడవు. మొలక మొలచునది. [మొలచుటకుకర్త] ఇట్లె మూఁగుధాతువుకంటెఁ గవర్ణకము కర్త్రర్థమందుఁ గలిగి "మూఁక" = [సంఘము=మూఁగునది] అయ్యెనని యూహింపవలయు. "ఏలిక" పాలకుఁడు ఏలుధాతువుకంటె ౧౭ సూత్రమున నిక వర్ణకము కర్త్రర్థమందుఁ గలిగె. [ఏలుటకుఁగర్త యని యర్థము] కోరిక వాంఛయు వాంఛితంబును; కోరుధాతువునకు ౧౭ వ సూ-న భావార్థమందు నిక వర్ణకము రాఁగా వాంఛ యర్థమగును. (కోరుట యర్థము) ఆధాతువుకంటెనే కర్మార్థమందు నిక వర్ణకము కలిగియు "కోరిక" యనియగు. దీనికి వాంఛితము అర్థము (కోరఁబడినది); ఆడు [నిందించుట] ధాతువునకు భావార్థమందిక వర్ణకమురాఁగా "ఆడిక" = (నింద] యగును. ఓడిక [=స్రోతస్సు 'ఓడు' నకుఁ గర్త్రర్థమందు' నిక వర్ణకము [ప్రవహించునదియని ప్రవహించు క్రియకుఁ గర్తయైనట్లు తోఁచుచున్నది]; ఇట్టులొక ప్రత్యయమే భావకర్మాద్యనేకార్థములయందు వచ్చుట యర్థమునుబట్టి యూహించునది. ఇట్టి ప్రాతిపదికంబులకర్థములును. నిదర్శనముగాఁ గవి ప్రయోగంబులును, శబ్దరత్నాదినిఘంటువులలో శాఖోపశాఖలుగాఁ బ్రసరింపఁబడును. కావునట్టి వ్యాకరణవిశేషశూన్యశబ్దంబుల

కర్థము నిచ్చట నెత్తి వ్రాయుట యనావశ్యకము. ఏకధాతువునకే భావకర్త్రాద్యర్థవిశేషములయందు నేకప్రత్యయంబే గల్గినను, నొకధాతువునకే ప్రత్యయభేదంబులఁ బ్రాతిపదికార్థభేదమున్నను, వ్యాకరణమ్మునం జేసి రూపవిశేషంబులున్నను, నట్టి స్థలంబుల నెంచి ప్రయోగంబులు ప్రమాణముగా వ్రాయంబడు. ఇచ్చటఁ గోరికశబ్దము భావార్థమందును గర్త్రర్థమందును నిక వర్ణకంబుగలదైనందున నర్థవిశేషములయందుఁ బ్రయోగనిదర్శనమావశ్యకము. క॥ ఈకథ యెవ్వరుచదివినఁ। గైకొన్నరు విన్నఁగోరికను వ్రాసినవా। రేకాలముశంభునికృప। నాకల్పముగందురైహికాముష్మికముల్ ॥ [ఇచ్ఛార్థము; భావార్థము] "తగుకోరికలిచ్చెఁ బులిందకోటికిన్" ఉ. రా. 6 ఆ॥ [వాంఛితము కర్త్రర్థమందు ప్రత్య]

2 సూ—ఇటం గృత్కగతపవేములు పరంబులగునపుడు కగచయవలకు లోపంబగు.

కృత్సంబంధులగు కాదులు పరంబులగునపుడు ధాతువునంతంబులగు కగచయవలకు లోపంబగు ॥ మీఁదిలక్ష్యంబులం జూడంబడు.

వ్యా—స్పష్టము.

3 సూ—కవర్ణకంబులు గ్వాదులకగు.

అలుగు - అలుక ॥ అఁగు - అఁక ॥ ఎఱుఁగు - ఎఱుక - ఇట బిందులోపంబు· ఇట్లు గొన్నింట గ్రహించునది ॥ కడఁగు - కడఁక ॥ కలఁగు - కలఁక ॥ కాఁగు - కాఁక ॥ తునుగు - తునుక ॥ నడచు - నడక॥ నలఁగు - నలఁక ॥ పోవు - పోక॥ మడఁగు - మడఁక ॥ మలఁగు - మలక॥ మునుఁగు - మునుక ॥ మూఁగు - మూఁక॥ మొలచు - మొలక ॥ వచ్చునకు - రా - రాక ॥ వంగు - వంక ॥ వీఁగు-వీఁక ॥ ఇక కపులుపరంబులగునపుడు కనునకు దీర్ఘంబగు- కానుక-కిసయుముది

యుల కుత్వంబునగు - కినియు - - కినుక ॥ ముదియు-ముదుక ॥ ఇత్యాదు లలుగాద్యాదులు.

వ్యా—"ఎఱుక" ఎఱుఁగు ధాతువునకీ సూత్రమునఁ గవర్ణకము రాఁగా ౨వ సూత్రమునఁ బ్రత్యయకకారపరత్వమందు ధాతుగకారమునకు లోపంబు. బిందువునకు నలోపంబిట విశేషము. ఇది పరిచయమర్థ మిచ్చుచో భావార్థమందుఁగ బ్రత్యయమును దక్షిణజ్ఞానము, సోదె, గుఱుతు, జ్యోతిశ్శాస్త్రమును అర్థములనవును కరణార్థమందుఁ [సాధనార్థమందు] గవర్ణకమనవలెను. దీనిచేతను యుక్తాయుక్తము మొదలైనవి తెలియఁబడునని వ్యుత్పత్తి చెప్పందగును. యుక్తాయుక్త వివేచనకు జ్ఞానము సాధనముగదా। పరోక్షమైన సంగతి తెలియుటకు సోదె సాధనము. [కరణము.) వస్తునిశ్చయంబునకు గుఱుతు సాధనము. ఆగతానాగతములు తెలియుటకు జ్యోతిశ్శాస్త్రము సాధనము. సాధనములైన జ్ఞానాదులను తెలుపుచున్నందున నెఱుకశబ్దము కరణార్థకము. ఉ॥ ఎఱుక పెటికెఁడు ధనము॥ (పరిచయము అర్థము: భావార్థము) క॥ చదివినయెఱుకలకుఁ బరిమోచదుననిరోయెఱుకల్ లక్ష్మి. ౪ ఆ (జ్ఞానముకరణార్థకము) గీ। భూతి డాఁచినపుఁ బూసి త్రిశూలహ। స్తంబుడాఁచి చేత సజ్జయమర। వెలఁది మేనఁ గల్గువీరుండు వెలఁది యై। యెఱుకయెఱుక యనుచు నేగుదెంచె॥ నీర. ౨ ఆ॥ (సోదె; పరోక్షార్థజ్ఞాన సాధనము) సీ॥ ఇటునేలకేజేల కెఱుకైనచెంగావిసుదసంజదగు కొండఁ జూచినాఁడ॥ కా ౫ ఆ॥ (గుఱుతు; వస్త్రమందలి నీరుఁ జెంగావి బ్రాహ్మణులని తెలియుటకై సాధనమైనగుఱుతు) గీ॥ రాజునకు గీడుపుట్టెను రాజ్యమడఁగు। ననుచు నెఱుకచెప్పెను జ్యోతిషాదములను। గుడుపుకొఱకు విప్రాకృతిఁ గొన్న శూద్రుఁ। బౌసపాత్రదండము గొనఁ బాడిగలదు॥ విజ్ఞా-ప్రా-కాం॥ (జ్యోతిశ్శాస్త్రము; పరోక్షార్థము దెలియఁగా సాధనము.) "తునుక" ("తునిఁగినది" అన్నయర్థము గావునఁ గర్త్రర్థమందిటఁ గవర్ణకము; గువర్ణలోపమే కాక పూర్వవర్తి బిందువునకు లోపము.) "మడఁక" మడత, మడుఁగు వస్త్రము అర్థము; మడఁలువడిఅనివ్యుత్పత్తివలనఁ గర్త్రర్థమందుఁ గవర్ణకము; "మలఁక" "మలక" ఇట్లు అర్ధబిందుసహితమును బిందురహితమును నయిన రెండుశబ్దములును "మలఁగు" వలననైన రూపములే మొదటిదానికి చిక్కు,

చుట్టు, మొదలగునర్థములఁ బ్రాఙ్ముఖమునకైనవి; రెండవదానికి సుడక, మూసిన; ఇట ద్రవ్యమర్థమయినప్పుడు మలఁగువాఁడు, మలఁగునది అనివ్యుత్పత్తిం జేసి కర్త్రర్థక ప్రత్యయాంతములు. "మూఁక" "మొలక" ఇత్యాది కర్త్రర్థకములని పూర్వమందుఁ జెప్పంబడియె. "కానుక" కర్మార్థమందు రూపము (రాజు కాన్కతోఁ) గనఁబడు నది = చూడఁబడునది] రూపాంతరము "కాన్క"; ౧౨ సూ—న పక్షాంతరమందు నిక వర్ణకము "కానిక" ఇదియుఁ గర్మార్థకరూపము. "కానుపు" అనునది కనుధాతు వునకుఁ బ్రసవించుటర్థమున్నందునఁ దద్ధ్వంసు ౧౧ సూత్రముచేత, బువర్ణకముగలిగి యీసూత్రమందలి సూరిగారివచనంబున నాదివర్ణదీర్ఘంబగు. "ముసుక" కర్త్రర్థమందుఁ గవర్ణకము [ముదియునది ముదియువాఁడు] "ఎట్టిగాఁ గదఁగిరి మూఁడుకాళ్ళముదుక వ్వరియింప" జై ౪ ఆ॥ "కినుక" రూపాంతరము "కిన్క" కినియుటకు ౧౧ వ సూత్రమునఁ బువర్ణకంబును నుత్వంబును గావింపఁ జెల్లి. గీ॥ అనుచు గ్రేఁగంట నీరసం బంకురింపఁ గినుపు కికికిందితకు నాత్మఁ గీలుకొనక॥ కాశి ౪ ఆ. [కినుపు = కినుక]

4 సూ—ఇమివర్ణకంబు కలుగాదులకగు.

కలుగు - కలిమి ॥ ఓరుచు ॥ ఓరిమి। కూరుచు - కూరిమి
నేరుచు - నేరిమి। వ్రేలుచు - వ్రేలిమి । బడియు - బడిమి ॥ బ్రదుకు
బ్రదిమి ॥ ఒడ్డు - ఒడ్డిమి ॥ తాలు - తాలిమి

వ్యా—"కలిమి" ఇటఁగలుగునకు బ్రకృతసూత్రమున నిమివర్ణకంబును "ఇమి' పరంబుగాఁగా రెండవసూత్రమున నంత్యగువర్ణంబునకు లోపంబును అపవాదనిత్యస్వర సంధియుఁ గలిగె. "కలిమి" భావార్థకమైనచోఁ గలియుండుటయర్థము "ఇట్టిమహిమ కలిమికిఁ గతమెయ్యది" భాగ. ఆ. ౪ [కలుగుట] కీధాతువునకు నధికరణార్థ మందును ఇమివర్ణకము వచ్చును ఉ॥ కలిమి యుడుట్టల దేర్చును॥ భాగ. శాం ౧ ఆ (కలిమి = సంపద; దీనియందు సుఖముగలుగునని వ్యుత్పత్తి) "కల్మి" రూపాంతరము. "ఓరిమి" ఇత్యాదులందు నీసూత్రమున నిమివర్ణకము రెండవసూత్రముచేత నంత్యవర్ణ

లోపమునని యూహింపనగు. "కూరిమి" (దీనిచేతఁ బ్రియపడుదురు అని వ్యుత్పత్తి। కరణార్థమందుఁ బ్రత్యయము. స్నేహము అర్థము). బడియు-బడిమి=(దృష్టిదోషపరిహారార్థము దిగఁదీయుట) తాలు-తాలిమి। "తాళు" అని ధాతువుగానున్నపుడల ఘుళకారముతో నుండును. ఈళకారము కృదంతత్వావస్థయందు లఘులకారమయి "తాలిమి" అగు. రూపాంతరము "తాల్మి" క। ఈతాల్మిలేమిబాహ్లిహ్వ౻ జాతికినీవెవ్వడవు నిజంబనవుడుసే నూతజుఁడననియె వెలుచు। నాతండాముని వరేణ్యుఁడతిడుపి తుండై॥ భార. శాం. ౧ ఆ॥ ఉ। ఉత్తమభక్తి నేనతగనోపి యొనర్తు బ్రియంబు తాల్మియుఁ॥ మెత్తదనంబు సంతతము మేలుగఁదాల్తుపహస్తనంగులఁ। భార। అర. ౨ఆ.

## ౫ సూ—తజ్వర్ణకంబు చేయాద్యములకగు.

చేయు - చేత॥ అలయు - అలఁత॥ కూయు - కూఁత॥ కోయు - గోఁత॥ గీయు - గీఁత॥ నేయు - నేఁత। ప్రాయు - ప్రాఁత॥ పోయు - పోఁత ॥ మూయు - మూఁత మేయు - మేఁత ॥ మ్రోయు - మ్రోఁత రోయు - రోఁత। లాయు - లాఁత। వ్రాయు వ్రాఁత॥ వ్రేయు - వ్రేఁత.

కూయుధాతువు మొఱయం దిప్రత్యయాంతము గీ॥ అకట! గూఁడుకూయు సాలికూయిని లాఁతి వారికైన నరయవలయుననిన। వన్నుఁగీరకుండు తన్నుఁగన్నట్టులు చూడనేర్చె ధర్మసూనుఁడపుడు॥ విరా. ౨ఆ. ఇటు లనుక్తస్థలంబులందుం గూడఁ బ్రకృతిప్రత్యయ విభాగం బూహింపవలయు

వ్యా"చేఁత" చేయుట. ఇట భావార్థకము తజ్వర్ణకమ్ము; క॥ వారోకయాగ్రహవృత్తిం గూరి యధర్మంబు సేఁతకుం జాలరుదు ర్వారబలులయ్యుఁ బాండుకుమారులు శాంతాత్ములందుఱ్ఱి మహిజనులెల్లఁ॥ భా. ఉద్యో. ౧ఆ. (అధర్మంబు సేఁతకుఁ=అనర్థము చేయుటకు) కృత్యము ఁనునర్థమందుఁ గర్మార్థకము (చేయఁబడునది); ఉ॥ పూఁ

తపించినంటి పలపుంబరించు కులంబునీతికిన్। లేఁతగడమ్మ యిత్తెఱఁగ లేమకు రాఁగన తెల్ల నిట్టిసీ। చేఁతకు మెత్తురమ్మ దయచేయక తిన్నని మేనువెన్నెలన్ వేఁతురటమ్మ యింతకును కేదురు సెల్లునటమ్మ యింతికిన్॥ మను. ౩ఆ ,,అలఁత'' ఈధాతువునకు ౧౧ సూ-చేఁ ఋవర్ణకంబును, ౧౨ సూ-చే నిక వర్ణకంబును గలిగి ,,అలపు'' "అలయిక" అనిరూపంబులగు. "గీఁత" (గీయఁబడునది అనిన కర్మార్థమందుఁ దబ్వర్ణకము; గీటు అర్థము) 'మూఁత' మూయుట అన్నయర్థమందు భావార్థకము; మూకుడు మొదలైన మూఁతపదార్థములు అర్థమైనపుడు కర్త్రర్థకము. 'మేఁత' పశువుచే మేయఁబడు తృణాదికమర్థము గానఁ గర్మార్థకము. 'రోఁత' జుగుప్సఅర్థము; రోఁతలు (బహువ) తిట్లు అర్థము. ఇటఁ గర్మార్థకము. "వ్రేఁత" వేయుటయు, కార్యకారణాభేదోపచారంబు చేత వ్రేయుటవలన (గలిగిన) దెబ్బయునర్థములు; క॥ అనూర్యభానుఁడీ క్రియ వ్రేసినయప్పగిది నుజనిభుఁడధికబలోల్లాసమునఁ బుచ్చుకొని పాడి। చేసెనగురులార్యన తని శిరమొకవ్రేతన్॥ నిర్వ ౪ ఆ॥ (దెబ్బచేత) భావార్థప్రత్యయమైనను నీయర్థమందుఁ గార్యము కారణముతో నభిన్నమన్న బుద్ధిచేత నిటు ప్రయోగింపఁబడియె. ఈగణంబులోని ధాతువుల యూకారమునకుఁ దకారము పరమగుచో రెండవ సూత్రమున లోపంబు గలిగె. తత్పుత్తుగాన బిందుపూర్వకంబగు. హ్రస్వముమీఁది యాబిందువు పూర్ణబిందువగు.

6 సూ—కువవర్ణకం బడంగ్వాదులకగు

అడఁగు - అడఁకువ ఎఱుఁగు - ఎఱుకువ ॥ కలఁగు - కలఁకువ॥ నలఁగు - నలఁకువ పెనఁగు - పెనఁకువ॥ పొలయు — పొలకువ॥ మఱచు - మఱకువ। మెలఁగు - మెలఁకువ-లోఁగు - లోఁకువ॥ వేగు - వేకువ.

వ్యా—కువప్రత్యయకకారమ్ము పరమగుచో (౨) సూత్రమున ధాత్వంత్యవర్ణమునకు లోపమగు.

"ఎఱుకువ"— ఎఱుఁగుధాతువునకుఁ గువర్ణకంబు గల్గగా, 'ఎఱుక' శబ్దమం దుంబలె బిందుపుచోఁ గూడ ధాతుగవర్ణంబు లోపించు. దీనిచేతఁ జేయఁబడునన్న వ్యుత్పత్తి గానఁ గరణార్థమంబుఁ బ్రత్యయము 'నలఁగువ— క్రిగాకు పాకనంబు గాన వ్యాధియను నర్థమునఁ గరణార్థమందును; క్రిమ, బాధ ఇత్యాద్యర్థములందు భావార్థమందును; బ్రత్యయము, 'పెనఁకువ'— దీనియందు (యుద్ధమందు) పెనఁగులాడుదు రన్న యర్థమ్ముచే నధికరణంబునఁ గువప్రత్యయము. తక్కిన మేశవాద్యర్థములయందు భావార్థమునని తెలియవలెను 'నలఁగువ'— దీనియందు సంచరింతురన్న వ్యుత్పత్తి నిమాగణము, ఇత్యాద్యర్థములందు నధికరణార్థకము 'పోఁబడి' అర్థమందు భావార్థకము. 'లోఁకువ — అపేఁకునది ఇత్యాదివిశేషణార్థమునఁ గర్త్రర్థమందుఁ బ్రత్యయము విశేష్యంబగుచో భావార్థకము. 'వేఁకువ'— ఈకాలమందుఁ దెల్లవాఱుచుండుంగానఁ బ్రభాతార్థమందు నధికరణార్థకము 'వేఁకువనో' హుఁ స ౨ అ.

### 7 సూ—టవర్ణకం బాద్యాదులకగు నగుచో నంతలోపంబగు.

ఆఁడు - ఆఁట। ఊరు - ఊట ఊటాడు - ఊటఆట। ఏఁకరు - ఏఁకట। ఓము - ఓట తిప్పు - తిప్పుట తేరు - తేఁట త్రిమ్మరు - త్రిమ్మట సందు - సంట। పాడు - పాట మందు - మంట। వండు - వంట। వేసఁగు - వేసట। అనుప్రయుక్తంబయిన యాటశబ్దంబు ప్రాయికంబుగాఁ గ్లీబసమంబగు। కోలాటము - పోరాటము మంద్రాటము ఇత్యాదులు.

వ్యా— "ఆట" ఆడుధాతువునకుఁ బ్రకృతిమాత్రమున భావార్థమందుఁ డప్రత్యయంబును ధాత్వంత్యావర్ణమునకు లోపమునునయ్యె. ఇట్లు తక్కినవి యూహింపవలయు 'ఊట'— ఊరెడు నీరు॥ (౨) మూలక — ఇయ్యర్థములందుఁ గర్త్రర్థకము 'ఊటఆట'— ఊరడించుట ఇట భావార్థకము. ఉ॥ అంతలు చేసిపోనడచి యక్కట సంజయుఁ డిటఁ జెప్పుము। తెంపుతో యిట్టియూటఆట నాడెంబ్రతుమం దెద యుధిష్ఠిరుండుదా నంతన మూఁగికృపకును దైవము హొనకు దివ్యబోళ్ళి యా తనకప్పగాఁజేఁయు

నాతఁడు నెందు సెయన్నదమ్ములకా। భార—ఉద్యో 3 ఆ గీ ఉన్న యప్పుడు దొడఁగింపకయులేని యట్లుగాఁగ మాటిమాటికిఁ బరికించి మందడీల కెల్లనూఁకట యగుచు నత్తిల్లఁ జేరు॥ భార—వి—౧ ఆ; సాహాయ్యముగా నుండువాఁ డర్థముగానఁ గర్త్రర్థకము "చేట"—చేరినపదార్థము—ఇత్యాద్యర్థములయందుఁ గర్త్రర్థకము. 'పాట'—పాడఁబడునదియర్థము గానఁ గర్మార్థకము. 'మంట'—జ్వాల యర్థమ యినచోఁ గర్త్రర్థకము—'మంగ్రాటము'—క్లీబసమంబుగాన మువర్ణకముగాఁగినది సంతాపార్థమున భావార్థము. గా। పంగ్రెండేండులు నీగతింజనఁగ జంభద్వేషిము ఖ్యావరుల్ మంగ్రాటం బిడియేల సెప్పందము కావఁ బ్రాంపి కీదేవుముల్। మంగ్రాటై నఁ జెనగ్ని నిందొక్కటా! గోపాలచూడామణికిఁ గండ్రో కానరో వారు చెప్పఁ డగదా కైలాస నాథుండు మల్॥ ఉ—హ—౨ ఆ (కండ్రో—కందురో 'అంగ్రము' అన్నట్లు 'కంగ్రు' అనురూపంబు, క్రి పరి. ౫౯—౬౭—సూత్రములనక )

8 సూ—టువర్ణకంబు పద్వాదులకగు నగుచో నవి యాద్యక్షరశేషంబులయి దీర్ఘంబునొందు.

పడు - పాటు ॥ చెడు - చేటు - అడుచు - ఆటు ॥ కలుచు - కాటు॥ పొడుచు - పోటు॥ వయిచు - వాటు॥ ఏయు - ఏటు ఓడు - ఓటు - వ్రేయు - వ్రేటు,

వ్యా—పాడు—ఇటఁ బ్రకృతసూత్రంబునఁ బడు యొక్క యాదివర్ణమయిన పకారంబు మిగిలి దీర్ఘంబై టువర్ణకంబుతోఁ బైరీతిగా రూపంబు నిలిచె. ఇయ్యది యాపదయర్థమిచ్చుచో దీనియందుఁ బడుగురు (శ్రమపడుదురు) అని వ్యుత్పత్తిగాన నధికరణార్థకము గీ పాండుసుతుల కిన్నిపాటులు పాటిల్లె ॥ భీష్మ ౧ఆ.

ఆం—'అడుచు' నఁపే వాక్యకారంబు మిగిలి దీర్ఘంబుతోఁ డువర్ణకాంతము యిన రూపంబు కాటు—దంశనార్థమయినపుడే కఱచునకు నిట్టిరూపంబు. భోగనా

ర్థకమయినచోఁ "గలపు" అనియగు మూలములో 'కలుపు' అని యుకారమధ్యము ప్రామాదికము. 'కలుపు' అని యుండవలయు. వాటు—పయిమునకుఁ దువర్ణకమును, ఆది వకారమునకు దీర్ఘమును. ఈధాతువునకుఁ గ్రియాపరిచ్ఛేదమందలి (౧౦౩) సూత్రమున 'వైచు' అగు. ఏటు—బాణప్రయోగము. వ్రేటు—దీనికిరూపాంతరము వేటు. కొట్టు నటుక, అర్థము. వేయువలన వేటు అనురూపంబయినదని చెప్పంగూడదు. అప్పుడు విశ్లేషంబర్థమగుం గాని కొట్టుట యర్థము కాకపోవలసి వచ్చును.

9 సూ—షవర్ణకంబు తిరియ్యాదులకగు.

తిరియు - తిరిషము। కలియునకత్వంబునగు - కలషము ॥ పొలయు - పొలషము॥ మఱియు ॥ మురిషము సొలయు-సొలషము వలియు - వలిషము.

వ్యా—తిరిపము తిరియునకు నీసూత్రమునఁ బవర్ణకము రాఁగాఁ దత్పరత్వంబున ధాతుయుకారమునకు ౨ సూత్రమున లోపంబు. కం. పరికెలఁత లెన్నియేనియుఁ దెరువుల ధనమునుగడించి తెచ్చుకొనఁగ నో తరళాక్షి! యొక్క దాసరి తిరిపపు బాపనికి వలచితిరుగుట తగునే!॥ పర 3ఆ భిక్షుయర్థముగాన భావార్థకప్రత్యయము సీ. కడదిరిపంబవై కాంతయునీవును దేశంబులం దెల్లఁ దిరిగి తిరిగి॥ కవిక ౨ఆ. భిక్షుకుఁడు కర్త్రర్థకము. దీనికి వృత్తియందు 'ము' లోపము. గీ॥ తిరిపజోగిఁ దగునె? దేవుఁ డనఁగ. హీర ౧ ఆ. కలపము—కలియునకుఁ బవర్ణకంబును ౨౨) సూత్రమున యులోపంబును నికారమునకత్వంబును గలుగంగఁ బైరూపంబయ్యె. కలయుధాతువును దిరియ్యాదిగణములో భావించినందున, కలపము అను రూపంబు సులభంబైనను కలియుధాతువువలనం గూడ నట్టిరూపంబు సిద్ధించుటకై యత్వంబు విధింపంబడియె. "కలుపు, కలుపుఁగోలు ఇత్యాది సాధారణప్రయోగంబులంబట్టి, ఇట్లు ఇకారమధ్యము గాను వ్రాయఁబడియె" నని బ. సీతారామాచార్యులుగారు కలియుధాతువుగూడ సుప్రసిద్ధమయి యున్నట్లు వ్రాయుచున్నారు శబ్దరత్నాకరమందుఁ గలపము శబ్దము

నకు (౧) కలపుట (౨) పరిమళద్రవ్యములను జేర్చి కలపిన చందనము, అని కలయుధాతువు రూపముతోడనే యర్థవివరణము చేయఁబడినది. కాన ధాతుద్వయంబునుం జియు నీరూపంబు నిర్వివాదంబు. క. తలయంటె నొకతె తేనికిఁ। గలపంబునఁ జేసితావిగర్గివనూనెౕ. య ౪ ఆ. (కలపుట) సీ. కలపంబు లభినవపగంధంబులుగఁ గూర్చి తనువున నలఁదుము ననువు గాఁగ. భార. వి ౧ ఆ. (పరిమళవస్తుమిళిత చందనము.)

## 10 సూ—తవర్ణకం బావులించు లోనగువానికగు.

ఆవులించు - ఆవులింత। ఇగిలించు - ఇగిలింత। ఓకిలించు - ఓకిలింత॥ కుళ్ళగించు - కుళ్ళగింత ॥ కుసిలించు - కుసిల్లింత॥ కొక్కరించు - కొక్కరింత॥ కొప్పరించు - కొప్పరింత। గిలిగించు-గిలిగింత। ఇత్యాదులెఱుంగునది.

వ్యా—ఆవులింత—ప్రకృతసూత్రమునఁ దవర్ణకంబు రాఁగా (౨) సూత్రమునఁ జుకారమునకు లోపంబు. ఇట్లు ఇగిలింత, గిలిగింత ఇద్యాదులం దూహించునది.

గీ॥ ఆవులింత, తుమ్ము, హాసంబు, నిష్ఠీవ। నంబు, గుప్తవస్త్రనమూఁగాఁ ॥
సలుపవలయు నృపతికొలువున్నయెడల బా। హిరముగనైనఁ గలని కర్గులగుట॥
భార. వి ౧౩.

సీ. కటికిచీఁకటి తిండికరముల గిలిగింత సెవ్వాఁడు దొగక స్నె వన్నెఁజేవపు మను ౧ ఆ. ఈయర్థమందె గిలిగిలింతయనియుఁ బ్రయోగంబుగలదు. సీ. లలిఁగపోలంబులం గిలిగిలింతలు పుచ్చి।నవ్వింపఁ గలకలనవ్వినవ్వి హరి. పూ ౫ ఆ.

## 11 సూ—పువర్ణకంబు మాయ్యాదుల కగు.

మాయు - మాపు॥ మేయు - మేపు॥ అడుచు - అడాపు॥ ఇంచు - ఇంపు॥ ఏఁచు - ఏఁపు। ఏచు - ఏపు। కను - కానుపు ॥ కాచు - కాపు॥ చూచు - చూపు-తలఁచు - తలఁపు। తోఁచు - తోఁపు।

తేఁకుచు - తేఁకుపు త్రోఁచు - త్రోఁపు ప్రూఁచు - ప్రూఁపు పెనఁచు పెనఁపు। పొలుచు - పొలుపు ప్రోచు - ప్రోపు మెచ్చు - మెప్పు మోఁచు - మోఁపు। వలచు - వలపు వాఁచు - వాఁపు ఇత్యాదులు మాయ్యాదులు

వ్యా—మాపు—మాయుధాతువునకు నీసూత్రమునఁ బుగ్నకంబు రాఁగా (౧)-సూత్రమున యియు, లోపము. మాయుట యర్థమయినపుడు భావార్థకము "మపతే మార్చుటొప్పదు కడుమాపునైన"

మాపు—రాత్రి; ద్వైతప్రపంచము సుషుప్తివశంబున నీకాలమందు నశించును. అనఁగా దైనందినప్రళయము దీనియందు జరుగుచున్నవ్యుత్పత్తిం జేసి యధికరణార్థమందుఁ బ్రత్యయము. (శర్వరీశబ్దఫలితార్థకము)అట్టి రాత్రికిసమీపస్థము గానలక్షణావశంబునమాపుశబ్దమునకు సాయంకాలమును నర్థమగు. ఉ. మాపటివేళ నీవువనమున్యమువెల్వడివచ్చిగోప్పగ పాృపతధూళిధూసరిత భాసితకుంతలమై సరోరుహాస్థాపితమైన నీమొగము దీరజనోత్తమ! మాకువేడ్కతోఁ జూపిమునంబులకా మరువిఁజూపురుగాదె క్రమక్రమంబునకా. భాగ. ౧౦ స్కం. (మాపటివేళ (రాత్రి) మరుని జూపురుగాదె యని ప్రధానక్రియతో నన్వయము). సీ. అరుణోదయమున శౌచాదులన్నియుఁ దీర్చి పరుసరేపటిసంధ్య వార్చువారలయు నాదిత్యుఁ డకగ్రుంకునప్పుడు మాపటి (సాయంకాల) సంధ్యావిధానంబు సలుపవలయు విజ్ఞా ఆచా. కాం. ఏఁచు ఏపు -(బాధ) "కుసుమాయుధు నేఁపుల కింతయోర్వలేక"మార్క. ౪ ఆ ఏచు-ఏపు-(అధిక్యము) ఉ, ఉమా వల్లభుఁ డాదినాయకుఁడువాసవసంస్తుఁడు వెంకటకొండపై నెల్లగణంబులుం గొలువ నేపునఁ బన్నగరాజపుత్రితో నల్లలితాత్ముఁడై సకలసంపదలం గొలువుండె—వీర ౧ ఆ కను కానుపు- ఇక. క. పు లు పరంబగునపుడు కనునకు దీర్ఘంబగు. అనుతృతీయసూత్రాంతర్గణసూత్రము దీర్ఘము.

12 సూ—ఇకవర్ణకం బుజ్వాను కగు

అంజు - అంజిక అమరు - అమరిక ఆరయు - ఆరయిక అలయు - అలయిక । ఆడు - ఆడిక । ఓడు - ఓడిక । ఓపు - ఓపిక కను - కానిక కూడు - కూడిక కోరు - కోరిక పొందు - పొందిక । పోలు - పోలిక తూను తూఁగునకగు. తూనిక ఇత్యాదులు అంజ్యాదులు.

వ్యా—అంజిక (వెఱపు) ద్వి. ఇంజనేయుఁ దభీతుఁ గాకృతిఁ దిలుకు నంజిక మీఁ దంపమఱయు వచ్చితిని—రా. కిష్కి. కాం.

ఆడిక—(నింద) సీ. కువలయంబున నంగఁ గూల్చ్యాడిక బంధు జీవము మీఁద గాఁ జేయనిపడ.

కానిక—ఇక. క-పు-లు పరంబగునపుడు కనునకు దీర్ఘంబగు ననుతృతీయసూత్రాంతర్గతసూత్రమున దీర్ఘము—"వృషముగాఁ నికయిచ్చి కరుణ జనింపఁబడె కి" కోరిక—క్రం. ఈకథ నెవ్వరు చదివిన। గాకొన్నను విన్నఁ గొంకక నుఱ్ఱాసిన వా। రేకాలము కిం భునికృప నాకల్పముగందు రైహికాముష్మికముల్. పరువాఁవనాగ్రమున రూపాంతరము కోరికి.

13 సూ—అప్పాదులకు నజీ యగు.

అప్ప - అప్పన । ఉజ్జ - ఉజ్జన॥ ఒప్ప - ఒప్పన॥ గట్ట - గట్టన గడ - గడన॥ దీవ - దీవన॥ పాట - పాటన॥ మన్న - మన్నన॥ వీచు - వీపన॥

వ్యా—అప్ప, ఒప్ప, ఉజ్జ, ఇత్యాదులు క్రియాపరిచ్ఛేదములోని ౬౩ సూత్రమందలి యంగలాదులలోనివి. అకారాంతములయిన యీధాతుఖండములకు నిందుగా గమంబు పరంబగుచుండుఁగాఁ ౫౭. పరి ౪౯ సూత్రమున నగాగమంబు వైభాషికంబు గాన అప్పగించు, ఒప్పగించు. అనియును, పక్షంబున సంధి. పరి ౧౦ సూత్రమున నప

దాదిస్వరంబుగాన నకారమునకు నిత్యసంధి గాదె? అప్పించు, ఒప్పించు, అగుచు నగును గదా! అట్లయినను గాగమాంతములయిన పైధాతువులలో నేకదేశవర్తులయిన, అప్ప ఒప్ప, ఉజ్జ (ఉజ్జగిల్లు) ఇత్యాద్యకారాంతధాతు ఖండములకును, వీచు, ఇత్యాద్యుకారాంత ధాతువులకును నదిప్రత్యయంబుగలుగు ధాతుశబ్దంబులపై వచ్చుటం జేసి నదిప్రత్యయంబు కృత్ప్రత్యయప్రకరణంబులో గణింపఁబడియె. అప్ప + న = అప్పన, అప్పనము (విభాగముగాఁ గ్లిబనమంబు) కం. ఘనములజాలెలు రతనపుఁ| బనితబనోపవరున సొమ్ముఁబనిచిన గణనా ఘన కీవచ్చెఁగదా యివి యనికొమాక్కొమి రనాలి యప్పన గొనుమక. శుక ౧ ఆ (అనుమతి)

అప్పనము—ద్వి. వొరలుసామంతులు దుర్గాధిపతులు| నరియప్పనము లీయరని నిశ్చయించి రా. అ. కాం.

(రాజులకర్పించెడి కానుక.)

పాట + న — పాటన — ఉ. పాటనసేయమిం గరులపైఁ బశీర్ణపవీరపంకలా| లాటికమై దరస్మితవిలాసపుఁ జంద్రికడొంకి వాడుటం| దీటదొలంగి విన్ననగునీముఖమో యనమాసిచంద్రుఁ డో పాటలగంధి! వ్రాలెనిదె భానరుచిం దనకందుమీఱఁగన్. (అలంకారము) మను 3 ఆ. వీచు + న వీవన ఇట నదిప్రత్యయంబు జేర్తుగాసఁ గ్రియాపరిచ్ఛేదములోని ౨౦ సూత్రమున నుత్వమ్మున కత్వంబును, క్రి పరి. ౭౭ సూత్రంబున చకారమునకు వకారము రాఁగా వీవనయయ్యె. సీ. ధ్వజముహాసనము వీవనయువాదిగఁ దెసకూరూపులై గరుడుఁ డారూఢిఁగొల్వ|| కళా. ౭ఆ. (విసనకఱ్ఱ)

14 సూ—బడి యేల్వాద్యర్థకంబు.

ఏలుబడి - కట్టుబడి - కనుబడి - కొనుబడి - గిట్టుబడి - చెల్లుబడి - చేసుబడి - తగులుబడి - తీఱుబడి-పెట్టుబడి - పోబడి - ముఱిక్కుబడి - వచ్చుబడి - సాగుబడి.

వ్యా—కట్టుబడి—బంటునకిచ్చెడి మాన్యము. సీ. ఇరుదక్కైజీతపు టెక్కటీలకు

18 సూ — అ వర్ణకంబు గీత్యాదుల కగు.

గీఱ - ఊద - ఎండ - కాయ - చదియ - తునియ - పరియ - పాయు - పిడుచ - మీట - మూడియ - వదర - వ్రియ్య.

వ్యా — చదివు — వలఁగుకు. ద్వి. కలములు చదియలుగాఁగఁ బడగలాత్రియు న| హరి౪. ౧౩

వ్యా — పాయఁగోలు. ఉ. శైర్సిగోయమాయఁ బెపతలనాపాయు| దిట్టివదర గలఁడె దొంగనైన| లక్ష్మి ర౧ కం. పగునాలుగలోకంబులు| బొదలింపం గుపింపఁగలవి సాంపలంపిదె| తునఁ దారొక్కటియగదురు వసలఁజేయుదురు శేపవాదులనెల్లన్| ఉ. హరి ౨ ఆ.

19 సూ — అకవర్ణకంబు మాత్యాదుల కగు.

మాఱు - మాఱకము - అమ్మ - అమ్మకము. అంపు - అంపకము. పంచు - పంపు - పంపకము. వంచుచకారంబు టకారంబగు - వంటకము. తోము - తోమకము. అద్దు అద్దకము.

వ్యా — తోమకము-తోముట మూలంబునఁ గ్రాపడి ముద్రప్రమాదమూలకంబు. ॥ పిగుకగొలుపఁపుఁ దోమకంబునం బుటపుటనై-ఆము ర ఆ.

20 సూ — ఉవర్ణకం బాత్వాదుల కగు నగునపుడు పకారంబు చయాలకగు.

ఆఁడు - ఆఁడుదు. అమ్ము-అమ్ముడు. అల్లు - అల్లుఁడు. ఎక్కు-ఎక్కుడు. క్రుమ్ము-క్రుమ్ముడు. చోపు-చోపుడు. త్రొక్కు -త్రొక్కుడు॥ త్రోవ్ము - త్రోపుడు॥ దంచు - దంపుడు॥ దాఁచు - దాఁపుడు॥

దిగు - దిగుడు। దోఁచు - దోపుడు పెంచు - పెంపుడు - ప్రేఁపుడు
పాఁకు - పాఁకుడు। మాఁయు - మాపుడు । రాచు - రాపుడు
ఇత్యాదులు.

వ్యా—ఎక్కుడు- ఆరోహణము (భావార్థమందు) వాహనము (ఆరోహింపనాశ్రయము; అధికరణార్థమందుగు); గ॥ ఎక్కుడినారోకో గరుడుఁ డెక్కుడుగాఁ గలవారు॥ ఉ. హరి. ౬ ఆ.

దోపుడు—కలఁతయర్థము దోపుధాతువు క్షుభధాతుభవము. భావార్థమందు డువర్ణకంబు. గీ॥ కలయఁ జోపుడ వెట్టింపగరియుఁ గిరియు గాసరముఁ గేసరియు దుష్టికడితియోలుఁగు ఋలీయఁ మొదలుమెకములు కలఁకదోలఁక జెదరి నలుదిక్కులకుఁ బాఱె వదరి బెదరి॥ ఉ. రా. ౨ ఆ.

పెంచు, పెంపుడు. ప్రేఁపుడు—పెంచుధాతువునకే డువర్ణకంబు పరంబగునపుడు "ప్రేఁచు" ఆదేశంబై ప్రకృతిసూత్రమున్నవనేచకారమునకుఁ బకారంబగు. కర్త్రర్థకప్రత్యయము. ప్రేఁపుడు-పెంచువాఁడు, వర్ధిల్లఁ జేయువాఁడు; అధికుఁడని ఫలితార్థము కం॥ సన్నపునారల (అప్పలను) నధిపతి! మన్నించినఁ బ్రేఁపుడైనమంత్రికిఁ బ్రతుకే మున్నది? మనుమున్న యతఁడు సన్నకసన్నటువాసి చనకున్నఁ జెనఁటి॥ పంచ. నా౧ఆ. మాపుడు-మలినము కం॥ వలపలిదిక్కునకేఁగుమక మలగంగాఁ దలిమి కుఱుచమాపుడు పుట్టం బలనఁ గట్టి జటానల్కలమున నవ్వఁ గచన్నుఁ గవగప్పి తగ॥ భార. ౭ ౧ ఆ.

## 21 సూ—ఉవర్ణకం బడుక్వాదులకగు.

అడుకు-అంటు-ఒప్పు-ఒఱుగు-ఒసఁగు.

వ్యా—అడుకు (లు) వడ్లునానబోసివేఁచికొట్టినవి. ఈయర్థమందు నిత్యబహువచనాంతము, కం॥ అడుకులు దన్నిప్పుడే కం ప్రుఁగు ... ప్రుగు గడుబుజించిన

హా॥ డొందలెఱుఁగక పాండుసుతులు నుడిగిమఱఁగవలసె నిప్పుడొకసాత్యకిచేత॥ భార. ద్రోణ ౪ ఆ

ఒఱగు—ఒఱగుఎందు మూలములో నుకారమన్యను ప్రామాదికము. "ఒఱగు మీఁదటఁజేరి" కళా ౫ ఆ.

ఒసఁగు—ఈవి, త్యాగము, బహుమానము గీ మాచిసామాజికులు తమసొమ్ము లెల్ల నొసగులఁగనై॥ ప్రభా ౪ ఆ.

22 సూ—వడిభృతులిట్లెఱుంగునది.

వడి; కొలువడి-గెలువడి-నటపడి. వ్యతిరేకంబున లేవడి. వి; తనవి-తెలివి- విరివి. అవు; తగవు - నగవు - ఉఱవు. ఇ: చేయి - వ్రాయి. కలి; కనుకలి - వినుకలి· ఇత్యాదులు మహాజనవ్యవహారంబుల నెఱుంగునది.

వ్యా—కొలువడి- కొలుచు + వడి; ఇట్లుండ, (౨) సూత్రమున, వకారాదిప్రత్యయపరత్వమ్మునఁ జులోపమని యెఱుంగునది. ఇట్లే, గెలువడి (గెలుచు + వడి) నడవడి (నడచు + వడి); ఇత్యాదులందు వడిప్రత్యయవకారంబు పరంబగుచోఁ జలోపంబు.

లేవడి-కలుగునకీసూత్రమున వడిప్రత్యయంబు రాఁగాఁ క్రి. పరి. ౧౧౬ సూ-న, వడిపరత్వమున "లే" అను నాదేశంబు. లేమి యర్థము. సీ. నిదురలేవడిఁ గింపు సెరయుకన్నవతోడఁ బొడిసాడియైన మేపూతతోడ॥ గసి ౫ ఆ. దారిద్ర్యమునన ర్థము. మ॥ లేవడిం బడియుండెందగదంచు పత్యగరిమన్ మన్యంబు గన్పట్టఁగా। చంద్రా ౧ ఆ.

తనివి-తనియుధాతువునకు విప్రత్యయము పరమగుచుండఁగా వకారాదిప్రత్యయముగాన (౨) సూత్రమున 'యు' లోపంబు ఇట్లే తక్కినవానికిని నూహింపవలయు.

# ప్రకీర్ణకపరిచ్ఛేదము



1 సూ—పదాద్యంబులు ఋ ఌ వర్ణంబులు రల తుల్యంబులు.

అతఁడు ఋషి - ఇటసంధిలేదు. ఆఋషి- ఇట యడాగమంబు లేదు. వచ్చెఋషి - వచ్చెన్ఋషి - వచ్చెనుఋషి. ఇటద్రుతమునకు లోపసంశ్లేష స్వత్వములు.

(వ్యా) పదంబు మొదటిఋకారమును, ఌకారమును, రేఫముతోడను లకారముతోడను, క్రమంబుగా సమంబులగు. సంధియందు నియ్యవి యచ్చువంటివిగాక హల్లు వంటివియగునని భావము.

క॥ ఆఋషిపుత్త్రుఁడుగట్టిన చీరలు మృదులములు నవ్యశిష్టములుమనో హరులు వారనిపృథుకటి భారంబున నొక్క కనకపట్టము వ్రేలుఁగ॥ భార. ఆరణ్యప॥ ఇట ఋకారంబు స్వరంబువంటిదిగాదు గాన సంధి. పరి. (3) సూ-న యడాగమంబు రాలేదు.

క॥ ఝషకేతుద్వేషునకుఁ గిబ్బిమపర్వతపృషునకమృతవిమనిధిజామాత్రిషునకు ఋషిపూజితునకు విషమాక్షున కింద్రముఖదివిజపక్షునకున్॥ ఋకారంబు హల్లు వంటిదిగాన "ఇషునకుఋషి" అనుచోట షష్ఠీవిభక్తి ద్రుతంబునకు సం. పరి. (౧౭ సూ-న, లోపంబుకలిగె ఇట్లు స్వత్వసంశ్లేషంబు లూహించునది.

చ॥ రతిపతినర్మకర్తఁ ఋతురాజబలావళి నెంచియేగుచు న్నృకులవర్ధించి కైకొని యమావనవనంబుల ముద్రవెట్టుచోఁ బ్రతినవదీపికాశిఖికరంగెడు లక్కయయ్యెఁ బోలెమంజుల స్థితమయి తేఁటిబుగ్గలపుఁ దేనియల్ గాయుటఁ గంటివేచెలీ! పసు 3ఆ.

2 సూ—అచ్చికంబులం దుత్తమంబులగు రు లు డు ముందఱి యేత్వంబునకు హ్రస్వంబు విభాషనగు.

నల్లేరు—నల్లెరు-పల్లేరు-పల్లెరు-పెన్నేరు-పెన్నెరు - మానేరు-మానెరు-ఆడేలు-ఆడెలు-కుందేలు-కుందెలు-తోఁడేలు-తోఁడెలు-నాఁగేలు-నాఁగెలు-నేరేడు-నేరెడు-మారేడు-మారెడు - పూరేడు-పూరెడు తంగేడు - తంగెడు.

(వ్యా)—మూడచ్చులుగల యచ్చతెనుఁగు పదంబులందుఁ దృతీయంబులగు రు, లు, డు, లు పరంబులగునపుడు, పూర్వమందలి యేకారంబు విభాషను హ్రస్వంబగునని యర్థము.

నల్లేరు— ఇది మూఁడక్షరములుగల తెలుఁగుపదము.

ఇట రువర్ణంబు తృతీయంబు. అట్టి రువర్ణమునకు ముందుదియైన యేకారము, (లకారంబు మీఁదిది) వికల్పంబుగా హ్రస్వంబగు. కావున, నల్లేరుశబ్దము హ్రస్వమగ్యంబును నగును ఉదా నల్లెరు

కుందేలు— ఈమాట మూఁడక్షరములుగలది. ఇందు లువర్ణంబు మూఁడవది, అట్టి లువర్ణంబునకు ముందరియేకారము (దకారము మీఁదిది) విభాషను హ్రస్వంబుఁగాఁగా, కుందెలు' అనియుదిహ్రస్వమగ్రంబగు ఉ. ఇంతుల కిమ్మైయున్నను జా లెన్నఁడువత్తురి వచ్చెనితఁడు నంతముఁబొందిరిర్ఘ ము మునఁ కౌనినింతురెయిట్టివంటయిల్ కుందెలు సాచ్చెవేగఁడిని కోమలివారలఁ జంపి తెచ్చినా కుందవనంపిపెట్టుము రసోత్కటమానస మాంసఖండముల్ భార, ౬ ఆ

తోఁడెలు— క॥ పలపోరిన వానినిధటు లలుగులపాలాడిరధపుత్రిపట్టి బె ట్ట్లిమపి వమెలంగఁగఁ గిటిఁ దోఁ డెలుమెడలగువానిఁ గొన్నిటిని వేటకరుల్ మను. ౪ ఆ.

నేరేడు—ఉ॥ ఆరమణీయజంబువనయందనిశంబును భూరిసింధుర స్థూలఫలం బులన్నగముపైఁబడి వ్రియ్యఁగఁదద్రసంబు సొం పారఁబ్రవాహమదై దివిజాద్రిఁ బ్రదక్షిణించియు న్నేరెడుమ్రానిమూలమున నెక్కొనియుండు జగత్ప్రశస్తమై మార్క. 3 ఆ. గీ నేరెడేటియసల్ దెచ్చి నీరజాప్తు సానఁబెట్టినరాపాడిచక్కి మెదిచి పదునుసుధనిడిచేసెనో పద్మభవుఁడు వీనిఁగాకున్నఁగలదె యీమేనికాంతి మన. 3 ఆ.

తంగేడు—సీ॥ కలకులనున్న తంగేటిజున్ను గృహమేధి యుపవాసముండంగ దీత గఢేటి॥ మను; ౧ ఆ. ఇట్లుతక్కినవి యూహించునది.

3 సూ—ఉయ్యాల పయ్యెద తాయెతులోనగుదిక్క నామంబులం గుయాకుం దాలవ్యవక్రయోగంబులేదు.

స్పష్టము.

(వ్యా)—ఉ॥ అక్కటికంబుమాలి ప్రజనాఁడినోంవుదునోంపనైతినా త్రిక్క రణంగిపోదురు పరితులమూఁకలు నోవుకైవడిన్॥ (వాసిష్ఠరామా° ౪ఆ) ఇత్యాది ప్రయోగంబులంజేసి త్రిక్కుశబ్దము తక్కుశబ్దమునకుఁ బర్యాయపదంబు.

ఉయ్యాల' పయ్యెద, తాయెతు వీనియందుంగాక తక్కిన నామవాచకములందు యకారమునకు, దాలవ్యవక్రయోగంబు లేదు తాలవ్యవక్రమనఁగా ,,ఏదైతోకశంబులోఁ దాఁబు'' అనుటంజేసి, ఎకారసంయోగంబులేదని యర్థము ఒకారము, ,,ఓనాతోకశంబులో ష్ఠం'' అనుటచే నోష్ఠ్యవక్రముగాన, దన్త్యానతరార్థమై తాలవ్యవక్రంబు చెప్పం బడియె. ఉయ్యాల ఇత్యాది శబ్దత్రయంబునందుఁబలె: బయ్యెద, తొయ్యలి ఇత్యా దులందును మధ్యాక్షరంబున నైత్వంబుండునని భ్రమగలుగఁగాఁదన్నివారణార్థ మీసూ త్రంబు రచియింపఁబడియె. ఈసూత్రార్థము కొంచెము చర్చింపఁదగియున్నది.

ఉయ్యాల, పయ్యెద, తాయెతులందక్క నామంబులందని మాత్రముచెప్పుట యర్థ కమయిన తక్కుశబ్దముతో నామవాచకములనుండి (ప్రాతిపదికంబులనుండి) గుయ్యా ప్రత్యయంబుఁ బరిగ్రహింప నంకేసి ,,షష్ఠీయుక్త మన్యపద్మాధికరణే,కర్తృవ్యార్థే పరతః''

452 బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక.

(షష్ఠీయుక్తమినయుక్తంచ యత్కించిద్దృశ్యతే, తత్రతత్సాన్నిధ్యే తత్సదృశే, అధికరణే = ద్రవ్యే, కార్యం విజ్ఞాయతే హి = యతః, తదా అర్థావగతిః = అర్థప్రతీతిరస్తి) అను పరిభాషాన్యాయంబున షష్ఠీయుక్తస్థలంబునందు నివశబ్దయుక్తస్థలంబునందుంబలె భేదసాదృశ్యంబులు తోఁచుచుండుంగాన నామంబులందుంబలె (ప్రాతిపదికంబులందు) నుయ్యేలాదులయందున్న సంధికార్యరూపకార్యంబు (ఏకపదత్వము) సాదృశ్యంబున స్ఫురించుచున్నది ఇయ్యవి యవయవార్థశూన్యములయిన యఖండశబ్దంబులని సూత్రకారుని తాత్పర్యము. ఈసూత్రము నప్పకవ్యాదిగ్రంథకర్తలమతంబునకు నత్యంతవిరుద్ధము. కాన నయ్యది యిచ్చట నుదాహరింపఁబడుచున్నది' అప్పకవీయము: ద్వితీయాశ్వాసము, గీ॥ గాఁడి నుయ్యేల, పయ్యెద, తాయెతులను గలయకారంబులెరు వక్రములు నిజంబు. ముద్దరాజు రామనవాని మూఁటిని సమాసంబు లని చెప్పె నిమ్మహిమన్య॥ సీ॥ ఊయెల కాకపటచేత నుయ్యేలయ్యె॥ బయిని చెరఁగునిక్కచక్కఁ బయ్యెదయ్యెఁ దల్లికాపునకై కట్టఁదగినసరులఁ దాలిబల్కెఁ గ॥ తాయెతుల్ దేశ్యము నను ఉయ్యేల లోనగుశబ్దంబులు కవిలోకసంజీవనియందు ముద్దరాజు రామన్న యేకపదంబులని భ్రమసెంది యాశబ్దంబులలోని మధ్యయకార మెత్వంబుగలదనిలక్షణంబు సెప్పెఁగాని యయ్యది యవిచారితరమణీయంబనియు, హేలాశబ్దభవంబైన యేలశబ్దంబు హ్రస్వకారంబువొందఁగా, ఊఁచ + ఏల “ఉయ్యెల” యనియు, ఎదకుఁబయినుండునన్న వ్యుత్పత్తిని జేసి “పయ్యెద” యనియు తాయి (తల్లి) + ఎత్తులు (దండలు) అనుచోఁ దల్లిరక్షణకై కట్టినదండలన్న యవయవార్థమునఁ ఒకారమును దేశ్యపలుకగాఁ “తాయెతు” లనియు శబ్దనిరూపణంబు నూపి, ఏల మొదలగువానికిఁ బదద్వయమార్గంబున సంధిలేమింజేసి యడాగమంబు గలిగెంగాన, కృష్ణనియేలలు, రామనియెద, లక్ష్మనిగొత్తు, ఇత్యాదులందుంబలెఁ బ్రత్యేకలక్షణమాత్రము నావశ్యకంబన్న తాత్పర్యంబున నప్పకవీంద్రుండిట్లు ఖండించె. శబ్దరత్నాకరమందును “ఊయెల” శబ్దమునొద్ద “ఊఁచ + ఏల అని యవయవార్థము చూపఁబడినది' ఇట్టి వాస్తవార్థంబును బరిశీలింపక సూరిగారు, “తే దాయెతులు నుయ్యేలయుఁ బయ్యెద, యనుదక్క గలుగదెత్వంబు మధ్యయకారమునకు', అనిన కవిలోకసంజీవని ననుసరించి యేకపదంబులన్న భ్రమమూలంబున నీసూత్రము రచించెనని తెలుఁగుచున్నది. ఈసూత్రంబున నుయ్యేలాదిశబ్దత్రయంబునం గాక తక్కిన నామంబులందు మధ్యయకారమునకెత్వము లేదని విధింపఁబడ్డదిగాని యుయ్యేలాదులందు సర్వదా యెత్వమే యుండునని

వియమింపఁబడలేదు గాన (౪)' (౫) సూత్రములప్రకారమున నైత్వరహితములైన యుయ్యాలాదిపయ్యెదశబ్దంబులును బరస్పరవిరోధంబు లేక గ్రంథస్థములంబునరక్షితంబు లయ్యె. అప్పకవి యెత్వయుక్తములైనయుయ్యాలాదిత్రయంబునకే తనగ్రంథంబునఁ గవి ప్రయోగంబులు చూపెను అంతమాత్రమున నైత్వములేనియుయ్యాలాదు లతనిమతంబున నప్రమాణంబులనియూహింపఁదగదు అతండు స్థాలీపులాకన్యాయంబు ననట్టు లుదాహరించెనని యెఱుంగవది.

ఉయ్యెల— చ॥ కలిదమయింతిఁ బాపఁదగునట్టి సతింబతి ద్రోయునోపఁగా లలవను దీర్ఘసౌహృదబలంబున నిట్టులు రెంటఁ జేసి యన్నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి గతాగత కారియైన యుయ్యెలనుబోలె నూఁగుకయొంతయుఁ బొద్దువినిశ్చితాత్ముఁడై భార. ఆర ౨ అ.

పయ్యెద— సీ॥ పలఁబడు జక్కవపల్ వలెనున్న జిలుగు పయ్యెదలోని గుబ్బపాలిండ్లు మెఱయ॥ య. 3 అ.

తాయెతు— సీ॥ ఒకయింతియొరగిన సికమీఁద ముడిపువ్వు బెత్తులు దొరయఁదా యెతులు చుట్టి॥ చం. భా. చరి.

గీ॥ ఇమ్ముగా మేల్పసిండి తాయెతులు మొల్ల సరిసరుల్ దట్టముగఁ జుట్టివేసినట్టి యొరసదిమీఁదఁ బైవెంట్రుకనిచికట్టె నట్టి బురుసారుమాల్ హాయల్ కట్టెదవర॥ రసి॥ ౧ అ

4 సూ— ఊయెల యూయాలలు చాఁపుల నొంటొంటికిం గుఱుచయుండెనగు.

ఉయేల - ఊయెల - ఊయేల - ఉయాల - ఊయల - ఊయాల - వక్ష్యమాణంబు యద్విత్వంబు - ఉయ్యేల - ఉయ్యెల ఉయ్యాల - ఉయ్యల.

(వ్యా)—ఊయేల, ఊయాల. ఈరెండుపదంబులలోని దీర్ఘంబులకుఁ బర్యాయంబున హ్రస్వంబు విభాషనగునని యర్థము. ఒక్కొక్కటియే హ్రస్వంబు వికల్పంబున నగుంగాని రెండుదీర్ఘంబులు నొక్కమాఱుగా హ్రస్వంబులు గావని ఫలితార్థము.

ఊయాల—సీ నిల్లువుటద్దములు గంటలయుయ్యాలలు హంసతూలికపాన్పులు దోమతెరలు॥ షో. 3 ఆ

పైనిఁజూపినవిధంబుల సంధిని వర్ణవికారంబులు గల్గెనని యూహింపనగు. పయ్యెద శబ్దమునొద్ద నిట్లే బ. సీతారామాచార్యులవారు వ్రాసిరి.

5. సూ—పయ్యెద పయ్యాద.

(వ్యా)—"పయ్యద" అని యకారమధ్యముగాను నుండవచ్చునని యర్థము. సంధిని వర్ణవికారమని శబ్దరత్నాకరము.

కీ గాననవేగమునఁ బయ్యద కొంగుసడలిన. .షో ౨ ఆ॥

6 సూ—ఉయ్యేలాదులం దొలియచ్చుమీఁది హల్లునకు ద్విర్వచనంబొండె నగు.

ఉయ్యేల - ఊయేల-ఊయేల - ఊయెల - ఊయాల - ఊయల - ఆయె - ఏలిదము - ఓయ - ఓయారము - కోపు (ధనుర్గ్రము) జాజర - తీనియ - తీయము - తేప (ప్లవము) తేమ - తోయలి-దీవియ - నూవు - నోవి - నోవు - పూవు - పేయ - మోక (అంకురము) మోటిక - మోవు - వీయము - ఇత్యాదు లూయేలాదులు.

(వ్యా)—ఊయేల మొదలగుశబ్దంబులయందుఁ బ్రథమస్వరంబుమీఁది హల్లునకు ద్విత్వంబుపక్షంబున నగు. ఉదా. ఉయ్యేల. ఇటఁ బ్రకృతమాత్రమున బ్రథమస్వరంబైన యూకారముకంటెఁ బరంబైన యకారమునకు ద్విత్వంబురాఁగా సమాసపరి ॥౧3 మాత్రమున, ఊకారమునకు హ్రస్వంబు. ఇట్లుఊయాల, ఊయల శబ్దంబు లీగణంబులో నిఘగుటంజేసి ద్వితీయహల్లునకు ద్విత్వంబురాఁగాఁ సమాసపరి. (౧3) మాత్రమున దీర్ఘం

టునకుహ్రస్వంబుగలిగి, ఉయ్యాల, ఉయ్యల అనురూపంబులునగు. సీ తొడలఁజవలేటి లేఁదరఁ గలుబాలుడెపుచందమామ నుయ్యాలలూఁప హరి. ఉ. ౬ ఆ. ఉయ్యాల శబ్దము; ఊయేలయొక్క రూపాంతరమని శబ్దరత్నాకరము. ఇట్లు తక్కినశబ్దములు వికారాంతరములని యూహించునది. క॥పలుమరుతలయుంటితగన్ నలుఁగిడిదోయిక్కజల మునన్ బోరాడించి లిలలింజన్నిమ్మచు; నుయ్యలనూఁపుమఁ దెనుపఁబోడఁగ నావర శిపుఁడు॥ కళా. ౬ ఆ. సీ॥ ఉయ్యాలతొట్టిలోనునిచి చేతులుపట్టి యూఁచియాడెను పాటనుబ్బసేర్చె వి. పు॥ ౭ ఆ ఏలిదము. క బాలుఁడని తలఁచిరివుతో నేలిదమునఁ గలసియునికి యిదికార్యమె భార. ఆది. ౬ ఆ.

ఎల్లిదము—పూర్వమందుంబలె నిటఁ బ్రక్రియ యూహించిపది.

చ॥ అనవిని యింద్రుడిట్లనియె నగ్నికినిమ్మరివోయి చెప్పు మ జ్జనపతితోడ నాపలుకు సమ్మతిఁజేయక తక్కనేని నేఁ బనిచెదవజ్రమున్ జమునిపాలికి నన్నరనాథు వేగ మే యనుచుటకింత యెల్లిదమె యాతనికిన్ మనయాజ్ఞ యూరయన్ భార ఆశ్వ ౧ ఆ.

ఉ॥ఇంతలుకన్నులుండఁ దెరునెవ్వరివేఁడెను భూసురేంద్రయే కాంతమునందునున్న జనరాండ్రెనెపంబిడి పల్కరించులా గింతియుకాక నీవెఱుఁగవే మునువచ్చిన క్రోపచాప్పునీ కింతభయంబులే. కడుఁగ నెల్లిదమైతిమె మాటలేటికిక మను ౨. ఆ.

జజ్జర—జాజరశబ్దము పకృతగణంబులోనిది గాన ద్వితీయాక్షరమురపు ద్విత్వంబురాఁగాఁ దొలివర్ణమునకు సమా-పరి-(౧౩) సూ-న, హ్రస్వము ద్వి వలదువసిద్ధ యీ విట్టి జజ్జల (పంచనలకు) కలఁగునే కాశికుఁడల్పునిరీతి హరిశ్చ ౧భా

తక్కిన యీగణాంతర్భూతశబ్దంబులును నిట్లే ప్రయోగింపవలె.

7 సూ—అకారంబుక్రింది అకారంబునకుం దుదినులుల క్రింది నలలకు లోపంబు బహుళంబుగ నగు.

అట్టు - అటు. గొట్టియ - గొటియ. కన్ను - కను. నన్ను నను. పల్లు - పలు. విల్లు - విలు.

(వ్యా) గొజ్జియ- ఇత్యాదులయందుఁ దుదికానిచోటను అకారలోపంబునకై అకారము ద్వంద్వంబునం జేర్పఁబడలేదు.

అఱు—సీ. ఇందుబింబముఁజూచి చెందుప్ప గలుగుసావి (అని) యఱులెత్తినా కంగ నాపపడిన కాశికె ఆ:

గొజ్జియ—ఉదవగు నారుగపంజలు గొజ్జియల వాడియును దలుచక్ర భా॰ ౨౦. ౪ ఆ

పలు—సీ। పలురాకమునువచ్చి బాలువేలువుమన్నఁ బంధులేపన్న నభావ్యుఁ డనియె భాగ ౯ స్క౦:

8 సూ—అక్కటాదులజడ్డకు లోపంబు విభాషసగు.

అకట - అక్కట. అక్కట - అట్టిక - అట్టుక - అట్టె - అయ్యో - అయ్యారె - అవ్వారి - ఇట్టిక - ఉప్పవడము - ఉమ్మి - ఎక్కసక్కియము - ఎక్కసెక్కియము - ఎక్కిరింత - ఎడ్డ - ఎన్నిక - ఎమ్ముక - కజ్జాయము - కట్టా - కట్టిక - కప్పురము - కమ్మటము - కమ్మతము - కువ్వాడము - కొట్టిక - కొమ్మ - కొయ్యగూర - గయ్యాళము - గుజ్జరాతి - చిట్టి - చిన్న - చిమ్మట - చెన్నఁటి - చెప్పము - చెప్పఁడు - చెమ్మట - చెల్లియలు - జవ్వాజి - జాబిల్లి - తమ్మటము - తమ్మలము - తల్లి - తుమ్మికి - తువ్వర - తెల్ల - దవ్వు - దివ్వియ - నవ్వు - నిద్దుర - నివ్వరి - నివ్వాళి - నువ్వు - నెట్టిక - నెమ్మలి - పవ్వళించు - పిన్న - పుల్లియ - పువ్వు - పెద్ద - పొట్టిప్రాకెన్న - ప్రెగ్గడ - బెగ్గము - బొమ్మ - బొమ్మికము - బొమ్మిడికము - బొమ్మిడీకము - మజ్జ - మత్తాబు - మల్లారము - ముక్క - ముద్దియ - మెట్టిక - మొక్కరము - మొగ్గరము - మొల్లాము - రడ్డి - లొట్టిపిట్ట - వట్టి - వయ్యాళి - సన్నియ - సవ్వడి -

సివ్వంగి.- అట్టు - ఇట్టు - ఎట్టు - అప్పుడు - ఇప్పుడు - ఎప్పుడు - అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - మమ్ము - మిమ్ము - తమ్ము - అమ్మ - అక్క - అవ్వ - అయ్య - అప్ప - అచ్చోటు - ఇచ్చోటు - ఎచ్చోటు - అచ్చటు - ఇచ్చట - ఎచ్చోటు - ఇత్యాదులు కొక్కరాదులు.

(వ్యా)— అక్కరాని గణంబుని శబ్దములయొక్క సంయుక్తాక్షరములకు లోపంబు విభావనకు.

అర్థంబుం దెలుపంగా బహ్వికంకణంబులైన నిఘంట్వాదులు పెక్కులున్నందున "లఘ్వర్థంవ్యాఘ్రానాదిక్యంతే" అనుసమర్థ సూత్రస్థపతంజలివచనప్రకారంబున గ్రంథలాఘవార్థము సంస్కృతవ్యాకరణంబున సర్వశబ్దార్థనిదేశము సలుపంబడని యట్టులే ప్రకృతంబునను గ్రంథవిస్తరభీతిం జేసి గణపరిగణితంబులైన శబ్దంబులకెల్లను నర్థప్రదర్శనంబు లేకుండ స్థాలీపులాకన్యాయంబునం గవి ప్రయోగంబులతోం గతిపయంబులైన శబ్దంబులకే యర్థంబు లుదాహరింపంబడుచున్నయవి.

అటె—కం సహింపను పనుచువాఁడటె విహితానుష్ఠాన పరులువీరటె వారలో కహితంబటె యిది మనకుఁ మహనీయమ కాకయెట్లు మానఁగవచ్చుఁ॥ భార. ఉద్యో ౧ ఆ: (అటె=ఆశ్చర్యము. టవర్ణలోపంబు.)

ఎకిరింత—(వాహనము) సీ॥ రేవెలుంగునుదాల్చుందేవేరియుమర్గ కెకిరింతయై మింట మెకమునక్కు॥ రామ ౩ ఆ: (ఎంగలోపంబు) గిజిగాడు——(పచ్చపిట్ట) ఉ॥ కూరిరవనేధవంత హాసకుర్య, పరమ్మతద్విజపఙ్క్తిం బొల్పారు ముసుంగులం బురువులంచు వెసంగొనిపోయి హంతకృం గారవవ్రమాలి గిజిగాడులు గూడులం జేర్చుదీపికల్ । గారవిం గృష్ణరాయమహికాంతిని కారెవపత్తనంబులన్ మను. ౧ ఆ: (ఇటజలోపంబు) జవాది-సీ కపటువో బీరెండం గరంగి కస్తూరి వంటి గమగమలను చొక్కు పుజవాజ॥ వసు. ౨ ఆ: (వకారలోపము) జాబిరి—తరల॥ పలుదలం గులం బోవుచందురుం బట్టనిన్నిటికన్నియై యులిగి వేవెనువెంట సేగనువట్టి జాబిరి

(సంస్కృతము) మేపరుల్ బలెజనల్ గడుసీఁ దేఱమఁ బైపయిం జనుదేరఁగా। నీలపుఁ బేఁకలమ్ము కొనళ్ల గుమ్మగంబులు పొల్పగన్॥ య. 3 ఆ: (లకారలోపము.

తెగిగడ—కం॥ తగనీలో నూహింపుము। దిగవిడువకు ధర్మతనయు దృఢమతివై పం। పకు చంపము కొడుకులకుం బ్రెగడలకుం జెప్పితీర్పు పెంపేర్పడఁగన్ భారత ద్రో. - ఆ (వయాళి—విహారము; వాహ్యాళిశబ్దభవము) చ అవికులవేశియుల్లు పల మాంక పిసాంచుర పన్నగాళికిన్ జలమరి చల్లగాలికిని జక్కరఖాణపుఁ దేజిదోలు ఫుల్। విలుతువ మాళికిన్ జిగురు విందులనీలి గయాళికిన్ హలా హళి గుళికా ఘదుర్మప ఖువాళికి వాళికి లోఁగిరయాత్మలోన్॥ వసు. 3 ఆ: (యలోపము)

9 సూ—జడ్డక్కరంబుతోఁ బదాదిస్వరంబుగూడుచో జడ్డకు లోపంబు లేదు.

ఆత్రత్తె - కన్నదరె - నన్నడిగె - పల్లొత్తె - విల్లందె.

(వ్యా) సంయుక్తాక్షరంబునకు నజాదిపదంబులతో సంధి గలుగునో లోపంబు గలుగదని యర్థము.

ఇట్లుమిత్త్రెక్కి, మున్నెలు ఇత్యాదు లూహింపనగు. తే॥ ఏమి పార్థుఁడు నీవు పండితుగలె యీవమ్మ కౌరవ్య సం। గ్రామమహోభము బాహుదర్పమునఁ దీర్పం దద్ద మిత్త్రెక్కి మి మ్మెల్ల న్వాఱఁగంది చూచెదముగా కీసారికిం బోయి రా ధీముం డిత్తఱి ఱిత్తమాటలకుఁ గోపింపంగ నూ పెంపుఱన్॥ (ఇట ఱకుటరేఫంబునకు లోపంబు రాలేదు.) భార. ఉద్యో 3 ఆ.

మిన్నెలు—మ అసిలఁ బర్బ్బిఁ జౌరచిత్తముల కత్యాదండ మొందఁగ న క్షిరిఁగ న్నెటి తరంగిలన్ దెవఁబుమన్ భార. ఆది౭ ఆ:

కన్నాకు—సీ॥ ఎఁదు పూశలు మట్టెయెత్తి బిట్టాలించి గముకిఁ గన్నాకయి గాఁచి యంగయు॥ మను. ౪ ఆ. క కన్నాకు నానకు భీష్మండి। స్నరపరుఁగాపఁలయు

నెమ్మెయినైనఁ దన్నుం గాచిన నికఁను జగన్నాథుఁ డీకగమునం బగఁ బనవఁగిఁ దుఁ॥
ఇట్లు వలోపము రాలేదు. భార. భీ ౧ ఆ:

క॥ "నలుఁగిరి దోయిళ్ళజలమునఁ బోర్చాకుడిం చిలకం జన్నిగ్భగు" కళా
ఓ ఆ: పి. పంకనిళ్ళంకుఁడై పారదారికవృత్తి విడలక పల్లార్తు వానికడః॥ ఐ ౧:౪.

10 సూ—హాదులయు నీలుగు లోనగువాని తొలి హల్లునకు లోపంబు బహుళంబుగ నగు.

హడపము - అడపము - హరిదళము - అరిదళము. హాఁది - అఁది - నీలుగు - ఈలుగు. నీలుగు - నెగయు - పొందు - పొనగు పుఁను-పొదవుల కాదిలోపంబొకండు వధియించె నది యవిచారమూలకంబు.

(వ్యా)—హకారాది శబ్దములయొక్కయు, నీలుగు మొదలగు శబ్దములయొక్కయు మొదటిహల్లునకు లోపంబుఁ బహుళంబుగా నగును.

ఆ॥ పూనె నెగ నెఁబొవ నెఁబొనరెఁ బొందొనవన్న । పలుకులందు మొదలఁ గలుగు నట్టి వ్యంజనంబులడఁగి వానిపై స్వరములు నిలుచు వలసినపుడు నీరజాక్ష॥ అని యప్పకవి ద్వితీయాశ్వాసమందు వ్రాయుచు "కం మానవతి యిట్లుమానిన మానగ్రోధములచేత మరలిచి చింతా దీనగతి నుండమదిలో నూనిన ప్రేమమునవంబు జోపగుఁ బనియెఁ॥" అను పారిజాతాపహరణములోని పద్యమును బూనదాతువు హాద్యక్షర లోపంబునకు నుదాహరణముగాఁ జూపి. 'పొదవు' నాదివర్ణలోపంబునకు, క॥ తదనంతరం బకట్రిమ్మ ఆ 'యదువిభుఁడు కృపావిధేయుఁడై వాణీశ' త్రిదశేశుల కార్పణ్యం బొదవ మని నె నుధను సైన్య యోధులనెల్లన్ అను చిత్రభారతాదిపద్యంబుల నుదాహరించెను. ఒదవునకుఁ గలుగు, ఉపయోగించు యుక్తము, అను నర్థములు శబ్దరత్నాకరాది నిఘంటువులందు వ్రాయఁబడినవిగాని పొదవు శబ్దమునకు నర్థములుగాని కవిప్రయోగంబులుఁ గాని లభింపఁబడలేదు. కాన శబ్దరత్నాకరాదులయందును ప్రాచీనలాక్షణిక

నిఘంటువులందును బోదవుయొక్క నామరూపంబులు' గగనకుసుమాయమానంబులై కానంబడక యున్నయవి. కాని యప్పకవీయమందు మాత్రము ద్వితీయాశ్వాసమందే బోదవునకు నృసింహపురాణములోని పద్యయము బ లోపము రానందులకు నుదాహరణ ముగాఁ జూపుటలో మూఁడవదిగా నీపద్య ముదాహరింపబడియె.

"అదియట్లు కాదెనిప్పుడఁ జెపలంటునె దేవదేవు శ్రీరమణీశుఁ మదినుంచు కొన్నవానిని బోదవునె తాపదలు రేఁగిఁ బొందునె తనుముల్॥" ఈపద్యమే శబ్దరత్నాకరములోను "మది నునిచిన యుత్తమునిఁ బోదవునె తాపదలు సూర్యుఁ బొదువునె తనువుల్" అని యుత్తరార్ధమునందలి యీమాత్ర పాఠభేదముతోఁ బోదవు ధాతువునకు సకర్మకార్థమైన క్రమ్ముటయను నర్థ ముదాహరింపఁబడినది. ఇట్టి యప్పకవీయ శబ్దరత్నాకరంబులగల పాఠభేదములలో నేది యుత్తమోత్తమో కొంచెము గర్హించి చూతముగాక!! సూర్యునిఁ జీకట్లు కప్పని విధముగ శ్రీహరిని ధ్యానించు నుత్తముని నాపదలు క్రమ్ముకొననేరవనిన పైపద్యార్థము నాలోచింపఁగా నిట సకర్మకార్థకమయిన పొదువు ధాతువుగాని పొదవుగాదు. ఇప్పద్యంబునఁ బోదవు ధాతువే యనినచో నప్పకవీయలక్ష్యపద్యప్రకారముగ నాదివర్ణము లోపించి తనరూపాంతర మవఁబడునట్టి యొదవు శబ్దమువోలె నకర్మకమై పైనింజూపిన యర్థత్రయమునె తెలుపును గావఁ బైపద్యమునందు నర్థసమన్వయంబు లేకపోవును. అదివర్ణలోపములేని తఱిని బోదవునకు గ్రమ్ముటయను నర్థ ముండునన్నచో "ఏకదేశవికృతమనన్యవత్" అను న్యాయంబున జరుగవలె జరుగును, నడచువలెనడుచును చొంబోలెఁ బోదవునకుం బొదువు ధాతురూపాంతరము కావలసివచ్చును అప్పుడు పొదువునకు నున్నయర్థము లన్నియు వినిగమనావిరహంబునఁ బోదవునకును జెప్పకతీరదు. అట్టియర్థములు పొదవునకున్నట్లు కవిప్రయోగంబులఁగానంబడదు. కావున "అనిరిపాటున వెసవిచ్చి పొదవికొనిన" పొదలి॥ యొండొండ దివియును భువియు దెసలుఁ బొదవికొనియుండు చీఁకటి ప్రోవువలన" అనినట్టి తెల్లిన యప్పకవ్యుదాహృతనృసింహపురాణ పద్యములందును "బోదవు" పాఠము ప్రామాదికముగాఁ దోఁచుచుండు. అకర్మకమైనపొదవునకు నాత్మనేపదార్థకమైన కొను ధాత్వనుప్రయోగంబనుక్తంబైనందునను, సకర్మకార్థమే (క్రమ్ముట) యిట సందర్భోచితముగానుండును. [illegible] 'సమంజసంబు

మఱియు, శబ్దరత్నాకరమునందు, ఒనవుధాతువు వైకృతమని యుద్ఘోషింపఁబడుచున్నయది. అపరశబ్దంబులవలన, ఓపరుధాతువైనట్లు లియ్యది యున్యపశబ్దంబులవలన నైనట్లు గ్రంథకర్తల తాత్పర్యముగా స్ఫురించుచున్నది. ఇట్లు పరాపేక్షలేక గీర్వాణవాఙ్మయాంశంబున స్వయంభువుగా నవతరించిన యొనవుధాతువు పూర్వపక్షులమతంబున దేశ్యంబై నిఘంటువులయందును నామరూపంబులులేనిసొనవుధాతువునకు రూపాంతర మెట్లు గాఁజాలును కావుననే? "ఒనువుధాతువు సొనువుయొక్క రూపాంతరమని వ్రాయఁబడినట్లిధాతువు సొదవుయొక్క రూపాంతరమని శబ్దరత్నాకరాదులయందు లిఖింపబడనేలేదు. కర్తృత్వము లోకసన్నమువట్టి సొదవుధాతువు వైకృతమే యని సాధించుటేని యప్పుడు సొదవు రూఢసాహిత్యమునందు వైకృతమనదగినదయ్యెను. నిఘంటువులందు "సొదవు" దేశ్యంబనియే వ్రాయఁబడినది కాన వైకృతమని ప్రసిద్ధికెక్కిన యొదవు సొదవులనఁ గాదగదు. ఒదవునొద్దఁగాని వేఱుగాఁగాని సొదవు నిఘంటువులందు నెత్తుకొనఁబడనందున దాని సత్తయు సంశయాస్పదమై యుయ్యేల లూఁగుచున్నయది. కావున, ఆ "పూనెనెగసెఁ బొదివెఁ బొనరెఁ బొందె" నవియే యప్పకవీయ లక్షణపద్యము చదివినచో సలక్షణముగా నుండును అప్పుడు, 'ఒనవు' నొద్దఁ బొదువుయొక్క రూపాంతరమని వ్రాసిన శబ్దరత్నాకరమును శాస్త్రీయమూలముగా నుండును. పూను ధాత్వర్థమును వివరించుచోఁ నీపద్యము శబ్దరత్నాకరములోఁగూడ నకార మగ్యంబగు సొదవు శబ్దముతోడనే వ్రాయఁబడినది. కాని యది ముద్రాప్రమాదము కావచ్చును. అట్లే కానిచో నొదవునొద్దఁగాని వేఱుగాఁగాని గ్రంథకర్త యీశబ్దము నేల యెత్తుకొని వ్రాయకుండును? బాలవ్యాకరణపుస్తకములందుఁగూడ నీసూత్రము నొద్ద నీశబ్దము సకారమధ్యముగానే దిద్దుట యుక్తంబగుంగాన గ్రంథవిస్తరంబులోఁ జాలును. ఒకవేళ ప్రోచ్ఛనశబ్దవైకృతమైన సొదవు శబ్దం బొకటి యున్నదనియు నందుననే దాని రూపాంతరమైన యొదవువైకృతముగా వ్రాయఁబడినదనియు వచ్చుటంగాని వేఱుకోటంగాని యీశబ్దము నెత్తుకొని వ్రాయకునికి శబ్దరత్నాకరాది గ్రంథకర్తల ప్రమాదమనియుఁ గొంద ఱందురేని "ధాతోరర్థాంతరే వృత్తే ర్ధాత్వర్థేనోపసంగ్రహాత్, ప్రసిద్ధే రవివక్షాతః। కర్మణోఽకర్మికా క్రియా" అను వైయాకరణాచార్యసంకేతసి సకర్మకధాతువు శ్లోకోక్తకారణములచే నకర్మకార్థము నీయవచ్చునుగాని యకర్మకధాతు విష్పన్నంబైన ప్రోచ్ఛనశబ్దము నొక వైకృతం బగునా కినుకగాని సొదవునకు

ఓచ్చెము—గీ॥ అధ్వరారంభమింతొప్పనయ్యె దక్షు। శివునిఁ దోడ్తేని యుఃక్ర-యొచ్చెంబుగాని॥ కాశీ. ౩ ఆ: పంచు-అజ్ఞాపించు-వ॥ తనశిష్యులైన, పైల వైశంపాయన సుమంత జైమినులం బంచి క్రమంబునఁ జతుర్వేదసూత్రంబులఁ జేయించి వేదవ్యాసుం డై-భార. ఆది ౧ ఆ:

మద్విరచితమయిన జార్జిముక్తావళియందలి యీపద్యంబును ౨ ఒఖేక్తి సూచకంబుగా నీసందర్భంబునఁ జేర్పఁబడు.

చెనయు-పోలు—చ॥ తనపతి జన్మవించెనయూ దారయుస్త్రీలు సుగ్రముసంఖ్యనం। దనులు సమాధికవ్యయము సుధామయువాక్కును గల్గు జార్జిపా। వనుఁగనన్నుఁ జూచి యొరుపచ్చ సహింపక పొగరుంకు ఘో, భరింపఁగాంచితమ్మ! పతిభావతిపన్నవసుంధరామణీ॥

ఎనయు—చ॥ వినినజనంబు లీతఁడవివేకియునన్ వలదింతరజ్ఞుల। జ్ఞను బలశౌర్యసంపదలు చూచి యెఱుంగమె? మున్ను నిన్ను నా। తెఱఁగలనం జగం బెఱుఁగదా యాతఁ డద్భుతవిక్రమోజ్జ్వలుం। డెనయఁడె నీవు పౌరుషవిహీనుఁడ వద్ది విశేంద్రనందనున్॥ భార. కర్ణ. ౨ ఆ:

11 సూ—ఆరాటాదులం బ్రథమేతర దీర్ఘంబునకు హ్రస్వంబు విభాషనగు.

ఆరాటము - ఆరటము. ఆరాటము - కకూ-చితి- కేళాకూళి కొమారుఁడు - కొమారిత - గంబూరము - పెండాఱము - బంగారము - బేహారము విటతాటము - సంతోషము.

(వ్యా)—ఆరాటము లోనగు శబ్దంబులందు మొదటి దీర్ఘమునకుంగాక తక్కిన దీర్ఘంబులకు హ్రస్వంబు వికల్పముగా నగు.

ఆరటము-(పరితాపము) క॥ పటునఖర శైత్యమున నారటము శిశిరు రాత్రినే లరసితున్న సింహాన్॥ పాండు. ౫ ఆ:

కస్తురిజెఱ-(లోభము) చ॥ కిలుకులఁ బెట్టి వీరి వశకించితోలంగదమన్న పట్టి కస్తురిజెఱయకాని దైవ మనుకూలముగాదు॥ జై. ౬ ఆ

సీ॥ మనసు కస్తురిజెఱి మెల్లవలేచి చేతులఁ గాంతుని జబ్బగాఁ గౌఁగిలించు, మను ౩ ఆ:

12 సూ—ఓయూరాదులం దొలిదీర్ఘంబునకు హ్రస్వంబు విభాషగు.

ఓయారము - ఒయారము - ఓయూరము - కేళాకూళి - కోలె- గూడారము - గోరువంకపక్షి - జోహారు - నీలుగు - పేడ - బేహారము - దీర్ఘమధ్యమ్ము - మాఱు - మూలుగు - మోఱకు - వీటతాటము - వీడియము. ఇత్యాదులు.

(వ్యా)—సూత్రార్థము స్పష్టము

ఒయారము—గీ॥ రతివిహారంబున గను నోయారమునఁ బొదలి। చంద్ర: ఉయ్యాలాదులం దునికిఁ జేసెఁ ఒయ్యారము. సీ॥ హారముల్ మెఱయ నొయ్యారంబులుగ్రుచ్చి యంపంచ వింతగా నలవరింతు॥ భార. విరా. ౧ ఆ:

గొరువంక—కం॥ గొరువంక యన్నమాటల। పరువంకఁ దలంపుగ్గ్గా మనుపఁ దమలో। గొరువింక నేమిగలదని। యిరుపంకల నగలఁ బొగిలి రెంతయుఁ దంతన్॥ విక్ర ౭ ఆ:

మ॥ శరసంధానముతోనె కొన్నియడుగుల్ జౌజవ్వనం బాతియు। ద్ధరశింగాఁగ్గొని ద్రోణముల్ దివియు దోర్దండంబులం జేఁదియే। పిరిబోయల్ చినుమంచు నార్చి పరగం జిట్టాసలం డాయుమణ్। గొరువంకల్ మొఱవెట్టిన ల్లవంయుల్ ఘోషింపరొప్పిఁచుచున్॥ మను ౪ ఆ: (ఈ శబ్దము నప్పకవి శకటరేఫశబ్దములలోఁ జతించె నది చింత్యంబు)

13 సూ—అడంగ్యాదుల డాకు ణకారంబు విభాషనగు.

అడఁగు - అణఁగు - అడఁచు - కడఁగు - చిల్లాడము - తడగము - నాఁడెము - పోఁడి - మిడుఁగు - నడఁకు - మిడుఁగుఱు ఇత్యాదులడంగ్యాదులు.

పాఁడు—క॥ గుణహీన నిహీతిచేతను । ప్రాఁకిగిరాఁచ తరులతోడ పడుగంబడి యొకో॥ పీఠ. ౪ ఆ:

మిణుఁగురులు—(అగ్నికణములు) చ॥ మిణుఁగురులు లెల్లెడం జెదరమింటను వంటలు వర్వఁగుంటికా । ఘుమఘుమ ఘూర్ణి నిస్వననికాయమునన్ హరిదంతరంళముల్ । పెనఁక మహోగ్రశక్తిఁ గొని యంకదారకుమీఁదవైవ దాఁ(ఱు)గతినింగి నుండినిజరోమలతోఁబను మక్కళైవడిన్॥ భాగ. ౧౦ స్కం ఉ:

14 సూ— దక్కులోనగువాని దాకు డకారంబు విభాషనగు.

దక్కు - డక్కు - దక్కు - దగ్గఱు - దాఁగు - దాఁకలి - దిగు - దిగ్గియ దూయు - దెందము - దేప్పరము - దెప్ప - దొంగ-దొప్ప - ఇత్యాదులు.

(వ్యా)—ఉ॥ డక్కను రాజ్యమంచు నకటా! యిటు తమ్మునిభాగమీక నీవెక్కటి మ్రింగఁజూచెదవు యెట్లటులగున్ వినమీను కోలతన్ । గ్రక్కున నామిషంబు చవిగానము మ్రింగిన చామ్పునూనె! యిట్లుక్కువుఁడైన నీకొనుకు నుల్లము నునటులాఁడగూడునే?॥ భార-ఉద్యో. ౨ ఆ;

డక్కు—ఉ॥ అక్కట మంచభాగ్యునకు నట్టిశనూభవరత్న మొవ్విరేన్ । డక్కునె తాత సిద్ధయుఁ డొడంబడునే కను మేలివస్తువుల్ । పెక్కుదినంబు లుక్కియున్నిబృంద

ము పిల్చినఁ బోటుబంటునై । యుక్కడిదె కేలపోయితి మ్మహాగుణాభూమణుఁ గోలుపోయి తిన్. భార. ద్రో-౨ ఆ:

15 సూ—ఏతాదులకు మువర్ణకంబు పరంబగునపుడు దీర్ఘంబు విభాషనగు.

ఏతము - ఏతాము - ఏతము కళ్లము - గాలము - గుడ్డము - గోణము - గోతము - జాజము - జంజము - జోతము - తణగము - బొండ్లము మండము - లాతము - పీణము. ఇత్యాదులు.

వ్యాఖ్యానము-సీ॥ వాలారు గోరుపెన్ గాలాము చేసినే జేజేహిరణ్యాక్షు శిసు కమునకు॥ పాండు. ౨ఆ: (గాలాము=బడిశము)

జాజాము—(పాలికలయందుఁ బోసిన నవధాన్యములనాఱు) గీ॥ శర్వరీచంద్రపరి ణయ సముదితాంకు । రార్పణక్రియలందు వియద్విభాగ । పాలికలదోఁచు కొత్త జాజాలమొలక । లనఁగఁదారక లొండొంత యంపరించె॥ కవి ౪ ఆ:

లాతాము—సీ॥ కకపాల కేదార.. కటకముద్రితపాణిఁ గులుపలాతాతోఁము గూర్చిపట్టి॥ మను. ౧ ఆ: [సన్యాసులు చేతఁబట్టెడు దండము.]

పీణాము—[సన్నవస్త్రము] కం॥ పన్నీట జలకమాడెను । నున్నని పీణాముగ ట్టెనువిరులు దుఱిమెన్ । సన్నముగ నలఁదెఁగస్తురిఁ । జన్నుల ముత్యాల బన్నసరములు దాల్చెన్॥ జై. 3 ఆ:

16 సూ—పదాంతంబులయి యసంయుక్తంబు లయిన నుఱు రుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.

ఇందు నురుల నుత్వలోపంబు ప్రాయికంబుగ పూర్వకంబులకుఁ జూపట్టెడు॥ మాఁన్నవాడె - మీనువాడె - మిన్వాడె - వత్తురువారు - వత్తు

ర్వాగు - కానుకొనియె - కాన్కొనియె - రాములు - రాముల్ - వనములు - వనముల్.

(వ్యా)—పదము తుదనున్న, ను, రు, లు, వర్ణంబులు సంయుక్తములు గాని యపుడు, వాని యుకారంబునకు లోపంబు బహుళంబుగానగు. ఇందు నున్న, రున్న ముల యుకారమునకు లోపంబు హల్లు పరంబగుచోఁ దఱచుగాను, అవసానమందు విరళంబుగాను, నగును.

ప్రాన్పడు— ప్రభించు —ధాతుజంబైన శబ్దాంబైన యను శబ్దముయొక్క యుకారమునకు లోపంబు ప్రాయికంబగు. సీ॥ సలుపుము దమమును దన్నన్మునిఁ బన్నియుఁ దాన మపాసించి తద్వరమున॥ భార. అర. ౨ ఆ:

కం॥ అనవిని నిరుత్తరుండయి । మనుజేంద్రుఁడు కొంతసేపు ప్రాన్పడి తలఁపున్ వెనఁ గొన నిద్రాహీనం। దనువలయఁ గవిదురులోఁడఁ దానిట్లనియెన్॥ భార. ఉద్యో. ౨ ఆ

శా॥ వాల్మీకి ప్రభృతుల్ కుమారినిటు సంభావింపఁగా మున్నది । క్ష్మాలంక్ రాజా వలంకరించి శుభలగ్నంబుం ప్రతీక్షింపఁగా। నాలోఁ దాను దదగ్రసన్మణివి శేషాన్వేష సన్నద్ధుఁడో । నాలోకాప్తుఁడు చేరరాగ మహీమన్ రత్నాకరప్రాంతముల్॥ వసు. ౬ ఆ:

ఏతత్సూత్రోదాహరణ సందర్భంబున మద్విరచితంబైన జాజీముక్తావళిలోని యిపద్యంబులనుగూడ సంధించి యీగ్రంథంబున నిట్టి తిరుగురపద్యసంఘటనాద్వారంబునఁ బరిపాలనా గౌరవముం గుఱిచి త్రికరణశుద్ధిం దెలిపెద.

వ॥ సాగ కార్ముబ్బులు మంటచా లెన్నపుడుం బోగాదు కన్నీటియే। టిగముల్ సప్పైన దాండ రాత్రిసల ధాత్రీవ్యష్టి రేఁచన్ మహా। యుగమైతోఁచిన దుర్గివాళి బహుగుణ్యకంబు మాయుఁచిభళ్ । ఘగమ్ముంగ్సూత్యుదు ద్రాబ్దిగిరేయ విజయశ్రీవినిర్. ద్ప్రాగ్రి శ్

చ॥ ఘులియనఁదగ్గచోటను గదుంభ్రమఘిల్లి యటందుర్; మామలి ! య్యలజగ దీశ్వరుండలఘులీశ్వరుఁడై తన కూర్మపృష్ఠమం। దెలమి వహింపుమన్నట్లు వహించుము నేఁ జేసి ఘులీశ్వరాఖ్యతోఁ । బిలిచిరి ధర్మజాదులను బేర్వడు మాగతి జార్జిభూపతీ!

మొదటిపద్యములోఁ గార్ముబ్బులు, చాల్మెఱపులు, కన్నీటి, గముల్నల్పి, బల్పగము, చంద్రికల్ (అవసానంబున) అనుచోట్లను; రెండవపద్యమందు, 'పేర్వడు' అనుచోటను, రు, లు, ను వర్ణంబులకు లోపంబని తెలియందగు లువర్ణాంతమైన ధాతుజవిశేషణముయొక్క యుకారమునకును. లోపంబు విశేషంబుగాఁ గానంబడు.

క॥ చిట్టుములు నోకిలింతలు । గట్టంబుగఁ బోడమోఁజవులు దప్పెం గోర్కుల్। బిట్టాడవెఁ బిలుఁదులు౦ జను । కట్టులు వదుబరిసెనపుడు క్రాల్గంటులకున్॥

అన్న. రా. బాల. కాం

సీ॥. విరహాగ్ని నీరీతిఁ గరఁగెనామానసం బనిఁచట్లు వెన్న గాచిన ఘృతంబు । పాలఁబోల్ వయసు నీపాలుజేయుట కిదె యూనవాలన్నట్లు లానవాలు॥

తా రా. శాం. విజ. 3 ఆ:

17 సూ—అచ్ఛికంబులం బదమధ్యంబుల న ల డ ర లయుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.

కినుక - కిన్క॥ కానుక - కాన్క॥ చిలుక - చిల్క॥ కాలువ కాల్వ॥ అడుగు - అడ్గు॥ కడుపు - కడ్పు॥ పెరుగు - పెర్గు కూరుకు కూర్కు.

(వ్యా)— అచ్ఛతెనుఁగుమాటల నడుమనున్న, న, ల, డ, ర, వర్ణంబులమీఁది యుకారమునకు లోపంబు బహుళంబుగా నగు

కిన్క—(లోపము) పంచచామరము॥ అనం గొలంతలేని కిన్కవక్కడించి తోఁడు! గ్రన్నన౯ డెసంగువింటవాలు నారసంబులూని॥ అన్న-రా-యు

చ॥ ఆకులవేణి కీలెడఁగ్రి గూడె విడిచియు నేకతంబునన్ । బాలశుకరాల యీచికురుబోడి కుచార్పితహార నాయకో । జ్జ్వలరుచిఁ గంటిరే యనినఁ జంద్రముఖుల్ చెలువప్పుఁబూనిరో । లలనలఁజూచి, కినుకయుఁ గలంకయుఁ గొంకును నంకురింపఁగన్॥ వసు 3 ఆ:

కానుక—(కానుక) సీ॥ సుమలుగాఁ బొలుచుపూగముల జెన్నొందు పూగములఁ గొన్నింటిఁ గైకానుకచేసి॥ గం॥

కాల్వ—తే॥ గీ॥ కడపఁ గోఁగుల కొకతోట కాల్వయయ్యె॥ అచ్చ.రా. యు.

18 సూ—లాంతియచ్చునకు సహితె మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి.

కలికి - కల్కి - ములికి - ముల్కి - బుడిపి - బుడ్పి

పొలఁతి - పొల్తి..

(వ్యా) తెలుఁగుమాటల నడుమనున్న శికార యుక్తలపు క్వచిత్తుగా లోపంబగు.

కల్కి—(1. ఒప్పిదము 2. మనోజ్ఞురాలు) సీ॥ ఈకల్కి మదనునిచేకటారి యొకాకకాను పెరటపిడి గాంచనేల? తా-శ-విజ 3 ఆ: సీ॥ అత్రిసప్తర్షి చెన్నలరి మాతనంశ్రమహిమఁ గుల్కెడు కల్కి మానికములు వసు. ౬ ఆ:

ముల్కి—(బాణము) వ॥ తనరాజీవశరం బెఱుంగదు నిశాతత్వంబు లేఁగల్వ తూ । పునకుం జాలదు వేగలీలయని యూపూముల్కి లెక్కించి క్రొ । న్ననవిల్కాఁడు నవాంబుజోత్పలవితానంబీను మీనాక్షిలో । చనము ల్వింట ఘటింపఁ బొల్చె నవి నిస్తంద్రాంబకఘ్న్యతుల్॥ వసు. ౨ ఆ:

19 సూ—అబ్బురాదులం దుత్వంబునకు లోపంబు విభాషనగు.

అబ్బురము - అబ్రము - అబ్బరము - కప్పురము - అప్పుడు ఇప్పుడు - ఎప్పుడు - చప్పుడు - నెత్తురు. ఇత్యాదులు.

(వ్యా)—అబ్బురములోనగు తెలుఁగుమాటల నడుమనున్న యుకారము వికల్పంబుగ లోపించును.

అబ్రము—ఉ॥ కాయను మేటితప్పు కొడుకాయను నిద్దపుఁ బూతమావిమో కాయనుఁ బంజరంబుఁ జిలుకాయని నబ్రపు సోయగంబుఁ బ్రో। కాయనుఁ బల్కవేమి యొలుకాయనుఁ బంతము దీలునోటుకై। కాయను స్నేరయిట్లు దుడుకాయనుఁ బాయఁగ నోరికాయనున్ అన్న. రా. అయో.

కప్రము—(కర్పూరము) ఉ॥ చెన్నగునన్నదీపులినసీమల దాగిలిమూత లాడు చున్ । నెన్నెలరేలఁ గప్పురపు విప్పుట నంటుల నీడనీరురా। కన్నెలతోయునన్నలకుఁ గన్నులు మాయఁ నదీయవాసనల్ । మన్ననఁగాంచి కప్రపు దుమారము రేచుసమీర డింభముల్॥ వసు. ౧ ఆ:

20 సూ—చుక్కరక రువర్ణకంబున కుముందఱిదఃవర్ణంబు నుత్వాంబునకులోపంబు విభాషనగు; నగుచోఁ దత్పూర్వంబు గురువుగాదు.

అదురుచు - అద్రుచు॥ ఎదురుచు - ఎద్రుచు॥ పదురుచు - పద్రుచు.

(వ్యా)—రువర్ణమునకుఁ జుగాగమంబు పరమగుచుండ రువర్ణముముందఱిదువర్ణముయొక్క యుకారమునకు లోపంబు వికల్పంబుగానగు. అట్లులోపించుచోదకారరేఫ సంయోగమునఁ బూర్వస్వరము గురువు గాదు. ఇట్టిచ రేఫసంయోగంబే యనోన్యంబును బ్రాసంబుగాఁ జెల్లుననియు నియ్యది లఘుద్విత్వప్రాసంబని పేర్కొనవలెనియు నప్పకవీయ తృతీయాశ్వాసమందు నిట్లు చెప్పంబడియె,

లఘుద్విత్వప్రాసము—తే॥ గీ॥ భువిలఘుద్విత్వ సంజ్ఞకంబులయి కొన్ని । యూ:

దఁబడని కాఁరలతోడనొకటికొకటి । ప్రాసములకగుఁ దములోనఁ బత్రయుగము । విద్రు
చితవతాత్మజాఁడు డెక్కల దుఱ్ఱవనవఁగ॥

అద్రుచు — క॥ ఇలయును నింగియు నద్రువఁ । జెలఁగ మహోగ్రము వారి సేరల గురుచా । నలుక నొప్పిన వక్కఁడ । బఱిఫుఁడే తెంచి సోడుపడె నపవనోత్తా!॥ భార. ద్రో 2 ఆ: క॥ పదిగడల దుఱఁగ నార్చుచుఁ । బదిమోముల జోదులనఁ బదిలుండునుముగ । బదివింటుల గైకొని యు । ప్పది తేరుల తేరికాండు బనెలఁగ నేసెన్॥ క॥ నొప్పినపి వాఁడునద్దయు । నుప్పరమదుఱంగనార్చి యొకవాలుంవూ । పప్పాల ముద్రిమ్మఱి పయిన్ । నుప్పున నదరింప సామ్యగొని యుంతు నెడన్॥ అధ్య. రా. యుద్ధ కాం.

ఇట్లు, "అద్రుచన్" అను శబ్దంబునఁ జాగాగము చకారంబునకు, (క్రి-స-రా సూత్రంబున "పానుపన్, కూరుపన్" ఇత్యాదులయందుబలెఁ. బకారంబు రాక సిద్ధచకారంబునకుం బోలెఁ ప్రయోగంబులనకాగముల కానంబడు ఇటఁ జేర్పరణార్థమును గనంబడును.

చ॥ ఎదిరించినకాలపాశమున నీగతి నీమదిఁ గోత్రసవ్యకన్ । బదిరించిన వారు ఉ-హరి. 8 ఆ:

ఇట్లు, అదుఱుము, ఎదుఱుము, పదుఱుము, అను వాట్లను దకార రేఫసంయోగంబుకు ముందున్న యకారంబును, ఎకారంబును లఘువులే కానఁ బద్యలక్షణభంగంబు గల్గలేదు. కొందఱు ధాత్రశాస్త్రవాది బనంబులలోని రేఫాంతసంయోగంబునకు ముందున్న స్వరమును గూడపలసినచోఁ బద్యలక్షణంబున నొకానొకప్పుడు లఘువులుగా నెన్నకొనవచ్చునందురు. అయ్యది పూర్వోక్తస్థలంబుల విశేషించి లఘుత్వమును విధించిన ప్రకృతసూత్రాప్పకవ్యాది లక్షణంబులం జేసి నిరాకరంబని తెల్లంబగుచున్నయది. విక్రమార్కుని సభలోని నవరత్నంబులలో నొక్కండని ప్రసిద్ధిం జెందిన వరాహమిహిరాచార్యుండు మాత్రము బృహజ్జాతక గ్రంథంబును వ్యాకరణయుక్తంబుగాఁ జత్రివృత్తంబులతోఁ గావ్యంబు భాతిని రచియించి ద్విత్వప్రదేశంబులందు నిట్టిసంయోగంబునకు ముందున్న వర్ణమును లఘువుగా నట్టు లెంచుచుండు.

బృహ—ప్రపఞ్చజ్యోతిషాఖ్యాయము. శాలినీవృత్తము-శ్లో॥ జన్మేశో? స్తైర్య ద్యదృష్టో రథ్యపుత్రం । పశ్యత్యార్కిర్జన్మపంచాబలో నర స్తీక్ష్ణాంపాపిప్పాత్యార్కి దేత్రికాగ్రసంస్థే । శామార్కజ్యం శైసౌమ్యదృష్టేన చందే॥—ఈశ్లోకంబులో ద్వితీయ పాదంబున ద్వితీయగణంబుగా నుండవలసిన తగణంబునకు దరేఫసంయోగంబున భంగము గలుగుచున్నయది. తేల్చి పలుకవలయునని గ్రంథకర్త తాత్పర్యంబు. ఇట్టిదిజ్యోతిశ్శాస్త్రగ్రంథంబులందే యాభాసధామముగాఁ గనంబడు. దీనికి మూలంబు గానరాదు.

21 సూ—జూదాదుల దాకు జకారంబు విభాషనగు.

జూదము — జూజము - అపుదు - జవాది - జాది - జాదు - విరవాద.

(వ్యా—ప్రకృతసూత్రంబునఁ గొన్ని తెలుఁగుశబ్దంబుల, దకారమునకు జకారము వికల్పంబుగా విధింపఁబడుచున్నయది. సంస్కృతభాషలో సయుకమునకాక జకారంబుల పాక్షికోచ్చారణంబుఁ జేసి 'దంపతీ' అనియు జంపతీ అనియు నీశబ్దమును ద్వివిధంబుగాఁ బలుకవచ్చును ప్రాకృతభాషయందుఁ గేవల దకారమునకు జకారవిధి లేదు గానివకారసంయుక్త సాంస్కృతికదకారమునకు-సూ-త్వత్వద్వాన్వాంక్వచిచ్చధ జఝాః॥ అనుసూత్రమున జకారం బక్కావిత్కముగా విధింపంబడియె. ఇట్లు భాషాంతరములయందును దకార జకారములకు మైత్రి క్వచిత్తుగానుండు.

22 సూ—నిందయం దామ్రేడితంబు నాద్యక్షరములకు హ్రస్వదీర్ఘంబులకుగి గీ లగు.

కుంభకర్ణుఁడు - గింభకర్ణుఁడు॥ రావణుఁడు - గీవణుఁడు.

(వ్యా)—రెండవపర్యాయంబున నుచ్చరించు మాటయొక్క మొదటిస్వరము హ్రస్వంబయ్యె నేని, గి, వర్ణంబును, దీర్ఘంబయ్యె నేని గీ, వర్ణంబును నిందయందు క్రమముగా నగు.

ఉ॥ అంచపులుమాయిడోదు సలరారఁగఁజేసి కడింటికోరికల్ । గాంచి నవోఢ రక్కసి కొలంబున కెల్లను మేలుబంతియై । మంచపుఁగోడు తాలుపరిమన్కి బిహారపు

మెట్టు నెంతయుం । గొట్టక యెత్తి నట్టి నినుఁ గోతులు గీతులు గల్వఁజాలునే? అవ్వం ద్వా. యు... కాం.

క॥ డింభక సర్వస్థలముల । నంభోరుహనేత్రుఁ డుండు నతఁడు మికలఁడే । రంభ బునఁ బరికింపవే । స్తంభంబునఁ జూపఁగలవె చక్రిం గ్రక్కి ॥ భాగ. 6 స్క:

ఆ॥ వె॥ పసుల గొల్లలను గిరులను నీరు । జాతములను గీరజాతములను విగ్రహింపనీని విహాంత తోషుగా । నెఱది వెతలు నిపిన వీధులకును॥ పసు. 3 ఆ

ఇటఁ జక్రధర శబ్దముల మొదటి హ్రస్వమునకు, గికారమును, "కాతులు నీరజాతములను" అను మాటల మొదటిదీర్ఘమునకు నూతకీలని గీకారంబును నయ్యెనని యెఱుంగునది.

23 సూ—పాదంబునం బ్రథమద్వితీయాక్షరములు వళిప్రాసం బులునాఁబడు.

(వ్యా)—పద్యపాదమునొక్క మొదటియక్షరంబునకు వళి యనియుఁ రెండవ యక్షరమునకుఁ బ్రాసమనియు, లక్షణగ్రంథములయందు సంజ్ఞగలదని యర్థము.

24—సూ—యవలలు లఘ్వలఘువులు మైత్రిం బొరయు రేఫం బులుపొరయవు.

వ్యా—యకారవకారలకారములు లఘువులును నలఘువులును యతిప్రాసములం దు నన్యోన్యమైత్రి గలిగియుండు. అట్లు లఘ్వలఘువులైన రేఫంబులు మాత్రము మైత్రితో నుండనేరవు.

ఉదా—క॥ అన్నలుఁ దమ్ములుఁ గలుగుట । యున్నతుగాఁ జేయు నెంతయు నున్నతిం దా । నన్నరయనీయలేయను సం । పన్నంబులు గాఁగ వారిఁ బాటించుటకున్ భా-శాం 2 ఆ: (ఇందు యతిమైత్రి)).

25 సూ.— శేషంబులు లఘ్వలఘువులుం దత్కాలంగల విశేషంబులు నార్యవ్యవహారంబునం దెలియుట శ్రేయంబు.

వ్యా.— లఘువనియు నలఘువనియు శేషంబు ద్వివిధంబు. ఆభేదము సర్వలక్షణసారసంగ్రహము, అప్పకవీయము మొదలగు నితరగ్రంథముల సాహాయ్యంబునం దెలియందగు. కావున నట్టిభేదవిస్తరంబు గ్రంథవిస్తరభీతిం జేసి యిట వివరింపను.

ఇంకను నార్యులచేత నవలంబింపఁబడిన విశేషంబులం దెలిసికొని వ్యవహరించుట శ్రేయోదాయకము. "మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే వీరపురుషాణ్యాయుష్మత్పురుషాణి భవంతి అధ్యేతారశ్చ ప్రవక్తారో భవంతి" యను భాష్యకారవచనంబున మంగళార్థముగాను గ్రంథాంతమునను శ్రేయశ్శబ్దము ప్రయోగింపఁబడినదని యెఱుంగునది.

మహాభాష్యప్రారంభమున గ్రామ్యభాషానిరసనం బొనర్చి వ్యాకరణప్రయోజనంబును స్థిరపఱిచినట్లీ సూత్రము నొద్ద సందర్భానుకూలంబు గాన నార్యులకు నాదరణీయముగాని గ్రామ్యభాషను ఖండించి వ్యాకరణప్రయోజనంబును దృఢపఱుపుటయే కాక యింకను గొన్ని విశేషంబులు చర్చించి యార్యవ్యవహారంబు శ్రేయోదాయకంబని ప్రదర్శింపఁబడును.

## గ్రామ్యభాషాఖండనము.

శ్లో॥ సారశ్లేష విశేషచిత్రఘటితామోదాత్తసద్రూపకై
ర్వ్యక్తోత్ప్రేక్ష విరేకవద్భిరుపమిత్యాద్యన్యదృష్టాంతకైః।
వృత్తైరక్తనవీనరీతిఘటితైస్సన్మార్గణైర్జృంభితై
ర్నిర్దోషైర్వివిధైరలంకృతిగణైరమ్యా రసౌరాజతే॥

(సాహిత్యరత్నాకరము)

ఉపమ, ఉత్ప్రేక్ష, సారాలంకారము మొదలగు నలంకారములును, మాధుర్యము మొదలగు గుణములును గల వాక్యములయందు ఘటిల్లినందున రసము ప్రకాశించుచుఁ

బ్రాహ్మణునిచేత నపశబ్దము పలుకఁబడఁగూడదు.' మ్లేచ్ఛునఁగా నపశబ్దము గాన
నది యవలంబించినచో బ్రాహ్మణుఁడు కూడ మ్లేచ్ఛుఁడగును. అట్లు మ్లేచ్ఛులము గా
కుండుటకై వ్యాకరణాధ్యయనము సేయవలయునని యర్థము. పైనివ్రాసిన భాష్య
తాత్పర్యము చూడఁగా గ్రామ్యభాషావలంబనమున బ్రాహ్మణుఁడే మ్లేచ్ఛుఁడగునని
స్పష్టపడుచున్నందున వేఱే మ్లేచ్ఛజాతి లేక మనమే మ్లేచ్ఛులమై శ్లో॥ ఏకత్రింశాను
రాగశ్చేత్తిర్యక్ప్రేక్షణ్యగతోపివా॥ యోషితో బహుసక్తిశ్చేద్రసాభాసస్త్రిధామతః॥
అని నిర్ణయించిన యాలంకారికులఁ గూడ సులభముగాఁ జేఁజిక్కి పైశ్లోకంబునఁ దిర్య
గ్జంతువులతో సాహచర్యంబుగాఁ బరిగణింపఁబడి ద్వంద్వంబునఁ దులఁదూఁగుచున్న మ్లె
చ్ఛులకుదాహరణమై రసాభాసమున కాస్పదమగుదుము. మఱియు వ్యాకరణశాస్త్రప్ర
యోజన ప్రకరణమందే పతంజలిభగవద్వాక్యమిట్లు చాటుచున్నయది. "అథవాభూ
యానధర్మః ప్రాప్నోతి। భూయాంసో పశబ్దాః। అల్పీయాంసశ్శబ్దాః। ఏకైకస్యహిశ
బ్దస్యబహవో పభ్రంశాః తద్యథాగౌరిత్యస్య శబ్దస్యగావీగోణీగోతాగోపోతలికే త్యేవ
మాదయో బహవో పభ్రంశాః! అథయో వాగ్యోగవిత్ అజ్ఞానంతస్యశరణం॥ శ్రు॥ సక్తు
మివతితఉనా। పునంతో యత్రధీరా మనసావాచమక్రత। అత్రాసఖాయస్సఖ్యానిజా
నతే। భద్రైషాంలక్ష్మీర్నిహితాధివాచి॥ లోకములో నొకశబ్దంబునకు దేశము, జాతి,
కులము, పురుషుఁడు మొదలగుభేదంబులను బట్టి యనేకవిధంబుగా నపశబ్దంబులు ప్ర
యోగించుటవలన నధర్మమగుకంటె నధర్మమే యధికంబగుచుండుననియు, శాస్త్రప్రోదిత
మైన యొక 'గో' శబ్దంబునకు, 'గావి, గోణి, గోత, గోపోతలిక,' మొదలగు నపశబ్దం
బులు పెక్కులు లోకవ్యవహారమునఁ గానవచ్చుచున్నవి యనియు, లోకములో బుద్ధి
మంతులు కొంతలో మిళితంబైన పరిశుద్ధపదార్థములను జల్లెడతో జల్లించి విడఁదీయునట్లు
వ్యాకరణవేత్తలు వ్యవహారమునఁ గానఁబడు ప్రాబల్యంబున నపశబ్దంబులతోఁ గలసిమెలసి
యున్న సుశబ్దంబులను వ్యాకరణజ్ఞానమున వేఱుపఱచి గ్రహింతురు అట్టి బ్రహ్మప్రతిపా
దక శబ్దమునందు భేదబుద్ధిలేక సమానజ్ఞానులయి సఖ్యంబుల నొందుచుందురనియు న
ట్టివారి వాక్కులయందే భద్రంబైన లక్ష్మి నివసించుననియుఁ బైవాక్యంబులకు ఫలితార్థము
కాఁబట్టి యనేకగ్రంథప్రమాణంబులఁ బరిశీలించినను యుక్తాయుక్తంబులగు వాక్యంబుల
విమర్శించినను శాస్త్రమర్యాదకు వెలుపలైన గ్రామ్యభాష రసాభాసంబునకుఁ బుట్టినిల్ల
యి గర్హణీయంబుగాని గౌరవయోగ్యంబుగాదని స్పష్టపడుచున్నది. నాటకంబులందు

నీచపాత్రంబుల కుచితంబు గాన నీగ్రామ్యంబునకుఁ గావలసినంత యవకాశమిచ్చి యుత్తమపాత్రంబుల యందుమాత్రము రిత్త సేయవలయును.

ఇంక నుత్తములు ప్రయోగింపనట్టి సంభాషణంబుననే గ్రంథరచన చేయవలయునన్న యంశముగూడఁ గొంతచర్చించి చూతము.. 'శ్లో॥ శతేషుజాయతేశూరః॥ సహస్రేషుచపండితః' అను న్యాయంబునఁ బామరసంఖ్యకంటెఁ బండితసంఖ్య మిక్కిలి స్వల్పంబుగదా! పామరులతో సంబంధంబునంగాని, శాస్త్రీయముగా మాటాడినచోఁ బామరులు తెలిసికొనలేక నవ్వుదురన్నసిగ్గునంగాని పండితులును వ్యవహారమునందు నిలయి లుపయోగించినంత గ్రామ్యంబు నుపయోగింపకున్నను మొత్తముమీఁద నపశబ్దంబులను సయితము క్రియాభాగంబులలో వాడుచుందురు. లోకవ్యవహారమునందు నొక వేళ వ్యాకరణయుక్తంబుగా మాటాడినను నట్టిమాటలు రసవంతంబయిన యొక యుత్తమ గ్రంథంబును రచించుటకు నెంతమాత్రమును జాలియుండవు. వ్యవహారావస్థలో మనకు వలసిన వస్తువులను వాడుకొనుటకు నవసరము దీర్చునట్టిమాటలు వ్యాకరణయుక్తముగ నుపయోగించినంతమాత్రముననే మనము ప్రాఁజదువుల బ్రహ్మలమనిపించుకొందుమేని, మన గృహాధిష్ఠానదేవతలయిన స్త్రీలు సయితము కొంచెము వ్యాకరణాంశము మనకంటెఁ దక్కువగాఁగ నట్టి ద్రవ్యగుణక్రియలపేర్లను బ్రతిదివసంబును బ్రయోగించుచుందురు గాన వారునుగూడఁ జదువులసరస్వతీ దేవతలనియే చెప్పందగియుందురు. ఇట్లు ప్రతి గృహంబును బ్రహ్మణీబ్రహ్మలతో నిండారుచుండును. కావునఁ నిట్టి పేలపిండివంటి పేలవంపుమాటలతో నిండిననీరసగ్రంథంబులను నాకర్ణించినవారు కావ్యరసామృతంబును గర్ణపుటంబులతోఁ జాఱలాడి జాత్రైతువిబుధాగ్రగణ్యులగుదురని యెన్నటికిని దలఁపఁగూడదు. మనముత్తములనుకొన్నజనులు మాటాడుభాషగూడ గ్రామ్యాంశసంకీర్ణమై గ్రాంథికశైలికి ననువుగా నుండనందున గురుకులవాసముచేసి సమార్జించిన సరస్వతీ కరుణాకటాక్షంబు ననుసరించియే గ్రంథంబులు రచియింపవలయునని సిద్ధాంతము గుమన్నది.

మఱియు, పతంజలిభగవానులు శాస్త్రీయములుగాని శబ్దంబులు ప్రయోగింప నర్హంబులుగానని భూవాది సూత్రభాష్యంబుననిట్లు వాక్రుచ్చి యుపసంహరించిరి ॥ఏతేషామప్యాణవయత్యాది నివృత్త్యర్థః పాఠః కర్తవ్యః। కేపునరాణవయత్యాదయః।

ఆనావయతి వర్ధయతీతి । శిష్టప్రయోగాదానావయత్యాదీనాం నిష్పత్తిర్భవిష్యతి । నహా వశ్యం శిష్టప్రయోగ ఉపాస్యః। యేపి పశ్యంతే తేషామపి విపర్యాసనిష్పత్త్యర్థః। లోకేహి కృష్యర్థే కసిం ప్రయుంజతే। దృశ్యర్థే దిసిమ్॥ లౌకికవ్యవహారదశయందుఁ బ్రయోగించినంతమాత్రమున సిద్ధములైన "ఆనావయతి, వర్ధయతి" ఇత్యాదులును, కృషధాత్వర్థమందు "కసి" శబ్దంబును, దృశిర్ ధాత్వర్థమందు "దిసి" శబ్దంబును లోకులు ప్రయోగింపఁగా నట్టిశబ్దంబులను శిష్టసమ్మతములు గానందున శాస్త్రీయములు గావని తొలఁగించుటకై భూధాతువు మున్నఁగాఁగల ధాతుపాఠోక్తధాతువులెల్లను నానుపూర్వివిశేషంబుతోఁ బఠింపఁదగినవని పూర్వోక్తభాష్యతాత్పర్యము. ఈభాష్యంబును నాలోచింపఁగా గీర్వాణభాషకుంగూడ వ్యావహారికభాషాసాంకర్యంబున వికృతి సంభవించునో శిష్టప్రయోగంబులును వ్యాకరణాదులును బరిశీలించుకొని శబ్దదోషంబులు తొలంగింపవలయునని తోఁచుచున్నందున నారీతినే శిష్టులయిన నన్నయభట్టారకాదిప్రయోగంబులను దత్ప్రణీతవ్యాకరణాదులను దెలిసికొని పామరబృందముచేతఁ బరిగృహీతమయిన రసాభాసభాషను బాఱఁద్రోలి సరసభాషాపద్ధతిసారస్యంబునే రసికు లాస్వాదింతురుగాక!!

## అర్ధానుస్వారము.

అర్ధానుస్వారము తనకుముందున్న స్వరము (అచ్చు) ననునాసికమని సూచించుటకు నిర్ణయింపఁబడిన చిహ్నమయి యున్నది. సంస్కృతశబ్దంబులయందుఁగూడ "అభ్రి, ఆఅవః॥ ఊ ఇతి। విద్వాఁల్లిఖతి॥ పయ్యన్తా ఇత్యాదిశబ్దంబులయందు నర్ధచంద్రాకారచిహ్నంబులు దేవనాగరగ్రంథంబులందు ననునాసికంబులయిన యక్షరంబుల శిరంబులపయి వ్రాయఁబడుచున్నయవి. అనునాసికాక్షరము సూ॥ ముఖనాసికావచనో నునాసికః అను సూత్రప్రకారంబున ముఖనాసికం బుభయముయొక్క మేళనంబుతో నుచ్చరింపఁబడుఁ నదిగాన నట్టియక్షరముయొక్క సగముభాగ ముచ్చారణలో నాసికముఁ జెందినదని పెద్దలు మూలదృష్టిని దానిని సూచించుటకై యర్ధచంద్రాకారరేఖలను చిహ్నములు

గా నేర్పఱిచి యుండవచ్చును. నాగరగ్రంథంబులయందు నక్షరంబుల శిరంబులపయి నున్న యూరేఖలే యనునాసికములయిన తెలుఁగువర్ణంబులలో వానిపార్శ్వంబునకుఁ గాలక్రమంబున జరిగియుండవచ్చును. అనునాసికాక్షరముయొక్క యుచ్చారణము ముఖంబునకును నాసికకును సమభాగంబుగాఁ జెందునని సూచించుటకే గాక వేఱొకలాభం బనకైకూడఁ దెలుఁగువర్ణంబుల పార్శ్వంబులయందే యర్ధచంద్రరేఖలు వ్రాసియుందురు. హ్రస్వంబులయిన యనునాసికాక్షరములతరువాత వైకల్పికముగా నిండుసున్నలు వచ్చునకాన మునుపు నిరూపింపఁబడిన యరసున్నలే నిండుసున్నలగునని చదువరులకు సులభముగా బోధపడుటకై యట్లు గావించియుండవచ్చును. సున్న తెలుఁగుభాషలోఁ బార్శ్వమందును, సంస్కృతంబున వర్ణంబుల శిరంబునందును వ్రాయుట సంప్రదాయంబుగా నున్నదిగదా?

తెలుఁగుభాషయందువలెనే సంస్కృతభాషయందును సయితము విరళంబుగాఁ గొన్ని శబ్దంబులందు ననునాసికవర్ణంబులపయిని నిండుసున్నలు వచ్చుట శాస్త్రీయము గావున నర్ధచంద్రరేఖలు పూర్ణానుస్వారములుండునట్టి యక్షరంబుల శిరంబులపయినే వ్రాయఁబడుట పరంపరగా వచ్చుచున్నదియని తోఁచుచున్నది. అట్టి శబ్దంబులెవ్వియనఁగా (1) సస్కర్తా సంస్కర్తా (2) పుస్కోకిలః, పుంస్కోకిలః (3) పుస్పుత్రః, పుంస్పుత్రః, (4) శార్ఙ్గిశ్ఛింధి శార్ఙ్గింశ్ఛింధి (5) చక్రిస్త్రాయస్వ; చక్రిఁస్త్రాయస్వ ఇత్యాదులందు। సూ॥ అత్రానునాసికః। పూర్వస్యతువా సూ॥ అనునాసికాత్పరోనుస్వారః॥ అనుసూత్రంబులచే ననునాసిక పూర్ణానుస్వారంబులు వికల్పంబు నగుచున్నవియని పండితలోకంబునకు విశదమయినవిషయము. భాషయొక్క రీతి ననుసరించి తెలుఁగులోఁ గొన్నిశబ్దంబులందే హ్రస్వంబు లనునాసికంబులై (అరసున్నగుఱుతులతోఁ గూడినవియై) వికల్పంబుగాఁ బూర్ణానుస్వారయుక్తంబులగుటయు, సంస్కృతంబులో, పైనిఁ జూపినరీతిని గొన్నిశబ్దంబులందు మాత్రమే యచ్చులనునాసికంబులై వికల్పంబుగా నిండుసున్నలగుటయు సంప్రదాయంబుగా నున్నయది. కాని సంస్కృతంబున నింకొక విశేషంబు కలదు. శ్లో॥ "అమోనునాసికా నహౌ। నాదినోహఝుశఃస్మృతాః। ఈషన్నాదా యణోజశ్చ। శ్వాసినస్తు ఖఫాదయః." అను శిక్షావచనంబు నుదాహరించుచు [illegible] ఘోషమోః। వహేత్కృష

లక్షణ మైచస్స్వస్యప్లుత ఇకారస్య చానునాసికస్యా దర్శనాదిత్యలం॥' అని శబ్దేందు శేఖరంబున నాగేశపండితుఁడు. అచ్ప్రత్యాహారములోనివియైనందునఁ బ్రాప్తించిన యానునాసిక్యధర్మంబును ప్లుత ఇకారంబునకును రేఫహకారంబులకును. ఐఔలకును, నిషేధించియున్నారు. తెలుఁగుభాషలో నట్లుగాక, 'పైఁడి, పైఁట, సైఁపు, సైఁదము, ఔఁగాక, కౌఁగిలి, కౌఁజు, ఇత్యాదులయందు నైకారమునకును నౌకారమునకును గూడ ననునాసికత్వము గానిపించుచున్నది. అనఁగా నర్ధానుస్వారములుండుచున్నవి. ఇంతియె కాక సంస్కృతంబునవలెనే తెలుఁగులో సయితము కొన్నిశబ్దంబు లర్ధానుస్వారము నొందినప్పుడే (అనఁగా అనునాసికధర్మము కలిగియున్నప్పుడే) యుక్తమయిన యర్థంబు నిచ్చుచుండును గాని యట్లు కానిచో విపరీతార్థమాగుచుండును. 'ఊఁ" అనుశబ్దం బనునాసికమయిన సమయంబుననే ప్రశ్నంబును, కథయొక్క వినికిని, తెలుపుచున్న యది లేనిచో నిషిద్ధార్థకంబగును, 'ఆఁ, ఆఁ,' అనుశబ్దంబునందు నాకారము అననాసికమయినపుడే 'ఆఁగు' మన్న యర్థము నిచ్చును గాని యట్లు కానిచో విపరీతార్థమిచ్చును ఏఁచు, వెలుఁగుఁ పెరుఁగు, పాఁడి, యిత్యాదులలోనఁ బైనిఁజూపినరీతి ననునాసికములయినపుడే క్రమముగా బాధించుట, కిరణము, వర్ధిల్లుట, క్షీరసంపద, యనునర్థంబుల నిచ్చును గాని యట్లు కానిచో వేఱొకయర్థంబుల నిచ్చును, మఱియు 'వచ్చెఁ గమలాక్షుఁడు, మెచ్చెఁ దాశరసాక్షుఁడు, ఇత్యాదిశబ్దద్వయసంధి స్థలంబులందును లోపించిన వకారముయొక్క యానునాసిక్యమును సమీపస్థలములయిన 'ఎ'కారములు తెలుపుననియే యట్టిచోటను నర్ధానుస్వారములు వాగనుశాసనులచే వ్యాకరణంబున విధింపఁబడినవి. అర్ధానుస్వారము తెలుఁగున దీసివేయఁబడెనేని లోపించిన వకారముయొక్క యనునాసికధర్మమును సమీపస్థమయిన 'ఎ'కారము తెలుపక పోవలసి యుండును మేమట్టి స్థలంబులయందు సయితము నాసికాసంబంధముతో నుచ్చరింపమని పట్టుసలతోఁ గొంద ఉందురేని శాస్త్రమందు దయచేతను వారు పలుకవలయునేకాని యట్లుకానిచో నెవ రేమిసేయఁగలరు. 'సయ్యన్తా; సవత్సరః; పుల్లింగమ్: విగ్వాల్లిఖతి' ఇత్యాదులందు ననునాసికములకు బదులుగా వచ్చినవిగాన నట్టిస్థలములయందలి యకార వకారలకారంబుల నాసికాసంబంధంబున నుచ్చరింపవలయుననిశాస్త్రము బోధించుచున్నను నాధునాగ్ణంబులకు నానునాసిక్య మచ్చారణ శక్యముకుఁ గారణము గాన మేము తీసివేయుచుగు

మనియుఁ బైస్థలంబులందు ముక్కుతోఁగాక కేవలము ముఖంబుతోనే పలుకుదుమనియు నెవ్వరైన బ్రాహ్మణులు వితండవాదంబునకు డీకొందురేని వారిముక్కును బలాత్కారముగాఁ బట్టి పరీక్షించుట యెవ్వరితరమగును ? అనునాసిక్యము లేదనియు, అరసున్న లేదనియు వారే యెదుటువారి ముక్కును బట్టుకొని ప్రతిబంధింపఁ బ్రయత్నించుచున్నారుగదా? శాస్త్రవిశ్వాసముచేతను, లోపించిన యనునాసికాక్షరంబులగుణంబును భాషాశైలింజేసి యాదేశవర్ణంబులును సమీపస్థవర్ణంబులునుదెలుపుట యుక్తంబగునన్న యుక్తిచేతను, మనసాక్షి బోధింపగాఁ బల్కవలసినదేగాని లేనియెడ నెవ్వరట్లుం జేయింప సమర్థులగుదురు? అరసున్న (లేక) యనునాసిక్యము లేదనినవారి క్రిందిస్థలంబులయొద్ద నట్టిసూత్రంబును బన్నుదురో యడుగుమన్నారము. బా. క్రి. సూ. 89 "ఖండబిందువుమీఁది సిద్ధనకారంబునకు ముత్తుపరంబగునపుడు పకారంబు ప్రాయికంబుగా నగు" ఉదా, తలఁపక; త్రేఁపక, నోఁపక; అరసున్నలు లేనివారి మతంబునందు నట్టినకారంబునకుఁ బకారము రావలసియుండునో యెట్టినకారమునకు॥ సూ॥ 88. ప్రకారమున వకారము రావలయునో తెలియక బుద్ధి డోలాయమాన మగుచుండును. అరసున్న యున్నయెడల 'ప్రతిజ్ఞానునాసిక్యాః పాణినీయాః' అను న్యాయంబున శిష్యపరంపరాప్రవాహముగా వ్రాయఁబడుచున్న యర్ధబిందువుతరువాతినకారంబును దోసికాని సూత్రమును సులభముగా నుపయోగింతురు

గీ. ధామకలితుండనై శూరతరుఁడగునరుఁ
డొప్పెసఁగురుచిరయశో మహోదయతను।
రాఘవపాండవీయము. ద్వితీ. 80 పద్యము.

ఇట భారతార్థమందు సగురు చిర యశోమహోదయతిన్; ఘనమయిన చిరకీర్త్యతిశయములతోఁ గూడిన వాఁడవుటచేత; రామాయణార్థమందు, రుచిర యశోమహోదయతన్, ఒప్పెసఁగున్ అని వ్రాయఁబడినది. రామాయణార్థములోని యొసఁగు శబ్దములో నరసున్న యున్నందునను, భారతార్థములోని సాంస్కృతికసగురు శబ్దములో నరసున్న లేనందునను, బద్యపాఠసమయంబునఁ బరస్పరవిరుద్ధంబయినయను నాసికత్వానునాసికత్వధర్మంబు లొక్కమాఱుచ్ఛరింపఁగా శక్యంబులుగానందునను, నిట శ్లేషార్థమెట్లు పొసఁగునని యెవ్వరైన శంకింతురేని సావధానచిత్తంబుతో వినుండు అర

సున్న తనకుఁ బూర్వమందున్నయచ్చు, అనునాసికమయినట్లు గుఱుతని యీవఱలో జెప్పియున్నాఁడను కాబట్టి యొసఁగుశబ్దములోని 'అ'కారము నిత్యముగా ననునాసికముగాన ననునాసికముకానేరదు. కాని సంస్కృతమయినసగురుశబ్దములోని 'అ'కారము, అనునాసికముకూడఁ గావచ్చును. ప్రమాణము. 'అ, ఇ, ఉ, ఋ ఏషాం వర్ణానాం ప్రత్యేకమష్టాదశభేదాః' అని "ముఖనాసికావచనోనునాసికః, అనుసూత్రము క్రింద వ్రాయబడినది. యత్నపూర్వకముగా సర్వదాయనునాసికము కావలయునని యుచ్చరింపఁబడినయచ్చు, అననునాసికముగా నేరదు కాని సామాన్యముగా నుచ్చరింపఁబడిన యచ్చునుభయంబును గావచ్చునని సంస్కృతవ్యాకరణశాస్త్రమందుఁ బారిభాషికంబుగా మర్యాద సేయఁ బడినది. కాబట్టి యొసఁగు శబ్దములోని సకారము సానునాసికమయిన నుసగురుశబ్దములోని సకారము నిరనునాసికముగావఁ బన్యథాసమయంబున సకారము నిరనునాసికముగ నుచ్చరింపఁబడెనేని సానునాసికంబునకును గ్రహణంబు గలిగి రామాయణభారతార్థంబు లుభయంబును జొపంగును. ఇట్లు కిరణవాచకమైన వెలుఁగుశబ్దములోని లకారమువీఁదనున్న "ఉ"కారము సర్వదా యనునాసికముగాన ననునాసికము కానేరదు గాని, యావరణవాచకమైన వెలుగుశబ్దములోని "ఉ"కారము నిరనునాసికమయినందున శాస్త్రంబున ననునాసికముగూడ గ్రహింపవచ్చును. కావుననే వెలుగు మొదలగు శబ్దంబులకు నానార్థంబులుచెప్పిన నిఘంటుకారుల వాక్యంబును సమంజసంబగుచున్నది. సామాన్యముగా నుచ్చరింపఁబడినవర్ణం బనునాసికంబును గావచ్చుటకుఁ బరిభాషేందుశేఖరములోని మూటతొమ్మిదవపరిభాషలో నిట్లు వ్రాయఁబడియున్నది, "అభేదకాగుణాః। అసతి యత్నే స్వరూపేణోచ్చారితోగుణోభేదకోనవివక్షిత ఇత్యర్థః"॥ గుణశబ్దముచేతను దాత్తానుదాత్తస్వరితములే కాక యానునాసిక్యముగూడ నర్థమగుననుటకు "యవాత్సృతీయాస్త్రాపంచమా। అనునాసిక్యమేషామధికోగుణః"॥ అను పతంజలి భగవద్వాక్యంబు ప్రమాణంబుగాఁ బరిఢవిల్లుచున్నది. కావున నుపాయాంతరంబులేమిం జేసి పైనిం జూపిన సాంస్కృతికవ్యాకరణ సంకేతిత సంప్రదాయంబు ననుసరించియర్థబిందుపులున్న శ్లేషస్థలంబులయందు నిట్లుసవరణమగునని యుభయభాషానిరంకుశమైన యగాధపాండిత్యముగల మూరకవీంద్రాదుల యభిప్రాయమగునట్లు స్పష్టమగుచున్నది. పైనిం జూపిన భాష్యకారులవచనంబున నానునాసిక్యధర్మము గౌణధర్మముగాని ముఖ్యధర్మంబు గాదనుటకుఁ బన్యథుకనవక్ష

యంబున నట్టిధర్మంబును వివక్షసేయుచున్నారు శ్లేషార్థంబునకుం గొంత కలుగవనియే నాతాత్పర్యము. ఇట్లు ప్రమాణంబులుచూపినను ననునాసికంబుల (అనఁగా నరసున్నల) నంగీకరింపనివారికి జలభారావస్థలోఁగాక శాస్త్రీయావస్థలో నాసికతోఁ బ్రయోజనం బులేనందున నది యున్నను లేనిదియై "నవిద్యతేఽనాసికాస్థితి. యస్యాసా" అనువ్యుత్పత్త్యర్థమునుబట్టి నాసికాశబ్దంబు (లేనిది) మాత్రము తన్మతంబున సాధువయి యవయవంబు నిష్ఫలంబగుంగాక !!

---

## పూర్ణానుస్వారము.

ఉదా:—(1) వంక (2) కంచె (3) పంద (4) వంట (5) కొంత (6) కొంప ఇత్యాదులయందుఁ గచటతపలకు ముందున్న పూర్ణేందు బింబాకారము పూర్ణానుస్వార మనంబడును. ఆబాలగోపాలమును పేర్ప్రతిష్ఠలఁబొంది విబుధులసంఘముఁ గడుపునిండాఁగఁ జేయునంతటి యానందంబును గొల్పుంజాలుచుఁ గువలయంబునకుఁ గన్నులపండువయ్యెడి యీపూర్ణేందుబింబాకారము తెలుంగుప్రపంచంబున వెలుంగుచుం డుమండఁగా నిట్టి యాకారము నామమాత్రావశిష్టమేకాని విధిచోదితంబుగాదని తెలుంగున సున్నకు సున్న పెట్టునట్టి యాధునికవాదం బొకటియుదయమందెడి. ఆవాదసారాంశ మేమనఁగా:—

(1) అంకః (2) క్రౌంచః (3) ఘంటా (4) దంతః (5) కంపః, ఇత్యాదిస్థలంబులందు నిట్లు ప్రథమావస్థలోఁ బూర్ణబిందువుండఁగా "అనుస్వారస్యయయి పరసవర్ణః" అనుపాణినిసూత్రంబునఁ (బరసవర్ణమంటిరి) పూర్ణబిందువునకు యయ్ప్రత్యాహారములోని వర్ణముపరమగుచుండఁగా సున్నకుఁ దర్వాతివర్ణముయొక్క వర్గములోని పఞ్చమాక్షరము నిత్యముగా నాదేశమగుననుటచేత (1) అఙ్కః (2) క్రౌఞ్చః (3) ఘణ్టా (4) దన్తః (5) కమ్పః, అని క్రమముగ సంస్కృతభాషలో ఙ, ఞ, ణ, న, మ, లాదేశములగుచున్నవిగదా? అనఁగాఁ బూర్ణబిందువునకుఁ గంఠ్యములగు ( గుట్టరల్ ) క, ఖ, గ, ఘ, ఙ, లు పరమగుచో ఙకారమును; తాలవ్యములౌ ( పలటల్సు ) చ, ఛ, జ, ఝ, ఞ, లు పరమగుచో, ఞకారమును; మూర్ధన్యములౌ ( సెరిబ్రల్సు ) ట, ఠ, డ, ఢ, ణ, లు పరమగుచో ణకారమును; దంత్యములౌ ( డెంటల్సు ) త, థ, ద, ధ, న, లు పరమగుచో నకారము; ఓష్ఠ్యములౌ ( లాబ్యల్సు ) ప, ఫ,

[1] [2]

కమ్పః—ఇట బిందువునకు నోష్ఠ్యత్వాను నాసిక్యసాధర్మ్యము గల మకారాదేశము.

ఇట్లు గీర్వాణభాషావ్యాకరణకర్తయైన పాణిని మునీంద్రుండు తన సంపూర్ణానుభవంబునం జేసి "అనుస్వారస్యయయి పరసవర్ణః" అనుసూత్రంబును రచియించి సంస్కృతపదంబులందలి బిందువునకు ననునాసికంబులగు పంచమవర్ణంబు లాదేశంబులుగా విధించె. ఆసూత్రము సంస్కృతభాషానిమిత్తమే రచియింపంబడినను యుక్తియుక్తమైన మన యనుభవంబును బరిశీలింపగాం దెలుంగుభాషయందుంగూడ నల్లసూత్రం బుపయోగింపకతీరదు. తెలుంగువ్యాకరణమున సూత్రము లేకున్నను దెలుంగుభాషలో సానుస్వారంబులనుకొన్న ప్రదేశంబులందు ననునాసికములౌ పంచమవర్ణంబుల పలుకుబడియే బలాత్కరించి యనుభవసిద్ధంబుగాం గానంబడెడి. అందున (1) వంక (2) కంచె (3) వంట (4) కొంత (5) కొంప—ఇత్యాదిపదంబులు (1) వఙ్క (2) కఞ్చె [3] వణ్ట [4] కొన్త [5] కొమ్ప—అని ఙ, ఞ, ణ, న, మ, లతో సంయుక్తములు సేసి లిఖింపవలయు. ఇట్లు పరుషసరళంబులకు ముందు సున్నలనుకొన్న ప్రదేశంబులెల్లం బంచమవర్ణంబులతో నిండియుండునని గ్రహింపునది. మఱియు, పంచ, సంజ—ఇత్యాదిపంక్తి చ, జస్థలంబులందుం దాలవ్యమైన ఞకారము బిందువునకుం బరవర్ణములైన దంత్య చజలకు సవర్ణము గానందున నిచ్చట బిందువునకు ఞకారము రానేరదు. అట్టి చ, జ, లకు దంత్యమైన నకారమే సవర్ణంబుగాన నట్టి శబ్దంబులు నకారయుక్తంబులు సేసి, పన్చ, సన్జ, ఇత్యాదివిధంబుగా వ్రాయవలయును. వఙ్క ఇత్యాదితెలుంగు శబ్దంబులు సంస్కృతపదంబులువోలె పంచమవర్ణయుక్తంబులు కాననే యీవక్ష్యమాణంబులగు నాంధ్రకవితాపితామహాది ప్రయోగంబులు సంగతము లగుచున్నవి:—

(1) ఉ॥ అఙ్కముఁజేరి శైలతనయాస్తన దుగ్ధము లానువేళ బా
ల్యాఙ్కవిచేష్టఁ దొండమున నవ్వలిచన్గ బళింపఁబోయి యా
వఙ్కఁగుచంబుగాన కహివల్లభహారముఁ గాంచిరే మృణా
ళాఙ్కురశంక నంటెడుగజాస్యునిఁగొల్తు నభీష్టసిద్ధికిన్॥

మను ౧౪

(2) ఉ॥ పాణ్డవ వంశవర్య పటుపాపవినాశని యైనయిక్కథన్
నిణ్డుమనంబులో వినుట నీవు కృతార్థుఁడ వైతి శాశ్వతా
ఖణ్డసుఖాత్మువిష్ణు నధిక స్థిరభక్తి సమాశ్రయింపు నీ
కొణ్డొకఁడేల యిమ్మెయి మహోన్నతిఁ జేయు జగత్త్రయంబునన్॥ భార-
శాం ౯, ౪

మొదటిపద్యమునందు (1) అఙ్క (2) అఙ్కుర, ఇత్యాదిపదంబులందుఁ బైని నుదాహరించిన సాంస్కృతిక వ్యాకరణసూత్రమునను సరించి ఙకారము తప్పనందునఁ బ్రాసస్థానంబున ఙకార కకారసంయోగంబుండకతీరదు. వఙ్కశబ్దంబు తెలుంగు శబ్దంబైనను సాంస్కృతిక భాషాసంప్రదాయానుసారంబుగాఁ బ్రాసస్థానమందు ఙకార కకారసంయోగంబు గల్గినందుననే సంయుక్తప్రాసంబునఁ బద్యంబు శాస్త్రీయమై సముంజస మగుచున్నయది. అట్లె రెండవపద్యమునందుఁ బాణ్డవేత్యాదిశబ్దములందుఁ బాణినీయ వ్యాకరణంబున ణకార డకారసంయోగంబు ప్రాసస్థానంబున నుండకతీరదు. నిణ్డొ ఒణ్డుఁ ఈతెలుంగుశబ్దంబులందును సాంస్కృతికవ్యాకరణ సంప్రదాయంబున, ణకార డకార సంయోగంబుండినందుననే నాల్గుపాదములయందును సంయుక్తప్రాసంబైనందున బద్యంబుశాస్త్రీయంబై రమణీయంబగుచున్నయది. ఇట్లేతక్కిన వర్గాక్షరములయందును నూహించుకొనునది. అవి యిట్లు కొందఱు తమవాచోయుక్తులు విజృంభింపఁ జేయుదురుకాని యీమతంబు నన్నయభట్టారక తిక్కనసోమయాజి ప్రభృతి సకలవిద్వద్వరేణ్యులకును సమ్మతంబుగాదు. పంచమవర్ణంబులు రాక తెలుంగుశబ్దంబులందు బిందువులే నిల్చునని ప్రాచీనులతాత్పర్యంబు. పైనింజూపినపద్యంబులయందుఁ బ్రాసంబెట్లుసంగతంబగుకేనివినుండు. పైపద్యంబున, "అఙ్కము" "అఙ్కుర" ఇత్యాదిశబ్దంబులయందు
(1) (2)
ప్రాసస్థలంబున సానునాసిక్య కంఠ్యత్వధర్మద్వయంబుగల ఙకారంబును వెంబడించి కేవల
1)
కంఠ్యత్వధర్మంబుగల కకారంబునివ్వటిల్లుచున్నది. అనఁగాఁ బ్రాసస్థానీయమైన "ఙ్క" అనునట్టి విశిష్టమందు సానునాసిక్యంబొకధర్మంబును గంఠ్యత్వధర్మంబులు రెండును గల్గియుండుట స్పష్టమగుచున్నయది. ఇటఁ బ్రాసస్థానంబున నొకసానునాసిక్యంబును )
ద్విగుణకంఠ్యత్వంబును దేజరిల్లుచుండు. (హియర్ ఇన్ది ప్లేస్ ఆఫ్ ప్రాస (ఙ్క'

బోరయునవియుఁ గలసి యనునాసికప్రాసములను బేర న. మ లనురుఁ గావ్య ముల యందుఁ దమకుఁ దాను'' అని శాసించుచున్నారు స్థిరమైననకారము మకారము నుపరముగఁ జో బూర్వనకారమునకు బిందువుపయితము రాఁదగునన్న మతంబున నిట్లు లక్షణపద్యము రచియింపఁబడియె. (సంధిపరి [19] సూత్రవ్యాఖ్యలోఁ జర్చించినయంశమును జూడుఁడు) కం తమ్ములను మల్లికాకుసు। మమ్ములమరువాఁపత్త్రిమాలికలను భక్తింమురసంహారు పూజలు। సమ్మదమునఁ బలుపఁ గలుగు సకలార్థమ్ముల్. కం॥ ఇమ్మహిని మునులచేవెల। సెంముసు కావ్యములు ''నాన్నృషిఃకురుతే కా! వ్యమ్మనువచనార్థంపుర్। సమ్మతిఁగలివేళ సుకవిజనశేమానుల్। [అప్పకవి] ఇట మొదటిపద్యముయొక్క తృతీయపాదమందలి ప్రాసస్థానంబునను రెండవపద్యములో ద్వితీయపాదప్రాసస్థానంబునను మండఁదగిన యోష్ఠ్యద్వ్యోష్ఠ్యమ్ములో నొకటి తక్కువయైనను నవివక్షం జేసి యనునాసికప్రాసమను పేరున ప్రాసంబు విధింపంబడియె

ఇకను ప్రాసస్థానములోని ''క్క'' అనుశబ్దంబు సంయుక్తంబును, వేఱొక ప్రాసస్థానమందలి ''ంక'' అనుశబ్దంబసంయుక్తంబును నగుచుండఁగా, సంయుక్తాసంయుక్తంబులకు నెట్లుసంయుక్తప్రాసంబు చెల్లునని శంకింపఁ రేని వినుండు. [1] అనుస్వారము [ం] [2] విసర్గము (ః) (3) జిహ్వామూలీయము (ఁక) [4] ఉపధ్మానీయము (ఃప) ''అఇఉణ్'' సూత్రములో, అకారము తర్వాతను శర్వర్ణముల నువ్యవుంగును [శ, ష, స] పఠింపవలయునని ''హయవరట్'' సూత్ర భాష్యమందు నుద్ఘోషింపంబడియె. అట్లుపఠింపుటం జేసి యను స్వారాదులచ్చులనియు హల్లులనియుఁగూడ శాస్త్రంబున వాడంబడును. ఉపధ్మానీయము (ఃప) హల్లుగూడ నైనందులకు ఫలంబిట్లు మహాభాష్యంబున నాకాంక్షింపఁబడియె. "ఉః జ" (ఆర్జవే) అనుధాతువునకుపధ్మానీయ ముపధ (                    )గాన నట్టి యుపధ్మానీయము నకు "ఝలాంజశ్ఝశి" అనుసూత్రంబున "బ" కారంబు రాఁగానైన సుబంతం "ఉబ్జకః" అనియుండు. దీనికి సంబోధనాంతము "ఉబ్జక!" అనియగును. (ఇట మూ (డంకెపుల్లకమునకు గుఱుతు.) (ఇచ్చట "గుణోరన్మతో సంశ్యస్యాప్యేకైకస్య ప్రాచామ్ "అ ౮ పా ౨ సూ ౮౬) అనుసూత్రమున బకారజకారసంయోగమునకు ముందుండి గురువైన యుబ్జిశబ్దమందలి యు [ఉ] కారముకు లఘుత్వంబువచ్చునని యుదాహరించి

పిమ్మటను "పూర్వత్రాసిద్ధమ్" అనుశాస్త్రము ననుసరించి, పూర్వంబైన ప్లుతంబుచేయు నట్టి సమయంబునఁ బరశాస్త్రాదేశమైన బకారంబసిద్ధంబుగాఁగా బకారస్థానియైన యు పధ్మానీయంబే యుదాహరణమందుఁ గనఁబడుటంజేసి హల్ సంయోగమునకు ముందు న్నయు [ఉ] కారము కానందున నియ్యది గురువుగాదనియు నంగుడఁ బ్లుతంబు రాద నియుఁ బతంజలిభగవానులు శంకించుకొని శర్వర్ణంబుల (శ, ష, స) మధ్యమందుఁ బఠిం పఁబడి నందున నుపధ్మానీయానుస్వారాదులు హల్లులనియు నిట నుపధ్మానీయ జకార సంయోగంబునకు ముందుండుటంజేసి గురువగుచున్న యుజ్జ్వకశబ్దము మొదటి యు [ఉ కారమునకుఁ బ్లుతంబు నిర్బాధమనియు సమాధానంబు చెప్పిరి. అట్లే ప్రకృతంబునను, న నుస్వారము శర్వర్ణములనడుమను [శ, ష, స] బఠింపఁబడుటంజేసి హల్వర్ణంబు గావున "ంక" ఇత్యాదులయందలి బిందుకారాదుల సంబంధము సంయుక్తంబై యన్యపాద ములయందలి జకారకకారాది సంయుక్తంబునకుఁ బ్రతిబంధకమగు సంయుక్తప్రాసం బునకుఁ బైపద్యంబులందు భంగంబు కలుగనేరదు అనుస్వారము హల్లుగావుననే బిందు పూర్వకమైన యీక్రింది నకారాదిప్రాసంబులు, ఈహకారమకారాది సంయుక్తములం బోలె సంయుక్తంబులైనందున వానికి ముందక్షరమ్ములు [అనఁగాఁ బాదాదివర్ణంబులు) హ్రస్వంబును దీర్ఘంబునుగూడఁ గావచ్చును.

ఉదా:—కం॥ అంఘనకుఁ గొఱయొవెన్నెల గంధర్వాంగనల పొందుగాదని సం పాదించి రాఘవునఁ గూలెదకట దవాంఘము వెలుఁగుగనిపొంద నడఁగినభంగిన్ ॥ మను ౨ ఆ:

కం॥ బ్రాహ్మణుఁడింద్రియవశగతి జిహ్మపరశైకనిపుణచిత్తజనితాజిహ్మగము లపాలైచెడు బ్రహ్మనందాధిరాజ్యపదవీస్యుతుఁడై మను ౩ ఆ

ఆ॥ వె॥ క్రిందజడ్డలును బిలుంపబిందువులును నూఁదిప్రాసములకునుండెనేని । హ్రస్వమొకటిదీర్ఘమొకటియొకటి వాని మొదలనిలుపవచ్చునెందు॥ అనిలక్షణ గ్రంథంబులయందు బిందువులను విశేషించి పేర్కొనుట యనోద్దేశపక్షగ్రాహులకు స్పష్టార్థమేకాని వేఱేప్రయోజనంబు లేదని తెలియునది.

ఇచటఁ గొందఱుబుద్ధిమంతు లిట్లు శంకింతురు:—పైనిజూపఁబడిన భారతాది [illegible] నవంబునఁ గాంచిరి

యేయుగంబునన్॥" అని యిట్లు మాంధాతృశబ్దపాఠంబు ఋకారముతోనే యుండవల్ల యునుగాని "మాం। ధాత్రిరఘుక్షితీశులు" అని క్రావడితోఁ బఠింపఁగూడదు. కావుననే యప్పకవి "వ॥ మాంధాతృశబ్దము ఋకారాంతము గనుకఁ దకారముక్రింద నున్నది ఋటుత్వమునకేగాని క్రావడిగాదు" అనియుద్ఘోషించుచు సంయుతాసంయుత ప్రాసంబునొద్ద నీపద్యమును ఋకారాంతమాంధాతృశబ్దపాఠముతో నుదాహరించెఁగదా కాఁబట్టి పద్యములోని "మాంధాత్రిరఘుక్షితీశు" లన్న యభూతపూర్వపాఠంబును బరిష్కరించుకొని పూర్వోద్దిష్టంబయిన వాచోయుక్తిపాటవప్రకటనంబు వృథాప్రయాసంబేకాని వేఱొకటిగాదని కొందఱవాంతరశంక శంకించెదరు. అట్లులనవలదు. మేమివఱలో సమాసపరిచ్ఛేదములోని (24) సూత్రమునొద్ద నీపద్యముదాహరించి ప్రకృతంబున వక్తవ్యాంశము శబ్దసాధుత్వనిర్ణయంబేయని యెంచుకొని ఋకారయుక్తపాఠంబును రేఫయుక్తపాఠంబును నుభయంబును వ్యాకరణప్రకారంబున సాధువులని స్థూలదృష్టిని "తుష్యతు దుర్జనః" అను న్యాయంబున సిద్ధాంతము చేసితిమిగాని పద్యలక్షణంబునకు భంగంబుగలిగింపకుండ నేపాఠము సాధీయముగానున్నదో నిశ్చయించి ప్రదర్శించుట యవశిష్టంబైనది. ప్రకృతవక్తవ్యాంశంబునకుఁ బెక్కులుదాహరణపద్యంబులున్నను "ఏకక్రియాద్వ్యర్థకరీబభూవ" అను న్యాయంబున రేఫయుక్తపాఠంబే పద్యలక్షణంబునకు సమన్వయంబుగా గానున్నదని చర్చాపూర్వకంబుగా నిశ్చయించుటకుఁగూడ నా పద్యమే యిప్పటి వక్తవ్యాంశంబున కుదాహరించితిమి. కాన సావధానమనంబున నాకర్ణింపవలయు. తే. గీ. రలలు తమక్రింద జడ్డలై క్రాలువ్రాలు। ప్రాసవర్ణంబులైనాని బాసియైనఁ గూడియైనను బెడయుపలుకుల నిలుచు సంయుతాసంయుతప్రాసపంక్తిఁ జెడదరి॥ ॥ అప్పకవీయము 3 ఆశ్వాసము। అర్థము, క్రావడితోఁగాని లేక లాముడితోఁగాని సంయుతములైన హల్లులతోఁ గేవల (అసంయుతము ల) హల్లులు గూడఁ బ్రాసంబులుగా నుండఁదగునని ఫలితార్థము.

పైలక్షణపద్యంబునుబట్టి భారతములోని ప్రకృతపద్యంబును ఋకారయుక్తమాంధాతృశబ్దముతో రేఫసంయుతమునకు నిట్టు లుదాహరణముగానిచ్చె.:—

ఉ. క్షత్త్రియవంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్త్రియవైశ్యశూద్రులఁ గాఁదగునాలుగుజాతులన్ స్వచా

రిత్రముఁ దప్పకుండఁగఁ బరీక్షితు కాచినయట్లు రామమాం
ధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె? యేయుగంబునన్. భా. ఆది-౨ ఆ.

ఈపద్యమునందు "క్షత్త్రియ, చారిత్ర" అని తక్కిన పాదములందుఁ బ్రాసము రేఫసంయుతంబై నాల్గవపాదమందు "మాంధాతృ" అని రేఫహల్లుతో సంయుక్తముగాక కేవలమును బ్రాసతకారము ఋకారాచ్చుతో నున్నను బైలక్షణపద్యము ననుసరించి ప్రాసంబు చెల్లునని యప్పకవి తాత్పర్యము. ఈపద్యము రేఫశ్లిష్టమునొద్ద నుదాహరించుట కేవలముఁ బ్రమాదాయత్తము. రేఫయుక్తాక్షరమును రేఫహీనాక్షరమును బరస్పరముఁ బ్రాసముగా నుండఁదగియున్నను "క్షత్త్రియ, చారిత్ర" అని హ్రస్వపూర్వకమైన సంయుక్తతకారముతో "మాంధాతృ" అనుచోటున సంయుక్తముగాని తకారము దీర్ఘపూర్వకంబై యెట్టులు ప్రాసంబుగా నుండ జాలును? ఆ. వె. క్రిందజడ్డలును బిందువులును గూఁడి ప్రాసములకు నుండెనేని। హ్రస్వమొకటి నిడుపయక్షరంబొక్కటి। వానిమొదల నిలుపవచ్చు నెందు॥ అను లక్షణపద్యము ననుసరించి సంయుక్తప్రాసంబునకును బిందుపూర్వకప్రాసంబునకును బూర్వమందే హ్రస్వదీర్ఘనియమము లేక యచ్చు నిలిచియుండవచ్చును గాని సంయుక్తముగాని కేవలప్రాసాక్షరమునకుఁ బూర్వమున నటులుండఁగూడదని లక్షణము చాటుచుండఁగాఁ బ్రకృతంబున "క్షత్త్రియ" ఇత్యాదులయందు హ్రస్వపూర్వకమైన సంయుక్తతకారప్రాసంబునకు "మాంధాతృ" అను నాల్గవపాదమందు సంయుక్తముగాని కేవల తకారప్రాసంబు దీర్ఘపూర్వకంబై ప్రతిష్టంబుగా నెట్టులుండఁజాలును? ఒకవేళ గీ. రలలు శమ క్రింద జడ్డలై ప్రాలువాలు...॥ అనెడివిధి "ఆ. వె. క్రిందజడ్డలును బిందువులును...." అనునట్టివిధిని సయితము బాధించి ప్రవర్తిల్లును గాన నిటదీర్ఘపూర్వకమైన యసంయుక్తతకారము హ్రస్వపూర్వకమైన సంయుక్తతకారప్రాసంబులు బ్రతిఘటించి ప్రాసంబుగా నుండవచ్చునందు రేని యటులు వచింపఁగూడదు.

శా. నాతోమార్కొనలేరు నిర్జరపురీనాగేంద్ర బృందారకా
రాతుల్ మున్నుగ దేవసంఘములు ఘోరాధీర సంగ్రామ కం
డూతి త్రైలోక్యమునందుఁ గల్గఁడు రణం బెవ్వోట లేకుండఁగా
జేతుల్ త్రుప్పు వృథాభరంబగుచు వచ్చెన్ దేవ యీ మేనికిన్. (పోము హరివంశము

గీ. వాక్త్రినేత్రాంగనాకచీకత్తులధిక । సంభ్రమంబునఁ గుంభనికుంభదైత్య [కేలిడి.
హంత్రిఁబూజింపుదురుత్ర యీమంత్రములను స్తోత్రములుచేసి మంగళారాత్రి
(దేవీవిజయము.

ఇత్యాదిసోదాహృత పద్యంబులందే దీర్ఘపూర్వకంబులును, సంయుక్తంబులును; బిందుపూర్వకంబులునైన ప్రాసస్థలంబులలో సావకాశమైనట్టి ‚‚గీ. వలలు తమ్రకింప జడ్డలై క్రాలుఁద్రాలు॥ అనునట్టివిధి చరితార్థమైనంగున అ॥ వె॥ ‚‚క్రింపజడ్డలను బిలుంగ బిందువులను॥ అనెడివిధి నెట్టులు బాధింపఁజాలును? కాఁబట్టి ‚‚మాం॥ ధాత్రిరఘుక్షితీశులం ముదంబున గాంచిరే? యేయుగంబునన్'' అను రేఫయుక్తమే పద్యలక్షణానుకూలంబుగానట్టిపాఠంబే ప్రశస్తంబు. ఈ ‚‚మాంధాత్ర'' పద్యంబునఁ ద్వితీయపాదత్రియంబునందలి ప్రాసములు హ్రస్వపూర్వకంబులైనను జతుర్థపాదంబున దీర్ఘపూర్వకంబైనను సర్వత్రసంయుక్తస్థలంబుగానఁ బూర్వోక్తవిధిచేతను నిర్బాధంబని యెఱుంగునది. ఈసమస్తము ప్రశస్తముగా నవలోకనము సేసియే యడిదము సూరకవి ‚‚గీ॥ ధరఋకారాంత శబ్దంబు ద్వంద్వమైన। రేఫమగుమఁ బిత్రర్షిల్లు వృషముగాను। పతిపరహాయ వాగ్వధూనేత్ర (వాగ్వధూనేత్రు-వాణీపతి) ముఖసు।రాభివందితపాదాబ్జయన్నయట్లు'' కవిసంప్రథమ 28 ల అనుపద్యలక్షణంబునకుఁ బ్రకృతపద్యములోని మాధాంతృశబ్దంబు రేఫాదేశయుక్తంబగుట యుక్తంబుగానెంచి యుదాహరణముగా నిర్దేశించె. కావున నట్లు ఖండించి నిశ్చయించిన యడిదము సూరకవీంద్రునియాశయంబే లెస్సయంబై ప్రబంధందులకు నెంతయు సంతసింపుమన్నారము.

ఈప్రకరణమందే, శా. లోకత్రాణరతింవదాదిను మహీలోకప్రవేశోత్కభా॥ పాౢక్ప్రప్రథమద్వితీయపద......అను రాఘవపాండవీయములోని పద్యమందలి ద్వితీయప్రాసంబును లకారశ్లిష్టమున కుదాహరణముగా నిడెందు సూపుటయు నొక ప్రామాదంబు. "ఋదుపధాచ్చాౢక్లృపిచృతేః" (అ 3 పా ౧ సూ ౧౧౦) ఇత్యాది సూత్రంబులవలన నయ్యది యచ్చుగాని హల్లుగాదు మఱియు నితండు కవికర్ణరసాయనములోని పద్యంబును బ్రమాణముగాఁ జూపి మాంధాతృశబ్దంబునఁ గ్రావడినిషేధింపను ఋకారాంతమని సాధించుట ద్వంద్వసమాసమందు ఋకారాంతములకు రేఫాదేశము

నన్నయంశము మఱచినట్లు తోఁచుచున్నది. కావుననే యీమాంధాతృశబ్దంబు భారతరచనా సమయంబున ఋకారములో నున్నదనియుఁ బూర్వోక్త రాఘవపాండవీయపద్యపాదప్రాసంబు లకారశ్లిష్టమనియు భ్రమియించి యేతత్కవిప్రయోగమూలకంబుగా రేఫలకార సంయుతప్రాసంబులు కేవల హల్లులతోఁగూడ హ్రస్వపూర్వకత్వ దీర్ఘపూర్వకత్వాదిసకల నియమముల నుచ్ఛేదించి యథేచ్ఛముగాఁ బ్రాసములై యుండవచ్చునని యెంచి యీకవి "గీ॥ పాఁడిద్రచ్చఁగనిమ్ము పాతంద్రికన్న! | వేఁడుకొనియెద నందాఁకఁ బండ్లుదినుము" అని తేటగీతిని రచియించి యుదాహరణములోఁ బ్రకృతాంశమును వికృతంబుగాఁ జేటుపఱుచుచుండె. కాఁబట్టి ప్రమాదబాహుళ్య భూయిష్ఠంబైన యీప్రకరణంబున నితం డుదాహరించిన ఋకారయుక్త ప్రాసంబు భ్రమాస్పదంబనియు స్వవాగ్బలునకు ముఖ్యాధారంబగు రేఫయుక్తమాంధాతృశబ్దపాఠంబె ప్రమాణంబనియుఁ బ్రకాశించుటకై ప్రసక్తానుప్రసంజన వశంబున నింతవఱకుఁ జర్చింపఁబడియెంగాన నిఁక విస్తరంబుతోఁ జాలును.

(2) అథవా, బ్రహ్మం బుపాదానకారణంబుగాఁగల యీప్రపంచంబు తత్త్వవేత్త దృష్టికిఁ గనంబడక కారణమైన బ్రహ్మంబె భాసిల్లునట్టులు. అనుస్వారం బుపాదానంబుగాఁగల పంచమవర్ణంబాంధ్రతత్త్వవేత్తలదృష్టికిఁ గానిపింపక కారణమైనయనుస్వారంబె యలరారుచుండెనని యూహించెద. వెండియు వేఱొకకారణంబుంగలదని తె

1 2 3

సెంచెదను. అవర్ణాతీతమయి, సద్వృత్తరూపరేఖావిలాసంబున నేకజన్మంబెత్తి ముక్తా

4 5 6

త్ముఁడైన యనుస్వారం బడుగిడినచోటునఁ బంచమవర్ణంబులై వికృతరూప రేఖావిలాసంబునఁ బలుపుట్టువులు (ముఖనాసికం బుభయమున జనించినవి) పుట్టి యంతేవాసులైన (మాతంగజాతీయములును, వర్గాంత్యములును) ఙకారాదులం జేనుపుట యర్హంబుగాదని యాంధ్రవిద్యావిశారదులైనబ్రహ్మణ్యులు సంశయించివానిని బహిష్కరించిరి. పూర్ణంబైన యాలోకంబు (నిండువెలుంగు=బ్రహ్మము) ధ్యానించి యాత్మోపకారం బగునని యెన్నిన పరిజ్ఞాతలు నిష్ఫలంబైన యీలోకంబును ఏవగించి వట్టులు కుణకంఠమై (బాహ్యప్రయత్నముగల) (ముక్కు) ముంగరయైన (నాసికయందు గోగినపరిభావము) పూర్ణానుస్వారంబుననే స్వకార్యసాఫల్యంబగునని యెంచి దానియాస్థానంబున

నుండి యాంధ్రభాషారహస్యవేత్తలు సర్వదా లోకులనోళ్లం బడుచుండెడి (ముఖస్థానాభ్యంతరప్రయత్నవంతములైన) యీయంత్యవర్ణంబులం బాలందోళికరిగాని యంతటిపరిపూర్ణులు వీని గుట్టుమట్టులు జాడం గట్టంజాలకపోయిరి యని యనంగూడదు.

ఞకారాదివర్ణంబు లాదేశంబుకాకుండనే యనుస్వారమాత్రమునం దెలుంగునం గార్యసాఫల్యమెట్టులగునని వారుతలంచిరో వినుండు.

(1) అఞ్చుః వఞ్చుకః—ఇత్యాదులయందు "అనుస్వారస్యయయి పరసవర్ణః" అను పాణినీయసూత్రంబున ననుస్వారాదేశంబయిన ఞకారాదులు, తత్సమభాషాభాగంబున నట్టిశబ్దంబులు తెలుంగులోనికి నేతెంచినతోడనే, తమకుస్థానియైన యనుస్వారస్వరూపంబు నాంధ్రభాషామర్యాదం జేసి యొందుచుండెడి. (1) రోచి, రోచులు (2) వీచి, వీచులు (3) వాజి, వాజులు—ఇత్యాదులయందు నాంధ్రభాషాపరిపాటింబట్టి భాషాంతరీయమైన దంత్య చ, జ, లచేతను సయితము ప్రాతిపదికంబులోని సాంస్కృతిక తాలవ్య చ, జ, లకు వికారంబుగలిగినప్పుడు తత్సమత్వంబు నకు భంగంబు కలుగకయుండంగా నిపుడనునాసికవర్ణంబులు తమస్థానియైన బిందుస్వరూపంబును నొందినంత మాత్రమున నట్టి తత్సమత్వవ్యవహారంబునకుం గొఱంత రానేరదనియే వారి తాత్పర్యము.

---

(1) అనుస్వార, విసర్గ, జిహ్వామూలీయో, పధ్మానీయములు, 'అ ఇ ఉ ణ్' అనెడి సూత్రములోని యకారము తర్వాతం బఠింపంబడెనని భాష్యము స్మరించునది; అనింద్యమైనదనియు నర్థాంతరము.

(2) వర్తులాకారమయినది; మంచిపరివర్తనయు, మంచిరూపము, విలాసముగలదని యర్థాంతరము. (3) ఏకపాద్యాం=నాసికాయాంజన్మ: (సర్వనామమునకు వృత్తియందు పుంవత్త్వము) నాసిక యొక్క దానియందే పుట్టినది; ఒకజన్మమెయెత్తి అనుటచే జన్మాంతరమునకుం దగిన పాపములేక పుణ్యముగలదనియు నర్థాంతరము. (4) ముత్యమువలెనున్నది; జీవన్ముక్తమయినదనియు నర్థాంతరము. (5) వర్గములోనైదవ వర్ణంబులు; అంత్యవర్ణములోనివనియు నర్థాంతరము. (6) వ్రాయుటలో భేదముగలవని ఫలితార్థము; వేదరూపుం వేదోష్టయుగలని యర్థాంతరము,

అజ్ఞ — అనెడి జకారఘటితశబ్దంబున "జ్ఞ" అనునట్టి విశిష్టములోనుండిన జకారమందు సానునాసిక్యకంఠ్యత్వములు, గ్రింది కకారమందుఁ గంఠ్యత్వము నున్నది గాన నట్టిసముదాయమందు నేకానునాసిక్య ద్విగుణకంఠ్యత్వంబులు వెలయుచుండు నని యూహలలోఁ జెప్పితిని.

అంక — అనెడి యనుస్వారయుక్తరూపమందున్న "ంక" అనునట్టి సముదాయములోనుండిన బిందువునకు సానునాసిక్యసర్వంబును, తర్వాతి కకారమందుఁ గంఠ్యత్వము నున్నవి గావున నట్టిసంఘాతమందు నేకానునాసిక్యకంఠ్యత్వములు వర్తిల్లుచుండు. కనుక పైరూపద్వయంబులోఁ దారతమ్యము విమర్శించినచో నుభయత్ర యానునాసిక్యకంఠ్యత్వములు సమానముగానే యుండెంగాని రెండవరూపంబునఁ గంఠ్యద్విత్వంబుమాత్రంబుండ లేదు. అర్కః — ఇత్యాదిశబ్దంబులయందు "అచోరహాభ్యాంద్వే" అనుసూత్రంబునఁ గకారమునకు ద్విత్వంబగుంగాన నొకమతంబున నుచ్చారణలోఁ గంఠ్యద్విత్వంబు స్ఫురించుటయు, "సర్వత్రశాకల్యస్య" అనుశాకల్యునిమతంబున నేకకంఠ్యత్వమే స్ఫూర్తివిషయమగుటయు, నెట్లుండునో యట్లే యంకశబ్దాదుల నుచ్చరించుచో గీర్వాణవ్యాకర్తల మతంబున ద్విగుణకంఠ్యత్వంబును నాంధ్రవ్యాకర్తలమతంబున నేకకంఠ్యత్వంబును స్ఫురించుననిన మతభేదంబుగలదు. వర్గీయాక్షరములకు ముంగున పంచమవర్ణంబులే యుచ్చారణంబులో సంభవించుట (అనఁగా ద్విగుణ కంఠ్యత్వాదులు=) యనుభవసిద్ధంబుగా నున్నది గాని బిందూచ్చారణ మట్టులేదనియందురేని యాకర్ణింపవలయు. సంస్కృతభాషలో "త్వఙ్కరోషి: త్వంకరోషి" ఇత్యాదిపదాంతస్థలంబున వర్గీయవర్ణంబులకుముందు బిందువుపాక్షికంబుగా నుచ్చారణంబులో ననుభవసిద్ధంబనియే గదా పాణినిచేత ,, వాపదాంతస్య ,, అను సూత్రమున విధింపఁబడినది. అందునెచ్చటను వర్గ వర్ణంబులకు ముందు బిందువుచ్చారణంబులో లేదని పలుకఁగూడదు. మఱియుఁ, ప్రకృతాంశములో గీర్వాణభాషను దృష్టాంతముగా స్వీకరించుకొన్నవారికిని ,,పచ్చెంగమలాక్షుఁడు,, ఇత్యాదిపదాంతస్థలంబునఁ దెలుఁగుభాషలోఁగూడ బిందువుపాక్షికంబుగా నుచ్చారణలో ననుభవసిద్ధంబే యనక తీరదు: సంస్కృతభాషలోఁ బోలెఁ దెలుఁగుభాషలో నేమును నేకపదంబునందును బిందు ననుభవసిద్ధంబు గాదం...యని నుడువుదురేని యట్టులు సర్వత్ర పదమధ్యంబున, బిందుపూర్వకంబుగా [illegible] కృతప్రాకృతవ్యాకరణంబై

షడ్భాషాచంద్రికయందు వకారాదిశబ్దంబులకు ,,రవలామథశ్చ": (అ ౧ పా ౪ సూ ౭౦) అనుసూత్రమున రేఫలోపంబుగలిగి ,,సోః,, (అ ౨ పా ౨ సూ ౧౩) అనుసూత్రముననైన ,,వకో,, అను రూపంబునకు ,,స్వరేభ్యోవక్రాదౌ,, (అ ౧ పా ౧ సూ ౪౦) అనుసూత్రంబునఁ బదమధ్యంబునఁ గల్గినబిందువునకు ,,వర్గేఽంత్యః,, (అ ౧ పా ౧ సూ ౪౭) అను సూత్రంబునఁ బాక్షికత్వంబంగీకరింపఁబడినది. మఱియు, ,,సో ఙ ఞ ణ నానాం,, (అ ౧ పా ౧ సూ ౪౧) అను సూత్రంబున (పరాఙ్ముఖః—పరంముహో) [కఞ్చుకః—కంచుఓ) ఇత్యాదిశబ్దంబులయందుఁ బాణినీయవ్యాకరణంబుననైన ఙకార ఞకారాదులకుఁ బ్రాకృతవ్యాకరణంబున వాల్మీకిమహర్షి చేత బిందువు విధింపఁబడియె. వ్యాకరణంబులోఁ బదాంతమునందుంబోలెఁ బ్రాకృతవ్యాకరణములోఁ బదమధ్యంబునను బిందూచ్చారణము పాక్షికంబుగా ననుభవసిద్ధంబైనట్టులు కరతలామలకంబుగా నిట్టు గాన్పించుచుండె. సాంస్కృతికశబ్దంబులు శాస్త్రప్రకారంబునఁ బ్రాకృతభాషలో సంస్కరింపఁబడునపుడు పదమధ్యంబందలి పంచమవర్ణంబులిట్టులు పాక్షికంబుగా బిందువులగుచుండగాఁ నట్టి పంచమవర్ణపక్షపాతంబుం బాఱంద్రోలి తెలుంగులోనికిం దెచ్చుకొన్న సాంస్కృతికపద [తత్సమపద] మధ్యమందుఁ గువలయానందంబైన బిందువే యెల్లప్పుడు నిందుధర్మంబా (ఇందుఁ=ఈతెలుగునందు; ధర్మంబు=న్యాయము; చంద్రిసదృశమనియు నర్థాంతరము) వనియెంచి యాంధ్రవ్యాకర్తలు నన్నయభట్టారకాది సర్వజ్ఞులు (ఈశ్వరులును) సర్వదా దానిని శిరసావహించిరి.

అందువనే యాంధ్రతత్త్వవేత్తలమతంబున ననుస్వారయతి బిందుయుగులు వేఱుగాఁ జేర్కొనంబడినవి. పంచమవర్ణంబులే యిందు నుచితంబైనచో ననునాసికాక్షర, సంయుక్తయతిభేదంబుననే గతార్థమగుంగాదే!! అఙ్క—ఇత్యాదిశబ్దంబులయందలి కంఠ్యతాల్వాదుల యుచ్చారణభేదం బస్పష్టభేదంబని యాంధ్రతత్త్వవేత్తల మతంబున నియ్యదియవివక్షితంబయ్యె. కావుననే ,,శత్రర్థేతూతిచ్చానోః" ఆం. శ. సంధిపరి. సూ. ౧౨ ,,తస్యస్యాచ్చ పూర్ణబిందురపి" (సంధి. ప. సూ. ౧౩=బాలవారణ్యక్రియాపరి. సూ. (౫౫) వర్తమానార్థకమైన చువర్ణకము పరమగుచో ,అను, మొదలగుధాతువులయొక్క ఉత్వంబునకు లోపంబుగాని లేక, మఱియు స్థానంబున బిందువున్నగాని యగునని సూత్రద్వయంబునకు ఫలితార్థము.) అని పైనింజూపిన బిందువిధా

యకమాత్రంబు చరితార్థంబగుచున్నది, తెలుఁగులో నాధునికులమతప్రకారంబున బిందువు రాక పంచమవర్ణంబే విధియైనందున నిట్టి నకారమెప్పుడును దంత్యంబే యగుం గాన చిత్యాది పరమగునపుడు (తమమతంబులోఁ బన్చ, పన్జ ఇత్యాదులుంబోలె) దంత్యతాల్వనునాసిక్యసావర్ణ్యయంబుగల నకారమె నిత్యంబగుచుండఁగా మొదటిమాత్రమునకైన యోగ్యోపమే సార్థకంబై రెండవమాత్రమునకైన బిందువిధానంబు వ్యర్థంబగునిట్టి పాక్షికబిందువిధానంబునఁ బ్రాచీనులమతంబులోఁ దెలుఁగునబిందువే కాని పంచమవర్ణంబులులేవని సిద్ధాంతమగుచున్నయది. కనుకఁ దెలుఁగులోనికి ఙకారఞకారములప్రాప్యముగా తేవలసినయవసరంబులేదు. మఱియు, "పన్చ్చ" ఇత్యాదిశబ్దములయందు నిట్టులు దంత్యంబౌచకారాదులకు ముందు దంత్యానునాసికంబైన నకారమే విధాయకంబుగావున నాధునికులమతంబున మీఁదుమిక్కిలి యింకొకయనర్థంబును గూరంబగును.

శా॥ ప్రాంచద్భూషణ బాహుమూలరుచితోఁ బాలిండ్లపైఁ గాఁగఁదై
యంచత్ప్రేమఁ గౌఁగిలించి యధరం బాసింపవే !! శ్రీహరీ!
యంచున్ బ్రాహ్మణుఁడోరిమోమిడి తదీయాంసద్వయంబంటి పా
మ్మంబంద్రోచెఁగలంచునే సకులమాయల్ ధీరచిత్తంబులన్ మను. ౨ ఆ.

ఉ. అంచితనానావాకలిత యానము దేరఁగఁబంచివచ్చి నె
క్కొంచి సహోధిరాజుఁడయి కేల్ దనకేలనమర్చిపక్కఁ
పంచయవర్తనుండగుచుఁ జారుముఖాబ్జవికాసమొప్పఁగ
ద్రింపుచుఁ బుణ్యలోకములు ప్రీతిమెలంగఁగ నాకుఁజూపినన్॥ భార. అను. ౨ ఆ.

మొదటిపద్యమున మొదటిపాదములోని "ప్రాంచత్" అనుశబ్దంబు సాంస్కృతికంబై యందుఁ దాలవ్యమౌ చకారమునకు ముందుబిందువు ఞకారమై "ప్రాఞ్చత్" అని ప్రాసస్థానంబున ఞకార చకార సంయోగముండును. తక్కిన మూఁడుపాదములలోని "అంచు" శబ్దంబు తెలుఁగైనందున దంత్యమైన యూనంతచకారమునకు ముందున్న బిందువు నవీనులమతంబున నకారమై "అన్చు" అనుకృతిని ప్రాసస్థానమున నుండవలసివచ్చెను. ఇట్లే అంచిత పంచయశబ్దంబులు ప్రథమద్వితీయపాదములు సాంస్కృతికములు గావున ననునాసికవర్ణఘటితములై "అఞ్చిత" "పఞ్చయ" అని యుండవలయు ద్వితీయపాద

ములోని "ఎక్కించి" శబ్దము తెలుఁగైనను తాలవ్యచకారము గాన ఞకారయుక్తమై "ఎక్కిఞ్చి" అనినవీనులమతమున నిట్లుండును. నాల్గవపాదమందలి "వరించు" శబ్దములోని చకారము దంత్యముగాన నిట్టిప్రాసస్థానమున నకారచకారసంయోగమధునాతనులమతము ననుసరించియుండఁ దీరదు ఇట్లు రెండుపద్యంబులయందు నొకపాదమున ఞకార, చకార సంయోగంబును వేఱొకపాదమున నకార, చకారసంయోగంబునునుండి సమానములుగా లేవంగున నాంధ్రకవితాపితామహాది పూర్వకవిప్రయోగంబులు లక్షణగ్రంథమ్ములకుసరి పడక యపలక్షణంబులగుట తటస్థించును. మఱియు, నపూర్వముగాదోషాపత్తిసయితము సంభవించునని తెలుపుటకై స్పష్టమీక్రింది నవలక్షణపద్యంబు రచియించి చూపఁబడుచున్నయది. కం॥ వనజాక్షిసత్పతింగా న్మనుజవ్యాంతరమునందు నోఁచిననోముల్। గనుగొన్నపంటచేన న్మనుబిడ్డలుదెబ్బమందు నుడివమ్మకునే? ఇట నాల్గవపాదములో, ప్రాచీనులకు సమ్మతమైన యతివోలె ద్వితీయపాదములో సయితము (నవీనులమతమున) నకారచకార సంయోగమునంజేసి నకారయతిరూపమైన దోషాపత్తి దువాళించును అందునఁ బ్రాచీనకవికృతప్రయోగంబునకు నష్టంబును, నపూర్వంబైన కారాపత్తివలన లక్షణభ్రష్టంబునుఁబబలి, కృతనాశాకృతాభ్యాగమదోషంబుల లోకాయతంబయ్యెడిని. ఇంక నతివిస్తరంబుతోఁ జాలుంగావున నిట్టులు బ్రహ్మణ్యులైన ప్రాచీనప్రబంధకర్తల దర్శనంబునకు భీతిల్లి పంచమవర్ణవ్యక్తిసంయోగంబులు పటాపంచలైపోవ, ననాద్యంతంబై పరిపూర్ణంబైనపరబ్రహ్మంబు ప్రపంచంబునంబోలె నీపూర్ణానుస్వారంబే పవిత్రంబైన యిబ్బహుళాంధ్రోక్తిమయప్రపంచంబునం బ్రబలమై పరిఢవిల్లుంగాక!!

---

## అజాదిసంధి విషయము



శ్లో॥ సంహితైకపదే నిత్యా । నిత్యాధాతూపసర్గయోః । ని
త్యాసమాసే వాక్యేతు । సావివక్షామపేక్షతే।

అనువదనంబున సంస్కృతభాషలో నదవకాన్యమంతుసంధిసంభావమునియిచ్చను బట్టియున్నది. సంహితయున్నప్పుడే సంధికలుగునుగాని వేఱొకయప్పుడు గలుగదు. సంహితయనఁగా నుచ్చారణలో వర్ణముల కత్యంతసాన్నిధ్యము 'సంహితానామ స్వభావసిద్ధామాత్రాతిరిక్తకాలవ్యవాయేన రాహిత్యం, అని వ్యాకరణశాస్త్రవ్యాఖ్యాతలు

చెప్పినారు. అర్ధమాత్రకాలముకంటె వర్ణంబులమధ్యను నెక్కుడుకాలము వ్యవధానమయినప్పుడు సంహితలేదని వ్యాకరణవేత్తలు నిశ్చయించిరి. సంహితాశబ్దమును సంధిశబ్దమును నొకధాతువు ననుసరించియే పుట్టినవిగాన, పాఠకుడు వాక్యము చదువునప్పుడు గుక్కచూపినచోటులనెల్ల నర్ధమాత్రాకాలముకంటె నెక్కువయెడముండునుగాన సంధియుండఁగూడదు. శ్రోతలకు వాక్యముయొక్క యర్థము బాగుగఁ దెలియుటకైతన యిచ్చవచ్చిన చోటులనెల్లను నాపుము సంధిలేకుండఁ జదువవచ్చును. పద్యంబులలోని వాక్యంబులకుమాత్ర మిట్టివిధి చెల్లదు. పద్యపాదాద్యంబు సంధియుక్తంబుగానే యుండవలయు. పద్యంబులో సంధి లేకుండ నేని పెద్దలు దానిని యతిభంగమను నొక్క గొప్పదోషముగాఁ బరిగణింపఁబడియె. ఇట్టి యాచారము చిరకాలమునుండియు రూఢమయి యున్నది ఉదాహరణముగా శంకరమండన మిశ్రులవివాదములోని శ్లోకంబులు శంకరవిజయమునుండి యెత్తి చూపుచున్నాఁడను.

శ్లో॥ కర్మకాలే న సంభాష్య
గృహం మూర్ఖేణ సంప్రతి
అహో ప్రకటితం జ్ఞానం
యతిభంగేన భాషిణా

శ్లో॥ యతిభంగే ప్రసక్తస్య
యతిభంగో న దోషభాక్
యతిభంగే ప్రవృత్తస్య
పంచమ్యంతం సమస్యతాం॥ (8వ సర్గ, 27, 28, శ్లోకములు)

మండనమిశ్రులు మొదటిశ్లోకమునందు "నసంభాష్య—అహో" అనివిసంధిగాఁ బలుకుటను విని శ్రీశంకరులు దానిని యతిభంగదోషముగాఁ బెంచి యాక్షేపింపఁగా మిశ్రులవారు తగినసమాధానము చెప్పలేక యతిభంగమందు ప్రవర్తించినతనకు శ్లోకములోనియతిభంగము దోషముగాదని వక్రశ్లేషముగా నుత్తరము చెప్పిరి. కావునఁ బద్యగతంబైనవాక్యంబునందు సంధితప్పక యుండవలయు.

## నుజ్యంతభవత్యర్థవిమర్శనంబు.

---

ఉ॥ మాకునతిప్రియుండవు సమస్తవిదుండవు చెప్పుమయ్య యీ
లోకములోనివర్తనములుండగువాని నెఱుంగఁజెప్పనిం
బ్రాకటధర్మతత్త్వవిదు బ్రాహ్మణముఖ్యుఁబురోహితుండుగాఁ
జేకొనువారమట్టి బుధసేవితుఁగానఁగమాకు నెందుఁగన్ । భార ఆది ౭ ఆ

పైపద్యంబున రేఖతో నిరూపింపఁబడిన "కాను" అను శబ్దంబు నుజ్యంతంబగు భూ (అగు) ధాతువు. అగుధాతువునకు నుజె పరమగునప్పుడు క్రి. పరి. (91) సూత్రమునఁ గాదేశము రాఁగానైన రూపంబు. ఈ క్రియాపరిచ్ఛేదములోని (40) సూత్రమునందు మర్థమందును, భావలక్షణార్థమందును, నుజివర్ణకంబు విధింపఁబడుచున్నదిగదా! ప్రకృతప్రయోగమందలి యగుధాతువున కేయర్థమందు నుజివర్ణకంబు సంఘటించునో కొంచెము విచారింతముగాక!! యజ్ఞదత్తుండు పురోహితుండుగాఁ (అగుచు) తలంచునన్న వాక్యంబున ముఖ్యక్రియయగు తలంచుటకును, బురోహితుండగుటకును, యజ్ఞదత్తుఁడే కర్తయైనట్టులు "బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగాఁ జేకొనువార" మను వాక్యంబునఁ జేకొను క్రియకును బురోహితుండగుటకును నొకరు కర్తగానందునఁ దుమర్థంబిటు సందర్భయుక్తంబుగానేరదు. ప్రకృతపద్యంబునఁ బ్రకరణసందర్భమునంజేసి యర్జునాదులు చేకొనువారును, బ్రాహ్మణముఖ్యుఁడు పురోహితుండగుటయుఁగాన నగుధాతు చేకొనుధాతువులకుఁ గర్తలు వేర్వేఱగుచుండుట స్పష్టమగుచున్నది. "బ్రాహ్మణముఖ్యుఁడు పురోహితుండుగా నర్జునాదులు ద్రౌపదిని జేకొనిరి" యన్న వాక్యంబునఁ జేకొనుధాతువునకుఁ గర్మము ద్రౌపదియై పురోహితుండగుటకుఁ గర్తయైన బ్రాహ్మణముఖ్యుఁడు ప్రథమాంతపదముచే బోధింపఁబడినట్లు లీవాక్యమున నుండలేమిగాన నిట భావలక్షణార్థంబును బొసంగనేరదు. ఈవాక్యంబున రేఖాంకితములైన రెండు క్రియలలోఁ జేకొను క్రియలక్ష్యము. "కాన" (అగు) అను క్రియ లక్షణము. ఈలక్ష్యలక్షణక్రియలకు రెండింటికిని ప్రథమాంతములచేతఁ జెప్పంబడి యర్జునాదులును, బ్రాహ్మణముఖ్యుఁడును గర్తలుగా నన్వయించుచుండిరిగావున భావలక్షణార్థము సమంజస

నగుచుండును. ఇఁకను «బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగాఁ జేకొనువారు» నన్న పద్యవాక్యంబందునో!! బ్రాహ్మణముఖ్యుఁడు చేకొనుధాతువునకుఁ గర్మంబుగానన్వయించుచు ద్వితీయాంతపదంబుచేఁ దెలుపంబడకుండెంగాని ప్రథమాంతంబునఁ «గాన్» అనుక్రియతో నన్వయించుటకు వలనులేదు గాన నియ్యది భావలక్షణార్థంబున కుదాహరణంబుగా నుండనేరదు అందునఁ బైపద్యమందలి యగుధాతువునకు (కాన్) దువర్థభావలక్షణార్థంబులలో నేదియును సంఘటింపకయున్నందునఁ గారకపరిచ్ఛేదములోని (3_౧)సూత్రమున బ్రాహ్మణముఖ్యశబ్దంబునకుంబోలె విశేషణమైన పురోహితశబ్దంబునకును బ్రథమావిభక్తి సంగతంబుగాఁ గానిపింపదు. ఒకవేళ బ్రాహ్మణముఖ్యుఁడు చేకొనుధాతువునకుఁ గర్మంబైనందున నీపద్యవాక్యంబులో «గాన్» క్రియకుఁ గర్తగాకున్నను బురోహితుండట్టి క్రియతోఁ గర్తగా నన్వయించుచున్నంగాన నిట భావలక్షణార్థంబున నుజీ ప్రత్యయంబురాఁగాఁ గారకపరి (3_౧) సూత్రంబునఁ బ్రథమావిభక్తియుండవచ్చునందురేని యట్లనవలదు. అట్టి భావలక్షణార్థమే యీపద్యంబున గ్రహింపబడినచోఁ, «బ్రాహ్మణముఖ్యుఁడు పురోహితుండుగా నర్జునాదులు ద్రౌపదిఁజేకొనిరి" యన్నవాక్యంబునఁ గర్మంబైన ద్రౌపది బ్రాహ్మణముఖ్యునికంటె వేఱుపదార్థమైనట్టులు, ఇచ్చటం గూడఁ గర్మంబైన బ్రాహ్మణముఖ్యుఁడు ప్రథమాంతపదబోధ్యంబైన పురోహితుండుగాక వేఱొకండుగా నున్నట్టులు తోఁచిపద్యంబున నపార్థము సిద్ధించును.

అనఁగాఁ బైపద్యమందలి చేకొనుక్రియను లక్ష్య (జ్ఞాప్య) క్రియఁగాను, దానికిఁ «గాన్" అనునజివర్ణకాంతధ్వని (అగు) క్రియను లక్షణ (జ్ఞాపక) క్రియఁగాను భావించి యాలక్షణక్రియకుఁ గర్తగాఁ బురోహితుండన్వయించునని యెంచి కారక.ప. 3_౧సూత్రమునఁ బ్రథమవచ్చునని భావలక్షణార్థము చెప్పికొన్నచో నట్టియెడ నీవాక్యంబునకు, నర్జునాదులు వేఱొక పురోహితుండు దగ్గరనుండఁగాఁ బూర్వోక్తదృష్టాంతవాక్యమందలి (ద్రౌపదినిబోలె) నొకబ్రాహ్మణముఖ్యునిఁజేకొన నుద్దేశించిరియన్నపరిహాస్యార్థమయి పురోహితుండు బ్రాహ్మణముఖ్యునికంటె వేఱుగానున్నట్లు తోఁచును. సిద్ధాంతములో బ్రాహ్మణముఖ్యునే పురోహితుండగుటకు నుద్దేశించినటులలోఁచును న్నందున నిట్టిస్థలంబులందుఁ «గాన్" అనుక్రియ యుద్దేశ్యనిశ్చయభావమును దెల్పుం [illegible] లక్షణార్థంబును బోధింపదు, ఇటవేఱొకండుగాక బ్రాహ్మణముఖ్యుఁడే పు [illegible]

భోద్వితీయాభివ్యక్తి, కటంకరోతిభీష్మముదారంశోభనందర్శనీయమితి" అని "అనభిహితే" (అ. 2 పా. 3 సూ. 1) అనుసూత్రంబునఁ బతంజలిభగవానులు కర్మవాచకంబైన కటశబ్దంబునకు విశేషణంబులైన భీష్మాదిశబ్దంబులకంటె ద్వితీయావిభక్తిగలుగునని నిశ్చయించినట్లే యిచ్చటంగూడఁ గర్మవాచకంబైన బ్రాహ్మణముఖ్యశబ్దమునకు విధేయవిశేషణమైన పురోహితశబ్దంబుకంటె ద్వితీయావిభక్తి యుత్పత్తిల్లునని సిద్ధాంతపఱుచుట న్యాయంబుగదా! ఒకవేళఁ "గాన్" అను నుడివర్ణకంబు కర్త్రర్థకమని యెంచి పురోహితపదార్థమును దానికిఁ గర్తగానున్నటులు వివక్షచేసినను, గారకప్రకరణస్థప్రథమసూత్రంబున, బ్రథమావిభక్తికిని గర్త్రర్థక బ్రాహ్మణముఖ్యునితో సామానాధికరణ్యమునకుంజేసి ద్వితీయసూత్రంబునద్వితీయావిభక్తికిని, బురోహితశబ్దముకంటె బ్రసక్తి కలుగుచుండఁగా, శి. ప. 50 సూత్రమున వ్యాకరణాంతరస్థ నిత్యత్వన్యాయంబంగీకరించినరీతిని నిచ్చటఁ బరత్వన్యాయం బవలంబించుట యుక్తంబుగాన "విప్రతిషేధేపరంకార్యం" (అ.1 పా. 4 సూ.2) అనుశాస్త్రంబునఁ "గర్మంబునద్వితీయయగు" అను పరసూత్రమందలి ద్వితీయావిభక్తియే యిట నిస్సంశయంబుగా నిష్పత్తిల్లుననుట యుప్పుకొనకతీరదు. కావున నిఁక విస్తరంబుతోఁ జాలును. అందునసర్వవిధంబులను "పురోహితునిఁగా" అను ద్వితీయాంతమే యుండవలయును పైనింజూపిన చర్చంజేసి యిట్టిస్థలంబులందు వ్యాకరణంబునవిధించిన తుమర్థముగాని భావలక్షణార్థముగాని సందర్భపడనందున "న్యాయముగాను" ఇత్యాదులయందుఁ "గాను" శబ్దంబు క్రియావిశేషణమన్న యంశమును మాత్రము సూచించినరీతినే యిట్టివిశేషణంబున కనుప్రయుక్తంబైన యీశబ్దంబు [కాను] విధేయవిశేషణమన్నసంగతినే బోధింపంగాని యన్యదర్థంబును దెలుపదన్నయంశం బార్యవ్యవహారంబులఁ దేటపడుచున్నది. కావునవే యీక్రింది ప్రయోగంబులు సాధువులగుచున్నవి.

చ॥ పరిచరుఁగాఁగనేలెనిరపాయచరిత్రునిఁ బాకశాసన స్ఫురదురుకీర్తిహారుని
సముజ్జ్వలమేరుసమానగాత్రునిన్ బరమపవిత్రునిన్ మునిసుపర్వనరస్తుతిపాత్రునిన్మనో
హరఫలశేముషీకబళితాంబుజమిత్రుని వాయుపుత్రునిన్॥ శ్రీరంగమాహాత్మ్యము.

ఉ. శ్రీగజగామినీమణిని సిగ్గునుగా నిరపాయుఁగాఁ బ్రియో
కీగృహమేధిఁగాఁ గరుణఁ జేసినఁగా భవరోగవైద్యుఁగా

నాగురువానతిన్నె మది నమ్మితివే తెలోకవేల్పులఁగొల్వనీ
వేగతికావవే రఘుపతీ శరణాగత వజ్రపంజరా!! వజ్రపంజరశతకము.

కం. ఏవానిబంధుమిత్రులు జీవనవమ్ములనుదప్పఁ జెందుదుగ్నృశునిం । గావాని నెన్నఁగఁదగుఁ। గేవలతనుకార్శ్యయుతుఁడు కృశుఁడె నరేంద్రా!! భార. శాం. ౧. ఆ.

కం. ధృతి నెవ్వని సేనిఁ బురో। హితుఁ గాఁ బుణ్యమునఁ బడసి యిక్ష్వాకుకులో। త్థితు లైనపతులు రాజ్యో। న్నతినొప్పమఁ జేసి రుర్వినానాక్రతువుల్॥ ఆది. భార. ౭ ఆ.

కం. అన్నలుదమ్ములుఁగలుగుట యున్నతుఁగాఁ జేయుఁ గొంతయును నృపతిం దా మన్ననయుఁ గిగియునుసం। పన్నంబులుగాఁగ వారిఁ బాటించుటగన్॥ భా. శాం. ౨ ఆ.

ఇత్యాదిప్రయోగంబులు పరిశీలింపఁగా విశేష్యము ద్వితీయాంతమయ్యెనేని విధేయవిశేషణత్వసూచకంబైన నువిషర్ణకాంతభూ (అగు) ధాతువున కుపపదంబై ద్వితీయాంతవిశేషణమే విశేష్యానుసారంబుగా నుండవలయునని తేటపడుచున్నది.

విశేష్యము ప్రథమాంతమయ్యెనేని, యప్పుడనుప్రయుక్తంబై నుజేవర్ణకాంత భూ (కాను) ధాతువుతో విశేషణమును బ్రథమాంతమై యుండందగు.

తే. బోఁటిమొకతె పెండ్లి పాటపాడఁగఁ జొచ్చె। నాఁపరానివిరహతాపమున ను। చేరుగూర్చితాను చెండ్లికూఁతురుకాఁగ। గోత్రధరుఁడు పెండ్లికొడుకుగాఁగ॥ ఇత్యాదులుదాహరణంబులు. ప్రకృతమందలి "బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగా" నన్న పద్య ప్రయోగంబునకు శరణంబేమని యడుగుదురేని, యిట యతిప్రాసాదుల బాధలేదుగాన "బ్రాహ్మణముఖ్యుఁ బురోహితేంద్రుఁగా" (పురోహితశ్రేష్ఠునిగా) ననియే సంప్రదాయపాఠంబున్న గ్రహించినచో మేలుగానుండును. అటుగాక యీప్రథమాంతపాఠమే సాధువుగా నుండందగునన్న యభినివేశమున్నయెడ "స్థితస్యగతిశ్చింతనీయా" యనున్యాయంబున నీక్రింది యగతికగతి నవలంబించి సవరణచేసికొనం జను:—

శ్లో। "యామాహుస్సర్వభూత ప్రకృతిరితియయాప్రాణినః ప్రాణవంతః" అను

శాకుంతలీయశ్లోకంబునందును, శ్లో॥ "విభుర్విభక్తావయవంపుమానితిక్రమాదముం నారద ఇత్యబోధిసః" అనిన శిశుపాలవధయందలి శ్లోకంబునందును, క్రమంబుగా "పుమాం" అను ద్వితీయాంతమునకు "సర్వభూతప్రకృతి" శబ్దంబు విధేయవిశేషణంబైనను, ద్వితీయశ్లోకమందు "అముం" అనిన ద్వితీయాంతమునకు "నారద" శబ్దంబు విధేయవిశేషణంబైనను, నిపాతంబైన యితిశబ్దంబునభూతప్రకృతనారదులయందలి కర్మత్వంబు చెప్పంబడినందునఁ గ్రమంబుగాభూతప్రకృతినారదశబ్దంబులకంటెఁ బ్రాతిపదికార్థమంగుఁ బ్రథమావిభక్తి "సూ॥ నిపాతేనాప్యభిహితే కర్మణినకర్మవిభక్తిః, పరిగణనస్యప్రాయికత్వాత్" (అధికరణం ౫ అ ౨ సూ. ౨౨) అనుసూత్రమున వామనాదిప్రాచీనుల మతంబునందుఁ బ్రవర్తిల్లఁగాఁ బ్రథమాంతములైనభూతప్రకృతినారదశబ్దంబు లెట్లుసాధువులుగాఁ దలంపఁబడియెనో యట్లే ప్రకృతంబునఁ "బ్రాకటసర్వశాస్త్రవిదు బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగా" ననుపద్యమందు ద్వితీయాంతమయిన బ్రాహ్మణముఖ్యశబ్దంబునకుఁ బురోహితశబ్దంబు విధేయవిశేషణంబైనను "కాను" అనునుజ్యంతావ్యయం బితిశబ్దార్థకంబని (అని యనియెడి యర్థముగలదని) యంగీకరించి యట్టి యవ్యయంబునఁ బురోహితుని యందలి కర్మత్వము చెప్పంబడినందునఁ బురోహితశబ్దంబుకంటెఁ బ్రాతిపదికార్థమందుఁ బ్రథమావిభక్తి ప్రవర్తిల్లినదని సౌకర్యంబున సవరింపకొనినను "బ్రాహ్మణముఖ్యునిఁ బురోహితుండని చేకొనువార" నినిన సరసార్థంబున నట్టి ప్రథమాంతపురోహితశబ్దంబు సమంజసంబయ్యెడునని యెఱుంగునది.

ఇఁకనింకను వ్యాకరణసూత్రపరిష్కారంబున నిర్ణయింపశక్యము గాని పశేషవిషయంబు లార్యులసత్ప్రయోగవిన్యాసంబు పరిశీలించి నిశ్చయించికొనుచు శాస్త్రమర్యాదం బ్రవర్తిల్లుట పరమశ్రేయంబు.

(మూలము) శ్లో॥ శ్రీస్తనాంచితకస్తూరీ పంకసంకలితోరసే
పంకజాక్షాయనాథాయ వేంకటేశాయమంగళమ్॥

వ్యా — లక్ష్మీదేవిస్తనములయందుఁ బూయఁబడియున్న కస్తూరీపంకముతో మిళితంబైన వక్షస్థలంబునాటిల్లఁగాఁ బంకజనేత్రుండై పరఁగుచున్న వేంకటేశ్వరస్వామికిని మంగళంబయ్యెడుమని యాశాసించుచు గ్రంథకర్త "కలా వేంకటనాయకః" అను నామంబును స్మరింపించుచున్నాఁడు.

శ్లో॥ సర్వపాపాని వేం ప్రాహుః కటస్తద్దాహ ఉచ్యతే సర్వపాపదహో యస్మాద్వేంకటాచల ఇత్యభూత్ - అని బ్రహ్మాండపురాణవచనంబున సర్వపాపదాహకంబగు "వేంకట" బిరుదంబుతోఁ బ్రబలియున్న భగవానుని స్మరించినవారి జ్ఞానాజ్ఞానకృతసకల దుర్దోషంబులను దొలంగించునన్న దృఢవిశ్వాసంబున భక్తభాగధేయంబగు వేంకటనామధేయంబుననే పైశ్లోకంబును గ్రంథకర్త యనంబడు చిన్నయసూరి సముపార్జించెనన్న తత్త్వంబును దెలియునది. ఈశ్లోకంబున "శ్రీస్తనాంచిత......తోరసే" అను శబ్దంబు బహువ్రీహిసమాసంబు. ఉరశ్శబ్దాంతమైన బహువ్రీహికి సంస్కృతవ్యాకరణంబున సామాసాంతమైన కప్ప్రత్యయంబు "ఉరఃప్రభృతిభ్యః కప్" (అ ౫ పా. ౪ సూ. ౧౫౧) అను సూత్రంబునఁ గలిగి "శ్రీస్తనాంచితకస్తూరీ పంకసంకీర్ణతోరస్కాయ" అని యుండవలయును. శబ్దసాధనంబునకు యత్నంబుచేసినం బన్వలకుంబునకు భంగంబు గలుగును. ఒకవేళ "సామాసాంతవిధిరనిత్యః" అనుపరిభాషవలనఁ గప్ప్రత్యయం బనిత్యంబని యంగీకరించినచోఁ బూర్వోక్తప్రయోగంబు సాధుపదంబగుఁగాని యటులనందగుఁ బ్రాచీనకవికృతమైన యొకమహాగ్రంథములో నెచ్చటనైన నిట్టి నలుసుండెనేని యచ్చటనిట్టి యనిత్యత్వపక్షం బంగీకరించి దోషపరిహారంబు చెప్పినం బాగుండునుగాని ప్రకృతంబున రచియించినయొక్క యనుష్టుప్ శ్లోకములోనే యిట్టి యనిత్యత్వపక్షావలంబనం బగతికంబై తోఁచెడిని. "ద్విత్రిభ్యాం ష మూర్ధ్నః బహువ్రీహౌ" (అ. ౬ పా. ౩ సూ ౧౯౭) అను సూత్రమునసైన యనిత్యత్వజ్ఞాపకత్వమున "శ్లో॥ చతుర్దశసహస్రాణి। రక్షసాం భీమకర్మణామ్ త్రయశ్చ దూషణఖరత్రిమూర్ధానో రణే హతాః" ఇత్యాద్యుత్తరరామచరితాదిపూర్వకవిప్రయోగంబులు సయితము సాధువులనుట యిష్టములేక వ్యాఖ్యాతలచేత నన్యథా సమర్థింపఁబడినవి. ఇంతియకాక, ఉరశ్శబ్దాంతమైన బహువ్రీహిలోఁ గప్ప్రత్యయంబునకు ననిత్యత్వపక్షం బంగీకరించిమానినకీర్తి యే కవిప్రయోగమందును గానరాకున్నయది. శ్లో। వ్యూఢోరస్కో వృషస్కంధస్సాలప్రాంశుర్మహాభుజః। అను కాళిదాసప్రయోగంబును "వ్యూఢోరస్కేన, మహోరస్కేన" అనిన హయవరట్ సూత్రస్థ భాష్యకారప్రయోగంబులును, నురశ్శబ్దాంత బహువ్రీహివిషయములోఁ గప్ప్రత్యయంబున కనిత్యత్వపక్షం బంగీకరించి యీపూర్వోక్తప్రయోగంబును సాధువుగాఁ జేయుటకు బ్రబలప్రతిబంధకంబులుగా నున్నవి గావున నియ్యదియిట్టి యనన్యసాధారణవ్యాకరణగ్రంథమునకు రచనాకర్తయనిపించుకొనుసూరిగారియెడ నాశ్చర్యజనకంబనక తీరదు.

## గ్రంథకర్తృత్వవిచారణ.

(మూలము).—కం॥ మును మదుపజ్ఞంబగుచుం దనరినవ్యాకృతిని సూత్రతతినొక కొంతం। దెనిఁగించి యిదిఘటించితి। ననయముబాలావబోధమగు భంగిఁదగన్॥

వ్యా—మదుపజ్ఞమ్=మమ-ఉపజ్ఞా-మదుపజ్ఞమ్,, అని సంస్కృతసమాసము. ఉపజ్ఞ యనఁగా వేఱొకరియుపదేశము లేకుండనే తనచేత మొట్టమొదట దెలియంబడినయంశంబని సంస్కృతవ్యాకరణంబునఁ గర్త్రర్థమందుఁ గప్రత్యయము. వాల్మీకిమహామున్యాదులచే నుపదేశములేకయే తనంతతాను స్ఫురించిచేయంబడినట్టి శ్లో॥ మానిషాదప్రతిష్ఠాంత్వ। మగమశ్శాశ్వతీస్సమాః ఇత్యాది శ్లోకమువంటిదని భావము. ఇట విశేష్యమైన వ్యాకృతిశబ్దము స్త్రీలింగమైనను ,,ఉపజ్ఞోపక్రమంతదాద్యాచిఖ్యాసాయామ్,, అను సాంస్కృతికసూత్రంబున నపుంసకమగును. తత్సమపరి. (86) సూత్రమిచట ననావశ్యకము. తనరినవ్యాకృతిని=ఒప్పిన (గీర్వాణభాషలో మున్నుతాను రచియించిన) వ్యాకరణంబున నని యర్థము. మొట్టమొదటఁ దాను గీర్వాణభాషలో రచియించిన యాంధ్రవ్యాకరణములోని సూత్రములను బాలురకు సుబోధార్థమై తెనిఁగించి వెల్లడించితినని పద్యతాత్పర్యము. మఱియుఁ దాను బహులక్ష్యంబులు పరిశ్రమతో సంగ్రహించి గీర్వాణభాషలో నీతెలుంగువ్యాకరణంబును మొట్టమొదట రచియించితి నన్నతాత్పర్యముగల మాటలు గూడ గ్రంథాదియందును గ్రంథాంతమందును నచ్చుపడియున్నవి గాని యయ్యవి యీపద్యార్థముతోడనే గతార్థములని యూహించి పరిత్యజించితిమి. ఇటులు పద్యార్థమువలననేకాక యీబాలవ్యాకరణరచనకుఁ బూర్వమున నాంధ్రభాషావిషయమై గీర్వాణభాషలో నొకసూత్రగ్రంథము। తాను వ్రాసినచో పూర్వగ్రంథాద్యంతంబులయందును ,,ద్విర్బద్ధంసుబద్ధంభవతి,, అనున్యాయంబున దృఢపఱుచుకొనుటకుఁ బౌనఃపున్యంబునం జెప్పుచుండుట కానిపించుచున్నయది. పద్యంబులోని మదుపజ్ఞశబ్దంబున ,,బాలవ్యాకరణమునకు మూలాధారమగు సాంస్కృతసూత్రకోశంబు నేనే మొదట రచియించితినిగాని వేఱొకరు రచియింపలేదు,, అనని షేధార్థమును వెల్లడించుచుండుట తోఁచుచున్నది, ఈగ్రంథకర్తకు నేలయింతయనుమానమో వింతగానున్నది. కాళిదాసాదికావ్యకర్తలు గాని, పాణిన్యాదిశాస్త్రకర్తలు గాని వారిగ్రంథ

కర్తృత్వమునకైనకీర్తిం జేసి విబుధు లపజ్ఞాశబ్దంబు నుపయోగించుటతక్క సర్వసామాన్యముగా నిట్టిపదంబును దమంతితాము వాడుకొన్నరీతి కానరాకున్నది. ఇంతియకాక యీచిన్నయసూరిగారు సైతము నీతిచంద్రికయొక్క గ్రంథకర్తృత్వవిషయమై యిట్టిపదుపజ్ఞశబ్దంబు నుపయోగించుకొని వివక్షించుకొనుటలో నింత శ్రద్ధవహించినట్లు కనంబడదు. ఇంతశ్రద్ధతో వక్కాణించుకొనుటయే గాని యాశ్లోకం బేశ్లోకస్థానమందును గోచరింపక యున్నది. శబ్దలక్షణసంగ్రహమను పేరను సప్తపత్రియైన యొకపత్రంబుమాత్రము తెనుఁగున వ్రాయంబడిన సూత్రంబులతో నుదాహరణాదివిరహంబుగా ముద్రితంబై కనంబడు. ఈమూలపద్యంబునొద్దను బ్రసంగవశంబునఁ జెప్పఁగా నవసరంబైన యొక యంశంబుగలదు, శిష్టు కృష్ణమూర్తిశాస్త్రులుగారును, పరవస్తు చిన్నయ్యసూరిగారును సమకాలికులుగాన నొకప్పుడిద్దఱును దటస్థించి వ్యాకరణశాస్త్రప్రస్తావనఁ జేయఁగా సూరిగారి పాండిత్యంబున కోడి శాస్త్రులుగా రంతయునోర్వలేక సూరిగారి ప్రసిద్ధిని భంగపఱుపవలెనని యెంచి తత్కృతమైన బాలవ్యాకరణంబు నెట్టెట్టులో సంగ్రహించి, స్వప్రణీతమైన సంస్కృతగంధమున కయ్యది తెలుఁగేకాని వేఱొకవిశేషంబు లేదని యనిపించుటకై యిటీవల సోదాహరణవివరణంబుగా హరికారికాగ్రంథంబును రచియించిరి యన్న కింవదంతియొకటి వాటిల్లుచుండు నిది యెంతవఱకు నమ్మఁదగినదో కొంచెమాలోచింతము.

(1) వేదశాస్త్రాధ్యయనంబునకు నిర్ణీతంబైన బ్రాహ్మణవంశంబునంబుట్టినది మొదలు గురుకులశిక్షనొంది యనేకసభాస్థలుల శలాకపరీక్షలిచ్చి యాతిరితి రాజాస్థానంబులందు యావజ్జీవమును బండితుఁడుగా నెన్నికగాంచిన కృష్ణమూర్తిశాస్త్రులుగారి వంటి పెద్దభారతయోధు తెలుఁగుపండితుఁడైన సూరిగారికోడెనన్న వాక్యంబును విన్నతోడనే, శ్లో॥ బాధితందృశ్యతామక్షైస్తైనబాధోనదృశ్యతే జీవన్నాఖుర్మార్జారం హంతిహన్యాత్కథంమృతః॥ అపిపాసుపతాస్త్రైర్విద్ధశ్ఛిన్నమమారయః నిష్ఫలేషువినాన్నా గోనశ్ఛుతీత్యతిరికాప్రమా"॥ అనునట్టి వేదాంతపంచదశీతృప్తిదీపాంతభాగమందలి శ్లోకద్వయంబును నీసందర్భమున మాకు జ్ఞప్తికివచ్చి హాసంబువొడముచున్నది

బ్రాహ్మణేతరుండు తానుజదివినజదువు బ్రాహ్మణుని చదువులోసహస్రతమాంశంబున్నను నంతమట్టెంతేగాదోచి బ్రాహ్మణుఁ డెరింగోచదివినంగాని యాశాం

పఠేనికీర్తినిసులభంబుగా సంపాదించును. కూపోదకంబు తానుప్పనగాక యించుక రుచిగానున్నచో గంగోదకంబును మీఱియున్నదనినయతిశయోక్తిని సంపాదించును శాస్త్రిలగారిని సూరిగారు మీఱినారన్నవాడుకకూడ నట్టిదేయని మాతాత్పర్యము. ౹౹ఆ.గీ. శిష్టకులకలశజలనిధి। శీతకరఃకృష్ణమూర్తిసంఖ్యావాన్ షడ్దర్శనీస్వతంత్రస్తనోతి హరికారికావళీంవృత్తిమ్" అనితనగ్రంథాదిని షడ్దర్శనములయందుస్వతంత్రుండని నిర్భయంబుగాఁ బ్రకటించుకొనిన కృష్ణమూర్తిశాస్త్రిలుగారివంటి పెద్దపండితుని తనకే శాస్త్రమునందుఁ బరిశ్రమగలదో యూసంగతిని గ్రంథాదియందుఁ దెలియఁజేయజాకిన చిన్నసూరిగారు మీఱెనన్నమాట యెట్లుపొసంగును. ఇంచుమించుగాఁ గ్రంథకర్తలు గురుకులశిక్షగా శాస్త్రాభ్యాసం బొనర్చినచో నట్టితమరొకగ్రంథంబును రచింపవలసి వచ్చిన సమయంబున రచనకుందగినంత సంభారము తమయొద్దఁ బూర్తిగానున్నది యని బుధులకుసూచించుటకై యెంతోయుత్సాహముతో స్వకీయమైన శాస్త్రపాటవంబును బరిరోచనాపూర్వకంబుగాఁ బ్రశంసించుకొనుట తఱుచు సంప్రదాయంబుగా నిటేవల నున్నయది. శ్లో. ౹౹అహంచనాట్యశ్రీతి పారదృశ్వా సుధామునస్తస్యకవేశ్చవాచః" అని ప్రతాపరుద్రీయమందు సూత్రధారుఁడు తనపాండిత్యంబును శ్లో.౹౹యేనస్వైరమభాణిపాణినిమతం ప్రాణాదికాణాదవాగ్గుంభే." అని సాహిత్యరత్నాకరంబున ధర్మసూరియును శ్లో.౹౹పాతంజలేమహాభాష్యేకృతభూరిపరిశ్రమః." అనిశబ్దేందుశేఖరప్రారంభంబున నాగేశపండితులును, శ్లో. ౹౹శ్రీమజ్జ్ఞానేంద్రభిక్షో రధిగతసకలబ్రహ్మవిద్యాప్రపంచః" ఇత్యాదికముగా రసగంగాధరమందు జగన్నాథపండితరాజును శ్లో. ౹౹వాణీం కాణభుజీమజీగణదవాసాసీచ్చ వైయాసికీమ్" అని మల్లినాథసూరియును, నిట్టులనేకులు బుధులు ప్రకృతకృత్యంబునకుఁ గావలసినసంభారము తమయొద్దమెండుగా నిండియుండెనని సూచించుటపరిరోచనామూలంబునఁ బ్రసిద్ధమైయున్నది.

కాఁబట్టి సూరిగారు గురుశిక్షతో సంస్కృతవ్యాకరణమే చదివియుండెనేని యట్టివలసినశాస్త్రపరిశ్రమ సంభారము తనకుఁ బ్రబలంబుగా నున్నది యనిశాస్త్రసంప్రదాయాంశంబులతో నిండియుండిన యిట్టిబాలవ్యాకరణంబు రచియించుసమయంబున నుత్సాహంబుతోఁ గృష్ణమూర్తిశాస్త్రిలుగారువలెఁ జెప్పుకొనియుందురుగానియిట్టులు తెలిపినను మౌనంబుతోనుందురని యెవ్వరును ననుకొనరు. ఈతెలుంగువ్యాకరణంబు కేవలమును సంస్కృతవ్యాకరణమును జదివినంతమాత్రమున రచియించుటకు వలనైయెకది

గాక శాస్త్రాదులయందు నిష్కృష్టమైన యనుభవపరిపాకంబునం జేయందగిన గ్రంథంబ న్నసంగతి నిర్వివాదాంశంబు. ఇంతగొప్పగ్రంథమును రచియింపసాధనంబైన శాస్త్ర జ్ఞాన మేగురునివలనఁ దనకులభ్యమైనదో యాగురుని నమస్కరించుమారంబున గ్రంథాది యందు ఋజువుచేసికొనుభారం బీసూరిగారికి నవశ్యకర్తవ్యంబై యున్నది. నిజంబు గా నీపాత్రంబు రచియింపఁగలిగినంత శాస్త్రజ్ఞానమే యుపదేశమైనచో బ్రాహ్మణేత రుడైన తనకింత ప్రతిభనుగలిగించిన గురుశేఖరుని నీతనిమనస్సాక్షి బహువిశ్వాసంబు తో వేనోళ్లను గ్రంథాదియందుఁ బొగడంగాఁ బొడుచుంగాని యటులుగాకసన్నపనగా విశ్వాసహీనతతో గురునిం దలంపనీక యూరకుండదని నానమ్మకము. ఇట్టి గ్రంథము చేయుట కృతపాండిత్యంబుగలిగి బుద్ధికుశలతతో "నీతిచంద్రిక" లోనైన వచన రచ నాదికము సల్పుటవంటిదిగాదు. సూ "కృచ్ఛగహనయోః కషః" (అ 7 పా 2 సూ 22) అను సూత్రంబునకు "కష్టం శాస్త్రం; దురవగాహమిత్యర్థః" అని వైయా కరణు లుదాహరించుటంజేసి శాస్త్రంబు సామాన్యంబుగాఁ జొరఁబడశక్యముగానిది యని చెప్పుదురు. అనఁగా నెంతోచిరకాలము సత్త్వగుణంబుతో గురుకులవాసముచేసి చదివినంగాని యబ్బునదిగాదని భావము. బ్రాహ్మణునికే యెంతోకష్టమైయుండగాఁ వేదాంగమైనవ్యాకరణంబు బ్రాహ్మణేతరునికి లభించుట యింక నెంతదుర్ఘటమో చెప్పవలసినది యేమున్నది? "ఛందోవత్సూత్రాణిభవంతి" అను వృద్ధిరాదైచ్ సూత్ర స్థభాష్యంబునం జేసియు, వైశేషికాది సూత్రములవోలెఁ గాక వేదాంగమైనందున వ్యాకృతి సూత్రములే వేదమువంటివియని కైయటాదులు వివరించుటంజేసియు నిప్పటి కాలంబుకంటెను నట్టి పూర్వకాలంబున ఛాందసత్వంబు మెండుగావున బ్రాహ్మణులు శ్లో॥ "భావం నచాస్యాహమనుప్రదాతు । మలం ద్విజోమంత్రమివాద్విజాయ" అను సుందరకాండీయ వచనప్రకారంబున శిఖాయజ్ఞోపవీతంబులులేని జాతివారికివ్యాకరణ సూత్రంబు లుపదేశించుట కాలధర్మప్రాయంబైనందున దుర్ఘటంబు పవిత్రకాలమం దేకాక జాతాశౌచాదులయందు మామకగురుచరణారవిందంబులు వ్యాకరణశాస్త్రపా ఠంబు చెప్పకయుండుట స్వానుభవంబయి యున్నది. ఇట్టిస్థితిలో నెంత కడుపుకక్కు ర్తికిఁ జొరంబడినవాఁడైనను వ్యాకరణశాస్త్రమునఁ బఠనపాఠనాదులు జరిగింపఁగలిగి నంత విద్వాంసుఁడైన బ్రాహ్మణుండు "ఛందోవత్సూత్రాణి భవంతి" యను భాష్య కారవచనంబును భస్మముపాలుసేసి మొదలు గగ్గురుపడొండక జాతివారికి నియమపూ

ర్వకంబుగా నిప్పటివఱకఁ గాలంబువఱయుతెము హిందూదేశంబున వ్యాకరణవిద్యా స్వీకారంబు సేయింపఁగా సాహసింపఁడనియే యెల్లరతాత్పర్యమైయుండునని వేఁదలంచెదను. ఒకవేళ నట్టి బహువాత్సల్యంబుగలిగినగురువు పుణ్యవశంబున లభింప వ్యాకరణశాస్త్రపాటవంబబ్బినచో నట్టిగురుని నమస్కారపూర్వకంబుగాఁ దనశాస్త్రపరిశ్రమంబు ఋజువుగాఁగ గ్రంథాదియం దేల వెల్లడించుకొనకయుండును? బ్రాహ్మణులుమాత్ర మందఱును గురువందనపూర్వకంబుగా వచ్చినవిద్యాపరిశ్రమను ఋజువుగాఁగఁ జేసికొనుచుండిరా? యని యడుగఁగూడదు. "బ్రాహ్మణేన నిష్కారణో ధర్మః షడంగో వేదోధ్యేయో జ్ఞేయ శ్చేతి" యనెడి యాగమప్రామాణ్యంబున బ్రాహ్మణుఁడవిపించు కొన్నవానికి వేదంబును వ్యాకరణాదిషడంగంబులును జదువుకొనుట సహజముగానివింత కానందున ఋజువుభారంబవసరంబులేదు. గురునమస్కారరూపంబైనమంగళం బొకప్పుడు విప్రునకు మానసికంబైయుండవచ్చును. బ్రాహ్మణేతరునికిఁగూడ గురువందనము మానసికమైయుండవచ్చునందురేని, తనకులంబున కెన్నండును లేనియద్భుతజ్ఞానవైభవంబునుగల్గించినగురునియెడ భక్తివిశ్వాసంబులు మిక్కిలి పెనంగులాడితమ్మునుబ్రకటింపకొనకమానవని నా తాత్పర్యము. కాఁబట్టిసహజపాండిత్యమునే "పంకసంకలితోరసే" యనిన యపప్రయోగంబుగూడ స్పష్టపఱుచుచున్నది. కాఁబట్టి యీయనశ్రుతపాండిత్యముగలబుద్ధిశాలియనందగునుగాని గురుకులవాసముచేసి శాస్త్రమభ్యసించినవాఁడని చెప్పుటకుఁ దగినయాధారంబులెన్నివిధంబులను గానరాకున్నవి. ఇట్టి సహజపాండిత్యశాలి గురుకులవాసశిక్షితుండైన శాస్త్రులవారిని నోడించెనన్నమాట దేహంబునబండబలంబుగలపురుషుఁడు గురుకులంబున సాముషిద్దనేర్చి ప్రగల్భుఁడైనయొకమల్లశిరోమణిని మర్దించెనన్నవచనంబువోలె హాసాస్పదమైనపుక్కిటిపురాణంబుగాని వేఱొకటిగాదు.

2. శాస్త్రులవారు చిన్నయసూరినిజూచి యోర్వలేకపోయిరి యన్నమాట యెంత సందర్భముగానుండునో విమర్శింతము. లోకములో నెల్లరకును దమకొప్ప దృష్టికి నాగినవస్తువునుజూచి యప్పుడె యోర్వలేమి పుట్టునుగాని తక్కువ వస్తువును గాంచిన ద్వేషంబు గలుగనేరదు. శాస్త్రులవారికి బహువిద్యలయందు లోకోత్తరప్రజ్ఞ గలదన్నయీయన యశంబునకు నెదురాడువారు కనంబడరు. ఈయనచాటుధారగాను భణుభాషలయందును జెప్పిన చమత్కార పద్యంబులు వచ్చిన పెక్కురువిద్వాంసులు ప్రస్తావనావశంబునఁ జదివి యానందింతురు. ఈయన యుపాసించిన గణపతి దేవత

పరప్రభావంబును లోకాతీత ప్రతిభ గలిగినది యున్నంత యనన్యసామాన్యప్రజ్ఞయబ్బి నట్లు ప్రసిద్ధిగలదు. బ్రాహ్మణేతరుండైనను, చనిపోయిన చిన్ననూరికింగూడ బుద్ధిశాలి యై నందున సంస్కృతాంధ్ర సాహిత్యదృష్టిద్వయంబును మిక్కిలి విశాలంబే యందము. అయినను నింతలో కొత్తరప్రజ్ఞగల యీయనదృష్టికి నచ్చియయ్యవి యనూయపడునం తటివిగానుండనేరవు. వివాదశ్చ వివాహశ్చ సమయోరేవ శోభతే" యను న్యాయంబున సమానస్కంధులకే సౌర్వలేమిని ద్వేషంబు గలుగును. సింహంబు తన ఘనతకుందగిన యేనుంగునుజూనియే ద్వేషించునుగదా। శ్లో. "సంత్యన్యేపి బృహస్పతి ప్రభృతయస్సంభావితాః పంచషాస్త్రే ప్రత్యేకవిశేషవిక్రమరుచీ రాహుర్న వైరాయతే" యనిన భర్తృహరి సుభాషితంబు ననుసరించి శాస్త్రులవారికి నసూయసహేతుకంబుగాదు. చాతని జాతి తెలుంగు పండితుఁడుచేసిన యొకతెలుంగు వాక్యరణంబున సంస్కృతపండితుండైన బ్రాహ్మణుఁడు తనయశస్సుపోయినదని యెంచుకొనఁడు. సంస్కృతపండితునిదృష్టి తెలుంగునందు నంత ఘనంబుగాఁ బోవనేరదు కావననే సంస్కృతపండితులు తెలుంగుకవుల సంఖ్యలోఁ దక్కువ యగుటకుఁ గారణంబు. మఱియు నీయుగంబున నొరులకు బ్రహ్మద్వేష మున్నంతగా బ్రాహ్మణుని కితరద్వేష ముండనేరదు. మీఁదు మిక్కిలి బ్రాహ్మణులు సయితము తమ నిష్పక్షపాతద్విజ భావముం బొగడించుకొనుటకై "బోద్ధారో మత్సరగ్రస్తా" యను న్యాయంబున స్వజాతినే వంచింపంజూచి తమ శివాచార ధర్మంబుల వెల్లడింపఁ జూచుకొందురు. ఈనడుమ నీబాలవ్యాకరణంబు స్వోక్పత్తి కీర్తి కిందగునటులు తనపూర్వగ్రంథప్రభావంబునఁ బాదఁగుండైన మాశిష్యుని మానసమ్మును మహోమిషరుచికిం జొనిపి పూతిగంధిం జేయుసమయంబునఁ బరులపంచలపాలై యాయానోటం బడఁజాలక కన్నీరు మున్నీరుగాఁగఁ బలవించు మాపలుకుం బడంతి పశుపాట్లు పాటింపలేక జాలింగొంచిన దేహంబున శిష్టరక్షణకులభూషణుండైన యేలూరి లక్ష్మీనరసింహమూర్తి బి. యే గారట్టిమాచతురాస్యవక్త్రదేవతమల్లంబు రంజిల్ల మన్నించి యూరడించి మరల బ్రహ్మముఖంబున వర్ధింపఁ బ్రాచీనకాలంబునుండియుఁ బ్రసిద్ధిం జెందిన యామె బ్రాహ్మీనామధేయభాగధేయమ్మున విషవాదనీయుక పలుతెలుంగుల సార్థకత నెందించిరి గావున స్వస్థుండైన (సగ్గఘుఁడు లేక తన్నూనంబొందిన) గూరువృత్యవరేణ్యుని శ్రీమన్నారాయణుం డాదరింపఁగా నిట్లు కృతజ్ఞభావంబుతోఁ బ్రసక్తాను ప్రసంజనఁ వశంబున బ్రస్తావింతుముగాక!!

శా. ఏ. (ఏలూరియనియోనర్థము) లక్ష్మీనరసింహమూర్తి చితికాయి కౌశికరాచార్యబజం
ఘాలుంజేసినభాతి ఛీతికతనన్ గాలాడకున్నట్టి దు
ష్కాలంబందుఁ గరావలంబనములన్ సాధూపకారం బతం
డ్రాళుండై యొనరించు; స్వస్థునతనిన్ నారాయణుం డోముతన్

కావున నంతటి బహువిద్యా పటిష్ఠుండైన కృష్ణమూర్తి శాస్త్రిలవారు చిన్న సూరిపాండిత్యముంజూచి యీసుం జెందిరి యన్న పలుకు పరిహాసాస్పదం బయ్యెడి.

8 ఇఁకను సూరిగారురచియించిన బాలవ్యాకరణంబు నెట్టెట్టులో సంగ్రహించి శాస్త్రిలవారు సంస్కృతము చేసికొనిరి యన్నయంశ మెంతనిజంబో చర్చింతము.

ఒకభాషలో వచనరూపముగానున్న గ్రంథమును వేఱొకభాషలో శ్లోకరూపమున ఛందోబద్ధంబుగాఁ జేయునపుడు, ధారాళంబై యుండుట మిక్కిలి కష్టంబు అట్టిస్థితిలోఁ గృష్ణమూర్తి శాస్త్రిలవారు రచియించిన హరికారికలు శైలిలోఁ బ్రవాహరూపంబున నున్నయనియుచుట మతిమంతులకుఁ దోఁపకమానదు.

అయ్యవి లక్షణబద్ధంబైనను నితరాపేక్షుంజేసి యిటుకాట మనుభవింపక స్వయంభువుగా నుప్పతిల్లినకీతిలోఁ గనంబడునని నిస్సంశయంబుగాఁ జెప్పందగు శ్లో. "పటుత్వం సత్యవాదిత్వం కథాయోగేన బుధ్యతే అస్తబ్ధత్వమచాపల్యం ప్రత్యక్షేణైవ గమ్యతే" యనిన వచనప్రకారంబున మాటాడించి కదుపుటచేతను ముఖవర్చస్సు గనుంగొనుటచేతను మనుష్యుని స్వరూపస్వభావాదులు మతిమంతులకు సునాయాసముగాఁ బొడకట్టునట్లు కవితాసరస్వతీ పదపదార్థంబులం బరిశీలింపఁగా నట్టి యనుభవశాలులకు ముంజేతి కంకణంబువోలెఁ గనంబడి స్వయంభవనభాషాంతరీకరణగ్రంథంబులు గుప్పనవెల్లడికాకమానవు. శాస్త్రికృతహరికారికా సంస్కృతగ్రంథంబును సూరి కృతాంధ్రగ్రంథంబును నొక్కకాలంబున రెండుచేతులందును నుంచుకొని పరిశీలించితిమేని భాషావేషభేదంబుగాక సూత్రక్రమంబునందును సూత్రవృత్తులయందును నడుమనడుమను వివరణవాక్యాదులయందును నాకారంబున గుడియెడమచేతులు వోలెనుండి పౌర్వాపర్యవివరణం బెన్నుటకు సామాన్యంబుగాఁ గష్టంబైతోఁచును. రెండుగ్రంథములలోనివి యుదాహరణంబు లొక్కటియే యయియున్నవి. సంధిపరిచ్ఛేదములోని (18) సూత్రము క్రిందను "ఛందోయి" యని శాస్త్రులవారి గ్రంథములో నుదాహరణముండంగా దాని

బదులుగా బాలవ్యాకరణంబులో "కందోయి" యని యుదాహరింపఁబడియె. అచ్చటచ్చట "వంతయు రామమయ" మనుదానికి బదులుగా "వంతెయుఁ గృష్ణమయము" అనినట్లు బాలవ్యాకరణంబున వేఱుగా వ్రాయంబడిన యుదాహరణంబులు పదిసంఖ్యకంటె నెక్కువగా నుండవు. ఈగ్రంథములు చూఁడగా శాస్త్రి సూరులిద్దఱిలో నెవ్వరో యొకరు శ్లో. "యస్యాశ్చోరశ్చికురనికరః కర్ణపూరో మయూరః" అనిన ప్రసన్నరాఘవనాటకములోని శ్లోకంబునఁ జెప్పంబడిన కవులలో నాదికవీంద్రుని పదవిని నధిష్ఠింపకతీరదు. శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారే సూరిగ్రంథమును హరించినట్లు కనంబడిన చోరనిపుడు శిష్టశబ్దంబునకు శాసింపఁబడువాఁడని యర్థము చెప్పవలయును. శాస్త్రిగారి ద్రవ్యంబును సూరిగారపహరించినరీతితోఁ జిన్నచోరనిపుడు, పరవస్తు—పరద్రవ్యమైన; చిత్—జ్ఞానముయొక్క, నయ—తీసికొనిపోవుటయందు, సూరి—పండితుఁడని, అనఁగాఁ బరద్రవ్యమైన జ్ఞానరూపవ్యాకరణగ్రంథమునుహరించినవాఁడుగాన పేరు యొనత్తును సార్థకంబుచేసికొనెనని శ్లాఘింపవలయును.

4. శ్లో. ఆర్యా "శ్రీమత్కదంబపర్వః స్థిరలసదైశ్వర్య యుక్చిరంజయతు ఇనగాలగోత్రధర్మస్ఫురిత శ్రీకాళహస్తినగరీశః॥ శ్రీమద్వరదామరకుల। ధామావరసూక్తిరసోహం సుమతిర్వృత్తిం నన్ననసూత్రాణాం కృష్ణమూర్తిరిహాసర్వే॥ అని యినగాలగోత్రస్థుఁడైన దామర చినరామన్నయ నెడి కమ్మకులస్థుఁడు కాళహస్తి సంస్థానాధిపతి రచియింపుమనఁగా హరికారికాగ్రంథమును నతనికిఁ గృతియిచ్చి చేసినట్లు గ్రంథాదియందున్నది. సూరికృతమైన యీబాలవ్యాకరణంబును దొంగిలి (1840—1885) సూరిగారు జీవించియుండఁగానే శాస్త్రిలవారు (1790—1870) సూత్రాదులను సంస్కృతముచేసి యాయుదాహరణంబులతోనే చినరామరాజునకు గృతియిచ్చెనని చెప్పవలయును. అంత పండితేంద్రుఁడు సూరివ్యాకరణంబును దొంగిలించి సంస్థానాధిపతికిఁ గృతియిచ్చెనట కుబేరుఁడు దారిద్ర్యబాధను గుచేలునియింటికిఁ గన్నమువేసి వెంటనే యాదొంగ సొమ్మును నొకగొప్పరాజకీయాధికారికి నమ్మినటువంటిది. ఇంతియగాక సూరిగారే కం. మునుమదుపజ్ఞంబగుమందసరినవ్యాకృతిని...... ఇత్యాది వాక్యంబులతో దాను మొదట సంస్కృతములోఁ జేసిన వ్యాకరణగ్రంథములం దెనిఁగించితినని తెలుపుచున్నారు. కాన సూరి కృతమైన సంస్కృతగ్రంథంబునకు మరల శాస్త్రిలవారు వేఱుమాటలతో సంస్కృతముచేసి గాని లేకదొంగిలించిన సూరికృతగ్రంథము మొదటను దాను రచియించినట్లు సూచించునట్టి పంచమశ్లోకంబులను బూర్తిచేసిగాని సూరిజీవితకాలములో సంస్థానాధిపతికిఁ గృతియిచ్చిరి యని చెప్పవలసియుండును! ఈ

యంశం బెంతనిజంబని నమ్మఁదగియున్నదో విమర్శింపఁగా బుద్ధిమంతులకే విడిచెదను. వాగనుశాసనుండు సంస్కృతంబులో రచియించిన యాంధ్రవ్యాకరణంబునకు నాంధ్రశబ్దచింతామణి యనియుఁగృష్ణమూర్తిశాస్త్రిలవారు గీర్వాణభాషలోఁజేసిన యాంధ్రవ్యాకరణంబునకు హరికారికలనియుఁ బేరువిడుముగాని సూరిగారు పద్యాదులలోఁ దాను సంస్కృతభాషలో రచియించినాఁడ నన్నయాంధ్రవ్యాకరణంబునకు నామకరణం బేమియుంచిరో బాలవ్యాకరణస్థపద్యంబులోఁ జెప్పికొనియుండిమనవీనులకు విందుచేసినవారుకారైరి. ఒకవేళ నయ్యది నామరూపంబులులేని వ్యాకరణంబై యుండవచ్చును. హరిశబ్దంబునకుఁ గృష్ణమూర్తి యర్థముగాన గృష్ణమూర్తిశాస్త్రిలవారు దాను రచియించిన కారికలనియు మహాభాష్యంబునకున్న హరికారికలతో సమానములనియు సూచించుటకై హరికారికలని శ్లేషార్థనామంబుంపఁబడినది. మఱియు "అదియే హరిభట్టకృతమై యథర్వణాదులచేఁ బేర్కొనఁబడిన కారికావళియైన పక్షమునఁ జిన్నయసూరి తనవ్యాకరణములో సూత్రములన్నిటిని హరిభట్టకృతగ్రంథమునుండి బొంగిలించి తనపేరటఁ బ్రకటించినట్టు స్పష్టమగును. అయినను మూలగ్రంథములోఁ జూపఁబడిన లక్ష్యములు కొన్నియథర్వణాచార్యుల కీవలియాధునికగ్రంథములోనివి యగుటచేత వ్యాఖ్యానముమాత్రమేకాక మూలగ్రంథముసహితముకృష్ణమూర్తిశాలస్త్రివారే రచియించిరేమోయని పలువురు సంశేహపడుచున్నారు. అట్టిగ్రంథమును రచియింపఁగల సామర్థ్యమావిద్వత్కవికిఁ గలదనుటకు సందేహములేదు." అని రాయబహదూర్ వీరేశలింగకవిగారు శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిలవారే యీవ్యాకరణము రచియించినట్లు తమ రచియించిన కవిచరిత్రమున, కృష్ణమూర్తిశాస్త్రిలవారిజీవితమును వ్రాయువట్టిప్రకరణంబులోఁదెల్పుచున్నాను. ఈకృష్ణమూర్తిశాస్త్రిలవారు సకలశాస్త్రాధ్యయనంబొనర్చిసంస్కృతభాషలో యక్షోల్లాసము కావ్యంబును, వల్లవీపల్లవోల్లాసము మదనాభ్యుదయమను భాణములను, రామాయణకథను జెప్పునట్టికంకణబంధంబును. హరికారికలను, నీలశైలనాథీయమును; ఆంధ్రభాషలో సర్వకామదాపరిణయము వేంకటాచలమాహాత్మ్యమును, పీఠారణ్యమాహాత్మ్యమును, పంచతంత్రమును, వసుచరిత్రవ్యాఖ్యానము రచియించిరని యీయనజీవితలేఖన ప్రకరణంబునఁ కవిచరిత్రలోనే వ్రాయఁబడి యున్నది. సంస్కృతాంధ్రభాషలయందు నింతయఖండసరస్వతీకరుణాకటాక్షలబ్ధైశ్వర్యంబుతోఁ దులదూఁగుచున్న శాస్త్రిలవారు, పట్టుమని యొకగ్రంథంబునైనను సొంతముగా ? వ్రాయ

లేనిసూరిద్రవ్యము నపహరింపవలసినంత యావసరము నరసరంబులేదు గాన సూరిగారే యీ మన వ్యాకరణంబును దొంగిలించి ప్రకటించికొంట నిశ్చయము.

5. గ్రంథము లోనికి యిరకను స్థాలీపులాకన్యాయంబున విమర్శింతము గాక

సంధిపరి-లోని (18) సూత్రమునొద్ద "చందోయి" యని శాస్త్రులవారి వ్యాకరణంబులోను, "కందోయి" యని సూరివ్యాకరణంబులోను నుదాహరింపఁబడిన భేదంబని యీవఱలోఁ జెప్పితిని. ఇప్పటి ప్రాపంచిక జ్ఞానంబునఁ దక్కువ యనుభవంబుగల శాస్త్రులవారు "చందోయి" యని యుదాహరింపఁగా, నట్టి యుదాహరణంబు చదివి పాఠశాలలోని బాలురు నవ్వుదురని యెంచి చెన్నపురిశాస్త్రపాఠశాలలో నాంధ్రోపాధ్యాయుండై లౌకికజ్ఞానంబునఁ బూర్ణుండైన సూరిగారాయుదాహరణంబును జూచి తీసివేసి "కందోయి" యనిబహిరంగముగాఁ జదువఁదగిన యుదాహరణముగాదిద్దినట్టులు స్పష్టపడుచున్నది

6 శ్లో శబ్దాద్యహ్రస్వతో నార్ధ బిందులో పోగుతస్య। వినేకాఁటావస్మదాత్మ ద్రుతస్సంశ్లేష భాక్సన॥-సంధి-పరి; ఈ సూత్రంబున "ఇఁక,అఁట"అను రెండుశబ్దములందుఁదప్పఁ దక్కినశబ్దంబుల మొదటి హ్రస్వముమీఁద వర్ధబిందు వుండదని శాస్త్రిగారు

ఇఁక, అఁట, మఁడు-అను శబ్దంబుల, దప్పఁ దక్కినశబ్దము మొదటి హ్రస్వము మీఁదనరసున్న లేదని సూరిగారు. శాస్త్రిగారి సంస్కృతశ్లోకసూత్రములోఁ మఁడుశబ్దముదాహరింపఁ బడలేదు.

సూరికృతివ్యాకరణంబును సంగ్రహించియీయన హరికారికలనుజేసినపక్షమున మూఁడుదాహరణంబులలో నొకదానినివిడవరు శ్లో. వినేకాఁటమఁడూక నాత్మా స్మదోస్సంశ్లేష భాగ్ద్రుతః" అనియే రచింపకొందురు

అమర్చిన పదార్థములో వత్తొప్రేలు పెట్టుట సులభముగాన హరికారికలనుజేసుకొనిన తర్వాతనైన జ్ఞానాభివృద్ధిచేతను 'మఁడు' శబ్దముచేర్పఁబడ్డది బంగారునొరకిన తర్వాతఁ దంకపుఁబోడి యుపయోగింపుట పక్కలోహారునికి సుకరము గదా!!

7 శ్లో॥ ముగంతసర్వనామాయే త్రీసమ్యగ్ధాతుభేదకైః। సపూర్వపదకః కర్మధార యోహ్యత్రదృశ్యతే॥ సమాసపఃహరకారిక; ఈకారిక బాలవ్యాకరణసమాసపరిచ్ఛేదము లోని (5)సూత్రమునకు సంస్కృతము: బాల-సమాస- (5)సూ- "కర్మధారయంబు త్రిక స్త్రీసమముగంత ధాతుజవిశేషణ పూర్వపదంబయి యుండును. అని సూత్రము కారిక లోనున్న "సర్వనామాయే" అను శబ్దంబునకుఁ దెలుంగుసూత్రములోని త్రికశబ్దంబాం త్రీకరణంబు. "సర్వనామ-అయే" అని "సర్వనామాయే" అనుపదంబునకు భేదము. ఆ, ఈ, ఏ, అను మూఁడువర్ణంబులకుఁ గ్రమంబుగా సంస్కృతసంధిచేసినచో "ఆ + ఈ=ఏ; (గుణము) ఏ + ఏ–అయే; (ఇటవయాదేశము) సర్వనామములైన ఆకారమును, ఈకారమును, ఏకారమును, బూర్వపదము గాఁగలదై కర్మధారయముండు ననియర్థము.

ఇట ఆ, ఈ, ఏ, అను సర్వనామములకుటకు "సర్వనామాయే" అని గ్రంథ కర్తశాస్త్రిగారు బహుప్రయాసముతోఁ గ్లిష్టార్థముగా సూత్రమును రచియించినస్థితి బుధులకు స్పష్టముగాఁదోఁచుమండు.

ఇట్టిస్థలలో సూరిగారు—"ఆ, ఈ, ఏ, అను సర్వనామంబులు త్రికంబునాఁ బడు"అని (4) సూత్రముగా రచించి పైని నేనువ్రాసిన (5) సూత్రమును జేసెను.

శాస్త్రిలుగారుగూడ నిట్లు, ఆ. ఈ, ఏ, లకుఁ ద్రికసంజ్ఞ యుంచిసాంస్కృతిక సూత్రమును రచించెనేని పైనింజూపిన క్లిష్టకల్పనయవసరములేదుగదా! సూరిచేసినబాల వ్యాకరణమునే శాస్త్రిగారుచూచి సంస్కృతముచేసినయెడల సౌకర్యముగానున్న త్రిక సంజ్ఞనుమాని "సర్వనామాయే" అని క్లిష్టపదంబు నుపయోగించుకొనునా! ఎప్పటికిని నుపయోగింపరని పామరులకుసయిత మిట్యాది తెలిసినవిషయంబు కానిసూరియుంచిన త్రికసంజ్ఞకుఁగూడ శాస్త్రిలవారి శ్లోకరచనామార్గమే కనుసన్న చేసినదని యెల్లరకుఁ దోఁపకమానదు. శ్లో। బహుశంద్వేసర్వనామాయేసంయోగినోహలః। ఉక్తత్రయా త్కృతహ్రస్వాన్స్టోహ్రస్వ చ్ఛతద్వయోః॥—సమాస--హరికారక: (బాల-సూ ౧౮_౧౯) ఈకారికయుత్తరార్ధమున కర్థము-కృతహ్రస్వంబగుపూర్వోక్తత్రయంబు మీఁది,అనఁగా, ఆ, ఈ, ఏ,లమీఁదఁజోటు'నోత్వంబునకత్వహ్రస్వంబులువిభాషనగు'

అనియీకారికలోఁ బ్రయోగింపఁబడిన త్రయశబ్దంబే, ఆ, ఈ, ఏ, లకుఁ ద్రికసంజ్ఞనుం పవలసినదని సూరికినుపదేశించెనని నాయభిప్రాయము శ్లో॥ ఆదీదేత్సర్వనామానస్త్రి కాఖ్యాఃకర్మధారయః త్రికధాతుస్త్రీప్రసవ్యస్య గంతభేదకపూర్వకః। అని, ఆ, ఈ, ఏ,ల కుఁ ద్రికసంజ్ఞనిడియేకసూత్రశ్లోకమురచించుకొంట శాస్త్రులవారికినసాధ్యమైనపనిగాదు. ఈసందర్భమున మాకు "అర్థో ర్వ్యవిధో యోనిరన్యచ్ఛాయాయోనిశ్చ" (అధికరణం 3 అధ్యాయః 2సూత్రం 7) అను వామనసూత్రప్రకారంబున స్వయంభువైన మొకటికవీశ్వరుని స్త్రోన నీడ నాధారముచేసుకొని రెండవవాఁడు కవిమ్మన్యుండంతకంటెఁ గొంచెము మెఱుఁగువెట్టినరీతిని జెప్పవచ్చుననిన వామనసూత్రాభిప్రాయము స్ఫుష్టికివచ్చుచున్నది; కావునఁ బైసూత్రప్రకారంబున శాస్త్రులవారి వ్రాఁత శైలి యయోనిసంభవమై శుద్ధమైనదనియుఁ చిన్నయసూరివ్రాఁతపుస్తక యన్యచ్ఛాయాయోనిసంభవమైసంకీర్ణమైనదనియుఁ దత్త్వవేత్తలకుఁ దెల్లమగును.

(8) శ్లో॥ శృంగారభూషణమతే ద్రుతాదపిపరోద్రుతః. హరికా. 8 అచ్ సంధి. (బాల. సూ. 21 కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి శ్లో ప్రత్యేకంలాండుబువురు నముష్షాద్ధూర్వహేరితం హరి. క్రియా. 2 బాల. సూ. 8. లకారంబునకు డుబు, వురు, నుము ఙాగు.) శ్లో॥ స్త్రీటోర్దవస్యలోపస్స్యాద్వా తిర్యగ్జడవాచినోః తయోర్బహుత్వేస్యేకత్వం ప్రసమేనస్మిధూర్వహః। దీనికిసరియైన బాల క్రియా. సూ. 24-25), పూర్వోక్తంబైన శాస్త్రీకృతసూత్రశ్లోకంబులలో ద్రుతంబుమీఁద ద్రుతంబుండుట శృంగారభూషణుని మతంబనియు, లకారంబునకు డుఙాదులగుననిన యిత్యాదులు ధూర్వహునిచేఁ జెప్పంబడియెననియు, నానామతకర్తలుద్ఘాటింపఁబడిరి. సంస్కృతవ్యాకరణశాస్త్రమందు బహుపరిశ్రమగలిగిన శాస్త్రులవారు "లోపశ్శాకల్యస్య" "త్రిప్రభృతిషుశాకటాయనస్య'' ఇత్యాది సూత్రములయందు నానామునిమతంబులు వెల్లడించిన పాణినిమహర్షిశైలిఁ జూచి యాంధ్రవ్యాకరణంబునందుఁ బైనింజూపిన మతకర్తలనామంబు లుద్ఘాటించిరి. సూరిగారిగ్రంథమే యీయనకు గతి యయ్యెనేని తద్రచితసూత్రములలోలేని నామంబు లుద్ఘాటించుట యెట్లుశక్యంబగును? శాస్త్రీకృతహరికారికలను జూచితనవ్యాకరణంబును రచించినవారనియనఁబడిన సూరిగారేల యీమతకర్తలనామంబుల స్వీకరింపలేదని శంకింతురేని, యానామంబు లపరప రంబులన్నతలంపునను, శ్రుతసాంకేత్యమైనయట్టి సంస్కృతవ్యాకరణశబ్ద [illegible]

యనుభవంబులేనందునను నట్లుసేయరైరి. ఇంతియకాక యాదికవియైన వాల్మీకిమహాము నికి „మానిషాదే" తిశ్లోకంబువోలెఁ దనంతటనే తనకే వ్యాకరణంబు స్ఫురించినదన్న సంగతిని సూచించునట్టి గ్రంథాంతపద్యంబులోని „మదుపజ్ఞ" శబ్దముయొక్క వాస్తవార్థంబునకు లోపంబు గలిగినచో స్వకీర్తికింగూడ లోపంబుగలుగునన్న కారణాంతరంబునంగూడననేకులు పూర్వులు వ్యాకరణకర్తలున్నటు తన్నామంబు లుదాహరింపకయుండిరనియూఁ దోఁచుచున్నది. కావున సూరికృతగ్రంథమునకుఁ బూర్వమందే యనేకప్రాచీన గ్రంథకర్తలమతంబులు శ్రద్ధతోఁ జదివి శాస్త్రిలవారు స్వగ్రంథంబును నొనరించుటలు సూత్రగత తన్నామంబులే చాటుచున్నవి. శ్లో। „పరుషావాస్వరూపేణ। ప్రథమాంతో పరిస్థితాః। కాకాసంబోధనేచాపి। హ్యవ్యయేకర్మధారయే। అవేతనార్థకేశబ్దే।ఇతిశృంగారభూషణః". ఇత్యాది కారికాంతరములయందును శృంగారభూషణాది వ్యాకరణ కర్తల మతము స్పష్టపఱుపఁబడుచున్నది.

(9) శ్లో॥లోట్స్యాల్లజ్వ్యతిరేకే స్యాల్లకారా అత్రవర్ణితాః॥ (2) శ్లో॥ అనుబంధోల్పటికిలజ్ త్రజిత్యదుతో భవేత్ ॥7॥ (హరి. కా. ఇత్యాదికారికలయందు లజ్, కలజ్ నుజ్. పడుజ్, ఇత్యాదులు హల్మాత్రమైన జకారమే యనుబంధముగాఁ (ఇద్వర్ణము) గలవి హరికారికలయందు గ్రహింపఁబడినవి. ఇట్టి జకారాదులయందు „అనుక్తమన్యతోగ్రాహ్యమ్" అను న్యాయంబునంజేసి „హలన్త్యమ్" అను పాణినీయసూత్రమున నిత్సంజ్ఞ విధింపఁబడుచున్నయది. కనుక నిత్సంజ్ఞ సులభంబు. బాలవ్యాకరణమందు లజి, కలజి, నుజి, పడుజి, అని యిటు లికారాంతములుగా గ్రహింపఁబడినవి. ఇట్లు పైనిం జూపినలజాదులికారాంతత్వరహితంబుగా శాస్త్రిగారుగ్రంథమందును,ఇకారాంతత్వములో సూరిగారిగ్రంథమందును గానంబడుచుండు. ఇట్టియంశమునుశాస్త్రిగారిగ్రంథకర్తృత్వంబునే ధ్రువపఱుచుచున్నది. క్రియాపరిచ్ఛేదములో సయితము నుజ్' మిజ్, అని యిట్లు జకారానుబంధముతోడనే యుచ్చరించుచో. దత్సమ. పరి. సూ. (22 వద్దనున్న „శిత్తు బిందుపూర్వంబగు" ననుసూత్రంబున బిందువుగలిగి ,చూడంను చూడంమ్ము' ఇత్యాదివిధంబుగా దుష్టరూపంబులగునని ఛీతిల్లి యావర్ణకంబులు „శి' శబ్దాంతములై జిత్తులయ్యేనేని యట్టిదోషంబు రానేరదని యూహించి సూరిగారిట్లు' చేయుట స్పష్టమగుచున్నది. ఇయ్యది సూరిగారి పాణినీయవ్యాకరణమందలి శ్రుతపాం

డిత్యగంధమును జాటుచుండు. నక్ (రామునిచేతను) నిక్ (రామునిని) నక్ (రాము నకు (కుక్ కలఁకులు ఇత్యాదులయందు సంస్కృతవ్యాకరణ సంప్రదాయానుసారం బుగా హల్మాత్రమే యనుబంధముగా నొనరించుకొనినందున "హలంత్యమ్" అను సూత్రంబున నిత్సంజ్ఞ రాఁగా లోపంబుగలిగె. ఇట నుజే, మిజే, యని యుచ్చరింపబడెనేని "జే" అను సముదాయంబునకు నేసూత్రంబున నిత్సంజ్ఞ గలుగునో తెలియకున్నది, "ఉపదేశేజనునాసిక ఇత్" అనుసూత్రంబున నొకవేళనికారంబున కిత్సంజ్ఞవచ్చుననుకొన్నను నుపదేశాంత్యముగాని జకారంబున కేవిధమున నిత్సంజ్ఞ సంభవించును "జిత్తు పరంబగు నప్పు డుత్వంబున కత్వంతగు," ననుసూత్రంబుననే జిశబ్దమునకు నిత్సంజ్ఞయున్నట్లు తెలియబడునందు రేని యిది యిత్సంజ్ఞానువాదకంబుగాని విధిసూత్రంబుకానేరదు. ప్రధానమైనవిధి ననువదించియేకదా! యనువాదసూత్రము సార్థకంబగను. కాననే పాణినీయంబున "ఆదిర్ఞిటుడవః" ఇత్యాది సూత్రంబులు వర్ణసంఘాతంబునకు నిత్సంజ్ఞను విధింపఁగా రచియింపఁబడినవి. ఒకనికి రాముఁడని నామకరణముంచినపిదప "రాముని రావింపుము" యనిన నర్థమగును గాని నామకరణము చేయకయుండ నెట్లు తెలియును. నామకరణంబుపొందని మనుజుండుండునా? కనుక నిత్సంజ్ఞ విధించు సూత్రము సూరిగారికి నావశ్యము. ఇట్టిభావంబుననే "ననుచో: కురిత్యాదావనువాదే కథముదిత్త్వమితిచేన్న; వ్యాకరణాంతరే ఏషాముదిత్సంజ్ఞకత్వే నాదోషాత్" అనియణుత్సూత్రశేఖరంబున శంకించుకొని వ్యాకరణాంతరం బిత్సంజ్ఞను విధించినట్లు సమాధానము వ్రాయఁబడినది. అయ్యదిసంస్కృతవ్యాకరణంబునం గాని మఱియొచ్చటం గాని గగనకుసుమంబై కానరాదు. అందుననే సూరిగారిట్టి వ్యాకరణంబు రచియించిరియనఁగా సంశయమ్మగుచున్నది. శాస్త్రిలవారి పక్షంబునఁ బైనిం జూపిన వర్ణకంబు జిత్తులయ్యేనేని బిందుపూర్వంబులై "మాడఁను, చూడంమి" ఇట్లుగుప్త రూపంబులేల కాకుండు? నని శంకింపఁగలదు. "అత్రజిత్యదుతోభవేత్" హరి. (కి సూ. 7 (అత్రధాత్వధికారే జిత్పరే ఉతఅత్వవేదిత్యర్థః). ఈధాత్వధికారమందు జిత్తుపరమగుచో నుత్వము కత్వమునవచ్చునని "అత్ర" శబ్దప్రయోగంబునంజేసి ధాత్వధికారములేనిచోటనే జిత్తుబిందుపూర్వంబగునని స్పష్టమగుచుండుఁ గాన బిందువుఁరాదని తెలియునది. ఇట్లుండ నశాస్త్రీయమార్గము చిన్నసూరిగారల త్రొక్కునో వింతగానున్నది.

10 శ్లో॥ తద్ధర్మాదిషు లేడాశీ । ర్వ్యాపసంప్రార్థ సేవిషు । లోట్స్యాల్లజ్ వ్యతిరేకే స్యాల్లకార అక్రమస్మృతాః॥ [హరికా-క్రి 1] ఇట్లు తద్ధర్మాదులయందు లేటనియు ఆశీరాదులయందు లోట్టనియుఁ బాణినీయప్రసిద్ధంబులై లేట్ లోట్ లకారంబులను శాస్త్రిగారు స్వీకరింపఁగా నిచ్చోటి తెలుఁగుసూత్రములందుఁ గ్రమంబుగా దీర్ఘ లకారంబులకై యింతవఱకు పర్యంతానుభావన మేలయని యూహించి లాట్టనియు, లూట్టనియుఁ బ్రాచీనశాస్త్రకర్తలచేత నాదరింపఁబడని మార్గంబు సూరిగారు ద్రొక్కిరి. వీరికి సంస్కృతవ్యాకరణంబునందు నింతటి గ్రంథము చేయఁగలిగినంత యనుభవ ముండెనేని చిరపరిచితమైన పూర్వశాస్త్రమార్గమును విడువరని నానమ్మకము.

11 శ్లో॥ ఆర్యా॥ నిడు నడు కడు చిఱుకుఱుగత డఱయోః ప్రాణేపరేతు టొ ద్విత్వః । గసడదవాః పరుషాణాం । పరతః ప్రథమాంతతస్తు బహుళంస్యుః॥ హరి కా. సంధి. ౫ శ్లో. అర్థము—"కుఱు, చిఱు, కడు, నడు, నిడు, శబ్దముల ఱ, డ, ల కచ్చుపరంబగునపుడు ద్విరుక్తటకారంబగు"(బా. వ్యా. సంధి. ౧౧ సూ.) ఇయ్యది పైనిం జూపిన శ్లోకపూర్వార్ధమున కర్థము ఉదా. కుఱు + ఉసురు = కుట్టుసురు; చిఱు + ఎలుక = చిట్టెలుక; ఇత్యాదిక్రమంబుగా, కుఱుచయైన యుసురుగాడ్పు, చిఱుతయైన యెలుక; ఇత్యాదికముగాఁ గర్మధారయ సమాసముదాహరణము. అర్థము—"ప్రథమమీఁది పరుషములకు గ స డ ద వ లు బహుళముగా నగు" (బా. వ్యా. సంధి ౧౨ సూ.) ఈసూత్రము పైశ్లోకముయొక్క యుత్తరార్ధమున కాంధ్రీకరణము ఉదా—

వాఁడు...కొట్టె { వాఁడు గొట్టె / వాఁడు కొట్టె } ఇత్యాదులు— వ్యస్తపదస్థలంబు లుదాహరణంబు.

ఇట్లు పైనిం జూపిన సూత్రశ్లోకములోని పూర్వార్ధమున కుదాహరణంబు కర్మధారయ సమాస స్థలంబనియుఁ, ఉత్తరార్ధమున కుదాహరణంబు వ్యస్త పదస్థలంబనియు, గరతలామలకంబై తెల్లమగుచున్నదిగదా! ఈశ్లోకపూర్వార్ధసూత్రము తర్వాతఁ జెప్పంబోవునట్టి కర్మధారయప్రకరణ సూత్రముల సహమను, (బా. వ్యా. సూ. 27. 28 29 30) బ్రింపఁదగ్గది యైనను, కుఱు, చిఱు, కడు—ఇత్యాదిశబ్దంబులను "గసడదవాః" అను శబ్దంబును లఘుసన్నిభూయిష్ఠంబులఁ జేసి యనుష్టుప్ శ్లోకములో

నీముష్పుటదుష్కూటంబును విరసంబునని తెలిసికొని ఛందోనిరోధంబున సమాసప్రకరణభంగదోషమునకు సహితము తలయొగ్గి శాస్త్రులవారిటు నార్యావృత్తములో వ్యస్తసమస్తస్థలంబులు విషయంబులుగాఁగల రెండుసూత్రములను జేజస్తిమిరంబులం బోలెఁ జేర్పవలసినవారైరి. సంధిప్రకరణ మంతయు యథాపూర్వముగా ననుష్టుప్ శ్లోకమయమై యున్నను నియ్యది యొకటియే ఛందోనిరోధంబున నార్యావృత్తముగా రచింపంబడియె. వ్యస్తస్థలంబు లక్ష్యంబుగాఁగల గ స డ ద వ విధాయకసూత్రమును, సమస్తస్థలము లక్ష్యముగాఁగల టద్వాదు విధాయకసూత్రమునుఁ దమ ప్రకరణశైలింబట్టి యన్యోన్యవిరుద్ధంబు లైనను గ్రంథకర్తకు ఛందోనియమంబున విధిలేక, గ స డ ద వ లును, నిదు, వదు, కదు, చిఱు, కుఱువర్ణమ్ములును లఘువులు గాన, సమసపత గణించి రెండుసూత్రములు నొక్క యార్యావృత్తములోఁ జొనుపఁగాఁ గత్యంతరము లేక వలసివచ్చెనని భావము! ఈశ్లోకక్రమంబున నే ప్రకరణవిరోధదోషంబునకు బద్ధులై సూరిగారుకూడ, 12—13 సంఖ్యలోఁ దమ సూత్రమ్ములను బన్నుచున్నారు. ఛందోబాధలేక వచనశైయ్యలో సూత్రములు వ్రాయునట్టి సూరిగారికింగూడ నేల యీప్రకరణభంగదోషమునకుఁ బాల్పడవలసివచ్చెనో కారణము గానరాదు. హా! కారణము గానరాదన నేల? కారణము బోధపడుచునే యున్నది. ఛందోనియమంబునం జేసి సూత్రజాలంబున మర్యాదం దప్పి కంటకమార్గంబునం బడిన శాస్త్రులవారి సహవాసము చేసినచోఁ, దాను లోకకంటకుండగుదునన్న యాసంగతి, యాద్యోకపక్షగ్రాహియై యమాయికుండైన సూరిగారికిఁ దెలియకయే యట్లొనర్చినట్లు తోఁచుచున్నది. ఓసి పక్షపాతబద్ధ శ్రోత్రములారా! శార్యచౌర్యపదంబులకు నాదివర్ణంబునం గూడఁ బోఁడిమిగల యతిస్థానంబుల భేదము గానరాకున్నను, వాఁడిమిగల ప్రాసస్థానంబున భేదము బయల్పడక మానదు సుండీ కాఁబట్టి యీగ్రంథమ్ముల యుత్పత్తి పౌర్వాపర్యంబు చదువరులే భావింతురుగాక!

12 శ్లో॥ ఏతేలడదాదయః కర్తృకర్మణోః స్యుస్సకర్మకాత్ । పరస్మాత్కర్తరి; పదు ర్జనబంధస్తు కర్మణి॥ హరి. శ్రీ

అకారాదులు సకర్మకంబాసకుం కర్తృకర్మంబులందును, లాఁతికిం గర్తయందు నగు. (బా. వ్యా. క్రి. ప. సూ 48)

పైసూత్రశ్లోకములోని "పరస్మాత్" అను పదమునకు సకర్మకధాతువుకన్న నితరమైన ధాతువుకంటె, అనఁగా నకర్మకధాతువుకంటెఁ గర్త్రర్థమందు లకారములు|

# ఈవ్యాకరణములోవచ్చునట్టి గ్రంథాదులవివరము.



| గ్రంథకర్తలు. | గ్రంథసంకేత గ్రంథములు పరిచ్ఛేదములు లేక తాకురములు ఆశ్వాసముల సంఖ్య. | |
|---|---|---|
| తిమ్మకవి | అచ్చ. రా. | అచ్చతెనుగురామాయణము (6 |
| అబ్బయ | అని | అనిరుద్ధచరిత్రము (5) |
| వేంకనార్యుడు | ఆంధ్ర | ఆంధ్రభాషార్ణవము. (3) |
| కృష్ణరాయలు | ఆము | ఆముక్తమాల్యద (6) |
| పాపరాజు | ఉ. రా. | ఉత్తరరామాయణము (8) |
| అడిదము సూరకవి | కవి. త ల. | కవిసంశయవిచ్ఛేదము. తరంగము లక్షణము |
| ... ... | ..కవిజ | కవిజనరంజనము. (8) |
| పింగళి సూరన్న | కళా | కళాపూర్ణోదయము (8) |
| మట్ల అనంతభూపాలుడు | కాకుత్స | కాకుత్స్థవిజయము (5) |
| మూర్తి | కావ్యా | కావ్యాలంకారసంగ్రహము (5) |
| శ్రీనాథుడు | కాశీ | కాశీఖండము (10) |
| కుమారధూర్జటి | కృష్ణరా | కృష్ణరాజవిజయము (4) |
| మల్లన | చంద్ర | చంద్రభానుచరిత్రము (5) |
| వేంకటపతి | చంద్రా | చంద్రాంగదచరిత్రము (6) |
| పినవీరభద్రుడు | జై | జైమినిభారతము (8) |
| తిక్కనసోమయాజి | ని | నిర్వచనోత్తరరామాయణము 10 |
| తిమ్మకవి | నీల | నీలాసుందరీపరిణయము. (3) |
| శ్రీనాథుడు | నై | నైషధము (8) |

| గ్రంథకర్తలు | గ్రంథసంకే గ్రంథముల (పరిచ్ఛేదము లేక తాకేము. ఆశ్వాసములసంఖ్య)) — | |
|---|---|---|

| | | |
|---|---|---|
| నారాయణకవి<br>వేంకటనాథుఁడు | పంచ | పంచతంత్రము, |
| శాకమూనిమూర్తి | పాంచా | పాంచాలీపరిణయము (5) |
| రామకృష్ణకవి | పాండు | పాండురంగమహత్మ్యము. (5) |
| ముక్కుతిమ్మన్న | పారి | పారిజాతాపహరణము (5) |
| పింగళి సూరన్న | ప్రభా | ప్రభావతీప్రద్యుమ్నము (5) |
| బ. సీతారామాచార్యులు | ప్రౌఢ | ప్రౌఢవ్యాకరణము |
| వాలేశ్వరుఁడు | భల్లా | భల్లాణచరిత్రము (5) |
| బమ్మెరపోతన | భాగ | భాగవతము(12) |
| రెట్టూరిరంగరాట్టు | భాను | భానుమతీపరిణయము (4) |
| నన్నయభట్టాదులు | భార | భారతము(18) |
| భాస్కరాదులు | భాస్క | భాస్కరరామాయణము. (6) |
| అనంతుఁడు | భో | భోజరాజీయము (7) |
| అల్లసాని పెద్దన్న | మను | మనుచరిత్రము (6) |
| మారన | మార్క | మార్కండేయపురాణము (8) |
| మొల్ల | మొల్ల | మొల్లరామాయణము (6) |
| తెలగనార్యుఁడు | యయా | యయాతిచరిత్రము. (5 |
| రంగనాథుఁడు | రంగ | రంగనాథరామాయణము (6) |
| కోదండపతి | రస | రసమంజరి. (3) |
| తిమ్మకవి | రసి | రసికజనమనోభిరామము (7) |
| పింగళిసూరన్న | రాఘ | రాఘవపాండవీయము (4) |
| తిమ్మయ | రాజ | రాజశేఖరవిలాసము (3) |
| అయ్యలరాజు రామభద్రుఁడు. | రామా | రామాభ్యుదయము (8) |
| మల్లన | రుక్మాం | రుక్మాంగదచరిత్రము (5) |
| తిమ్మయ | రుక్మి | రుక్మిణీపరిణయము (5) |
| ఎర్రాప్రెగ్గడ | లక్ష్మీ | లక్ష్మీనృసింహావతారము(నృసింహపురాణము) (5) |

| గ్రంథకర్తలు | గ్రంథసంకేతాక్షరము | (గ్రంథములు పరిచ్ఛేదము లేక ఆశ్వాసములసంఖ్య) |
|---|---|---|
| నందిమల్లయ, ఘంటసింగయ. | వరా | వరాహపురాణము (12) |
| రామరాజభూషణుడు | వసు | వసుచరిత్రము (6) |
| కాత్యాయనుడు | వా | వార్తికము |
| జక్కన | విక్ర | విక్రమార్కచరిత్రము (8) |
| చేమకూర వేంకటనాథుడు | విజ | విజయవిలాసము (3) (సుభద్రాపరిణయము) |
| కేతన (అభినవదండి | విజ్ఞా | విజ్ఞానేశ్వరీయము (3) |
| వెన్నెలకంటి సూరన | వి. పు | విష్ణుపురాణము (8) |
| బమ్మెరపోతన్న | వీర | వీరభద్రవిజయము (4) |
| శేషము వేంకటపతి | శశాం | (శశాం) శశాంకవిజయము (5) |
| గణపతిదేవుడు | శివ | శివయోగసార (4) |
| కదిరీపతి | శుక | శుకసప్తతి (2) |
| మల్లారెడ్డి | షట్చ | షట్చక్రవర్తిచరిత్ర |
| ... .. | షట్చ. నల | షట్చక్రవర్తిచరిత్రలోని నలచరిత్ర |
| యల్లన | షో | షోడశకుమారచరిత్రము (8) |
| కామేశ్వరుడు | సత్య | సత్యభామాసాంత్వనము (4) |
| తిమ్మయ | స | సర్వలక్షణసారసంగ్రహము |
| చేమకూర వేంకటనాథుడు | సా | సారంగధరచరిత్రము (3) |
| అయ్యలరాజు నారాయణామాత్యుడు | | హంసవింశతి (5) |
| ఎఱ్ఱాప్రగడ | హ. పూ. | హరివంశము పూర్వభాగము (9) |
| సోమనాథుడు | హ. ఉ. | హరివంశము ఉత్తరభాగము. |
| శంకరకవి | హరిశ్చ | హరిశ్చంద్రోపాఖ్యానము (5) |
| రామరాజభూషణుడు | హరి. న | హరిశ్చంద్రనలోపాఖ్యానము |

# వ్యాకరణవిశేషాంశములు



భారతి, 15—7—1904

శబ్దరత్నాకరాది నిఘంటువులందును కొన్నిపత్రికలయందును పంచాంగములయందును పండిత పామర సాధారణముగా జ్యేష్ఠమాసమని వాడుచున్నారు. అది జ్యైష్ఠమాసంబని యుండవలయును గాని జ్యేష్ఠమాసమనఁగూడదు. "ప్రమాదో ధీమతామపి' యనుటంజేసి ధీమంతులకే ప్రమాదంబుగాన సవరించుకొనుట యుక్తముగా దోచుచున్నది, ఇదియు నొకచిన్న సమాచారముగావున వృత్తాంతములలోఁ బొందుపఱిచినారము.

కల్లూరి వేంకటరామశాస్త్రి.

శ్రీభారతి ఫిబ్రవరి మార్చి ఏప్రిల్ 1905

## జ్యైష్ఠమాస శబ్దవిమర్శ,

జ్యైష్ఠమాసమని ఐత్వముతోఁ బలుకవలెనుగాని ఏత్వముతోఁ బలుకఁగూడదని శ్రీభారతీ ప్రథమపత్రికయందుఁ బ్రకటింపఁబడినది. తర్వాతను కొందఱు సజ్జనులు ఈశబ్దమును శాస్త్రపూర్వకముగా రూపనిష్పత్తి వ్రాసి పత్రికయందుఁ బ్రచురము చేయఁగోరెదమని న్యాయైకగ్రహణబుద్ధితో జాబులు పంపినందున సాధక బాధక గ్రంథప్రయోగములు కొన్ని స్వయము నే శంకించుకొని తోఁచినయట్లు సిద్ధాంతీకరించుచున్నారము.

జ్యేష్ఠానక్షత్రముతోఁ గూడిన పూర్ణిమాసి "జ్యైష్ఠీ" అనఁబడును "నక్షత్రేణయుక్తః కాలః" అనువట్టి వ్యాకరణ సూత్రంబున అణ్ ప్రత్యయము వచ్చి ఆదివృద్ధిరాఁగా ఐకారయుక్త రూపంబగును. పిమ్మటను ఆనక్షత్రముతోఁ గూడిన పౌర్ణమాసిగల మాసము జ్యైష్ఠమనఁబడును. సా

సాస్మిన్ పౌర్ణమాసీతిఅనసూత్రంబున తిరిగిఅణ్ప్రత్యయమురాఁగా మా
సమర్థమైనపదముఁ కూడ వైశబ్దమైకారముతో నుండవలెను. చిత్రానక్ష
త్రముతోఁ గూడిన పౌర్ణమాసిగల మాసము చైత్రమనియు, విశాఖా
నక్షత్రముతోఁ గూడిన పౌర్ణమాసిగలమాసము వైశాఖమనియు ఐకా
రముతోనుండిన రూపంబులే పైసంజెప్పిన సూత్రంబుల మూలంబున
లోకంబులో వ్యవహరింపఁబడుచున్నవి.

శ్లో॥ జ్యేష్ఠమాసికర గ్రహోన శుభకృజ్యేష్ఠాంగనాపుత్రయో
ర్జ్యేష్ఠే మాస్యజాతియో ప్యుదిదా జ్యేష్ఠోను సంభూతయోః దంప
త్యోర్యదియేన కేనధి నాజ్యేష్ఠత్రయం చాస్తిచేత్రి) జ్యేష్ఠాహ్వాయ
దోషదోహీ సతతథాప్యాద్య గర్భద్వయే' అనుకాలామృత తృతీయ
బిందువు నందుఁ శ్లోకములో మాసమర్థమైనపదము సహితము పూ
ర్వోక్త శబ్దమును ఏత్వంబుతోనే పఠించునట్టి లోకవ్యవహారంబు గలద
నియు (౧)జ్యేష్ఠమాసము (౨)జ్యేష్ఠుఁడు (3)జ్యేష్ఠురాలు ఇట్లు
మూఁడుపర్యాయంబుల ఆశబ్దము తిరిగివచ్చినది. గనుక నేకశేషవృత్తి
చేతను నొకశబ్దమే మిళి యుంట సంభవించి త్రిజ్యేష్ఠదోషమని గ్రం
థములోఁబొందుపఱచుటకు వీలైనదనియు, మాసమర్థమైనపదము ఐకా
రముతోనుండెనేని యట్టింబును ఏత్వముతోఁ గూడిన తక్కినవయో
వాచక శబ్దంబులును ఏకరూపంబులు గాక యేకశేషవృత్తి దర్ఘ
టంబై త్రిజ్యేష్ఠదోషమనినగ్రంథకర్తల వాక్యంబులు అశాస్త్రీయ ప్ర
లాపంబులనవలసియుండును గావున మాసవాచకమైనపదము సహిత
ము ఏత్వముతో నుండవచ్చునని యెవ్వరైనను వచింతురేని సావధాన
ముగా వినుఁడు. పూర్వోక్తకంబులో జ్యేష్ఠానక్షత్ర జాతక వధూ
వరులకు తన్మాసమందుఁ బెండ్లికూడదని కూడ చెప్పఁబడి యున్నది.

అనక్షత్రమందె పుట్టిన పురుషులు జాతార్థమందు నక్షత్రా
నుసారాఁగా అదవృద్ధిచే నైత్వమొచ్చి జ్యైష్ఠులనఁ బడుదురు. కాని

ఏత్వముండదు కావుననే శ్లో॥ రో. రే మ. మృ. జ్యే. చిషువృద్ధిరాదా షాత్స్వేచ వాంత్య శ్రవశాశ్వయుక్ష్ను॥

అనియా జప ప్రయోగరత్నము జాతకర్మ ప్రకరణమునందు రోహి ణ్యాదినక్షత్ర జాతశిశువులను రోహిణి, రైవత, మాఘ, మార్గశీర్ష, జ్యే ష్ఠ అనిపిలువ వలెనని చెప్పఁబడినది. ఇప్పుడుకూడ నక్షత్ర జాతకు లర్థమై నప్పుడు ఐత్వముతోఁగూడిన శబ్దంబులకును, ఏకారయుక్తమైనమాస వాచక శబ్దంబునకును (పూర్వపక్షులమతప్రకారంబున) ఏకశేషము ఘ టంబుగాన "భక్తి తేషెలాసు నేన రోగశాంతిః" అనులోకోక్తి ప్రకారంబుగా త్రిజ్యేష్ఠదోషమని చెప్పుట కవకాశమే లేకపోవును, మఱియుఁ బూర్వో క్త శ్లోకంబులలో వైమాసమందుఁ బుట్టినవారికి గూడనుఁ నామాసము లో వివాహము కూడదని వచింపఁబడినది. ఆమాసమునందుఁ బుట్టిన దంపతులు అర్థమిచ్చునప్పుడు కాలాత్ రక్ వచ్చునుగాన నట్టివధూవ రులు జ్యైష్ఠికులనఁ బడుదరు. ఇచ్చటను కూడ ఏకశేషవృత్తి రాక త్రి జ్యేష్ఠదోషమని వచించుట దుర్ఘటంబేయగును, కాబట్టి మాసమర్థమి చ్చునప్పుడు ఎకారమె యుండుననన్న వివాదమువలన లాభంబులేదు. పైశ్లోకములో "జ్యేష్ఠమాసి" అఃఐకారముతోనే పలుకవలెను కాలా మృతములోని ఏత్వము లేఖకుల ప్రమాదము కావచ్చును లేక జ్యోతి శ్శాస్త్ర గ్రంథములలో శబ్దసాధుత్వవిషయమై యంత పట్టుదలలేదు కావున "ధనిష్టరేవత్య గతే ప్రయాణే" నుపాఠము వంటిదే కాలా మృతమును. కావచ్చును ఈగ్రంథములో యితమ ప్రమాదములుకొ న్ని కానవచ్చుచున్నవి. శ్లో॥ దుఃఖస్యాత్ రౌద్రయోరదలిభే సా బంధకీశ్రక్రభే" అనికాలామృత ప్రథమశీదువు లవ శ్లోకము మఖా ర్ద్రా నక్షత్రములయందు రజస్వలయైన స్త్రీదుఃఖియగునని చెప్పబడినది వ్యాఖ్యానములోఁ గూడ యస్యాః కన్యాయాః ప్రథమరజో దృశ్యతే సాదుఃఖస్యాత్" అన్వ్రాయంబడియున్నది. శాస్త్రంబునందేసి దుఃఖినీ'. అన్నస్త్రీలింగరూపముండవలెను

# వ్యాకరణ విశేషాంశములు

"దుఃఖీనీస్యాత్" అన్న చోఁ ఛందోభంగమగును. ఒకపక్షంబున 'సుఖమాత్మన ఇచ్ఛతి' సుఖము తనకుఁ గోరుచుండును అనిన యర్థమునందు క్యచ్ ప్రత్యయాంతంబైన సుఖశబ్దముకంటె క్విప్ ప్రత్యయము వచ్చి సుఖీః అని ఈకారాంతంబులలో శాస్త్రమున వ్రాయఁబడిన రీతిగానే దుఃఖఃమాత్మన ఇచ్ఛతి అనిన యర్థంబునందుం గూడ దుఃఖీః అన్న విసర్గాంతరూపము పుల్లింగ స్త్రీలింగ సాధారణముగా నుండును. కనుక శ్లోకములో నట్టి పారమేయుంచవలయుననికాని లేక దుఃఖశబ్దంబునకు దుఃఖాభిన్నురాలు అనఁగా దుఃఖస్వరూపురాలన్న యర్థము చెప్పకొని యాశబ్దముకంటె చ్వి ప్రత్యయము చేసి అస్యచ్వౌ అనుసూత్రంబున ఈత్వము చేసినచో గంగీస్యాత్ అన్నట్టులే దుఃఖీస్యాత్ అన్నరూపము సాధువగుననికాని ఇట్టిచోటుల చెప్పనగు లేని ప్రకృతంబునఁ గూడ శాస్త్రజ్ఞులు జ్యోతిషమున అనియో పారము సవరింతురుగాక. ఇకను బూర్వపక్షావలంబులు మాఱెప్పిన యుక్తిః మాసవాచక మైన పైశబ్దమునందు ఐత్వమున్నచోఁ బ్రక్కన వానితో నేక శేషవృత్తి వలను పడదు. గావున త్రిజ్యేష్ఠదోష మనిన వ్యవహారంబునకు గతి యేమియనియడుగుదురేని సమాధానము విమందు. కాలామృత. శ్లోకములో సర్వవిధంబుల చేతను నేక శేషవృత్తి సందర్భపడదని స్పష్టముగాఁ జైవిఁ జూపఁబడినది. ఆశ్లోకముయొక్క తాత్పర్యమేమనగా (౧) జ్యేష్ఠానక్షత్ర జాతకవరుఁడు. (౨) జ్యేష్ఠానక్షత్రజాతకురాలు కన్య. (3) జ్యేష్ఠానక్షత్ర యుక్తపౌర్ణమిగల మాసము ఇట్లు మూడింటి విశేషణంబులలోఁ బరస్పరాసంబంధము నంతర్భావంబుగా జ్యేష్ఠశబ్దము ముమ్మారు తిరిగి వచ్చినప్పుటికిని త్రిజ్యేష్ఠదోషమని గ్రంథకర్త తాత్పర్యము గాని ఏకశేషవృత్తియే యావశ్యకమన్న యభిప్రాయము గాదు శ్లోకములోని తక్కినయంశములలో గూడ నిట్టియథా సంభవముగా గ్రహించుకొనవలయును, కనుక మాసవాచక శబ్దము ఐత్వయుక్తమే యుండవలయునే జ్యైష్ఠేశుక్ల)

## వ్యాకరణ విశేషాంశములు

శ్శుచిస్త్వయం అని ఐత్వయుక్త పాఠమే యమరములోనుండవలయును ఇచ్చోటున గురుబాల ప్రబోధికలో "జ్యైష్ఠానక్షత్రయుక్తా పూర్ణిమాస్మిన్" అని వ్యుత్పత్తి చైత్రవైశాఖాది శబ్దస్థలంబులందువలెనె వ్రాయఁబడినది, కావున నిత్యాదిస్థలంబుల శాస్త్రజ్ఞులు జ్యైష్ఠశబ్దమనియే యూహింతురుగాక శబ్దరత్నాకరాది నిఘంటువులలో గూడ నీశబ్దమైత్వముతో నుండవలయునని యూహించునది. శ్లో॥ వీరాద్భుతాదిషురసేషురసప్రసిద్ధిస్సిద్ధా కుతోపివట యక్షవదావిభాతి లోకే గతానుగతికత్వవశాదుపేతామేతాం నివర్తయితుమేష పరిశ్రమో నః। అన్న సాహిత్య రత్నాకర రసతరంగోదాహృత శ్లోకంబున శృంగారమే రసమనియుఁ దక్కినవి యట్లుగాకున్నను మఱ్ఱిచెట్టును యక్షుడు (భూతవిశేషము) ఆవహించియున్నాడని యెవ్వండో పలుకగా దానిని లోకులందఱును గతానుగతికంబుగ నమ్మినట్టు శృంగారేతరములను రసములని వాడుచుండిరనియు నట్టి ప్రసిద్ధిని మాన్పఁగా నింత శ్రమమాకుఁగలిగెననియు భోజరాజు చెప్పిన వాక్య~~నాగా ఈ~~శబ్దముయొక్క ఐత్వవిచారణయొద్దను మాకు జ్ఞప్తికి వచ్చుచున్నది. ఇట్లు శాస్త్రంబున పైమాన శబ్దమందు నైకారము విధిగాఁ గనఁబడుచుండగా నింకను నెవ్వరైనను నేకారమే వచించుఁడి యా మాసము జ్యేష్ఠలక్ష్మీనివాసమగుటయే తమకిష్టమని యాగ్రహింతురేని యట్లేవారు చిరజీవులై యుందురుగాక!

కల్లూరి వేంకటరామశాస్త్రి.



# బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికానుబంధము.

దేశమాత పత్రిక, 30—10—1918

## శేషాద్రిరమణకవులకు విశేషరమణీయంబౌ నుత్తరము.

బ్రహ్మశ్రీ శేషాద్రిరమణకవులు, బాలవ్యాకరణము చిన్నయ్యసూరిగారు స్వతంత్ర సా ర్థ్యంబుననే రచింపఁబడినదిగాని వారికారికలకు నాంధ్రీకరణము కాదనియు, సూరిగారి గ్రంథకర్తృత్వము బ్ర॥ శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారికిఁ జెందించుట యక్రమం[illegible]నియు, బ్ర॥ కల్లూ వేంకటరా[illegible] ్త్రిలుగారు చరపన్న చిన్నయ్యసూరిశబ్దంబును వ్యాకృతిని శబ్దముచు బాండి [illegible]మ్మున శ్లేషించి కనంబఱచినయట్లులు వారుచూపిన పదునాల్గుయుక్తు లిట్టివేయని 1918 సం॥ము కృష్ణాపత్రికలో బ్రకటించిరి. [illegible]ంజాపిన పదములు శ్లే స్థాలీపులాకన్యాయ లిఖితమైన గ్రంథములోని పదునాల్గుయుక్తులును గారణంబు గండెడి. శ్లేషించుటకుఁ గారణమైన పదునాల్గుయుక్తులకు సమాధానము చెప్పక శ్లేషమునే మేలెత్తుకొని, పదునాల్గుయుక్తు లిట్టివే యనుట క్రమమ్ముగాదు రాజమహేంద్రవరము గవర్నమెంటార్ట్సు కాలేజిలోని యుభయభాషాభూషితగురువులగు బ్ర॥ ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రులుగారియు క్తివచనాదులం బరిశీలించియే గ్రంథకర్తృత్వము కృష్ణమూర్తిశాస్త్రులవారికి నిశ్చయించిరి. గ్రంథముద్రితమైన యావ్యాసపోత్రాభిప్రాయమును గంగొనవలయును. కొంతకాలముకుముందున నీనగరంబున నార్ట్సుకాలేజిలోనే గీర్వాణపండితోత్తములైన బ్ర॥ కస్తూరి శివశంకరశాస్త్రులవారీపదునాల్గుయుక్తులం బరామర్శించియే "చిన్నయసూరికి సంస్కృతవ్యాకరణపాండిత్యమువిషయమై బాలవ్యాకరణములోని యంశములను బట్టిగా నాకు మిక్కిలి సందేహముగానున్నది" యని వ్రాయుచున్నారు. గ్రంథముద్రితమై యాద్వితీయాంశ రమతమతల్లికను గణింపవలయును. ఇంతియకాక, శిష్టుకృష్ణమూర్తిశాస్త్రిగారి గ్రంథకర్తృత్వమునకు వ్యతిరిక్తాభిప్రాయులై ప్రకృతకవులచే స్వపక్షగృహీతులైన మ॥ వావిలికొలను సుబ్బారావుగారును గుప్తార్థప్రకాశికావ్యాఖ్యానకర్తయుక్తుల యుక్తములయియున్నవని యొప్పుకొనుచు సత్యపరిశీలనాకాంక్షులయినట్లు వారి ముద్రితాభిప్రాయమునఁ గానవచ్చుచున్నది. ఇట్లు పదునాల్గుయుక్తులును గీర్వాణాంధ్రములయందు గురుకులశిక్షితు పండితేంద్రులమనంబునాకర్షించి వారి పరిజ్ఞానదృష్టికిఁ బాత్రంబులై ప్రవర్తిల్లుచుండు నానియెడ "పదునాల్గుయుక్తు లిట్టివే" యని పెదవివిఱచి విరామమునొందుట యభిరామము కాదు. ఎత్తుకొనిన యీయంశము మిక్కిలి లోకోపకారకమయినదియు, చర్చనీయమయినదియునున్నది. బ్ర॥ వేంకటరామశాస్త్రులుగారు "చిన్నయసూరియే గ్రంథకర్తయని పదునాల్గింటి మఱియుక్తులు వందవపూర్వకముగ నంపుగాని యభిప్రాయము మార్చుకొందు" రన్నట్లు మునుపెక్కుచోట్ల వ్రాయబడి; వారికీవిషయమునఁ బట్టుదల లేదనుటస్పష్టము. కావునఁ బాల్గుయుక్తులను సమాధానము చె[illegible] ప్రకృతకవులను బ్రార్థించెద. (కృష్ణాపత్రిక ముద్రింపవలయునని మనవి.

ఇట్లు, గ్రంథకారి శిష్యుఁడు,

ఆచంట సత్యనారాయణ, సీనియర్ బి స్టూడెంట్, ఆర్ట్సుకాలేజి, రాజమండ్రి.

N. B. ఈవ్యాస ప్రకటనకు గుప్తార్థప్రకాశికాకారులు సుమారెనిమిది సంవత్సరములు సంపూర్ణారోగ్యవంతులై యుండి కాలములోఁ బ్రైవేటుగా [illegible]నంబడిన కవిద్వయముగాని, మఱియేరునుగాని, వ్యతిరేకముగా [illegible]ంజాలరైరి. శ్రీరామాప్రెస్, రాజమండ్రి.